| | | |
|---|---|---|
| *First Print* | : | ఉగాది, వృషానామ సంవత్సరము<br>**26 మార్చి 2001** |
| *First Edition* | : | 1000 copies |
| *Copy wright* | : | భారద్వాజ ఆశ్రమము శ్రీకాళహస్తి |
| *Paper used* | : | *Creomove* |
| *Size of the Book* | : | Demy 1\8 |
| *Size of the Letter* | : | 12 point |
| *Number of pages* | : | 10 + 178 |
| *Price* | : | Rs. 40/- |
| *Published by* | : | BHARDWAJA ASHRAMAM<br>No. 4-570, Car Street,<br>Sri Kalahasti - 517 644. |
| Copy's available at | : | BHARDWAJA ASHRAMAM<br>No. 4-570, Car Street,<br>Sri Kalahasti - 517 644. |

శ్రీకాళహస్తీశ్వరాయ నమః

శ్రీజ్ఞాన ప్రసూనాంబాయైనమః

## మంగళాచరణం

శ్లో॥ యన్నామస్మరణం సమస్తజగతామైశ్వర్య సంపాదకం
యత్సందర్శన మాశుకోటి జననం ప్రాప్తాఘవిధ్వంసనం ।
వేదైశ్చాపి న శక్యతే నిగదితుం యత్స్వానుభూతే సుఖం
సోఽయం నః పరిపాతు నిత్యకృపయా శ్రీకాళహస్తీశ్వరః

ఏదేవుని నామస్మరణము స్మరించినంత మాత్రముచేత ప్రపంచమునకు సమస్తమగు ఐశ్వర్యములు ఒనగూడగలదో, ఏదేవుని దర్శన మాత్రముచేత కోటి జన్మముల పాపము క్షణములో హరించగలదో, వేదములకు అతీత మైన తత్త్వమును కలిగిన వాడును, ఏ స్వామి సందర్శనముచేత నిజమైనదియు అపరిమితమైన ఆనందము, సుఖము లభించునో అట్టి శ్రీకాళహస్తీశ్వరుని నిత్యకృపను జనులు పొందగలరు.

BHARADWAJA ASHRAMAM

*Srikalahasti*

## AN APPEAL

Manuscripts on palm leaf or paper are the works of our ancients sages and wisemen, they are the great treasures inherited by our nation. These are to be preserved for the generations to come. It is a moral obligation of persons who possess them to preserve them for the benefit of all of us.

Probably you, your friends, or your neighbours may have them in possession. You can contribute them to preserve for the sake of our culture, by presenting them to Bharadwaja Ashram, Srikalahasti (A.P.)

The manuscripts will be accepted and acknowledged with the gratitude by the Ashramam and preserved with care and made available to the posterity. The unpublished works found among them will be published in course of time as facilities occur, with due recognition of your gift.

**Bharadwaja Ashramam** invites you to contribute these invaluable manuscripts to its Library.

**Bharadwaja Ashramam** invites Philonthrothic Instutution and persons to join in publishing the National treasure by way of financial support.

# విషయ సూచిక


| | | |
|---|---|---|
| 1. | భూమిక | 1 |
| 2. | పూర్వపీఠిక | 3 |
| 3. | శివనామ మహిమ | 6,92 |
| 4. | సర్వ రోగములను పోగొట్టేవాడు రుద్రుడు ... | 10 |
| 5. | శివకేశవుల అభేదము | 12 |
| 6. | బ్రహ్మకు తాతలాంటివాడు శివుడు | 14 |
| 7. | స్ఫటికమణి నిర్మితమే కైలాసము | 18 |
| 8. | బిల్వారణ్య మహిమ | 19 |
| 9. | సాలెపురుగు అర్తిని పోగొట్టుట | 21 |
| 10. | సంసార వైద్యుడు శివుడు | 22 |
| 11. | పరాత్పరుడు శివుడు | 24 |
| 12. | కాళేభముల గర్వభంగము | 26 |
| 13. | గంగావతరణమున మత భేదము | 34 |
| 14. | బ్రహ్మాండమున నిండి ఉన్నాడు శివుడు | 24, 156 |
| 15. | పంచముఖుడు శివుడు | 17, 133 |
| 16. | సర్వమంగళాలంకృతుడు శివుడు | 50, 104 |
| 17. | సర్వశుభములను ఇచ్చువాడు శివుడు | 52 |
| 18. | సచ్చిదానంద స్వరూపుడు శివుడు | 53, 156 |
| 19. | హిరణ్యగర్భుని తండ్రి శివుడు | 54 |
| 20. | శ్రీ జ్ఞాన ప్రసూనాంబికా పతి శివుడు | 58 |
| 21. | మయూరుని కథ | 59 |
| 22. | శ్రీరాముని మోహనమును పోగొట్టినవాడు | 60 |
| 23. | కాలస్వరూపుడు శివుడు | 63 |
| 24. | పశుపతి | 66 |
| 25. | శబరాభయ ప్రదాత | 70 |
| 26. | సువర్ణముఖరీ తీర వాసుడు | 74 |
| 27. | విజయునికి ముక్తి ఇచ్చుట | 76 |
| 28. | అగస్త్యుని దేవతలు సేవించుట | 76 |
| 29. | వైదికాగమ స్వరూపుడు | 80 |

| | | |
|---|---|---|
| 30. | దివ్యమణులతో అర్చనను పొందినవాడు | 86 |
| 31. | శ్రీకాళహస్తీశ్వరుడు మణికర్ణుడు | 87 |
| 32. | పంచాక్షరాకారుడు శివుడు | 101 |
| 33. | దుర్గాహేమ రుచిప్రదుడు | 102 |
| 34. | సీలాదేవి వృత్తాంతము | 106 |
| 35. | లింగోద్భవుడు | 107 |
| 36. | సర్వవిద్యాపతి | 108, 110 |
| 37. | పంచాక్షరమయుడు శివుడు | 112 |
| 38. | సుభగా వృత్తాంతము | 114 |
| 39. | చంద్రుని క్షయమును పోగొట్టినవాడు | 115 |
| 40. | సూర్యుని పాపములను పోగొట్టినవాడు | 116 |
| 41. | ఆనందతాండవ ప్రియుడు | 119 |
| 42. | సకలామర నాయకుడు | 124 |
| 43. | హరహరుని కథ | 128 |
| 44. | సుదర్శనుని పాపక్షయము | 129 |
| 45. | స్కందుని సర్వజ్ఞత్వము | 130 |
| 46. | శ్రీలక్ష్మిచే పూజింపబడినవాడు | 134 |
| 47. | నందిశైల వాసుని కథ | 136 |
| 48. | మూగవాని పాపములను పోగొట్టినవాడు | 137 |
| 49. | నీలకంఠుని పాపాపహరణము | 146 |
| 50. | పద్మసేమునిచే రాజేంద్రునిచే సేవించినవాడు | 147 |
| 51. | సారంగుని కథ | 151 |
| 52. | చక్రధరుని కథ | 152 |
| 53. | వరగుణుని కథ | 153 |
| 54. | భరద్వాజునిచే పూజించిన వాడు | 163 |
| 55. | గోవింద నయనార్చితుడు | 165 |
| 56. | బ్రహ్మపురమున విష్ణు నగరమున ఉండువాడు | 156, 157 |
| 57. | ఉత్తర పీఠిక | 167 |
| 58. | ఫలశ్రుతి | 168 |

# శ్రీకాళహస్తీశ్వరుని శతనామములు


| | | |
|---|---|---|
| 1 | శివః | 6 |
| 2 | మహేశ్వరః | 8 |
| 3 | శర్వః | 9 |
| 4 | రుద్రః | 10 |
| 5 | విష్ణుః | 12 |
| 6 | పితామహః | 14 |
| 7 | సర్వభృత్ | 17 |
| 8. | దివ్యకైలాస శిఖరేంద్ర నివాస భూః | 17 |
| 9 | అఖండ బిల్వచ్ఛదన ప్రియః | 19 |
| 10 | లూతార్తి మోచకః | 21 |
| 11 | సంసార వైద్యః | 22 |
| 12 | సర్వజ్ఞః | 23 |
| 13 | పరమాత్మా | 24 |
| 14 | పరాత్పరః | 24 |
| 15 | కాళేభాజం జవధ్వంసీ | 26 |
| 16 | సితాభ్ర సరిలాప్లుతః | 34 |
| 17 | తేజోనిధిః | 39 |
| 18 | జగద్యోనిః | 39 |
| 19 | దివ్య మంగళ విగ్రహః | 40 |
| 20 | అనేక కోటి బ్రహ్మాండ పిండీకరణ పండితః | 41 |
| 21 | పంచబ్రహ్మతనుః | 45 |
| 22 | సర్వమంగళాలంకృతాకృతిః | 49 |
| 23 | అనాదినిధనః | 50 |
| 24 | శంభుః | 52 |
| 25 | సచ్చిదానందరూపభాక్ | 53 |
| 26 | హిరణ్య గర్భ జనకః | 54 |
| 27 | జ్ఞాన సూనాంబికా పతిః | 58 |
| 28 | మయూరార్తి ప్రహర్తా | 59 |
| 29 | రామమోహ నిబర్హణః | 60 |
| 30 | వేదాంత వేద్యః | 62 |
| 31 | కాలాత్మా | 63 |
| 32 | విచిత్ర బహుశక్తిమాన్ | 65 |
| 33 | స్థిరధన్వా | 65 |
| 34 | పశుపతిః | 66 |
| 35 | సర్వతత్త్వ ప్రబోధకః | 68 |
| 36 | శబరాభయదః | 70 |
| 37 | గౌరః | 71 |
| 38 | శబరేక్షణ పూజితః | 72 |
| 39 | సువర్ణముఖరీ తీరవాసీ | 74 |
| 40 | విజయ ముక్తిదః | 76 |
| 41 | అగస్త్యాయ రమేశాది సురోపాస్యత్వదాయకః | 76 |
| 42 | వైదికాగమ పీఠస్థః | 80 |
| 43 | మణిజాలార్చన ప్రియః | 86 |
| 44 | మణికర్ణః | 87 |
| 45 | హరి బ్రహ్మాఽదృష్టపాద శిరాః | 98 |
| 46 | స్వభూః | 100 |

47 [illegible] 101
48 పంచాక్షరాకారః 101
49 [illegible] 102
50 అనంత కళ్యాణ గుణః 104
51 సీతా మైత్ర్య కారణః 106
52 లింగోద్భవః 107
53 విద్యారాశిః 108
54 విద్యాపతిః 110
55 అనామయః 111
56 పంచాక్షరాభిధేయః 112
57 సుఘనాశోక భంజనః 114
58 చంద్ర క్షయ ప్రహర్తా 115
59 అర్జున మహా పాపాబ్ధి శోషణః 116
60 ఆనంద తాండవ కరః 119
61 సురాసుర నాయకః 124
62 భర్గః 125
63 దుర్గా సమారాధ్యః 126
64 శక్ర ప్రస్తుత వైభవః 126
65 సేతా 127
66 హార హారోద్ధర్తా 128
67 చక్ర కల్పిత మార్గణః 129
68 స్కంద సర్వజ్ఞతాహేతుః 130
69 పంచధాభిన్న మస్తకః 132
70 లక్ష్మీ వినత వామాంఘ్రిః 134
71 జాబాలా భక్తిగోచరః 136
72 మూకమృత్యుంజయార్తిఘ్నః 137
73 వృద్ధ బ్రాహ్మణవేష ధృత్ 138
74 మాయా శివద్విజాకారః 138
75 [illegible] 140
76 [illegible]
[illegible] 141
77 [illegible] 142
78 [illegible] 144
79 [illegible] 144
80 సహస్రదేవ సంపద్యః 145
81 నీలకంఠ మలాపహృత్ 146
82 పద్మసేనక – రాజేంద్ర
కన్యాయుగళ సేవితః 147
83 తుంగః 150
84 రక్షిత సారంగః 151
85 ధృత వస్త్రధర ప్రభుః 152
86 ధర్మాసనః 152
87 వరగుణాభీప్సితార్థ ప్రదాయకః 153
88 నిత్యః 156
89 బ్రహ్మ పురావాసీ 156
90 దేవర్షి నగరాసితః 157
91 శ్రీవిష్ణునగరా వాసీ 158
92 శ్రీముత్యాంద్యపురస్థితః 161
93 భీమార్చితః 161
94 పితా 162
95 భర్తా 162
96 భరద్వాజ ప్రపూజితః 163
97 ప్రసన్న కాళహస్తీశః 163
98 ప్రభాద్యోతిత దిఙ్ముఖః 164
99 కుమార కాళహస్తీశః 164
100 గోవింద నయనార్చితః 165

# అంకితము



పరదేవత

శ్రీజ్ఞానాంబిక

పాదపద్మములకు

---

శ్రీ జ్ఞానాంబ స్తుతి

విదశ కమల సంస్థా పుష్పహస్తోప యుక్తా / ధవళ మమలరూపా నిఖిల జ్ఞాన ప్రదీపా.
శశిధర కృత మూర్ధా శుభ్ర తాటంక భూషా / కుంకుమ మస్తక రేఖా కరండమకుటోపేతా
జయ జయతు సమస్త జ్ఞాన సూనాంబదేవి।



ప్రచురణకు ధనసహాయము చేసిన దాతలు

శ్రీమతి వి. రాజేశ్వరి, శ్రీ వి.వి. ప్రసాదరావు దంపతులు సోంపేట

శ్రీ వడగ, వీర ప్రసాదరావు (70 సం॥లు), ధర్మపత్ని శ్రీమతి రాజేశ్వరమ్మ (63 సం॥లు) దంపతుల జన్మస్థలము శ్రీకాకుళం జిల్లా సోంపేట పట్టణం. ప్రసాదరావుగారి హైస్కూలు విద్యాభ్యాసం వెంటనే తొలుత రివెన్యూ డిపార్టుమెంటులోనూ, ఆపిమ్మట పోస్టల్ డిపార్టుమెంటులో పనిచేసి, ప్రస్తుతం విశాఖపట్నం - ఉక్కునగరంలో తన చిన్న కుమారుని వద్ద సతీసమేతంగా విశ్రాంతి తీసుకొనుచున్నారు. వీరికి ముగ్గురు సుపుత్రులు. వీరంతా ఉన్నత పదవులలోనున్నారు. ఇద్దరు పుత్రికలకు వివాహమై సుఖ జీవనము సాగించుచున్నారు.

శ్రీ ప్రసాదరావుగారు శ్రీవిద్యోపాసకులు. దసాశ్రమ స్థాపకులైన బ్రహ్మాలీన శ్రీశ్రీశ్రీ చిద్ఘనానంద మహర్షుల వారి ప్రియ శిష్యులు. సర్వశ్రీ శ్రీశ్రీబ్రహ్మాలీన కంచి కామకోటి పీఠాధిపతులు, శ్రీ సరస్వతీ చంద్రశేఖరేంద్రస్వాముల వారియొక్కయు, శృంగేరి పీఠాధిపతులు శ్రీవిద్యానంద భారతీ స్వాముల వారియొక్కయు, శ్రీభూమానందాశ్రమ సంస్థాపకులు శ్రీ రామకృష్ణానంద స్వాముల వారియొక్కయు ఆశీస్సులు పొందియున్నారు. ఉత్తర ప్రదేశ్‌లో శ్రీ అఖండానంద సరస్వతీ స్వాముల ప్రియశిష్యులు యోగశిరోమణి శ్రీశ్రీశ్రీ విమలానంద స్వాముల వారియొక్కయు, వేదాంత శిరోమణి మాతృశ్రీ పూర్ణ ప్రజ్ఞానంద సరస్వతీ స్వాములయొక్కయు, బలిఘట్టం కళ్యాళగిరి వాసిని మాతృశ్రీ పరమహంస పద్మావతియొక్కయు, శ్రీ జినన్నారి నాన్నగారియొక్క కృపాకటాక్షములకు దంపతులిరువులు పాత్రులైనారు.

ప్రస్తుతం గురుకార్యములందు వీరి మిత్రులు శ్రీ బొహరా పద్మనాభస్వామిగారి సహకారముతో నిమగ్నులై సాధన చేసుకొనుచున్నారు. వేదాంత జిజ్ఞాస, యోగ విద్యలయందు అభిరుచి, నిష్కామ సేవలో అభిలాష గలవారు.

ఈ దంపతులను వారి వంశమును శ్రీజ్ఞానప్రసూనాంబాసమేత శ్రీకాళహస్తీశ్వరులు దీర్ఘ ఆయురారోగ్యములతోనూ, సకల సంపదలతోనూ ధర్మ కార్య నిమగ్నత నొసంగి అనుగ్రహించు గాక!

శ్రీకాళహస్తీశ్వర ప్రసీదతు

# శ్రీకాళహస్తీశ్వర శతనామాబ్జమాలికా భూమిక:

శంభో! సమర్పయే తుభ్యం భాష్యం యత్తవ కీర్తనం ।
ఏతేన నామయజ్ఞేన విఘ్నాన్ సర్వాన్ వ్యపోహయ ॥
బుద్ధిర్బలం వయోవీర్యం ధనం సాధనసంపదం ।
శంభుం స్వయం మదంతస్థం బోధయన్నాత్మనః పదం ॥
శంభుం సహస్ర మూర్ధానం చరాచర పతిం విభుం
స్తువన్నామ సహస్రేణ జ్వరాన్ సర్వాన్ వ్యపోహతి ॥
భక్తిర్నామ సుధాస్తి లోకవిదితా స్వాభావికానందదా,
శంభోః ప్రీతికరీ జగద్ధితకరీ లోకోత్తరా శాంతిదా ।
**పీత్వా సౌఖ్యమయీ మిమాం బుధజనాః సంపాదయధ్వం నిజం**
మోక్షం లోకసుఖం యశశ్చవిమలం లోకే సుఖేనాచిరాత్ ॥
సంసార రోగేణ చిరం సుతప్తాః కుతోఽపి శాంతిం నపరాం ప్రసన్నాః ।
**శ్రుత్యబ్ధినిర్మంథనలబ్ధసారం సంతః సదా భక్తిరసం పిబంతు ॥**

''భజ్యతే సేవ్యతే అనేన భగవదాకారమంతః కరణం క్రియత ఇతి భక్తిః'' భక్తి అనగా భగవంతుని మనోవాక్కాయ కర్మలచేత సేవించుట, భక్తి శబ్దముచేత శ్రవణ, కీర్తన, స్మరణ, పాదసేవన, అర్చన, వందన, దాస్య, సఖ్య ఆత్మనివేదనాది సాధనములు చెప్పబడినవి. మనస్సును ఎల్లప్పుడు పరమేశ్వరునియందే లగ్నము చేయవలెను. ''ఏకం సత్ విప్రాః బహుధా వదంతి'' అన్నట్లు భగవంతుడు ఒక్కడే. కానీ ఆభగవంతుని రూపాలను పండితులు అనేకరకాలుగా వర్ణించారు, కీర్తించారు, దర్శించారు. ఆభగవద్రూపాలన్నీ సర్వగుణ పరిపూర్ణములు. ''కలౌసంకీర్త్య శంకరం'' అన్నట్లు సర్వేశ్వరుడు స్తోత్ర ప్రియుడు భగవంతుని స్తుతించటంవల్ల భగవన్నామాన్ని జపించటంవల్ల సిద్ధించే సత్ఫలితాలు మరెన్నెన్నో. అందువల్లే ఆ పరమాత్మ ఆయా సందర్భాలలో భక్తులకు ఇష్టమైన వివిధ రూపాల్లో వారివారి చేత అనేకరకములుగా స్తుతింపబడ్డాడు. తద్ద్వారా వారివారికి ఇహ పర సుఖాలు అనుగ్రహించాడు. మహిమాన్వితాలైన సర్వేశ్వర నామావళులన్నిటియందు శ్రీస్వామివారి అవతార, లీల, విక్రమ, అనుగ్రహ విశేషాలు కీర్తింపబడ్డాయి.

మహర్షులు, యోగులు, తపశ్శక్తి సంపన్నులు భగవద్భక్తి కల శక్తిని తమతమజీవితాలద్వారా వెల్లడించి ఉన్నారు. మానవుడెంతటి సంపన్నుడైనా, అతనిమేధస్సు ఎంత సునిశితమైనా, అతనికి ఎంతగా శక్తి యుక్తులున్నా, ఒక్కొక్క క్షణంలో, ఒక్కొక్క సంఘటనలో ఏమీ చేయలేని అసమర్థుడౌతాడు. అటువంటి విపత్కర విషమ పరిణామములలో మానవతీతమైన మహత్తర శక్తి ఏదో మనమీద ప్రభావం కలిగి ఉన్నది. అటువంటి మానవాతీత మహత్తర శక్తినే భగవల్లీల అన్నారు మనపూర్వీకులు. భగవల్లీలలు అనేకం. సర్వేశ్వరుడు సర్వశక్తి సమన్వితుడు కావున ఆయన లీలలు గుర్తించటం చాలా కష్టము. ఆయన భక్తులకు మాత్రము వశ్యుడౌతాడు. శివలీలలు అనంతాలు, అనేకాలు.

శ్రీమత్పరమహంస పరివ్రాజకాచార్యవర్యులు, సంతత ప్రణవార్థానుసంధాన పరాయణులు అగు శ్రీమచ్చిదంబరానంద తీర్థ స్వామి వారి ప్రియ శిష్యులు అగు శ్రీ శివానందయతి

పరమ్మలచేత తనకొరకు, లోకోపకారముకొరకు శ్రీకాళహస్తీశ్వర స్థల పురాణము ఉన్న (71 వ అధ్యాయము నందలి) ఈశతనామాబ్జమాలిక యమధ్వజసుతుడైన మృత్యుంజయుడు రైక్వ మహర్షి శాపమునకు గురికాగా ఆకష్టములను పోగొట్టుకొనుటకు బాల్యమునందే పరమేశ్వరుని సాక్షాత్కరించిన మృకండ మహర్షి కుమారుడైన మార్కండేయుడు రోమశభరద్వాజులమధ్య జరిగిన సంభాషణను మృత్యుంజయునకు చెప్పెను. శ్రీశివానంద తీర్థ యతి ఈమాలికకు సంస్కృతములో అతిసుందరమైన వ్యాఖ్యను రచించెను. ఇందులో స్థలపురాణమును, భక్తుల చరిత్రలను, శ్రీకాళహస్తీశ్వరుని లీలలను, చాలా విపులముగా వర్ణించిరి. సంస్కృతములోని వాఖ్యను 1893 ఫిబ్రవరిలో ముద్రించిరి. సంస్కృతములో ఉన్నందున అది అందరికి అందుబాటులో ఉండదుగనుక తెలుగులో అనువాదము అవసరమైనది. ఇందులో శివతత్వమును వివరించుటతో బాటు కైలాసము స్ఫటికమణిమయమని, శ్రీకాళహస్తి అఖండబిల్వకాననమని, ఇచటి బిల్వ దళముల వైలక్షణ్యమును, సాలెపురుగు, సర్పము, ఏనుగులతో పాటు అనేక భక్తుల చరిత్రలు, శ్రీకాళహస్తీశ్వరుడు సంసారవైద్యుడని, గంగావతరణ నిర్ధారణ, మయూరునికథ, శబరునిభక్తి, మణికర్ణికా వైభవము, శ్రీకాళహస్తీశ్వరుని అనంత కళ్యాణగుణములు, లింగోద్భవ విశేషము, నీలాదేవికి ముక్తి ప్రధానము, చంద్రుని క్షయమును పోగొట్టుట, ఆనందతాండవమును గూర్చియు చక్రిపాపములను పోగొట్టుట, స్కందునికి సర్వజ్ఞత్వ హేతువు, జాబాలమహర్షి భక్తి, మగావాడైన మృత్యుంజయుని రక్షించుట, మాయా శివద్విజుని అవతారము, మయూరుని పాపశమనము, నీలకంఠుని పాపములు పోగొట్టుట, సారంగధరుడు, వరగుణుని కోర్కెలు తీర్చుట, గోవిందుని నయనార్చనము, లక్ష్మి వినత వామాఘుడు మొదలగు విషయములను సుమనోహరముగా సామాన్యులను ఆకర్షించేవిగా ఉన్నవి.

అనువాదమును చేయుట చాలకష్టము. శ్రీశివానంద తీర్థస్వామికి అనేక శాస్త్రములు, ఆగమ విషయములు, శ్రీకాళహస్తి క్షేత్రస్థల మహాత్మ్యమును బాగా తెలిసి ఆవిషయములను అందరికి తెలపాలనే కోరికతోను, శ్రీకాళహస్తీశ్వరుని భక్తి తత్త్వము అందరికి అందుబాటులో ఉంచాలనే తపనతోను అనేక పురాణములను కావ్యములను పరిశోధించి ఈవాఖ్య రచించారు. అటువంటి రచనను తెలుగు అనువాదము చేయుటకూడా చాలాకష్టమే. కావున శ్రీకాళహస్తీశ్వరుని అనుగ్రహమువలన యథాశక్తిగా అనువాదము చేయబడినది. దీనిని చదివి భక్తులందరూ ఆనందించెదరు గాక.

శ్రీకాళహస్తీశ్వరః ప్రసీదతు.

ప్రకాశకులు



## శ్రీశివమస్తు.

శతనామాబ్జమాలాసవ్యాఖ్యా తత్రేయం పూర్వపీఠికా

### పూర్వపీఠికా

**సర్వాంతర్యామిణం సాంబం శివం నత్వా యథా మతి ।**
**తన్నామమాలికామేతాం వ్యాకుర్వే ప్రముదే ॥**

సాంబం = ''అంబయాసహితం'' అమ్మవారితో కూడిన శ్రీశివునకు సాంబః = సాంబుడు అని అర్థము. ఇచట శ్రీజ్ఞాన ప్రసూనాంబతో కూడినవారు శ్రీకాళహస్తీశ్వరస్వామివారు. వారిరువురు కోరినవార్కి అనేక శుభములను మంగళములను ఇచ్చేవారు. అంబతో కూడిన పరమేశ్వరుడు సర్వాంతర్యామిగా ఉన్నాడు. మనస్సు ఉల్లాసమును, కల్గించు శ్రీకాళహస్తీశ్వర శతనామాబ్జమాలికను వివరించుచున్నాను. పూజయందు మాలికా సమర్పణము విధి. శ్రీశివానంద తీర్థస్వామి శతనామములను పుష్పముగా చేసి దానిని ఒకమాలికగా తయారుచేసి శ్రీకాళహస్తీశ్వరునకు సమర్పించెను. శ్రీశివానందతీర్థులు అనేక శాస్త్రములతో పాటు వేదపురాణేతిహాస ఆగమములయందు మహాప్రతిభగల పండితుడు. సందర్భానుసారముగా ఆయా శాస్త్రములలోని సుగంధ పరిమళములు వెదజల్లే పుష్పములను సేకరించి మాలికగా కూర్చినాడు. అందువల్ల ఈ మాలిక అతిసుమనోహర సుగంధిభరితము. శ్రీశివానందతీర్థ స్వామి శ్రీకాళహస్తీశునియందు అచంచలమైన పరమభక్తి కలిగినవాడు. ''శ్రీకాళేభకిరాత చిహ్నములు వాసిందాల్చి రుద్రాక్ష లింగాకారమ్మైన స్వాత్మభూధరము నొయ్యంగూడి జ్ఞానాంబతో, శ్రీ స్వర్ణముఖీ పురోవసది గూర్మిం దోచు నా స్వామి లోకైకత్రాణమహోద్యమ ప్రథితుడై యార్తాళి రక్షించెడిన్'' కుసుమమాలికను శివభక్తి అనే సూత్రముతో గుచ్చి శ్రీకాళహస్తీశునకు సమర్పించెను.

**శ్రీరోమశమునిః**

**మార్కండేయపదే నత్వా రాజా మృత్యుంజయాహ్వయః**
**వినయేన సమావిష్టః ప్రోవాచ వచనం మృదు ॥**
**సర్వజ్ఞ ! మునిశార్దూల! శరణాగతవత్సల ।**
**యమేన లోకరక్షార్థం యా దత్తా భవతే పురా ।**
**శుభా శ్రీకాళహస్తీశప్రీతిదా నామమాలికా ।**
**మహ్యం ప్రయచ్ఛతామద్య యయాఽహం శోక సంకటాత్ ॥**
**ముక్తో భవేయం సకలాద్భవత్పాదావలంబినే ।**

రోమశమహర్షి ఇట్లు చెప్పుచున్నాడు. మృత్యుంజయుడనే మహారాజు శ్రీమార్కండేయ మహర్షికి నమస్కరించి అతివినయముతో మృదుమధురములగు మాటలతో ఆమహర్షిని ప్రశ్నించెను. హే! ముని శార్దూల! నీవు సర్వజ్ఞుడవు. శరణాగతవత్సలుడవు. లోకరక్షణకై శోక సంకటములనుండి బయటపడుటకై అనేక శుభ పరంపరలను ఇచ్చేదియు శ్రీకాళహస్తీశునకు మిక్కిలి ప్రీతి పాత్రమైనదియు ఐన శ్రీ కాళహస్తీశ్వర శతనామాబ్జమాలిక సారమును, శివతత్త్వమును నాకుచెప్పవలసినది అని ప్రార్థించెను. ఆ శతనామాబ్జమాలికను ఆశ్రయించిన నేను జీవన్ముక్తుడను కాగలను.

**అన్వార్థ : సర్వజ్ఞేతి సంబుద్ధ్యా మత్సంకటనివృత్త్యుపాయం జానాసీతి. అన్యత్ర ప్రత్యాఖ్యాన నివృత్త్యర్థం ముని శార్దూలేతి । విద్యాగ్రహణే అనధికారిణమపి మాం శిక్షయిత్వానుగృహాణేత్య ర్థసిద్ధ్యై శరణాగతవత్సలేతి చ సంబోధన త్రయముక్తం । భగవన్ యమేన మృత్యునా భవతే తుభ్యం దత్తా సముపదిష్టా శుభా సుమంగలా శ్రీకాళహస్తీశ ప్రీతిదా యా నామమాలికా యయా సకలాత్ రైక్వశాపాధిగతా త్సంకటాన్ముక్తో భవేయం। భవత్పాదావలంబనే మహ్యం తాం నామమాలికాం ప్రయచ్ఛ ఉపది శేత్యర్థః ॥**

మార్కండేయ మహర్షి సర్వజ్ఞుడు. కనుక సృష్టిలోని అన్ని విషయములతోపాటు మృత్యుంజయ మహారాజు భూత భవిష్యద్వర్తమాకాలములను, ఆరాజు వృద్ధి క్షీణములు గూడా బాగా తెలిసినవాడు. అతని సంకటముల నివారణోపాయము కూడా తెలిసినవాడు. ఆయన ముని శార్దూలుడు కావున ఆయన చాలా గంభీరుడు. ఒకరి విషయములు మరి ఒకరికి చెప్పనివాడు. ఇంద్రియ నిగ్రహము కలవాడు. ఆత్మవిద్యను గ్రహించలేని అనధికారులకుకూడా శిక్షణ సాధన ఇచ్చి వారిని అనుగ్రహించేవారు. శరణుకోరివచ్చినవారి శ్రితవాత్సల్యముతో తాపోపశమనమునిచ్చు వాడున్నూ, ఇటువంటి అనేక సంబోధనలతో ఆయనను ప్రార్థించెను. ఓ పూజ్యుడా ! యమధర్మరాజుచేత అభిమానముతో నీకు ఉపదేశించునదియు, అది అనేక శుభములను, అనేకమంగళములను ఇచ్చునదియు శ్రీకాళహస్తీశునకు మిక్కిలి ప్రీతి పాత్రమైన శతనామాబ్జమాలికను నాకు ఉపదేశింపుము రైక్వమహర్షి శాపముచేత నేను చాలా కష్టములను అనుభవించు చున్నాను. ఆ శతనామాబ్జమాలికా శ్రవణముచేత ఆపాపములనుండి నేను విముక్తుడను కాగలను. కావున నిన్ను ఆశ్రయించితిని. నాకు ఆ శతనామాబ్జమాలికను ఉపదేశించమని ప్రార్థించుచున్నాను.

**ఇతి సంప్రార్థితస్తేన యమధ్వజసుతేన సః ।**
**హర్షేణ మహతా యుక్తో నిజగాద మృకండుజః ॥**
**శ్రద్ధయా పరయాభక్త్యా శ్రుణు తన్నామ మాలికాం ।**
**గోపనీయా విశేషేణ యా సర్వాపద్విమోచినీ ॥**

ఈ ప్రకారముగా యమధ్వజసుతుడైన మృత్యుంజయుడు, ఆమహర్షిని ప్రార్థింపగా మిక్కిలి సంతోషముతో శ్రీ మార్కండేయ మహర్షి సమస్త ఆపదలను పోగొట్ట కలిగినదియు అనేక మహత్తులతో కూడినదియు నైన నామమాలికను శ్రద్ధతో పరమభక్తితో వినమని చెప్పెను.

**అర్థః ఇతి సమధ్వజసుతేన తేన రాజ్ఞా సంప్రార్థితస్స మృకండుజః మహతా హర్షేణ యుక్తస్సన్నిజగాద। అత్యంత శ్రద్ధాభక్తిభ్యాం శృణు । యా సర్వాపద్విమోచినీ జననమరణనానారోగదారిద్ర్యాద్యఖిలాశ్చా పదో మోచయతీతి తథోక్తా సా విద్యావిశేషేణ గోపనీయారక్షణీయా. విద్యారక్షణం నామ విధివదుపసన్నాయోత్తమాధికారిణ ఏవోపదేష్టవ్యతా । అన్యథా మాయకావృత వాదిశఠజనోపదేశనేన సా విద్యా సముద్విగ్నా భవతీతినైరు క్తైరుక్తం । విద్యా హవై బ్రాహ్మణ మాజగామ । గోపాయ మాశేవధిష్టేహ మస్మి । అసూయకాయానృజవే శఠాయ మామాబ్రూయావీర్యవతీ తదాస్యామితి ముక్తిశ్రుతేః । శ్రవణాద్యనధికారిణే న బ్రూయాదిత్యర్థః ॥**

యా సర్వాపద్విమోచినీ సేయం నామాబ్జమాలికా విశేషణ గోపనీయేత్యర్థః । శివపురాణే శివతత్త్వరహస్య కథనే శ్రీరోమశభరద్వాజముని సంవాదే శ్రీకాళహస్తిస్థల మహాత్మ్యే నవత్యధ్యాయ ప్రపంచితానానేతిహాస విలసితే ఏకసప్తతితమాధ్యాయే ఇయం శతనామాబ్జమాలికా మార్కండేయమహామునినా మృత్యుంజయాఖ్యాయ నరపతయే ప్రీత్యా ఉపదిష్టా ॥

ఈశతనామమాలిక మహిమను చెప్తూ ఇది ఎటువంటి వార్కి ఉపదేశించవలెను అనే ప్రశ్నరాగా "స గురుమేవా భిగచ్ఛేత్ శ్రోత్రియం బ్రహ్మనిష్ఠం" మిక్కిలి ఆర్తితో నియమనిష్ఠలతో శ్రద్ధతో విద్యను నేర్చుటకు వచ్చే ఉత్తమునికి మాత్రము చెప్పవలెను. లేనిచో విద్య మహిమ తెలియక కువ్యాఖ్యలను చేయుచూ వాడు పతితుడగుటయే కాక తోటివారినిగూడా పాడుచేయును. విద్యయందు కోరికలేని వానికి ఉపదేశింపరాదు. అది అపాత్రదానము కాగలదు. విద్య సకల ఆపదలనుండి విముక్తిని ప్రసాదించును. భక్తితో కూడిన శతనామాబ్జమాలికా పఠనము కల్పవృక్షమువలె కోరినవన్నీ ఇచ్చును. దీనిని మహర్షులు ఉపదేశించిరి కనుక అతిశయోక్తులు అసత్యములుండవు. యమధ్వజ సుతుడైన మృత్యుంజయుడనే మహారాజుచేత మృకండుమహాముని కుమారుడైన మార్కండేయ మహర్షిని శివతత్త్వముతో గూడిన నామమాలికను చెప్పమని అడుగగా మిక్కిలి సంతోషముతో శ్రద్ధా భక్తులతో వినమని చెప్పెను. ఈ శివ నామమాలిక సమస్త ఆపదలను పోగొట్టును. జననమరణములతో గూడిన అనేక రోగములు, దారిద్ర్యమును అనేక ఆపదలనుండి విముక్తిని ఈ స్తోత్ర పఠనమువల్ల లభించును. ఇది ఒక మహావిద్య. దీనిని విశేషించి రహస్యముగా ఉంచవలెను. ఎందువలన అనగా విద్యారక్షణవలన ఎవడు ఆర్తుడో, ఎవడు అనార్తుడో మొదట తెలియదు. ఆర్తునకు అందించినచో అది ఎడారిలో స్వాతిచినుకవలె అతనిని రక్షించి ముక్తునిగాచేయును. గుణములయందు పొగరుతో దోషములను ఆరోపించే వారికి, అసత్యములాడువారికి కుత్సితునికి, నిందకునికి ఉపదేశించినచో అది వ్యవస్థ తప్పి తను చెడుటయే కాక తద్వారా సమాజమునకు కూడా కంటకుడుగా మారును. కావున పరమేశ్వరునియందు అచంచలమైన భక్తి కలవానికే దీనిని ఉపదేశించవలయును. పరమేశ్వరునియందు భక్తిలేనివారు ఈ శివనామ మాలికను వినకూడదు. శివపురాణమున శివతత్త్వ రహస్యమును శ్రీరోమశ భరద్వాజ మహర్షుల సంభాషణమున శ్రీకాళహస్తీశ స్థల మహాత్మ్యమును గూర్చి జరిగెను. ఈ స్థల మహాత్మ్యమును చెప్పెన. డెబ్బై ఒకటవ అధ్యాయమున శ్రీమార్కండేయ మహర్షి మృత్యుంజయ నరపతికి ప్రీతితో శతనామాబ్జమాలికను ఉపదేశించెను. శివపురాణమున దీని ప్రస్తావన ఉన్నందున ఆపురాణమునకు ఎంత పవిత్రత, ప్రాధాన్యము సఫలత్వములు కలవో ఈ శతనామాబ్జమాలికకు కూడా అంతే పవిత్రతకలదు. మహర్షులచేత చెప్పినందున అసత్యము లేశముగూడా వీటియందు లేదు. మహర్షులు దివ్య శక్తి సమన్వితులు కదా!

**పూర్వ పీఠికా సమాప్తము.**

**నామమాలికానువాదము ప్రారంభము.**

## శివః

త్రిమూర్తులలో ఇతను ఒకడు ఇతను ప్రపంచ లయ కర్త. ఇంతను విష్ణువువలె రాక్షస సంహారమునకు అవతారములు ఎత్తలేదు. జ్ఞానబోధ చేయుటకై శ్రీదక్షిణామూర్తిగా అవతరించెను. శివుడనగా శాంతస్వరూపుడని అర్థము. అంతః కరణ విజేతలలో ఆయన అగ్రేసరుడు. "శామ్యతి పరమానందరూపత్వాత్ నిర్వికారోభవతీతి శివః, శేతవే సజ్జనమనసేతివా, శివం కల్యాణం తద్యోగాద్వా శివః" సాక్షివేతగూడా ఆక్రమించబడని శుద్ధ ప్రత్యక్ చైతన్యమే శివుని స్వరూపము మోక్షమును పొందగోరిన వాడు. లౌకిక జీవనమునుండి దృష్టిని మరల్చి ఈ అవ్యాప్త స్వరూపుడైన శివుణ్ణే పొందగోరును. పరమేశ్వరుని శరీరములలో రక్షణ చేసే దానిని శివః అందురు. ఇది శుద్ధ సత్త్వము ఉపాధిగా కలిగినదియు సంసారరోగముచే బాధపడువారికి ఎల్లప్పుడు ఔషధము వంటిదై తక్షణమే సకల రోగములను నివారించును. పదునాలుగు భువనములతో నిండియున్న ప్రకృతి అంతయు శివస్వరూపమే.

శివ పరమానంద రూపత్వాత్ । నిర్వికారో భవతీతి । శేర తే సజ్జనమనాం స్యస్మిన్నితి శివః । సర్వత్ర పక్షపాతి త్వాభావేన సమత్వాద్వా శివః । తథాచ **కర్ణపర్వణి** । సమాభవంతి తే సర్వే దానవాశ్చామ రాశ్చయే । శివోఽస్మి సర్వభూతానాం శివత్వం తేన మే స్మృతమితి । శివేచ్ఛూనాం సర్వార్థోపక్రమం సాధయతీతి వా శివః । **అనుశాసనికె** ॥

**పమేధయతి యన్నిత్యం పర్వార్థానాముపక్రమం ।**
**శివమిచ్ఛన్మనుష్యాణాం తస్మాదేష శివస్మృత ఇతి ॥**

శివుడు పరమానంద స్వరూపుడు. నిర్వికారుడుకూడా. సజ్జనులు మాత్రమే ఇతనిని చేరుదురు. అంతటి పక్షపాతములేకుండగా సమదర్శిగా శివుడు మాత్రమే ఉండగలడు. దేవతలకు మహర్షులకు వరములు ఇచ్చినట్లే రాక్షసులకు కూడా కోరిన వరములు ఇచ్చెను. అందువల్ల **శివుడు పమదర్శి.** మహాభారత కర్ణపర్వమునందు శివమహిమను గూర్చి తెలుపుతూ, పరమశివునకు జీవులందరూ సమానులే. దేవ, దానవ, యక్ష, రాక్షస, కిన్నర, కింపురుష, గంధర్వాది సమస్త జీవులను పరమశివుడు సమానముగానే కాపాడును. అందువల్ల ఆయనను కొలిచిన వారికి మంగళములు, శుభములే అశుభములు వారినిచేరవు "శివనామని భావితేం తరంగే మహతిర్జ్యోతిషి మానినీమయాంతే, దురితాన్యపయాంతి దూర దూరే మహూరాయాంతి మహంతి మంగళాని, శివే సకల కల్యాణ భాజనం యత్ర జాయతే" పరమశివుని ఇష్టపడేవారు కోరిన ఫలములను సాధించెదరు. అడిగిదే తడవుగా వరములను ఇచ్చే కల్పవృక్షము పరమశివుని భక్తి. అల్పమైన కాలమున అనంతమైన ఫలములు ఈశ్వరారాధనవల్లనే లభించును.

శివస్స్వయంప్రకాశ ఇతివా । హింసి ధాతోస్సింహశబ్దో వశకాంతౌశివస్మృతః । వర్ణ వ్యత్యయస్సిద్ధం పశ్యకః కశ్యపో యథేతి । అయం శివశబ్దః అగ్నీష్టోమాత్మకతయా శివశక్త్యాత్మకతయాచాభిమన్యతే పౌరాణికైః **వాయు సంహితాయాం** । శం సుఖం పరమానందమికారః పురుషస్మృతః । వకారశ్శక్తిరమృతం శివఇత్యుచ్యతే బుధైరితి । శివం కల్యాణం తద్యోగాత్తత్ప్రదత్వా ద్వా శివఇత్యర్థః ఏవం శివశబ్దోఽతిమంగళ

వాచక తయా శ్రుత్యాపోచ్యతే । శివాబుణ వస్సంతు శివావనస్పత యుస్సంతు । అహోరాత్రే శివేస్యాతాం । స్వస్తి శివంకర్మాస్త్వితి । ధర్మ ప్రశ్నే । ఉత్తర తశ్చుచౌ దేశే రుద్రాయునినయేదేవం వాస్తు శివం భవతి । స్వాధ్యాయమధీత్య కామం గచ్ఛే దేవముభయోశ్శివం భవతీతి । న కుస్పత్యా గ్రామం ప్రవిశేద్యది ప్రవిశేన్న మోరుద్రాయ । వాస్తోష్పతయ ఇతీ మావ్పుచంజపేదన్యాం వా రౌద్రీం వాస్తు శివం భవతీతి । శ్రు । పతితశ్వపచశ్చండాలో వాయుశ్శివ ఇతి వాచం వదేత తేన సహభుంజీత । తేన సహ సంభాషేత తేన సహ సంవసేతేతి । ఏవమత్యంత శోభనత్వేన పతితపావనత్వేన నిరతిశయసుఖ ప్రదానత్వేనచ ప్రసిద్ధేః నిత్యసుఖావాప్తయే తస్మై శివాయ నమ ఇత్యర్థః । సశివః పాత్వితి వాధ్యాహార్యం । యద్యప్యభ్యుదయార్థినాం నామమాత్ర కీర్తనేపి ఫలం ప్రాప్యమేవ । తథాపి నామావసానే య ఏవం భూత స్సపాతు । తస్మై నమ ఇతి వాధ్యాహార్యమితి ప్రతీయతే । తథాహి

**అర్థానామక్షరాణ్యేవ వాచకాని తథాపి తు ।**
**అర్థానామపి కేషాంచిత్ పరాణ్యేవ ద్విజోత్తమాః ।**
**వాచకాని చ వాక్యాని తథైవ బ్రహ్మవిత్తమాః ।**
**అర్థానామపి కేషాంచిత్ ప్రమాణాని ప్రదీపవదితి ॥**

అత్ర కేషాంచిదాచార్యాణామ్మతేఇత్యర్థః ।ప్రదీపవదితివాక్యాన్యేవ విస్పష్టార్థ బోధకానీత్యుక్త త్వాత్ తస్మై నమ ఇత్యాదియథాయోగ్యం యోజ్యమితి ॥ 1 ॥

శివః అనగా స్వయం ప్రకాశకుడు అని అర్థము. హింసి ధాతువునకు సింహశబ్దము పుట్టినట్లు వశకాంతౌ అనే ధాతువునుండి శివశబ్దము పుట్టెను. ఇది అక్షరముల, వర్ణముల తారుమారు అగుటచేత సిద్ధించినది. పశ్యకుడు కశ్యపుడు అగునట్లుగా. ఈ శివ శబ్దము అగ్నికి పర్యాయ పదముగా శివ శక్త్యాత్మకముగా పౌరాణికులు అనుకొనుచున్నారు. పరమశివునిలో తేజస్సు సూర్యునిగా, శాంతము చంద్రునిగాను పుట్టినవి. శం అనగా సుఖమును, పరమానందమును ఇచ్చునది. ఇకారము పురుషునిగాను వకారము అమృతమయమైన ఆదిశక్తిగాను మొత్తము మీద శివశబ్ద వ్యుత్పత్తిని పండితులు చెప్పిరి. శివం అనగా కల్యాణము అని అర్థము. కళ్యాణయోగమును కళ్యాణ ప్రాప్తిని శివుడే ఇచ్చును. శివశబ్దము మిక్కిలి మంగళకరమైన మాటగా వేదము కూడా చెప్పినది. సర్వ వ్యాపకుడైన శివుని ఆజ్ఞలో భూమిమీద వెలసిన ఋతువులు శుభమునే ఇచ్చును. వృక్షములు, లతలు శుభములనే ఇచ్చును. రాత్రి పగలు మంగళమయములే మనము చేసే కర్మలు శుభమును ఆశీర్వాదమును ఇచ్చును. ధర్మ ప్రశ్నయందు ఉత్తర దిక్కున శుచిగా ఉండే స్థలమందురు. రుద్ర శబ్దమును గట్టిగా అరచి శంఖు స్థాపన చేసినచో వాస్తుదోషములు పోగలవు. అచట శుభమగును. సాంగోపాంగముగా అధ్యయనము చేసి శివనామోచ్చారణచేసి బయలుదేరినచో అంతట మంగళములు జరుగును. ''యశ్శివో నామరూపాభ్యాం యా దేవీ సర్వమంగళా తయోః సంస్మరణాత్పుసాం సర్వతో జయ మంగళం ॥ కుత్సిత భావము, చెడ్డనడవడి కలిగిన గ్రామమును ప్రవేశించరాదు. అత్యవసరముగా ప్రవేశించ తలచినచో ''నమోరుద్రాయ'' అని స్మరిస్తూ ప్రవేశించినచో పెకమైన ఉపద్రవము నష్టము, కష్టములు కలుగవు. ''వాస్తోష్పతయ'' అనే వేదమంత్రమునుగాని శివుని-సంబంధించిన సూక్తములు జపించినచో శుభములు కలుగును. శుచి శుభ్రము ఆచారం తెలియనివారి సహ పంక్తిన కూర్చొని భోజనము

చేయరాదు. అట్లు చేయవలసి వచ్చినచో శివనామస్మరణ చేస్తూ చేసినచో ఆ దోషము నశిస్తుందని అంటారు. ఈ ప్రకారముగా శివనామోచ్చారణ శోధనమును, పతితపావనత్వమును నిరతిశయ సుఖ ప్రదత్వము, నిత్య సుఖవ్యాప్తి ప్రసిద్ధములుగదా! అందుకే 'తస్మై శివాయనమః' అని నిరంతరము స్మరించవలెను. కనుక అటువంటి మహిమలు కల పరమశివుడు రక్షించును. అభివృద్ధిని ఆకాంక్షించే వారు తప్పని సరిగా శివుని ధ్యానించినచో ఫలమును తప్పక పొందుదురు. శివతత్త్వమును బోధించే అనేక వాక్యములు వేదమునకలవు.

## మహేశ్వరః 2

మహేశ్వరుడనగా గొప్ప ప్రభువు. చక్రవర్తి.

సర్వ ప్రపంచకృత్య నిర్వహణే అయమేక ఏవేష్టే ఇతీశ్వరః మహాంశ్చాసావీశ్వరశ్చ మహేశ్వరః అస్య మహేశ్వరత్వం శ్రుతిరిత్థం నిర్వక్తి. అథ కస్మాదుచ్యతే మహేశ్వరః యః సర్వాన్ లోకాన్ సంభక్షత్యజస్రం సృజతి. విసృజతి. వాసయతి. తస్మాదుచ్యతే మహేశ్వరః శివశ్శూలీమహేశ్వర ఇతి నిఘంటుః. నహ్యయం మహేశ్వర శబ్దః జనేశ్వర యోగేశ్వరాది శబ్దవత్పరిచ్ఛిన్న వైభవ బోధకః కింతు రుద్రవిష్ణు విధాదేరపి విధాతృత్వ జ్ఞానదత్వాది విభావావేదకః అపిచ మహేశ్వరశబ్దవాచ్యస్య వస్తునో లక్షణం మహేంద్రేణోచ్యతే । శ్రీకాళిదాసకృత **రఘువంశ మహాకావ్యే** హరిర్యథైకః పురుషోత్తమస్మృతో మహేశ్వరస్త్ర్యంబక ఏవ నాపరః తథా విదుర్మాం మునయశ్శత క్రతుం ద్వితీయగామీనః కిలైష శబ్ద ఏషన॥ శ్రీ కాళిదాసకృతనాటకేచ । ఈశ్వరశబ్దోన్యత్రా నీశ్వరే న యాతీత్యాహ ॥ వేదాంతేషు యమాహురేకపురుషం వ్యాప్య స్థితం రోదసీ । యస్మిన్నీశ్వర ఇత్యనన్యవిషయశ్శబ్దో యథార్థాక్షరః అంతర్యశ్చ ముముక్షుభిర్నియమిత ప్రాణాదిభిర్మృగ్యతే । సస్థాణు స్థిరభక్తి యోగసులభో నిశ్రేయసాయాస్తు న ఇతి । **చంద్రాలోకే** । శబ్దమీశ్వర ఇత్యుచ్చైః స్సార్థం చంద్రం బిభర్తి య ఇతి . ఏవం భూతోఽనన్యసాధారణ మహేశ్వరాఖ్యోదేవః నఃఽపాయాదిత్యర్థః ॥

సమస్త ప్రపంచమును సృజించి లయముచేసే బాధ్యత ఈశ్వరుడే చేయగలడు. గొప్పతేజస్సు. వైభవములుగలవాడు. ధనవంతుడు ఐశ్వర్యవంతుడు అగు శివునికి మహేశ్వరుడు అని పేరు కలదు. పరమేశ్వరుని మహేశ్వరత్వము వేద విహితము. వేదమున చెప్పినందున అది సప్రమాణము. అసలు ఏకారణము చేత పరమేశ్వరుని మహేశ్వరుడు అని అందురు. అంటే సమస్తలోకములను తనలో లయముచేసుకొని వెంటనే సృష్టి చేయును. ఆ సృష్టి పూర్వముకన్నా విలక్షణముగా, వింతగా, ఆశ్చర్యముగా చేయును. సృష్టి స్థితి లయములయందు పరిపూర్ణమైన అధికారమును స్వేచ్ఛను కలిగినందున ఆయనను మహేశ్వరుడు అని అందురు. నిఘంటువులో శివః శూలీ మహేశ్వరః అని సమానార్థకములు కలవు. ఈ మహేశ్వర శబ్దము జనేశ్వర యోగేశ్వరాది శబ్దములవలె భేదించిన వైభవమును తెలుపునది. ఐతే మహేశ్వర శబ్దవాచ్యమునకు లక్షణము మహేంద్రుని చేత చెప్పబడినది. కాళిదాస మహాకవి తన రఘువంశమహాకావ్యము మూడవ సర్గయందు **49** శ్లోకమున మహర్షులు నన్ను పురుషోత్తముడనీ మహేశ్వరుడని త్ర్యంబకుడని వర్ణించిరి అని పరమేశ్వరుడు చెప్పెను. విక్రమోర్వశీయ నాటక నాందీ ప్రార్థనయందు స్థాణువైన శివుడు తనభక్తులకు మంగళములను మోక్షమును ఇవ్వగలడు. ఏమంగళస్వరూపుని భగవంతుని వేదాంత శాస్త్రమున పరమాత్మునిగా అనన్య గుణగణైక భాజనునిగా ఆకాశమును పృథివిని వ్యాపించి ఉన్నవానినిగా వర్ణించిరో, ఏ పరమశివుని

అద్వైతునిగా (రెండులేనివానిగా) సర్వవ్యాపకుడుగా సత్ చిత్ ఆనంద స్వరూపునిగా వేదాంతులు వర్ణించిరో, చరాచరములను పాలించే ఏ శివునియందు ఈశ్వర శబ్దము పరమ శివునికాక మరే అర్థమును చెప్పదో ఆయన భక్తి సులభుడు. త్రిభువనములను స్వేచ్ఛానుసారము రక్షించుచూ నడిపించుచూ ఉన్నవాడు ఈశ్వరుడే. ప్రాణాది వాయువులను యోగప్రక్రియతో స్తంభింపచేసి సంసారము సారములేనిదిగా భావించి పరమేశ్వరుని ఉపాసించుచున్న ముముక్షువు యోగుల మనస్సులో ఆయన ఎల్లప్పుడు ఉండును. యోగులు నిశ్చల మనస్సుతో ధ్యానము చేయుచూ తమహృదయములలోనే పరమేశ్వరుని చూచుచున్నారు. వేదాంతమనగా జీవేశ్వరజగత్స్వరూపమును వివేచన చేసే శాస్త్రము అందులో ఈ జగత్తుకు కర్త ఎవరు, ఆయన ఏ స్వరూపమున ఉండును. పరమాత్మ జీవాత్మల సంబంధము ఏది. ఆయన ఎట్లు లభించును. మొదలగు విషయములు కర్మ బ్రహ్మ ప్రతిపాదకములుగా కొందరు వర్ణించుచున్నారు. ఒక్కడు అంటే సజాతీయ విజాతీయ స్వగత భేద శూన్యుడు. అంటే ఈ ఘటము ఆ ఘటముకాదు అనునది భేదము. విజాతీయ భేదమనగా ఘటము పటముకాదు అని చెప్పుట స్వగత భేదమనగా నా చిన్నతనములో అట్లు ఉండేవాణ్ణి ఇప్పుడు అట్లులేను అన్నట్లున్నది. 'ఏక ఏవ రుద్రః స ద్వితాయాయ న తస్థే'' (తైత్తిరీయము) స ఏకోయ ఏకః సర్వుద్రో యోరుద్రోస ఈశానః యః ఈశానః సభగవాన్ మహేశ్వరః (అథర్వ శిరః) ఆ పరమేశ్వరుని పురుషత్వము ఇట్లు ఉన్నది. పురుషో వై ః న్ మహో: నమః (కూర్మ పురాణము) పశ్యంతి శంభుం కలి మీశితారం రుద్రం ః ,హంతం పురుషం పురాణం (శంకరగీత) పురుషో నామ సంపూర్ణః శిరః సత్యాదిలః;ణః'' వ్యాపకో హి భగవాన్ రుద్రః, సర్వవ్యాపీ సబగవాన్ తస్మాత్సర్వ గతః శివః (పతంజలి - మహాభాష్యం 3.1.175) ఈశ్వరత్వం నామక్లేశకర్మవిపాకాశయైః అపరామృష్టః పురుషవిశేషః (అమర కోశం) వ్యోమకేశో భవో భీమః స్థాణూరుద్ర ఉమాపతిః. ఇటువంటి అనన్యసాధారణుడైన మహేశ్వరుడు నన్ను రక్షించుగాక. మహేశః నః పాయాత్. మహేశ్వరుడు అంతటా వ్యాపించి యున్నాడని అథర్వ శిరోపనిషత్‌యందు కలదు. ''స ఓంకారః యః ఓంకారః సప్రణవః యః ప్రణవః, సః సర్వవ్యాపీ యః సర్వవ్యాపీ యః సర్వవ్యాపీ వ్యాపకోహి భగవాన్ రుద్రః వ్యాపనాత్ వ్యాపీ మహాదేవః'' (3-11) శ్వేతాశ్వతరోపనిషత్‌లో ''తమీశ్వరాణాం పరమం మహేశ్వరం, తం దేవతానాం పరమంచ దేవతం పతిం యతీనాం పరమం పురస్తాద్విదామదేవం భువనేశమీడ్యం'' (6-7) ఇట్లు ఉపనిషత్ పురాణములలో మహేశ్వరుడు ఒక్కడే సర్వజీవులలో ఉంటూ వారికి సుఖశాంతులను ఇచ్చుచున్నాడు.

## శర్వః 3

**శ్రా హింసాయాం సర్వమంతకాలే కల్పితమిదం జగత్. హింపతి. స్వరూపమాత్రేణావశేషయతి ఇతి శర్వః తస్మై నమః**

శ్రా హింసాయాం అనే ధాతువునుండి శర్వ శబ్దము పుట్టినది. ప్రళయకాలమునందు తను కల్పించిన ఈజగత్తును తనలో లయముచేసుకొనును. మరలా తననుండే సృజించును. అటువంటి పరమేశ్వరునికి అనేక నమస్కారములు. శ్రీ సదాశివుడు చేసే సంహారము అనేక విధములలో ఉండగా ప్రధానముగా అవాంతర ప్రళయముల

చేత సంహరించుటు కొంత భూభాగంలోని జీవులను సంహరించుట. జీవుని పుణ్యపాపమిశ్రమములైనవి సంసార గుణమును తెల్పేవి. ఐనా వాటిని కూడా శివుడు సంహరించగలడు. గుణత్రయములు అగు పుణ్యపాపమిశ్రమములతో ప్రధానముగా నాలుగు వర్గముల జీవులకు సుఖములు, దుఃఖములు, మిశ్రమములు ఇచ్చుట తీసుకొనుట చేయువాడు. సృష్టి ఉన్నంత కాలము పుణ్యపాపములు ఉండును. జగద్వ్యాపకుడైన భగవంతుని సృష్టి చూచి అందే తాదాత్మ్యమును చెందక అంతటి అందమైన సృష్టిచేసిన భగవంతుడు ఎట్లుండునో అని ఆయన గూర్చి ధ్యానము, జపము చేసి మనస్సును ఆయనపై ఉంచి ఆయన దర్శనమునకై అహర్నిశము పాటుపడవలెను. సామాన్యముగా భగవధ్యానమున మనస్సులగ్నము కాదు. మనోవేగమునకు మించిన వేగమున పరుల హింసను, పరిద్రవ్యాహరణ చేయును అది దుఃఖమునకు హేతువు. కనుక మానవుడు అక్షయమైనది, ఆనందమును, సుఖమును ఇచ్చే పరమాత్మ కృపకు ప్రయత్నించ వలెను. ''శృణాతి పాపాన్యత దుఃఖ మాత్రం, శర్వో మహాదేవ సరుద్ర నామా, శర్వోజిఘాంసుశ్చ మమోఘ మారః చ్ఛిన్నత్తి పాపానిహ శర్వభక్తః

## రుద్రః 4

రుద్రుడు సాంసారిక బాధలను కాచి మరగపెట్టి నాశనము చేయును. శివతత్త్వమును ఉపదేశించువాడు రుద్రుడు. వేదోక్త ధర్మములను సప్రమాణముగా బోధించువాడు రుద్రుడు. రుద్రులు పదకొండు మంది కలరు. వారు అజుడు, ఏకపాదుడు, అహిర్బుధ్న్యుడు, త్వష్ట, రుద్రుడు, హరుడు, శంభుడు, త్ర్యంబకుడు, అపరాజితుడు, ఈశానుడు, త్రిభవనుడు.

రుద్రుడనగా భయంకరమైన ఆకారము కలిగినవాడు. రోదయతీతి రుద్రః, రుదంరాతి - దదాతీతి రుద్రః, దుఃఖం, దుఃఖకారణం వాద్రావయతీతి రుద్రః, రుతౌ నాదాంతే ప్రద దతీతి రుద్రః, రుత్యా వేద రూపయా ద్రావయతీతి రుద్రః, శివుడు లయ కారుడు. ఆయన దుష్టరాక్షస సంహర్త. దుష్టసంహర్త. కావున పాపులను ఏడిపించుటచేత శివుడు రుద్రుడాయెను. జీవులకు సంసార దుఃఖములను పోగొట్టునది రుద్రుడే, శివుడు నాదప్రియుడు. భక్తులు శివనామనాదాంతమున ఆనంద సాగరనిమగ్నులై ద్రవింతురు. సంగీతయుక్త తాండవమున డక్కా, డమరు నాదమున రుద్రుడు ద్రవింతుడని పురాణ ప్రతీతి. ప్రణవ నాదమునకు వేద ఘోషకు కూడా పరమేశ్వరుడు ద్రవించును.

రుజం సాంసారికీం ద్రావయతీతి రుద్రః. రుతా వేదాంతమహావాక్యేన శివజ్ఞానము పదిశతీతి । రుతా శ్రుత్యా హి ధర్మాదీన్ బోధయతీతి । రుతినా దాంతే ద్రవతి ద్రావయతీతి । సర్వ మంతకాలే రోదయతీతి చ రుద్రః । పురాణ నిర్వచనంచ ।

**అశుభద్రావకో దేవో యజ్ఞహార పురర్భవం ।**
**తతశ్శివాభిధో రుద్ర శబ్దేనాత్రాభిధీయత ఇతి ॥**

నను । న్విర్తణస్య.అంతే సర్వం రోదయితుః కథం సంసారరోగ శమయిత్వం సుఖదత్వం వేతి చేదుచ్యతే । తస్య ఘృణానిధిత్వ సుఖప్రదత్వాదిమహిమా విద్వద్భిరేవావగమ్యతే । తథాచ । గర్భజన్మ జరామరణ నరకయాతా యాతశ్రమఖిన్నానాం జంతూనాం విశ్రాంత్యై మహాప్రళయకాలే సంహార సాధనం తమస్స్వీకురుతే । తదా జంతవో బిభ్యతి ।

క్షణేనావిద్యామోహితాస్సు చిరనిద్రాసుఖమేవానుభవంతి చ । ముముక్షవో బ్రహ్మవిద్యాధికారిణస్తదుపదిష్ట జ్ఞానాన్ముక్తాశ్చ భవంతీతి తే బ్రహ్మలోకేషు పరాంతకాలే పరామృతాత్పరిముచ్యంతి సర్వే ఇతి శ్రుతేః ।

**శివపురాణే** । నిదానజ్ఞస్యభిషజో రుగ్ణే హింసాం ప్రయుంజతః నకించిదపి నైర్ఘృణ్యం ఘృణైవాత్ర ప్రయోజికే ఇతి గళపిటకరోగిణో నిద్రాభ్యవహారాది విముఖస్య హా హేత్యాక్రందమనో భిషక్ శస్త్రగ్రహణే భయప్రదో తత్కర్మణా సుఖ సుషుప్త్యభ్యవహారాది యుతం సుఖమేవ కరోతి యథా తథాఽయం జంతూనామంతే శివంకర ఏవరుద్ర ఇత్యతస్తుపాయాత్ ॥

రుజమనగా సంసార సంబంధమైన రోగములను పోగొట్టువాడు. రుతము అనగా శబ్దము వేదాంత మహావాక్యములనగా ఉపనిషత్తులు. అవి శివతత్త్వమును ఉపదేశించును. ''వేదోఽఖిలోధర్మమూలం'' శ్రుతి అనగా వేదము. వేదము అనేక మానవధర్మములను ఉపదేశించెను. దాంతము అనగా బ్రహ్మచర్యాది తపః క్లేశమును ఓర్చుకొనే శారీరిక, మానసిక ధైర్యము కలిగి ఉండుట. వేదమున చెప్పిన ఆశ్రమ ధర్మములను ఆచరింప చేయు మనస్సును ఇచ్చుట. రుద్రుడు దుఃఖములను కూడా ఇచ్చును. తద్వారా సుఖము ఆనందముల తత్త్వమును తెలియును. లయకర్త ఐన రుద్రుడు దేహత్యాగము చేసే సమయమున ఏడిపించును. అట్లే ప్రళయకాలమున జీవులు దేహ పరిత్యాగమునకు ఇష్టపడక, దేహములను విడువవలసి వచ్చినందున హా! హాకారములు చేయుదురు. జీవుల అశుభములను పోగొట్టుటకై పరమేశ్వరుడు లయమును చేయును. లయము చేసిన దానినే మరలా సృష్టి చేయును. మంగళకరుడైన శివుడు జీవులకు ఎట్లు శుభములు ఇచ్చునో రుద్రుడుకూడా అట్లే ఇచ్చును నామభేదము తప్ప ఫలప్రదానములో భేదములేదు. ఘృణము అనగా కరుణ, కనికరము. అదిలేని వానిని మరణావసానమున అందరిని ఏడిపించేవాడు సంసార తాపమును పోగొట్టుటలో సంసారరోగమును తగ్గించుటలో సుఖమును, ఆనందమును ఇచ్చుటకు ఎట్లు సమర్థుడగును. కనుక అతని కరుణానిధిత్వము సుఖప్రదానములో మహిమలను చూపుటలో ఎట్లు సమర్థుడో విద్వాంసులకు మాత్రమే తెలుసును. సంసారమనగా మాతృగర్భ ప్రవేశము, జననము, ముసలితనము, మరణము, నరకము, పుట్టుట, చచ్చుట మొదలగు పనులతో శ్రమపడి శోకతప్తులైన జీవుల సమూహము. అటువంటి జీవుల బాధల విశ్రాంతికై పరమేశ్వరుడు మహాప్రళయమును చేయును. ఆప్రళయమునకు ముందుగా ప్రపంచమంతయు మహాచీకటి (తమస్సు) ఆవరించును. అది పరమేశ్వరుని అనుమతితోనే జరుగును. ఆ చీకటికి జీవులందరూ భయపడుదురు. క్షణకాలములో జీవులందర్నీ అవిద్య మోహములో పడవేయును. ఆ అజ్ఞాన మోహితులైన జీవులు చాలాకాలము నిద్రలో ఉందురు. సామాన్య జీవులు ఇట్లుండగా ముముక్షువులు బ్రహ్మ విద్యయందు అధికారమును సంపాదించి సద్గురువు ఉపనిషత్తుల ఉపదేశములతో జీవన్ముక్తులై బ్రహ్మలోకమున ప్రళయ కాలమువరకు ఉండి తర్వాత ముక్తులగు చున్నారు. ముక్తులైన వార్కి మరలాపుట్టుకలేదు. **శివపురాణమున** వైద్యుడు రోగ లక్షణమును రోగితత్త్వము తెలిసినవాడు కనుక అవసరమైనప్పుడు శస్త్ర చికిత్స చేసి రోగికి కొన్ని కష్టములు కలుగజేయును. అది రోగ నివారణకు మాత్రమే నిర్దేశించినది గాని రోగి మీద ద్వేషముతో గాదు. కంఠములో వ్రణము లేచినది. ఆ వ్రణ బాధతో హా! హాకారములు చేయుచున్నాడు. నిద్రను హాయిని

పెరుగును. ఎటువంటి రోగికి శస్త్ర చికిత్స ద్వారా ఫలము ప్రయోజనమున్నప్పటికి రోగి సుఖమును సంతోషమును దృష్టిలో ఉంచుకొని రోగమును తగ్గించుటకు కావలసిన ఉపాయములను వైద్యుడు చేయును. అట్లాగే సంసార రోగగ్రస్తులైన జీవుల బాధలను నివారించి వారికి అనేక మంగళములను ఇచ్చువాడు రుద్రుడు. అతడు మనల్ని రక్షించుగాక.

## విష్ణుః 5

సర్వదేవాత్మకో రుద్రస్సర్వే దేవాశ్శివాత్మకాః ।
రుద్రస్య దక్షిణే పార్శ్వే రవిర్బ్రహ్మాత్రయోగ్నయః
వామపార్శ్వే హ్యుమాదేవి విష్ణుస్సోమోఽపి తే త్రయః
యా ఉమా సా స్వయం విష్ణు యో విష్ణుస్సహి చంద్రమాః ।
యే నమస్యంతి గోవిందం తే నమస్యంతి శంకరమితి ।

ఇతి రుద్రహృదయోపనిషది.

రుద్రహృదయోపనిషత్తునందు రుద్రుడు సర్వదేవాత్మకుడు దేవతలందరూ సుమంగళ ప్రదాతలే (శివస్వరూపులు) రుద్రునికి కుడిభాగమున సూర్యుడు బ్రహ్మ మూడు అగ్నులు (త్రేతాగ్నులు - ఆహవనీయము, దాక్షిణాగ్ని గార్హపత్యము) కలవు. రుద్రునికి ఎడమభాగమందున ఉమాదేవి, విష్ణువు సోముడు కలవు. ఏ ఉమా రుద్రునికి ఎడమ భాగమున కలదో ఆమే స్వయముగా విష్ణువు. విష్ణువే చంద్రుడు (సోముడు). ఎవరు గోవిందునికి నమస్కరించెదరో వారే శంకరునికి కూడా నమస్కారము చేయుదురు.

హరేః ''నామ జపన్ మర్త్యః కలౌయాతు అపరాంగతిం'' కృతయుగమున ధ్యానమును త్రేతాయుగమున యజ్ఞయాగములను ద్వాపరయుగమున అర్చనలను చేసి ఎంతటి ఫలములను పొందుచున్నారో కలియుగమున నామ సంకీర్తన ద్వారా అంతటి ఫలములను పొందుచున్నారు. విష్ణువుయొక్క నామ సంకీర్తనము చేత మంచి జ్ఞానము ప్రాప్తించును. విష్ణు శబ్దము విష్ వ్యాప్తౌ అనే ధాతువునుండి వచ్చినది. వ్యాపక శీలుడు అని ధాత్వర్థము. అంటే దేశముచేత కాలముచేత వస్తువు చేత పరిధి కలిగినవాడు కాదు. మహస్తే విష్ణో సుమతిం భంజామహే (ఋ.సం. 1.153.3) కిమిత్తే విష్ణో పరి చక్ష్యం భూత (ఋ. సం. 7.100.6) ఇదం విష్ణుర్వి చక్రమే (ఋ. సం. 7-22.17) విష్ణుః గోపాః పరమం (ఋ.సం. 3.55.10) విష్ణో కర్మాణి పశ్యత (ఋ.సం. 1.22.17) తద్విష్ణోః పరమం పదం (ఋ.సం. 1.22.20) అంతర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణః స్థితః (తై.సం. 4-13) అని వేదమున విష్ణువును గూర్చి చెప్పినది. విష్ణువు విశ్వరూప ధరుడు. పృథివీ ఆకాశములను ఆశ్రయించి ఉండే తేజస్సు విష్ణువే. భక్తుల హృదయములలో ఉండువాడు, దేవాసుర సంగ్రామమున వీరుడై అనేక అస్త్ర శస్త్రములను విసిరే వాడు. ఆయన విశేషముగా గతిని వ్యాప్తిని ప్రజననమును కాంతిని, దీప్తిని మ్రింగుటను తినుటను చేయగలడు. ఈయన ''వీర శక్తి మతాంశ్రేష్ఠః'' అమితశక్తి కలిగిన వరిష్ఠులలో వీరుడు. కాలనేమి అనే మహారాక్షసుని సంహరించినవాడు. విష్ణువు ఏపరిధి (హద్దు) లేని వాడైనప్పటికిన్నీ సంసర్గాభావములేనివాడు. శివపురాణమున ఇట్లు ఉన్నది. శివ శక్తులు క్రీడించుట చేత విష్ణువు ఉద్భవించెను. విష్ణువుని తపస్సు చేయుమని శివుడు అనుమతి నివ్వగా విష్ణువు ఘోర తపస్సు చేసెను. అతని దేహమునుండి

జలము స్రవింపుచేత శివుడు విష్ణువును నారాయణ అని సంబోధించెను. దేవీ పురాణమున శక్తి విష్ణువును సృజించెను. బ్రహ్మతో మధుకైటభులు కూడా పుట్టిరి. వారిని వధించుట బ్రహ్మ విష్ణువుల వల్ల కాలేదు. అంతట పరాశక్తిని విష్ణువు ప్రార్థింపగా ఆమె చెప్పిన ఉపాయములో విష్ణువు మధుకైటభులను చంపెను. రైవతుడు ఒక అందమైన గుర్రము మీద వెళ్ళుచుండగా ఆ గుర్రమును వీక్షగా, ఆశగా చూచుచున్న లక్ష్మిని శ్రీహరిచూచి ఆడగుర్రముగా జన్మింపుమని శ్రీహరి శపించెను. శాపవిమోచనోపాయమును పరమశివుడు చెప్పగలడు. కైలాసమునకు వెళ్ళమని శ్రీహరి లక్ష్మికి చెప్పెను. అంతట లక్ష్మితో శ్రీహరి కూడా కైలాసమునకు వెళ్ళగా ఇద్దరూ అశ్వదంపతులై హయహయుని కని వైకుంఠమునకు వెళ్ళిరి. లక్ష్మిని శ్రీహరి పరిహాసము చేయగా లక్ష్మికోపములో శ్రీహరిని చూడగా శ్రీహరి తల కింద పడెను. అంతట దేవతలు శివుని ప్రార్థింపగా హయ శిరమును శ్రీహరి శరీరమునకు అతికించగా ఆయన హయగ్రీవుడాయెను.

విశ్వం వేష్టి వ్యాప్నోతీతి విష్ణుః. విషిల్ వ్యాప్తౌ స్వీయాభిరష్టాభిర్మూర్తిభిః రుద్ర ఏవవిష్ణు రిత్యర్థః। విశ్వం విష్ణుర్వషట్కార ఇతి విష్ణుర్నారాయణః కృష్ణఇతిచ సహస్రనామామరకోశ ప్రసిద్ధే అపి విష్ణు నామనీ హరిపరతాయాం సర్వశ్శర్వశ్శివస్థాణు రిత్యాదివత్ ఆపేక్షిక వ్యాపకత్వ వాచకే విష్ణు శబ్దాన్వర్థతా పరమేశ్వర ఏ వేతి వచనాద్గృహ్యతే । శ్రు । సర్వవ్యాపీ స భగవాన్ తస్మాత్సర్వగతశ్శివ ఇతి । వృక్ష ఇవ స్తబ్ధః దివి తిష్ఠత్యేకస్తే నేదం పూర్ణం పురుషేణ సర్వమితి । విశ్వస్యైకం పరివేష్టితారమీశం తు జ్ఞాత్వా మృతా భవంతీతి । దిశం భిత్వా సర్వాన్లోకాన్ వ్యాప్నోతి వ్యాపయతీతి వ్యాసనాద్వ్యాపీ మహాదేవ ఇతి । సర్వేదేవా అస్మిన్ నువిశంతీతి విష్ణురితిచ । ఏవం శివస్య వ్యాపి త్వే పురాణాని చ సంతి. వ్యవహారే భూపాది వ్యాపిత్వవత్ విష్ణుమాయాకాశా దేరపి వ్యాపిత్వ మాపేక్షికం । **సౌరసంహితాయాం** । ఆత్మనోఽణుత్వ హేతుత్వాదణు ర్మాలిన్యతోఽమలం । గుహాసంవరణేనైవవ్యాపిత్వాద్విష్ణురీశ్వర ఇతి ।

**భారతే నామాని తవ గోవింద యాని లోకే మహాంతి చ ।**
**తాన్యేవ మమ నామాని నాత్రకార్యావిచారణేతి ।**

కూర్మ వాసిష్ఠ లైంగ్యాదిత్య పురాణేషు దారుకావన ప్రవేశ వర్ణనే । యా తస్యా పార్శ్వగా బాలా సా పార్వత్యంశజో హరిరితి వచనాచ్చ శివస్య వామాంగం శక్తి విష్ణు సోమాత్మమక మిత్యుక్త త్వాత్ హరేరుత్పృష్టనామ్నాం శివనామతయోక్తత్వాత్. శివశక్త్యో రేక త్వాచ్ఛక్తి విష్ణ్వోరేకత్వాచ్చా భేదోపచరేణ వా శివ ఏవ విష్ణురిత్యర్థః। య ఎవంభూతః తస్మై నమః ।

ఎవడు ప్రపంచమును అంతా చుట్టుకొని వ్యాపించి ఉన్నాడో అతను విష్ణువు. విషిల్ వ్యాప్తౌ అనే ధాతువునుండి విష్ణుశబ్దము పుట్టినది. పరమేశ్వరుని అష్టముఖములలో శ్రీహరిముఖము ఒకటి. విష్ణువు నారాయణుడు శ్రీకృష్ణుడు మొదలగు నామములు అమరకోశ, విష్ణు సహస్రనామ స్తోత్రములయందు చెప్పబడినది. విష్ణు సహస్రనామములలో శ్రీహరిపరముగా సర్వః శర్వః శివః స్థాణుః మొదలగు నామములు కలవు. కోరదగిన వ్యాపకత్వ వాచకమునందు విష్ణు శబ్దమునకు పొసిగిన అర్థము పరమేశ్వరుడే అని చెప్పబడినది. అనగా శ్రీవిష్ణుసహస్ర నామములలో శివశబ్దములు చెప్పిరి. వస్తుతః

లని శివుని పర్యాయపదములే. విష్ణు శబ్దము వ్యాపకార్థమున శివుని కూడా చెప్పవచ్చును. వేదములు కూడా ఇట్లు ఉన్నది. అందువల్ల సర్వ వ్యాపకుడైన ఆ భగవంతుడు అంతట నిండి ఉన్నా శివుడే వృక్షమువలె చలనములేని అటువంటి ఒకానొక మహాపురుషుడు ఒక్కడే సంపూర్ణ ప్రపంచమును నిండి ఉండెను. జీవులు అటువంటి పరమేశ్వరుని తెలుసుకొని మిథ్యాజ్ఞానము లగుచున్నారు. దివ్యుల భేదించుకొని సర్వ లోకములను వ్యాపించి ఉండుటచేత పరమేశ్వరుడు వ్యాపకుడు వ్యాపి. ఆయనే దేవాధిదేవుడు. మహాదేవుడు. సర్వదేవతలు పరమశివునిలో ఉన్నందున ఆయనే విష్ణువు. పరమశివుడు వ్యాపకునిగా నానాపురాణములు చెప్పినవి. వ్యవహారదశలో ఒక రాజు భూమిని పాలించుచుండగా అతని ఏలుబడిలోని భూభాగమంతయు అతని స్వాధీనము. అట్లాగే విష్ణుమాయ భూమి ఆకాశపర్యంతమువరకు వ్యాపించి ఉన్నది. కానీ అది పరమేశ్వరాధీనము **పౌరసంహితలో** ఆత్మ అణువు కనుక దానికి మాలిన్యములేదు. కొండయందు తొలచబడిన వేష్టనమువలె వ్యాపించి ఉండుటచేతనే విష్ణువు ఈశ్వరుడైనాడు. **మహాభారతమున** ఇట్లు ఉన్నది. ఏ నామములు గొప్పవిగా గోవిందునికి చెప్పెదరో అవే శంకరునికి సంబంధించినవి. ఇచట చర్చకు తావులేదు. ఈ విషయములను కూర్మ పురాణము వాశిష్టపురాణము లింగ పురాణము ఆదిత్యపురాణములయందు దారుకావన ప్రవేశ వర్ణనమునందు కూడా కలదు. పరమ శివుని ఎడమ భాగమున శక్తి విష్ణువు సోముడు ఉన్నట్లు చెప్పుట చేత శ్రీహరిని గొప్పగా చెప్పే నామములు పరమశివునివే ఉభయులకు అభేదము చెప్పినవి, శివునకు శక్తికి ఐక్యము. శక్తికి విష్ణువు ఐక్యము. శక్తికి విష్ణువునకు సోమునకు ఐక్యము కావున శక్తి విష్ణు సోములు పరమశివునిలో లీనమై ఉన్నారు. అంతటి పరమ శివునకు అనేక నమస్కారములు. మహాకవి కాళిదాసు శివుని అష్టమూర్తులలో విష్ణువుని ఒక మూర్తిగా వర్ణించెను.

## పితామహః 6

పూర్వనామములలో శివకేశవులకు అభేదమును చెప్పి ఇప్పుడు బ్రహ్మకూడా శివరూపుడే అని చెప్పు చున్నాడు. పితామహుడు అనగా బ్రహ్మదేవుడు. సృష్టిచేయు భగవదంశను బ్రహ్మ అని అందురు. ఇంద్రత్వమువలె బ్రహ్మత్వము కూడా ఒక పదవి. భృగువు, పులస్త్యుడు, పులహుడు, అంగిరసుడు, అత్రి, క్రతువు, దక్షుడు, వసిష్ఠుడు, మరీచి అను నవబ్రహ్మలు కలరు. బ్రహ్మ శ్రీమన్నారాయణుని కుమారుడు. ప్రళయకాలమున శ్రీమన్నారాయణుడు అద్భుతాకారమున శయనించి ఉండగా లోకములన్నియు ఇతని శరీరమున ఉండునని తెలిసికొని శ్రీహరి శరీరమున ప్రవేశించెను. లోపలఉన్న లోకములన్నిటిని చూసెను. అంతలో శ్రీహరి నిద్రించెను. ఆయన నవరంధ్రములు మూసుకొనెను. బ్రహ్మ శ్రీహరి శరీరమునుండి బయటకు వచ్చుటకు దారిలేక నాభియందున్న కమలమునుండి బయటకు వచ్చెను. విష్ణువు బ్రహ్మకు శివుని మహాత్మ్యమును చెప్పెను. బ్రహ్మ ఐదవ శిరస్సు గార్దభము కాగా దానిని పరమ శివుడు ఖండించెను. అంధతామిస్రవిద్య వలన ఆకలిదప్పికలు బ్రహ్మకు పుట్టెను. ఆ ప్రభావమున కొందరు జీవులు పుట్టగా వారికి ఆకలి దప్పికలు పుట్టెను. ఆ ప్రభావమున కొందరు జీవులు పుట్టగా వారు బ్రహ్మను భక్షింపబోవగా 'మామా జక్షత' అనుటచేత యక్షులు 'మామాభక్షత రక్షత' అనుటచే రాక్షసులు పుట్టిరి. అసురులు బ్రహ్మను మోహించిరి. శ్రీహరి ఆలోచనతో బ్రహ్మదేహమునుండి సంధ్యా అనే అందమైన స్త్రీ పుట్టగా ఆ రాక్షసులు, ఆమె వెంటపడిరి. ఆ

ఆనందమయిన తన్మయుడై బ్రహ్మతనచేతిని వాసన చూడగా అందు అప్సరసలు, గంధర్వులు పుట్టిరి. బ్రహ్మ ఉన్మాద భ్రాంతికా నిద్రారూపములతో పిశాచములు, గుహ్యకులు, సిద్ధులు పుట్టిరి. అదృశ్యముతో పితృగణములను తిరోధాన శక్తితో నరులను కిన్నరులను, మనువును, చెవినుండి పులస్త్యుడు, నాభినుండి పులహుడు, బొటనవేలినుండి భూమి, దక్షుడు, మానస పుత్రులు మునిశ్రేష్ఠులు. శిరస్సునుండి బ్రాహ్మణులు, బాహువులనుండి క్షత్రియులు, జఘనమునుండి వైశ్యులు పాదములనుండి శూద్రులు తొడనుండి, నారదుడు, ప్రజాపతులు పుట్టిరి. ఏకాదశరుద్రులు, నారదుడు, సనత్కుమారులను బ్రహ్మ సృష్టి చేయమని కోరగా వారు తిరస్కరించిరి. అంతట నారదుని కాముకుడవై శూద్రయోనియందు పుట్టమని శపించెను. త్రిపురాసుర సంగ్రామమునకు శివుని రథసారథి బ్రహ్మ అయ్యెను. బ్రహ్మ ఐదవ ముఖమును ఖండించమని కాల భైరవుని శివుడు ఆదేశించగా ఆశిరః కపాలముతోనే శివుడు భిక్షాటనము చేయుమని బ్రహ్మ శివుని ప్రార్థించెను. దేవాసుర సంగ్రామమున బ్రహ్మ దేవతలను నేను భక్షించగలని ఐదవముఖముతో అనగా దానిని దేవతలు శివునకు విన్నవించగా శివుడు ఆశిరస్సును ఖండించెను. ఆ శిరస్సుపడిన ప్రదేశమే బ్రహ్మ తీర్థముగా ప్రసిద్ధి చెందినది. బ్రహ్మయొక్క రేతస్సు పతనముకాగా అందు వాలఖిల్యులు పుట్టిరి. ప్రజాపతి దేవుడను మనువు కుమారుడు. అతనికి ధూమ్ర, బ్రహ్మవిద్య, మనస్విని, రతి, శ్వస, శాండిలి, ప్రభాత అను ఏడుగురు భార్యలు కలరు. వీరియందు అతనికి ధరుడు, ధ్రువుడు, సోముడు, అహుడు, అనిలుడు, అగ్ని ప్రత్యూషుడు, ప్రభానుడు, అని ఎనిమిది మంది పుత్రులు కలిగిరి.

పితౄణామపి పితృత్వా ద్విధిః పితామహః। తస్యాపి పితృత్వాచ్చివ ఏవ పితామహః౹ శ్రు । యో బ్రహ్మాణం విదధాతి పూర్వమితి ।

శాంతిపర్వణే

సర్వతత్త్వవిధానజ్ఞః ప్రధాన పురుషేశ్వరః ।
సోఽసృజద్దక్షిణాదంగాద్బ్రహ్మాణం లోకసంభవం ।
వామపార్శ్వాత్తథా విష్ణుం లోకరక్షార్థ మీశ్వర ॥ ఇతి

బ్రహ్మాదేరపి పితృత్వాచ్ఛివ ఏవ పితామహ ఇత్యవసీయతే । ఏవముక్త శివమహేశ్వరరుద్రవిష్ణు పితామహనామ్నాంచ శివపురాణగత కైలాస సంహితాయాం దివ్యనామాష్టకమితి పరిగణనా కృతా । తత్సువయాల నిర్వచనశ్లోకాః అత్ర విలిఖ్యంతే ।

శివో మహేశ్వరో రుద్రో విష్ణుశ్చైవ పితామహః ।
సంసార వైద్య స్సర్వజ్ఞః, పరమాత్మేత్యుదాహృతః
ఇత్యుక్త్వా పునరాహ ।
అనాది మలసంశ్లేష, ప్రాగభావా త్స్వభావతః ।
అత్యంతపరిశుద్ధాత్మేత్యతోయం శివ ఉచ్యతే ॥
అథవా శేషకల్యాణగుణైకఘన ఈశ్వరః ।
శివ ఇత్యుచ్యతే సద్భి శ్శివతత్వార్థ వేదభిరితిః ॥
యం వేదాదౌ స్వరం ప్రాహు ర్వాచ్యవాచకభావతః ।
వేదైక వేద్యో యశ్చాత్మా వేదాంతే చ ప్రతిష్ఠితః ॥
తస్య ప్రకృతిలీనస్య యఃపరస్సమహేశ్వరః
అథవా త్రిగుణం తత్త్వం మాయేయమిదమవ్యయం

మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం ।
మాయాపి క్షోభకోఽనంతో మహేశ్వర సమన్వయాదితి ॥
రుద్దుఃఖం దుఃఖహేతుర్వా తద్ద్రావయతి నః ప్రభుః ।
రుద్ర ఇత్యుచ్యతే సద్భి శ్శివః పరమకారణమితి ॥
శివతత్త్వాదిభూమ్యంతం శరీరాదిఘటాది చ ।
వ్యాప్యాధితిష్ఠతి శివ స్తస్మాద్విష్ణురుదాహృతః ఇతి ॥
జగతః పితృభూతానాం శివో మూర్త్యాత్మనామపి ।
పితృభావేన సర్వేషాం పితామహఉదీరితఇతి ।
నిదానజ్ఞో యథా వైద్యో రోగస్య వినివర్తకః ।
తథా సంసారవైద్యోఽయం హర ఇత్యుచ్యతే బుధైః ఇతి ।
అణవో నైవ జానంతి మాయానవమలావృతాః ।
అసత్స్వపి చ సర్వేషు సర్వార్థ జ్ఞానహేతుషు ॥
యద్యద్యథా స్థితం వస్తు తత్తథైవ సదాశివః ।
అయత్నే నైవ జానాతి తస్మాత్సర్వజ్ఞ ఈశ్వరఇతి ॥
సర్వాత్మపరమైరేభిర్గుణైర్నిత్యసమన్వయాత్ ।
స్వస్మాత్పరాత్మవిరహాత్పరమాత్మా శివస్స్వయమితి ॥
ఏవం తన్నిర్వచనాని తత్తన్నామసు యోజ్యాని ॥ ॥

పితృదేవతలకుకూడా పితామహుడైన బ్రహ్మ తండ్రిలాంటివాడు. బ్రహ్మదేవునకు కూడా తండ్రి శ్రీపరమేశ్వరుడు. అందువల్ల ఆయన పరమేశ్వరుడు. సృష్టికి పూర్వము ఏ పరమేశ్వరుని బ్రహ్మగా తెలుసుకొనుచున్నాడో అతడే పితామహుడు. సర్వతత్త్వములను, సృష్టి విధి విధానమును మొదటి పురుషేశ్వరుడు చేయువాడుగా తెలుసుకొనుచున్నారో అటువంటి పరమేశ్వరుని కుడిభాగమునుండి జగత్సృష్టి కొరకు చతుర్ముఖ బ్రహ్మ ఆవిర్భవించెను. ఎడమ భాగమునుండి లోకరక్షణకొరకు శ్రీహరిని పరమేశ్వరుడు సృష్టి చేసెను. ఈ ప్రకారముగా శివుడు, మహేశ్వరుడు, రుద్రుడు, విష్ణువు పితామహుడు తర్వాత చెప్పబోవు సర్వజ్ఞుడు, పరమాత్మ వాచ్యుడు సంసార వైద్యుడు అందరూ ఒకే తత్త్వమునకు చెందినవారు. ఇది శివపురాణములోని కైలాస, సంహితలోని శివదివ్యనామాష్టకముగా పరిగణన చేసెను. అచట ఉన్నమూలమును నిర్వచించే శ్లోకములు ఇచట చెప్పబడుచున్నవి. జీవుని అజ్ఞానము స్వభావముగా చాలా కాలమునుండి ఆలింగనము చేసుకొని ఉన్నది. పరమాత్మ స్వరూపుడైన శివుడు అత్యంత పరిశుద్ధుడు. మంగళ ప్రదుడు. ఆయన అశేష అనేక శుభకల్యాణగుణైక ఘనుడు అని శ్రీశివ తత్త్వార్థ పండితులు చెప్పుచున్నారు. ఏ పరమేశ్వరుని వేదమునకు మొదటకల ప్రణవ స్వరరూపునిగా చెప్పుచున్నారో అదే వాచ్యముగా బయట ఏది చెప్పుచున్నారో అంతతః వాచకముయొక్క భావముకూడా అదే. ఏ పరమేశ్వర తత్త్వమును వైదికులు వేదాధారముగా చాలా గొప్పగా చెప్పుచున్నారో వేదాంతులుకూడా అదేవిధముగా చెప్పుచున్నారు. సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు ప్రకృతిలో కూడా లీనుడై ఉన్నాడు. ఆప్రకృతి సత్త్వ రజస్తమో గుణములతో కూడినదియు మాయలో నిండినదియు శుభములనిచ్చే పరమేశ్వరుని ఆజ్ఞానుసారముగా ఉండునది ఈ ప్రపంచము శివమయమే. ఈ చరాచరప్రపంచమున రెండే తత్త్వములు కలవు. ఒకటి మాయా స్వరూపమైన ప్రకృతి, రెండు మాయాధి దేవుడైన పరమేశ్వరుడు.

మాయాధిపతియైన పరమేశ్వరుడు అనంతుడు, మాయమాత్రం మానవుని కలతపెట్టును. కనుక మాయ వల్లనే మానవునికి అనేక దుఃఖములు కలుగుచున్నవి. అన్నికములైన దుఃఖములను పోగొట్టువాడు రుద్రుడు. కనుక శివత్త్వము అంతట వ్యాపించిన వెలుగు వంటింది. అటువంటిగొప్ప తత్త్వమును శ్రీహరి బ్రహ్మకు ఉపదేశించెను. బ్రహ్మకు పితామహుడు పరమశివుడు. జీవులందరికి తండ్రిలాంటివాడు కూడా పరమశివుడే. పరమ శివుడు రోగనిర్ధారకుడు. సామాన్య వైద్యుడు రోగమును రోగిని పరీక్షించి తగినమందులువాడి రోగము (వ్యాధి)ను ఎట్లు పోగొట్టునో అట్లే సంసార రోగములను పరీక్షించి ఆరోగములను పరమ శివుడు హరించి వేయును. కావున పరమేశ్వరుని పండితులు హరుడు అని స్తోత్రము చేయుచున్నారు. అణువు చాలా సూక్ష్మము కనుక దానిని మనము తెలుసుకొనలేము. అట్లాగే మాయాస్వరూపమును గుర్తించటము కూడా చాలాకష్టము. దానిని తెలుసుకొనుటకు దేహములోని ఇంద్రియములు పనికిరావు. కావున మాయా అతీంద్రియులకే గోచరమగును. మాయకునికి మాత్రమే మాయా స్వరూపము తెలియును. అమాయకుడు మాయను కనుగొనలేక మోసపోవుచున్నాడు. అప్రత్నముగానే ప్రపంచతత్త్వమును పరమేశ్వరుడు తెలుసుకొనుచున్నందున ఆయన సర్వజ్ఞుడు; ఈశ్వరుడు, సర్వాత్మ అని చెప్పుచున్నారు. నిర్గుణుడైన పరమేశ్వరునికి సగుణములను ఆపాదించి మనము ప్రార్థించు చున్నాము. తను పరమాత్మ వేరుకాదు ఒకటే. అదే సోహం భావన. దాసోహం అనే భావన మన మనస్సులో సంపూర్తిగా ఎప్పుడు నిలుచునో అప్పుడే శివానుగ్రహం కలుగును. తద్వారా ముక్తి లభించును.

## సర్వభృత్ 7

సర్వశబ్దార్థ భూతాః అష్టమూర్తీర్బిభర్తీతి సర్వభృత్ । అథవా భూమ్యాద్యష్టతనూభిః స్థితిజీవన పాకశ్వాసావకాశావలోకాద్యుపకారేణ సర్వం బిభర్తి పుష్ణాతీతి సర్వభృదిత్యర్థః ॥

సర్వ శబ్దముచేత ప్రపంచము చెప్పబడుచున్నది. సర్వాత్మకత్వముగా సర్వోపాదానముచేత సర్వేశ్వరుడే చెప్పబడుచున్నాడు. భృత్ అనగా భరించేవాడు. పరమపురుషార్థమైన మోక్షము ఈశ్వరాధీనము  ఆయనే లోకబంధువు. అష్టమూర్తులచేత భరించేవాడు పరమేశ్వరుడు. అష్టమూర్తులనగా పంచభూతములు, సూర్యచంద్రులు, యజ్ఞకర్త అను ఎనిమిది స్వరూపములు కలవాడు పరమేశ్వరుడు. స్థితి, జీవనము, పాకము, శ్వాస, అవకాశము అవలోకము అనే ఉపకారములచేత అంటిన్నీ భరించువాడు పోషించువాడు పరమేశ్వరుడు.

## దివ్య కైలాస శిఖరేంద్ర నివాసభూః 8

కైలాస మనగా వెండికొండ. కైలాసమనగా స్ఫటికము, ఆ పర్వతము స్ఫటికమువలె శుభ్రమైనది, తెల్లనైనది.

దివి భవతీతి దివ్యః కైలాసః కేళీనాం సమూహః కైలం తేన సహాస్యతే స్థీయ తే కృతపురుష పుణ్యైర్మహద్భిరితి కైలాసః । ఆస ఉపవేశనే ఉక్తంహి ।

**కామంజనే స్మ్రియంతే కైలాసవిలాసవర్ణనావసరే ।**
**సాధనకథనావసరే సాచీకుర్వంతి వక్త్రాణీతి ॥**
**అథవా కేశిరసి శివస్య లాసో నృత్తం అస్మిన్నితి కేలాసః ఏవ కైలాసః। తథాచ ముక్తిఖండే ।**

శ్రీనందీ
కైలాసే సంధ్యయోస్తత్ర కరోత్యానంద తాండవం ।
తచ్ఛివా కేవలం పశ్యత్యన్యస్తత్ర న పశ్యతి ॥
పుండరీక పురే రుద్రః శౌనకానందనర్తనం ।
శ్రీమద్దభ్రసభామధ్యే కరోతి భగవాన్ సదా ఇతి ॥
శ్రీశివస్యాలయః ప్రళయేప్యనామయతయా అయం కిలాసేతి పౌరాణికా ఆహుః ॥
యత్కైలాస మహాకల్పే ష్వప్యద్భుతమనామయం ।
తత్కైలాసపదం ప్రాహుశ్శివతత్త్వవిదోః జనా । ఇతి

కంచ ఇలా చ కేలే తయోర్జలభూమ్యోరాసనం స్థితిర్యస్య స కేలాసస్స కైలాసః స్ఫటికమణిమయ ఇతివా తస్య దివ్యకైలాసస్య ఏకాదశసహస్రైకాదశలక్షోత్తరైకాదశకోటి సంఖ్యాకాని ఏవ విచిత్రాణి నానామణిమయాని శిఖరాణి సంతి తేషామిద్రస్సర్వోత్కృష్టం శివానందనిలయం నామశిఖరం శిఖరేంద్రం తత్ర నివాస భూరస్యాస్తీతి తథోక్తః । అత్ర పురా విస్మృతసర్గకార్యస్య విధేః మహాకైలాసం గత్వా తపస్యతః పరమేశ్వరాజ్ఞయా దర్శితం శివానందనిలయం నామశిఖరం గృహీత్వా భూమౌ శ్రీదక్షిణకైలాసస్థానే ప్రతిష్ఠాప్య తదుపత్యకాయామత్యద్భుతమదృష్టపూర్వం మహాలింగం దృష్ట్వా మహాభిషేకారాధన తపసి వర్తమానస్య సర్గాది సర్వసామర్థ్యదాత్రీమీక్షణదీక్షాం దేవశ్చకారేతి కథా।

దివ్యమైన సుఖములకు నిలయములు కనుక అది దివి స్వర్గముతో సమానమైనదికనుక అది దివ్యము. కేళీ అనగా విలాసమైన స్త్రీ పురుషుల విహార క్రీడ (క్రీలా-విలాసే, - కేల -చాలనే) అటువంటి కేళిల సమూహమే కైలము అటువంటి సమూహములతో ఉండు పట్టణము కైలాసము. పురుః అనగా ధనము, గౌరవము స్వభావము, పరాక్రమము, సౌందర్యము అని అర్థము. పుణ్యపురుషులు మహాయోగలు పరమభక్తులు ఉండే స్థలము కైలాసము. ఆస -నే ధాతువునకు ఉపవేశనము ఉండుట అని అర్థము. కైల+ఆసము = కైలాసము. కైలాసమున ఉండే జనులు యథేచ్ఛగా, ఆనందమును పొందుతూ స్వామి సన్నిధిలో ఉందురు. మహర్షులు కైలాస విలాసమును వర్ణనచేయునప్పుడు సాధనచేయు విధానమును చెప్పునపుడు సేవకునివలె శ్రద్ధగా వినెదరు. అందమైన జడలతో లాసము = లాస్యము చేయు ఆటకాడు. నృత్తము = నర్తనము, అంగప్రత్యంగములచే భావమును తెలుపుచూ ఆడెడి ఆట. శరీర హస్తనేత్రాభినయనములచేత పాటయొక్క భావమును తెలుపుచూ ఆడెడి ఆట ఇటువంటి ఆటల శాల దివ్య కైలాసము. ఆ కైలాసమున రెండు సంధ్యా సమయములందు పరమశివుడు ఆనంద తాండవమును చేయును. అదృశ్యము అచటివారికి తప్ప అన్యులకు గోచరముకాదు. శౌనకుడు శునకుని కుమారుడు ఇతడు నైమిశారణ్యమున పన్నెండేళ్ల సత్రయాగముచేసెను. శ్రీసూతమహర్షి ద్వారా అనేకపుణ్య కథలను వినెను. ఇతను (గృత్సమదుని కుమారుడు). శౌనకుని కుమారుడు. బహ్వృచ ప్రవరుడు. పుండరీకమనే పురమున రుద్రుడు ఆనంద తాండమును చేయును. ఆతాండమును చూచిన శౌనకుడుకూడా ఆనందవర్తనమును చేయును. ఆకాశ మధ్యసభామందిరమధ్యభాగమున ఎల్లప్పుడు శివుడు తాండవమును చేయును. ఆనంద పురవిహారియైన పరమశివుడు ప్రళయకాలమున (నవిద్యతే అమయః యస్య, న ఆమయః అస్య = అనామయః) ఆమయము అనగా రోగము, తద్ద్వారా

బాధలు అవి లేనివి. శ్రీసదాశివుని భక్తులదగ్గరకు కూడా అవి రానివి. అని పౌరాణికులు చెప్పుచున్నారు. శివతత్త్వవేత్తలు కూడా కైలాసమును మోక్షస్థానము అని చెప్పుచున్నారు. క = అనగా సూర్యుడు, మన్మథుడు, యముడు, రాజు, దేహము, అగ్ని, గాలి, ఆత్మ, నెమలి, మేఘము, ప్రకాశము చిత్తము మొదలగు అర్థములు కలవు. ఇల అనగా భూమి క + ఇల = కేల అనగా భూమ్యాకాశజలములు వాటిని ఆసనముగా స్థితిని చేసుకొన్నవాడు పరమేశ్వరుడు తెల్లనైనది, చల్లనైనది, స్వచ్ఛమైనది ఐన కైలాసము స్ఫటికమణులతో ప్రకాశించుచున్నది. అటువంటి దివ్య కైలాస పర్వతమున ఏకాదశి సంఖ్యలుకలవేలు, లక్షలు, కోట్లుకల విచిత్రములైన మణిమయములైన అనేక శిఖరములు కలవు. అందులో దేవేంద్రుని చేత సర్వోత్కృష్టమైనదియు శిఖరములకెల్ల గొప్పదియు ఐన శివానంద నిలయమనే దివ్య శిఖరమును ప్రార్థనతో ఇవ్వబడెను. అచటనే పరమశివుడు నివాసముంటున్నట్లు ప్రతీతి. పూర్వము బ్రహ్మ దేవుడు సృష్టిచేయు విధానమును విస్మరించెను. అప్పుడు బ్రహ్మ దేవుడు కైలాసమునకు వచ్చి పరమశివుని గూర్చి ఘోర తపస్సుచేసెను. అంతట పరమశివుడు ప్రసన్నుడై ప్రత్యక్షమాయెను. బ్రహ్మదేవునికి సృష్టి విధివిధానమునుచెప్పి దేవేంద్రుడు తనకు బహుమతిగా ఇచ్చిన శివానందనిలయమనే దివ్య శిఖరమును తీసుకొని వెళ్లి దక్షిణకైలాసమున ప్రతిష్టించి ఆ శిఖర సమీపమున అత్యద్భుతము అదృష్టపూర్వము ఇదివరకెన్నడూ చూడనిది ఐన మహా శివలింగమును చూచి మహాభిషేకముచేసి అనేక పత్రపుష్పములతో అర్చించి మరలా కైలాసమునకు రమ్మనెను. అంత పరమేశ్వరుడు బ్రహ్మదేవునకు సృష్టిచేయు శక్తిసామర్థ్యములను దివ్యదృష్టిని ఇచ్చెను. కనుక శ్రీకాళహస్తి క్షేత్రము దేవేంద్రుడు పరమేశ్వరునకు భక్తితో సమర్పించిన విచిత్ర దివ్య మణిమయమైన శివానంద నిలయ శిఖరములతో గూడిన దివ్య మహిమాన్విత క్షేత్రము.

## అఖండ బిల్వచ్ఛదన ప్రియః 9

ఈనాము శ్రీకాళహస్తిలో మాత్రమే దొరికే బిల్వ దళ మహిమను చెప్పుచున్నారు. శ్రీకాళహస్తికి అఖండ బిల్వకాననమనే పేరుగలదు. ఇచట బిల్వ వృక్షములు అనేకములు ఇదివరకు కలవు. ఇవి మామూలు బిల్వములుకావు. ఒకే ఈనెకు మొదటమూడు పత్రములు ఒకదానినుండి మరొకటి మొలచినట్లుగా ఉండి చివరిమూడవ ఆకుకు విడివిడిగా మూడు ఆకులు ఉండును. సామాన్యముగా వేరోచోట ఒకే ఈనెకు మూడు ఆకులు ఉండుట మనము చూచుచునే ఉన్నాము. కాని ఇది ఇచట మాత్రమే ప్రత్యేకము. ఇటువంటి విలక్షణము ప్రత్యేకము.ఐన అఖండ బిల్వములతో అర్చించి పూజించుట ఇచటి విశేషము. పూర్వము పార్వతీదేవి పరమేశ్వరునితో భూలోకములోని స్త్రీలు అనేక రోగములచేత గ్రహములచేతమూ, వివాహము కాకుండగాను, సంతానహీనులుగాను బాధ నొందుచున్నారు. స్త్రీలకు ఆబాధలు లేకుండగా సర్వసుఖములను కలుగచేసే శైవ పంచార్ణవ వ్రతమును నాకు ఉపదేశించమని కోరగా అంత శివుడు ఆవ్రతము అతి కష్టమైనదని, దానిని ఎంతో నియమనిష్టలతో ఆచరించాలి అలా చేయనిచో శివాగ్రహమునకు గురి కావల్సివచ్చును అని చెప్పగా పార్వతి ఆ దీక్షను పాటించేందుకు ఎన్నికష్టములనైనా ఎదుర్కొంటానన్నది ఆ పార్వతి. అంతట శివుడు శైవ పంచార్ణవ దీక్షను పార్వతికిచ్చెను. అంతట పార్వతి దీక్షను స్వీకరించి వర్ణదీక్ష, దృగ్దీక్ష, మేధాదీక్ష, శాంభవదీక్ష, మౌనదీక్షలను శ్రద్ధగా పాటించినది. కానీ ఒకనాడు దీక్షా భంగమై పరమశివుని ఆగ్రహమునకు గురియై భూలోకమున మానవ కాంతగా పుట్టినది.

దక్షిణ కైలాసమును ఈ అఖండ బిల్వ వృక్షము క్రిందకు చేరి పరమభక్తితో కొంతకాలము తపస్సు చేయుచునా కొంతకాలము ఆ అఖండబిల్వ పత్రములతో బిల్వ పుష్పములతో పూజచేసి స్వామి అనుగ్రహమును ఆమె పొందినది. తపోదీక్షలో శివజ్ఞానమును, ఈశ్వరానుగ్రహమును సంపాదించినందున ఇచట ఆమె జ్ఞాన ప్రసూనాంబగా వెలసి కలియుగాంతము వరకు పూజలందుకొమ్మని పరమశివుడు ఆజ్ఞాపించారు. ఈమె అష్టాదశ శక్తిపీఠాలలో ఒకరని భక్తుల భావన. ఈమె మహాశక్తివంతురాలు. గ్రహపీడితుల పాలిట కొంగుబంగారము. అఖండ బిల్వములతో శ్రీజ్ఞాన ప్రసూనాంబ అర్చించుటే కాక చాలామంది మహర్షులు ఆయనను అర్చించి ముక్తిని పొందిరి. ప్రాచీన కాలమున ఈ క్షేత్రమును అఖండ బిల్వకాననమని భైరవ కోన అనికూడా పిలిచెదరు.

బిల్వమును శ్రీఫలమని మహాకపిత్థమని పిలిచెదరు. ఆరోగ్య రీత్యా దీనికాషాయము మేహ శాంతిని పైత్య శాంతిని, జఠర దీప్తిని ఇచ్చును. మారేడు వేరు కాషాయము గుండె దడను విరేచనబద్ధమును పోగొట్టును. బిల్వపత్ర కాషాయము ఉబ్బసమును, వాంతిని, అణచును. మారేడు దోరపండు గుజ్జును పంచదార (చక్కెర)తో కలిపి తీసుకొంటే విరేచనములను నిలుపును. ఆకలి లేకుండుటను, వాతశ్లేష్మములను హరించును. మారేడు పండు గుజ్జును చింతపండును పంచదారలో చేసిన పానకములో సేవించిన మేహ శాంతి చేసి చలువ చేయును. ఇట్లు బిల్వము శరీర ఆరోగ్యమునకు కూడా ఉపయోగపడును.

బిలతి ధ్వంసయతి । కుష్ఠాదిరోగానాశ్రితానామితి బిల్వః । బిలతి హినస్తి పాపాన్యర్చకానామితి వా బిల్వః । న ఖంధ్యంతే ఇత్యఖండాని । ఛాద్యతే తరు రేభిరితి ఛదనాని । అఖండబిల్వ ఛదనేషు దళేషు ప్రీతిరస్యాస్తీతి అఖండబిల్వచ్ఛదన ప్రియః । శ్రు । త్రిశాఖై ర్బిల్వదళైః ఆద్రైరనార్ద్రై ర్వా న తత్ర సంమార్జ్యఇతి । పురాణంచ

ఉత్తావైర్బిల్వపత్రైశ్చ కోమలైర్గంధలేపితైః ।
ఉత్తరాగ్రైర్మహాదేవమర్చయిత్వా విముచ్యతే ॥
శుష్కైః పర్యుషితైః పత్రై రపి బిల్వదళైరపి ।
అభావేబిల్వపత్రాణాం తమ్మాంస్తమ్మదార్చయేత్ ॥
తదభావే తదుక్త్వాద్యైః పుష్పైరభ్యర్చయేచ్ఛివమితి ।
తస్మాచ్ఛివః అఖండ బిల్వదళ ప్రియః ఇత్యర్థః బిల్వోపనిషదిర్త తే
త్రిసుపర్ణమృచాం రూపం త్రిసువర్ణం త్రయీమయం ।
దేవేషు బ్రాహ్మణేభ్యశ్చైత్రి సువర్ణమయాచితం ।
మహ్యాం వై బ్రాహ్మణాయేదమయాచిత ముదాహృతం ॥
దద్యాద్బ్రహ్మభ్రూణవీర హత్యాయాశ్చాన్యపాతకైః
ముక్తోఖండానందబోధ బ్రహ్మ భూయాయ కల్పత ॥ ఇతి

మూడు దళములతో కూడినదియు సత్త్వ రజోస్తమోగుణాత్మకమైనదియు త్రినేత్రునకు ప్రతీక ఐనదియు ఆధిభౌతిక ఆధిదైవిక ఆధ్యాత్మికమైనదియు అనేక జన్మలపాపపరిహారము మూడు దళములుకల బిల్వపత్రమును శివార్పణతో జరుగును. కోటికన్యామణులదానములు, కొండంత రాశికల మువ్వులను అంతటిబంగారమును అంతటిరాలిపూలను దానము చేస్తేవచ్చే ఫలము ఒకబిల్వ పత్రమును శివునకు అర్పించినచో వచ్చును. దివ్య కాశీక్షేత్ర నివాసమ్ముండి, ఆక్షేత్రమున వెలసిన శ్రీకాలభైరవుని దర్శించిన గాని త్రివేణీ సంగమ మైనదియు ప్రయాగక్షేత్రమున వెలసిన బిందు మాధవస్వామిని దర్శించినఫలము ఒకబిల్వ పత్రమును శివార్పణ చేసినచో ఆఫలితము లభించును.

చెరువులను త్రవ్వించుట తనపుత్రులను ఇతరులకు దత్తత ఇచ్చి వారి వంశమును నిలబెట్టిన ఫలము. ఉత్తమ సంస్కారములు కల బ్రాహ్మణులకు సాల గ్రామదానము చేసిన ఫలము, వెయ్యి మొగ ఆడ ఏనుగులను దానముచేసిన ఫలము, వంద అశ్వమేధయాగములుచేసిన ఫలములు, ఒక బిల్వమును శివునకు అర్పించినచో ఆఫలమంతయు లభించును. బిల్వ పత్రములను చూచినా పుణ్యమే. తాకినచో అనేక పాపములు నశించును. శివునకు బిల్వములతో అర్చించుటచేత దరిద్రుడు ధనవంతుడు కాగలడు. ఏడు జన్మలవరకు అమిత ఐశ్వర్యసంపద చేకూరును. ఒకవెయ్యిమందికి అన్నదానముచేసినఫలము వెయ్యిమందికి ఆత్మతత్త్వోపదేశము చేసిన ఫలము అనేకజన్మలయందు చేసినపాపములు ఒక బిల్వపత్రమును పరమశివునకు భక్తితో సమర్పించిన అవినశించును. ''అఖండ బిల్వపత్రంచ అయుతం శివపూజనం, కృతం నామ సహస్రేణ ఏకబిల్వం శివార్పణం'' అని బిల్వ పత్రములతో శివుని అర్చించిన ఫలము విశేష ఫల ప్రదముగా మహర్షులు చెప్పిరి. సామాన్య బిల్వదళములకే ఇంతటి మహిమఉంటే అఖండ బిల్వ పత్రములతో పరమశివుని అర్చించిన మహాపుణ్య విశేషమే లభించును. కుష్టు మొదలగు మహారోగములన నాశనముచేయగల శక్తి ఒక బిల్వార్చనలోనే ఉన్నది. అర్చనలతో శివునకు బిల్వార్చనే శ్రేష్టమైనది. బిల్వార్చన ఐశ్వర్యమును చేకూర్చును. పుణ్యప్రదమైన రోజులలో శివునికి లక్షబిల్వార్చన చేయుట ఆంధ్రదేశమున ఆచారముకలదు. అఖండ బిల్వవృక్షములతో కప్పబడినది శ్రీకాళహస్తి క్షేత్రము. అటువంటి అఖండబిల్వదళముల అర్చనను అత్యంత ప్రీతిగా భావించేవాడు. శ్రీకాళహస్తీశ్వరుడు. అందువల్ల ఆయనను అఖండబిల్వచ్ఛదన ప్రియుడు అని అందురు. ఆబిల్వదళములుపచ్చివికానీ ఎండినవికానీ ఆయనకు ప్రియములే. బిల్వములు దొరకనప్పుడు బిల్వవృక్షముయొక్క మొదలలో ఉన్న మట్టితోకూడా అర్చనచేయవచ్చును., బిల్వోపనిషత్ లో ఇట్లున్నది. మూడురేకులుకల బిల్వ పత్రము నాలుగు వేదములతో సమానము. అది త్రిమూర్తి స్వరూపము ఈశ్వరానుగ్రహము. బిల్వార్చనతోనే లభించును. బిల్వదళములను సద్బ్రాహ్మణులకు దానము ఇచ్చిననూ మహాపుణ్యమువచ్చును. భ్రూణహత్యాది మహాపాపములు బిల్వార్చనతో తొలగిపోవును. అఖండ బిల్వార్చన ప్రియుడైన శ్రీకాళహస్తీశ్వరుడు నన్ను రక్షించుగాక.

## లూతార్తి మోచకః 10

లూయతే విచ్ఛిద్యతే స్వోత్పాదితతంతురనయేతి లూతా। కీటవిశేషః। లూఞ్ ఛేదనే। కశ్చిద్ద్విజాధమః కువిందం ధనినముపజీవ తనువ నద్మన్యేవాషరణం వసన్నంతే కస్మైచిచ్ఛివయోగినే మహాలింగవస్త్రం దత్వా సద్యోమమార। తత్ర భావేనాయమా[illegible]దేశే తంతువాయ జంతుర్జాతి స్మరో జనిత్వా శివగర్భాలయే నిజతంతునివహైర్గోపురా స్థానమంటపసరస్తటాకశిఖరాదీని విచిత్రాణి నిర్మాయ తేష్వీశాజ్ఞయా ప్రజ్వలితేషు సరభసం స్వతనూమపి తత్రాగ్నౌ జుహావ। తదా తస్యార్తిం భవ పీడాం మోచయామాసేతి కథా.

లూతమనగా సాలెపురుగు. దానినే శ్రీ అని గూడా అందురు. ఈ సాలెపురుగు పూర్వ జన్మలో ఊర్ణనాభుడే బ్రాహ్మణుడు. బ్రహ్మదేవుని శాపమువల్ల భూలోకమున సాలెపురుగై జన్మించాడు. శాపవిముక్తికై బ్రహ్మను ఊర్ణనాభుడు ప్రార్థించగా దక్షిణకైలాసములో అఖండ బిల్వవనమున వెలసిన పరమేశ్వరుని ధ్యానించినచో ఆయన కటాక్షంవల్ల ముక్తి కలుగును అని చెప్పెను. అలా ఊర్ణనాభుడు శ్రీకాళహస్తీశ్వరుని సేవిస్తూ ముక్తిని పొందెను. ఇప్పటికీ శ్రీకాళహస్తీశ్వరుని విగ్రహమునకు క్రిందిభాగమున గూడులాంటి రూపము సాలెపురుగు ప్రతిరూపమని అందురు. అది స్వామివారి పరీక్షలకు కూడా నిలిచి తన అకుంఠిత స్వామిభక్తిని చాటెను. ఊర్ణనాభుడు సత్యసభుని పుత్రుడు. కామోద్దీప్తుడై, సంస్కారవిహీనుడై వర్ణసంకరమును

పొంది హీనజాతి స్త్రీని వివాహమాడి అమితైశ్వర్యమును పోగొట్టుకొని జీవనమునకు సాలెవానిగా మారెను. తనునేసిన వస్త్రమును ఒక శివభక్తునికి సమర్పించెను. అతనితో ఒకరోజున అఖండ బిల్వ కాననమైనదియు, గజారణ్యమునకు చేరి అతనితో అఖండ బిల్వ పత్రములను పుష్పములను అచటి శివునకు సమర్పించెను. కొంతకాలము తర్వాత మరణించి అదే స్థలమున సాలెపురుగుగా జన్మించి తంతువులలో శివునకు ఆచ్ఛాదనమును నిర్మించెను. స్వామి ఆసాలెపురుగును పరీక్షింప గోరెను. పరమేశ్వరుడు భక్తులను అనుగ్రహించుటకు ముందు పరీక్షచేయును. అట్లే ఊర్ణనాభునికూడా స్వామి పరీక్షించెను. దీపశిఖలచేత ఆ తంతుగృహము భస్మమాయెను. పట్టువీడని ఊర్ణనాభుడు మరలా తంతుగృహమును చేసెను. మరలా అదికూడా దగ్ధమాయెను. దానితో విరక్తి చెంది దేహముపై, దేహముతో చేసే కర్మలపై మోహమును విడిచి అపరిమిత భక్తితో పరమేశ్వర ప్రసాదితమైన ఈ దేహము పరమేశ్వరుని పరీక్షకే అంకితము కావలెనని ఆ ఊర్ణనాభుడు (సాలెపురుగు) ఆ అగ్నిలో తన దేహమును అర్పించెను. లూయతే అనగా విచ్ఛేదనమును చేయునది. అంటే తను చేసినకర్మ తంతువు అనేక జన్మలనుండి అనుసరించి వచ్చుచున్నది. ఆ తంతు విచ్ఛేదనము పరమేశ్వరుడొక్కడే చేయగలడు. వస్తుతః కర్మతంతు విచ్ఛేదము అంత తేలికగా జరుగదు. అసాధారణమైన పనిని పరమేశ్వరుడు చేయగలడా? అని ప్రశ్నించినచో చేయగలడు అని సమాధనము అది ఎట్లనిన వేదమున ప్రతిపాదించిన కర్మ సిద్ధాంతము. స్వర్గాది సుఖములయందే పరమతాత్పర్యము కాదు. ఆకర్మలను పరమేశ్వర ప్రీతికై పరమేశ్వరార్పణముగా పరమేశ్వరైక్యము కొరకు చేయవలెను. ఐతే సాక్షాత్తుగా కర్మఫలము ముక్తిని ప్రసాదించవు. కర్మఫలము మానసిక పరిపక్వతకు సాధనమగును. తద్వారా పరమేశ్వరతత్త్వము సులభముగా అర్థమగును. పరమేశ్వర తత్త్వ జ్ఞానముద్వారానే మోక్షము లభించును. మానసిక పరిపక్వతలేని ఊర్ణనాభుడు ఒక కువిందుని (సాలెవాడు) బాగా డబ్బుకలవానిని ఆశ్రయించాడు. తనజీవనము కోసము, చాలా కాలము అతని ఇంట్లో బట్టలను నేసెను. ఒకరోజు తనదగ్గర తనునేసిన, ఒకవస్త్రమును ఒక మహాయోగికి శివునకు అర్పించ వలసినదిగా ఇచ్చి మరణించెను. పూర్వజన్మ సంస్కారముచేత ఆ అఖండ బిల్వ వనమునకు దగ్గరలోనున్న ఈశ్వరాలయమున సాలెపురుగుగా జన్మించి తంతు సమూహములచేత గోపురములను ఆస్థాన మండపములను శిఖరములను చిత్ర విచిత్రములుగా నిర్మించి పరమేశ్వరాజ్ఞతో మిక్కిలి సంతోషముతో ఆమంటలలో దూకి ఆత్మను శివార్పణ చేసుకొనెను. అంతట పరమేశ్వరుడు అతని ఆర్తిని సంసారతంతు బాధను పోగొట్టెను. క్రిమికీటకములను కూడా దయతలచి మోక్షమొసగే శ్రీకాళహస్తీశ్వరుడు నాకు ముక్తిని ప్రసాదించుగాక.

## సంసారవైద్యః 11

సంసారః సంసరణం. గర్భ జన్మజరామరణ స్వర్గ నరక కాంతారేషు పౌనఃపున్యేన సంచారః ఇత్యర్థః ॥ స ఏవ రోగః తస్య రోగస్య వైద్యః విద్యాం చికిత్సా వేదమధీతవాన్ వేత్తీతి వా వైద్యః శ్రు । అధ్యవోచదధివక్తా ప్రథమో దైవ్యో భిషక్ ఇతి. ఉన్నో వీరాం అర్పయ । భేషజేభిర్భిషక్తమం త్వా భిషజాం శృణోమీతి । లోకేఽపి వైద్యనాథ మితి శివస్థల ప్రసిద్ధేః । స సంసారవైద్యః శ్రీకాళహస్తీశ్వరో నః పాయాదిత్యర్థః ॥

సంసరణము అనగా, సంసారము, బాట, పట్టణమునుండి వెడలుట, యుద్ధ ప్రారంభము, సంబంధము, చేరిక భార్యాపిల్లలతోకలిసి ఉండుటమొదలగునవి అర్థములు కలవు. అసలు జీవుడు మొదట మాతృగర్భమున ప్రవేశించుట, జన్మించుట, వృద్ధిపొందుట, మరణించుట, స్వర్గ నరకములకు వెళ్లుట, ఇట్లు దారి తెలియని భీకరారణ్యము, పోరాని త్రోవలలో

మాటిమాటికి, పౌనః పుణ్యముగా తిరుగుచేసే సంసారలక్షణము. ఇది సంసారరూపమహారోగము. సామాన్యమైన రోగమునకు వైద్యుడు అనేక పరీక్షలు చేసి రోగ నిర్ధారణ చేసుకొని ఆ తర్వాత ఔషధములను ఇవ్వగలడు. సంసారరోగమునకు ఎన్ని పరీక్షలు చేసిననూ రోగనిర్ధారణ చేసి రోగనివారణము సామాన్య వైద్యుడు ఎపడూ చేయులేడు. సామాన్య వైద్యుడు సామాన్య పరికరములతో పరీక్షచేసిననూ రోగనిర్ధారణను చేయులేడు అనన్యసామాన్యమైన శక్తి కల్గిన వైద్యుడు మాత్రమే ఈ సంసారరోగమును పోగొట్టగలడు. చికిత్సా శాస్త్రమును అధ్యయనము చేసినవాడు వైద్యుడు. చికిత్సా శాస్త్రము వేదములలో కలదు. అధర్వణ వేదమున విశేషముగా కలదు. కనుక వైద్యము వైదికమైన శాస్త్రము. ఇది భారతీయ సంప్రదాయ బద్ధమైనది. శస్త్ర చికిత్స లేకుండగానే మహావ్రణములను, రోగములను తగ్గించుట దీనిలోనే చెప్పిరి. దేవతలకు మొదటి వైద్యుడు రుద్రుడే. పరమశివుడు సామాన్య వైద్యులకన్నా గొప్ప వైద్యుడు. లోకమున వైద్యనాథుడుగా ప్రసిద్ధ శివక్షేత్రము తమిళనాడులో కలదు. పరమేశ్వరుడు సంసారతాపమును, పోగొట్టగల వైద్యుడు. ''నమామి ధన్వంతరిమాదిదేవం సురాసురైః వందిత పాద పద్మం। లోకే జరారుగ్భయ మృత్యునాశం దాతా రమీశం వివిధౌషధీనాం॥ వైద్య శాస్త్రమున వ్యాధిని తెలియచేయుటకు ఐదు ఉపాయములు కలవు. అవి నిదానము, పూర్వరూపము, రూపము, ఉపశయము సంప్రాప్తి. జన్మను ఎత్తిన ప్రతి మానవునకు పురుషార్థ, చతుష్టయములసాధనకు శరీరము ముఖ్య కారణము. అది రక్తమాంసమేధోమజ్జాస్థి చర్మ సిరాది యుక్తమై పూర్వజన్మ పాపవశమువలన అనేక వ్యాధులకు గురి కావల్సి వచ్చుచున్నారు. ''శరీరమాద్యం ఖలు ధర్మసాధనం'' శరీరమును ఆరోగ్యముగా ఉంచుకొని దీర్ఘాయువును సంపాదించుట మానవుని ప్రథమ కర్తవ్యము. ఆ మార్గమును వేదాంగమైన ఆయుర్వేదము ఉపదేశించుచున్నది. పూర్వము మహర్షులు తమ తపోబలముచే బుద్ధి సూక్ష్మతచేత ఆయుర్వేదమును విస్తృతి పరచినారు. ఇది వేదాంగముకనుక వేదకాలమునుండి ఇది ప్రచారములో ఉండినది. పరమేశ్వరుడే అనాదికాలపు వైద్యుడు. అశ్వనీ దేవతలు ధన్వంతరీ మొ॥లగు వారు దేవ వైద్యులు.

## సర్వజ్ఞః 12

సర్వం తత్త్రాణి కర్మఫలానుభవయోగ్య శరీరాదికం కల్పాదౌ యౌగపద్యేన జానాతీతి సర్వజ్ఞ. ఇత్యర్థః

సర్వజ్ఞుడు అనగా సర్వము తెలిసినవాడు అని అర్థము. సర్వపదముచేత ఏప్రాణికి వాని కర్మ ఫలాను భవయోగ్యమైన శరీరములను ఇచ్చుటను తెలిసినవాడు. ప్రళయము తర్వాత ఒకేసారి అనేకరకముల జీవులను సృష్టిచేయగల సామర్థ్యము కలిగినవాడు వేదములు స్మృతీతిహాస పురాణాగమ కావ్యాదులు పరమేశ్వరుని ఒక్కడినే సర్వజ్ఞునిగా చెప్పుచున్నవి. కనుక పరమేశ్వరుడు సృష్టిస్థితిలయములను బాగా తెలిసినవాడు కనుక ఆయన సర్వజ్ఞుడైనాడు.

## పరమాత్మా 13

సర్వ శరీరేషు ఆత్మ భావేన సదా సమస్వయాత్ పరమాత్మా. క్షేత్రజ్ఞంచాపి మాం విద్ధి సర్వ క్షేత్రేషు భారత (భగవద్గీత - 13.2) ఇతిస్మృతేః. సర్వ శరీరేషు సర్వాంతరతమః. అతఃఏవ పరమశ్చాసౌ ఆత్మాచేతి పరమాత్మా.

అన్నీ శరీరములయందు ఆత్మ ఒకటే అనే భావనలో ఉండువాడు పరమాత్మ. అసలు ఆత్మ - అనాత్మలకు కలభేదమును, వీటిద్వారా ఏర్పడిన బంధమును, ఈ బంధము ఆత్మజ్ఞానముచేత ఎట్లు తొలగును. అసలు జ్ఞానమంటే ఏమిటి? జ్ఞానసాధనములు ఏవి? ఏవిధమైన జీవన్ముక్తి కలుగును? క్షేత్రక్షేత్రజ్ఞుల (ప్రకృతి పురుషుల) వివేచనము (వేరు) చేసినచో క్షేత్రమే ఈ శరీరము. దీనిని తెలుసుకొనువాడే క్షత్రజ్ఞుడు అని అనాత్మ ఆత్మలయొక్క స్వరూపమును గృహమును దీపమును వలె వేరు పరచి చూపి బ్రహ్మ పరోక్షము, సద్వితీయము అనుభావమును తెలుపుటను ఆత్మయందు కనిపించే ఈ సంసారమును సమూలముగా పోగొట్టుకొనుటకు ఆత్మ ఆనంద స్వరూపము అనే విషయము సిద్ధించుటకు శ్రుతి మొదలగు ప్రమాణములద్వారా నిశ్చయించే క్షేత్రజ్ఞుడే బ్రహ్మ. ఈ శరీరమే క్షేత్రము. దానిని ఎరిగినవాడు. క్షేత్రజ్ఞుడు. క్షేత్రమంటే పొలము. సకాలములో వ్యవసాయముద్వారా ధాన్యములు పొందునట్లు మానసికక్షేత్రమున కృషిచేసి ఈశ్వర ప్రాప్తి అనే ఫలమును పొందగలుగుట చేత ఈ శరీరమును క్షేత్రమనిరి. ఈ క్షేత్రమునందుండి దీనిని ఎరుగువాడు అనగా శరీరములోని చైతన్యాంశము క్షేత్రజ్ఞుడు అనబడును. అన్నీ క్షేత్రములయందును పరమాత్మే క్షేత్రజ్ఞుడు. సర్వజీవుల శరీరములయందు అంతర్యామిగా ఉండేవాడే పరమాత్మా. పరమము అనగా ఆద్యము, ఉత్కృష్టము ప్రధానము అని అర్థము. పరమాత్మా అనగా పరబ్రహ్మ. ఆయనే శ్రీకాళహస్తీశ్వరుడు.

## పరాత్పరః 14

ఇంద్రియమనోబుద్ధి హిరణ్య గర్భాఖ్య తత్త్వాని ఉత్తరోత్తరతః పరాణి శ్రేష్ఠాని సూక్ష్మానిచ. తేభ్యోఽపి పరమవ్యక్తం తస్మాత్పరస్మాదపి పరః పురుష వాచ్యః శివః ఏవ పరాత్పర ఇత్యర్థ।

**ఇంద్రియేభ్యో పరం మనో మనసః తత్త్వముత్తమం,**
**సత్త్వాదధిమహానాత్మా మహతోవ్యక్తముత్తమం ।**
**అవ్యక్తాత్తు పరం పురుషః వ్యాపకో లింగ ఏవ చ**
**యత్ జ్ఞాత్వా ముచ్యతే జంతుః అమృతత్వం చ గచ్ఛతి.**
**ఇతి బ్రహ్మగీతావచనం చ పురుషోనామ సంపూర్ణః సాంబః సత్యాదిలక్షణః**

**సవిష్ణుః నాహమవ్యశ్చ సత్యమేవ మయోదితం ఇతి తస్మాత్పూర్ణత్వాత్పురుషః ఇత్యన్వర్థ నామా శివః పరాత్పరః ఇత్యర్థః ।**

పరమ శివుడే మన దేహమునందున్న జీవుడు. హృదయమునందుండి ఏమీ ఎరుగనివాడివలె ఉంటూ అన్నిటినీ నడుపునది పరమేశ్వరుడే. దేహేంద్రియాది సమూహము జడము. ఆ జడ సమూహమునందు ఉండి నడిపించే వాడు పరమశివుడే. జడమయమైన దేహమునందు చైతన్యుడైన శివుడు లేనిచో ఆదేహము శవమగును. శివుడే మోహములో చైతన్యుడై జీవుడగుచున్నాడు. దేహములలో చిక్కుకున్నవాడు పరమేశ్వరుడే. ఆయన తను శివుడన్న భావమును మరచి సంసారి ఆయెను. జీవత్వం భ్రాంతి. అసలు సత్యము శివుడే. ఇంద్రియములు, మనస్సు, బుద్ధి హిరణ్య గర్భుడు మొదలగునవి ఉపాధిని ఆశ్రయించుకొని ఉండును. ఒకే జీవుని సుషుప్తి దశలో ఆనందమయుడని ప్రాజ్ఞుడని పారమార్థికుండని చెప్పుదురు. ఆ ప్రాజ్ఞరూపుడైన జీవుడే స్వప్నదశయందు అంతఃకరణమును ఉపాధిగా చేసుకొని తైజసుడని, ప్రాతిభాసికుడని స్వప్న కల్పితుండని చెప్పుదురు. ఆ తైజసుడే జాగ్రద్దశయందు చక్షురాది బాహ్యేంద్రియములచేత జాగ్రత్ప్రపంచమును ఉపాధిగా చేసుకొని విశ్వః అని వ్యావహారికుడని చిదా భాసుడని చెప్పెదరు. ''జీవేశ తైజసప్రాజ్ఞాః విశ్వవైరాజరూపిణః తేషాం షణ్ణాం విహారార్థం సమష్టి వ్యష్టి భేదతః''. కనుక ఇంద్రియములకన్నా మనోబుద్ధులు, వాటికన్నా హిరణ్యాగర్భుడు. అన్యుడు. గొప్పవాడు, సూక్ష్ముడు, ఇంద్రియములకు గోళములు కలవు. కానీ మనోబుద్ధులకు హృదయము తప్ప మరే గోళములు లేవు. అట్లాగే హిరణ్య గర్భుడు. వీటికన్నా పరమాత్మ అవ్యక్తుడు ఆయన మహత్తు మొదలగు తత్త్వములు కలిగినవాడు. అందువల్ల వీటికన్నా అన్యుడినుండి పరమాత్మే పురుషవాచ్యుడు. ఆ పరమాత్మే పరమశివుడు. ఇంద్రియములకన్నా వేరైనది. ఇంద్రియమును నియంత్రించునది మనస్సు. మనస్సుకన్నా సత్త్వము (స్వభావము, ప్రయత్నము, ప్రాణము, పృథివ్యాధి ద్రవ్యములు) చాలా ఉత్తమమైనది. ఐతే కామమును (కోరిక అనే శత్రువు) ఇంద్రియములు, మనస్సు, బుద్ధి అను ఈ మూడు జీవుని ఆవరించినందున లోపల ఉండే చైతన్యమును అవి ఆవరింపబడును. తద్వారా జీవును భ్రమకు లోనగును. అనగా కామ వాసనలు బుద్ధిలోపల చిత్తమునందుండి తమోగుణముద్వారా జ్ఞానమును ఆవరించి రజోగుణముద్వారా చిత్త విక్షేపమును (భ్రమను) కలుగచేయును. ఆవరణ శక్తి, విక్షేప శక్తి జీవుని జ్ఞాన భ్రష్టుని చేసి ప్రపంచ విషయా శక్తిని వృద్ధిచేయును. కావున మొదట ఇంద్రియములను మనస్సును నిగ్రహించి, జ్ఞానమును, విజ్ఞానమును నశింపచేయు కామమనే మహాపాపిని నిర్మూలించవలెను. కామమును జయించుటకు మొదటిమెట్టు ఇంద్రియ నిగ్రహము.'' తస్మాత్త్వమింద్రియాణ్యాదౌ నియమ్య భరతర్షభ, (భగ 3-41) శ్రీకృష్ణుడు అర్జునకు చెప్పెను. ఇంద్రియములను నిగ్రహించుట చాలాకష్టము. ఐతే సాధనవల్ల దానిని నిగ్రహించుట సాధ్యమగును. కనుక సత్త్వముకన్నా మహత్తుగొప్పది మహత్తుకన్నా అవ్యక్తము గొప్పది. అవ్యక్తమునుండి అన్యుడైన వాడు పురుషుడు. ఆపురుషుడే వ్యాపకుడు. ఆయనే లింగస్వరూపుడు. ఎవరిని తెలుసుకొన్నందువల్ల జీవునకు జీవత్వము, జంతుత్వము, పశుత్వము పోయి అమృతత్వమును పొందునో అతనే పరమాత్మా అని బ్రహ్మ గీతలో చెప్పబడినది. పురుషడనగా పరమాత్మా ఆయన సంపూర్ణుడు. ఆయనే సాంబశివుడు. ఆయన సత్, చిత్ ఆనంద స్వరూపుడు. ఆయన విష్ణువు కాదు జీవుడునుగాదు. ఆయన వీటికన్నా అన్యుడు. సంపూర్ణుడైన పరిపూర్ణ స్వరూపుడే పురుష రూప పరమేశ్వరుడు. ఆయన పైన చెప్పిన లక్షణములకు తగినవాడు, అన్వర్థనామధేయుడు. శ్రీకాళహస్తీశ్వరుడే నేటి పరాత్పరుడు.

## కాలేభాజం జవధ్వంసీ 15

కాలము అనగా కృష్ణసర్పము. ఇభము అనగా ఏనుగు. ఈ పాములను ధరించువాడేయైనవాడు పరమేశ్వరుడు. పరిణామమయమైన సంసార సర్పము గజమును జీవులను పోగొట్టి వారిని సంరక్షించి మోక్షమును ఇచ్చి వారి గుర్తులను తనను ధరించువాడేగాక వారివెల్లలో స్థిరుడై వారివెల్లలోనే ఉపశమింపజేసే దయామయుడు మన శ్రీకాళహస్తీశ్వరుడు. గజాసురుని చంపి తలచి గజచర్మాంబరధారియైనాడు. సంప్రీతి భక్తి మెచ్చి చంద్రశేఖరుడయ్యాడు. అట్లాగే గంగాధరుడు గరళ కంఠుడు. నీల కంఠుడు మొదలగు ఎన్నో భక్తుల నామములతో తనవిగా చేసుకొని ఆనామములతో పిలిచితే పరవశించిపోయే ఆ త్రిలోకపాలుడు మరి ఒకరు సృష్టిలోనే లేరు. హస్తి పూర్వజన్మలో శివుని పరివారములో ఒక కింకరుడు. ఒకరోజు పార్వతీ పరమేశ్వరులు ఏకాంతమున ఉండగా వారి అనుమతి లేకుండగా లోపలికి వెళ్ళినందున పార్వతీదేవి కోపగించి వానిని భూలోకము ఏనుగుగా పుట్టుమని శపించెను. అంతట కింకరుడు శాపవిముక్తికై పరమేశ్వరుని ప్రార్థింపగా దక్షిణకాశియైన అఖండ బిల్వవనమున నన్ను అర్చన చేయుచూ అచటికి వచ్చిన సర్పముతో పోట్లాడి మరణించిన తర్వాత శాపవిముక్తుడవు అయ్యెదవని వరమిచ్చెను. ఆ శివకింకరుడు గజముగా అఖండ బిల్వవనమున శ్రీస్వామిని సేవిస్తూ ఉన్నాడు. కొంతకాలము తర్వాత కృష్ణసర్పమొకటి వజ్రవైఢూర్య మణులను సేకరించి వాటితో ఆస్వామిని పరమ భక్తితో అర్చించేది. అదే సమయములో ఏనుగు వాటిని తొలగించి తను తెచ్చిన వాటితో స్వామిని అర్చించేది. ఇలా చాలాకాలము ఒకరికి తెలియకుండగా మరి ఒకరు శ్రీస్వామిని పూజిస్తూనే ఉన్నారు. తమకు ఎవరో అడ్డు వస్తున్నారని తెలుసుకొని పాము కాచుకొని ఉండగా ఏనుగు వారి అడ్డును తొలగించేందుకై వచ్చి స్వామిని అర్చిస్తూ ఉండగా పాము ఏనుగు తొండములో దూరినది. బాధను భరించలేక తలను సమీపములోని అఖండ బిల్వవృక్షమునకు బాదుకొని మరణించెను. తొండములోనికి వెళ్ళిన కృష్ణసర్పము బయటికి రాలేక తొండములోనే మరణించింది. ఏనుగు తన తొండములో దూరిన పామును చంపవలెనని తద్వారా తను స్వామిని అర్చించుటకు ఎవరూ అడ్డురారని తొండమును వృక్షమునకు బాది తనుగూడా మరణించెను. పరమేశ్వరుడు వారి మూఢ భక్తికి మెచ్చి తనలో ఐక్యం చేసుకున్నాడు. ఆహా! ఆ మూగ జీవులు ఎంతపుణ్యాత్ములో!!

కాలః కృష్ణ సర్పః వ్యాల పురాణ ప్రయోగ ప్రాచుర్యాభిప్రాయేణావగమ్యతే. ఏతి మదమితి ఇభః ఇణ్ - గతౌ (కాలశ్చ ఇభశ్చ - కాలేభౌ) తయోరాజం జవస్సంసారః।

సంసృతిర్భవసంసార ప్రతియత్నాజవం జవా ఇతి కోశాంతరం అత్ర చ కాలేకో బుధ్యతే అర్థాత్సర్ప దోషః కాలేభయోస్సంసారక్లేశం సమూలాజ్ఞానం ధ్వంసయన్ స్వాత్మైక్యముక్తిం దదాతీతి తథోక్తః। నను। ముక్తిర్నామ జనిమృతి దుఃఖాజ్ఞాన పాశమోచనం। సాఽపి ముక్తిర్యథోక్తాధికారిణ ఏవ భవేత్ లూతాగజభుజగాదేః కథముపపద్యేత మృతానాం గతిర్వా కతివిధా కింమాన మితి చేదుచ్యతే అవివేకి జంతు జాతస్య చక్రనేమిక్రమవత్ జననమరణే ఏవ చ లోకాంతగతిః। కర్మవిద్యావతాం దేవలోకావాప్తిః। య ఏవం విద్వానుదగయనే ప్రమీయతే ఇతిశ్రుతిః। కేవలకర్మిణాం పితృలోకావాప్తిః। అథ యో దక్షిణే ప్రమీయత ఇతిశ్రుతిః నియమేన మహాలింగాదిప్రతీకోపాసకానాం సాలోక్యముక్తిః। తత్రైవోత్కృష్ట ప్రవణ ప్రతీకోపాసకస్య సన్యాసినస్సామీప్యముక్తిః ప్రతీకమంతరేణ స్వస్వాభక్తేన వివిధైశ్వర్య విశిష్ట దైవతోపాసకస్య సార్ష్టితా సారూప్యముక్తిః। జగత్కారణ సాంబమూర్త్యహంగ్రహోపాసకస్య।

కాళము అనగా కృష్ణ సర్పము. మహా పురాణమున మిక్కిలి ప్రచారములో ఉన్నవిగా గాథలు తెలియుచున్నవి. మిక్కిలి మదమును పొంది ఉన్నది ఏనుగు. ఇభ్ గతౌ అనే ధాతువునుండి ఇభ శబ్దము వచ్చినది. భవమనగా సంసారమని అర్థము. భవంభవధ్వంసీ సంసారముయొక్క క్లేశములను సమూలముగా నాశనము చేయగలవాడు పరమేశ్వరుడు. కాళము ఇభముల సంసారక్లేశములను నశింపచేసి స్వాత్మైక్యముక్తిని కూడా ఇవ్వగలడు సదాశివుడు. కేవల ముక్తి అనగా జన్మ మరణముల దుఃఖమును అజ్ఞానముచే వచ్చిన భవబంధపాశమును పరమేశ్వరుడు పోగొట్టగలడు. అటువంటి ముక్తి తగిన అధికారికి మాత్రమే లభించును. ఐతే సాలెపురుగు, సర్పము, ఏనుగులకు ఎట్లు ముక్తి లభించినది? మరణించినవారు ఏఏ మార్గములలో ఎట్లు వెళ్ళి మరలా భూలోకమున జన్మను ఎట్లు ఎత్తుదురు? మరణించిన వార్కి ఏ ఏ జన్మలు లభించును? వీటికి ప్రమాణములు ఏవి? అని ప్రశ్నించినచో ఛాందోగ్యోపనిషత్తు, భగవద్గీతలలో ఉత్తరాది, దక్షిణాది దేవయాన పితృయాన మార్గముల గూర్చి కలవు. అగ్ని కాలాభిమానదేవత. అయనే శుక్లపక్షాభిమానదేవత, ఉత్తరాయణాభిమాన దేవతగూడా ఆయనే. ఈ మార్గములనుండి పోవువారు బ్రహ్మవేత్తలు. వారికి మరలాజన్మలేదు. ధూమమును కాలాభిమాన దేవత. రాత్రియందు కూడా ఆయనకు దీనియందు అభిమానముకలదు. కృష్ణపక్షమునకు దక్షిణాయనమునకును అభిమానదేవత. ధూమాదిదేవతలు ఉన్న మార్గమున వెళ్ళే యోగులు చంద్రలోకమునకు వెళ్ళి అచటకర్మ ఫలమును అనుభవించి మరలా భూమికి మరలి వచ్చెదరు. ఈలోకమున జ్ఞాన కర్మలయందు అధికారము కలవారలకు శుక్లము కృష్ణము మార్గములు శాశ్వతమైనవిగా భావించి అగ్న్యాది మార్గము ఆవృత్తి రహితమైనది ధూమాదిమార్గము ఆవృత్తి కలిగినది. ధూమాదిమార్గమున వెళ్ళువారు చంద్రలోకమునుండి మరలాభూమి పైకి వచ్చెదరు. కావున ఇందులో ఒకటి మోక్షమునకు హేతువు. మరొకటి సంసారమునకు హేతువు. అవివేకులు అజ్ఞానులు అనేక జన్మలను ఎత్తుచూ బండి చక్రములోని అరలవలే పైకి క్రిందకు మారుచూ పుట్టుట చచ్చుట చేయుచుందురు. వార్కి లోకాంతరవాసము కూడా లేదు. కర్మలచేత ఆత్మవిద్యను సంపాదించి వార్కి దేవలోకప్రాప్తి వచ్చును. ఆతర్వాత అతనికి మోక్షము వచ్చును. కేవలము కర్మలనే చేయు కర్మిష్ఠులకు పితృలోకవాసము వచ్చును. అతను దక్షిణాయనముద్వారా ధూమాది మార్గమున వెళ్ళగలడు. నియమనిష్ఠలతో మహాలింగమును ప్రతీకగా చేసుకొని ఉపాసన (మంత్రానుష్ఠానమును విశేషార్చనలు) ను చేయుదురో వార్కి సాలోక్యముక్తి లభించును అచటనే ఉపాసనను తీవ్రతరము చేసి ప్రతీకగా (ఆలంబన) ప్రణవమును (ఓంకారమును) ఉపాసించే సంన్యాసులకు సామీప్యముక్తి లభించును. ప్రతీకకు భేదమైనప్పటికి దానికి సమానమైనదియు అనేక ఐశ్వర్యములను ఇచ్చునదియు ఒకవిశిష్టమైన దేవతోపాసన చేసినచో సారూప్యముక్తి లభించును. జగత్తు సృష్టి స్థితిలయములకు కారణభూతుడైన సాంబమూర్తిని అహంగ్రహోపాసనగా ఉపాసకుడు ఏదేవతను ఉపాసించుచున్నాడో ఆదేవతారూపము (తాదాత్మ్యము అనగా అభేదము) నుపొంది సాయుజ్యముక్తి లభించును. ముక్తి ఐదురకములు. సర్పము గజము ముక్తిని ఆర్జించుటలో తగువు పడిరి. ఒకరికన్నా మరొకరు స్వామిని విశేషముగా అర్చించి స్వామికి ప్రీతిని కలిగించి వారి అనుగ్రహమును పొందవలెనని కలహించుకొని స్వామిని తను తప్ప మరెవరూ విశేషముగా అర్చించకూడదు అని అసూయతో హస్తిని బాధించవలెనని సర్పము. తనకన్నా మరొకరు శ్రీస్వామిని విశేషముగా అర్చించుచున్నారని గజము భావించినది. గజము పరమభక్తితో శ్రీస్వామివారిని తనకన్నాముందుగా శ్రీస్వామి అనుగ్రహము పొందునని

సర్పము ఆ గజము తొండములో దూరి తనూ మరణించెను. వ్యక్తిగతముగా ఎవరికి ద్వేషములేదు. ముక్తి విషయములోనే వారి స్పర్ధ.

తద్దేవతా తాదాత్మ్యరూపసాయుజ్యముక్తిః శ్రు । ఏతాసామేవ దేవతానాగ్ సాయుజ్యగ్ సార్ష్టితాగ్ సమానలోక తామాప్నోతీతి । ప్రమాణాని । ఏతాః కర్మఫలభూతా ముక్తయః ॥ బ్రహ్మైక్యత్వజ్ఞానాదేవ కైవల్యం భవతీతి । బ్రహ్మవిదాప్నోతి పరమితి ప్రమాణం । తత్ర శివస్థానమ్మృతానాం అధికారవిచారానర్హాణాం చిత్తశుద్ధ్యనుసారేణ పంచవిధాసుఽముక్తిషు అధికారోఽస్తి తదుపపత్తి రగ్రే మణికర్ణ మంత్రే వక్ష్యతే । అత్ర శ్రీమద్దక్షిణ కైలాసే బాలాగజభుజంగాదయః విశిష్టపూర్వకర్మభిర్లబ్దేశ్వరానుగ్రహా ః జాతిస్మరాశ్చ నియమేన దేవమభ్యర్చ్య శివపదే ఏవాసూంస్త్యక్త్వా శ్రీ జ్ఞానసంబంధ శ్రీకంఠవిద్యేశాదివత్ సాంబమూర్తిం సాక్షాత్కృత్య తత్తాదాత్మ్య రూపాం సాయుజ్యముక్తి ం గతాః ఇత్యత్ర కానుపపత్తిః నను శివతాదాత్మ్యమేవ సాయుజ్య ముక్తిశ్చేత్ వృక్షే వృక్షాంకురవత్ మహాలింగే గజదంతాదిదర్శనే సతి కథం సాముక్తిః । ఉక్తంహ్యాచార్యైః।

**తాదాత్మ్యమత్ర వాక్యార్థ స్తయోరేవ పదార్థయోః ।**
**సంసర్గోవా విశిష్టోవా వాక్యార్థో నాత్ర సమ్మతః ।**
**అఖండైక రసత్వేన వాక్యార్థో విదుషాం మతః ఇతి ।**

అత్రోచ్యతే । నహి కీశకిశోరవత్ గజాదయశ్శివమాశ్రిత్య లంబంతే । కింతు శరీరత్రయనాశేన పరశివతాదాత్మ్యం గతైరేవ తన్ముక్తిసమయే కిం వాంఛితమితీశ్వరేణ నియుక్తైః తైరస్మచ్చిహ్నం నామ చ త్వయా ధర్తవ్యం లోకహితాయేత్యభర్థితో దేవః కృపయా తల్లక్ష్మలింగే దధార । తస్మాత్ కాళేభాజజవధ్వంసీత్యర్థః ॥

ముక్తి అనగా జన్మ, మరణం, అజ్ఞానమువలన వచ్చిన దుఃఖము, సాంసారిక పాశము మొదలగువాటి నుండి బయటపడుట అని చెప్పిననూ అది అందరికి లభించదు. అది సాధన చతుష్టయ సంపన్నుడైన అధికారికి మాత్రమే లభించును. ఐతే ఈశ్వరానుగ్రహం వలన సాలెపురుగు కృష్ణ సర్పము ఏనుగు ముక్తిని పొందినవి. మరి అవి వివేకములేనివి. ఏకారణముచేత వాటికి ముక్తి లభించెను? అసలు మరణించినవారు ఎట్లు వెళ్ళుదురు. ఆవెళ్ళుట ఎన్ని విధములు? వాటికి వేద, పురాణేతిహాసములందు ప్రమాణములు ఏమైనా కలవా? అని ప్రశ్నింపగా కలవని సమాధానము. వివేకములేని ప్రాణులయందు పుట్టిన జీవులు చక్రములోని అరలవలె పుట్టుట మరణించుట యందే ప్రవృత్తి ఉండును. వారు పుణ్యలోకములుగాని, మరి ఏలోకాంతరగమనముగాని చేయలేరు.

మోక్షమును కోరువారు సాధన చతుష్టయ సంపన్నులు కాలేని యెడల ఉపాసనలద్వారా మానసిక పరిపక్వతను పొంది తద్వారా ఆత్మజ్ఞానమును సంపాదించి మోక్షమును పొందెదరు. ఉపాసనల గూర్చి విచారించనచో కొన్ని విధములైన విద్యలను ఉపాసనలందురు. ఏవిద్య ఐననూ అది పురుషార్థ సాధకమే. ముఖ్యముగా ముక్తి ప్రయోజకములగు విద్యలే ఉపాసనలు. అభ్యుదయ సాధనము, కైవల్యసన్నికృష్ట ఫలము, ఈషద్వికృత బ్రహ్మ విషయము, కర్మ సమృద్ధి ఫలము అనునవి ఉపాసనలని శ్రీఆదిశంకరులు ఛాందోగ్యోపనిషత్ భాష్య ఉపోద్ఘాతమున చెప్పిరి. విషయాంతరములను పరిహరించి ధ్యేయ వస్తువునందు చిత్తమును స్థిరము చేసుకొనుటే ఉపాసన అని అర్థము. ఐతే శివలింగ, సాలగ్రామాది ప్రతీకములందు శివవిష్ణ్వాది దేవతల ఉనికి ఉన్నదని భావించి

వాటికి అర్చనాదులు చేయుటయు ఉపాసనయే. ఉపనిషత్తుయందు అనేకరకములైన ఉపాసనలు కలవు. అసలు ఉపాసన అనగా దేవతాదులను సేవించుట, దైవ మంత్రచింతనము. దైవ గుర్వాది పూజనము. వ్రతాదినిమిత్తముగా భోజనము లేకుండగా శరీర ధారణకు అల్పాహారములను సేవించుట మొదలగునవి.

**తద్దేవతా తాదాత్మ్యరూప సాయుజ్య ముక్తిః శ్రుః. ''ఏతా సామేవ దేవతా నాగోం సాయుజ్యగోం సార్ష్టితాగో సమానలోకతా మాప్నోతీతి. ప్రమాణాని. ఏతాః కర్మ ఫల భూతా ముక్తయః**

ముక్తి అనగా జన్మ. మరణం, అజ్ఞానమువలన వచ్చినది. దుఃఖము, సాంసారిక పాశము మొదలగు వాటినుండి బయట పడుట అని చెప్పిన అది అందరికి లభించదు. అది సాధన చతుష్టయ సంపన్నుడైన అధికారికి మాత్రమే లభించును. ఐతే ఈశ్వరానుగ్రహంవలన సాలెపురుగు కృష్ణ సర్పము ఏనుగు ముక్తిని పొందినవి. మరి అవి వివేకము లేనివి. ఏకారణముచేత వాటికి ముక్తి లభించెను. అసలు మరణించిన వారు ఎట్లువెళ్ళుదురు. ఆ వెళ్ళుట ఎన్ని విధములు వాటికి వేద పురాణేతిహాసములందు ప్రమాణములు ఏవైనా కలవా? అని ప్రశ్నింపగా కలవని సమాధానము. వివేకములేని ప్రాణులయందు పుట్టిన జీవులు చక్రములోని అరలవలె పుట్టుట మరణించుటయందే ప్రవృత్తి ఉండును. వారు పుణ్యలోకములుగాని, మరి ఏ లోకాంతర గమనములేదు.

ఉపాసనాఫలమును అనుభవించుటకు దేవలోకమునకు ఎట్లు వెళ్ళుదురు? అని ప్రశ్నించగా దానికి సమాధానము ప్రతి జీవుడు మరణించిన తర్వాత వాడి సుకృత దుష్కృత ఫలములు అనుభవించుటకై ఆయా లోకములకు యమదూతలో లేక మరే లోకపు దూతలో వచ్చి తీసుకొని వెళ్ళుట గరుడ పురాణములలో చెప్పబడెను. ఐతే ఉపనిషత్తులలో చెప్పిన మార్గములు వేరు. అవి రెండు. అందులో 1. దేవయానము. (అర్చిరాది మార్గము) 2. పితృయానము (ధూమరాది మార్గము). దేవయానమనెడి అర్చిరాదిమార్గముచేత బ్రహ్మలోక ప్రాప్తి. (ఉపాసనా మహిమచేత) సృష్టికి ముందు సూక్ష్మభూత సముదాయ స్వరూపమై ఉండు హిరణ్య గర్భలోకములోచేరి తత్సారూప్యమును పొందుటయే సిద్ధించును గాని నిరతిశయానంద స్వరూప బ్రహ్మ ప్రాప్తి సంభవించదు. కనుక ఏ దేవతను ఉపాసించిన ఆ దేవత సారూప్యమును మాత్రము పొందగలరు. కానీ ఉపాసనాకర్మ పరమ పురుషార్థమునకు ముఖ్య సాధకము కాదు అని బాదరాయణుని వేదాంత సూత్రములలో ''కార్యం బాదరి రస్య గత్యుపపత్తేః'' ఉన్నది. పితృయానము అను ధూమాది మార్గముచేత భూమినుండి చంద్రలోక ప్రాప్తి పునరావృత్తికి కారణమగు చున్నది. అది ఎట్లనిన స్వర్గ లోక భోగహేతువైన కర్మ క్షయమైన తర్వాత పూర్వము చేయబడిన సుకృత-దుష్కృతానుసారముగా మరలా జన్మ కలుగుచున్నది. ఈ కర్మలవలన దేవయాన- పితృయానములలో ఎదో ఒక మార్గమును పొంది పాపకర్మలచే అధోగతి ఐన తిర్యక్‌జంతువులయొక్క యోనులయందు స్థావరములయందును, పుట్టుట-మరణించుట కలుగును. పుణ్యవంతుడైన వాడు మరణము తర్వాత పుణ్య ఫలము కొరకు దేవతలతో స్వర్గ లోకమునకు వెళ్ళి అచట కొంతకాలముండి అచటినుండి చంద్రలోకమునకురాగా ఆ స్వర్గ నివాస కర్మక్షయమైన తర్వాత అతను మిగిలిన పుణ్యంతో మేఘములనుండి వర్షముద్వారా భూమిమీదపడి మనుము భుజించే ఓషధులు-ఫలములు మొదలగువాటిలో చేరి క్రమముగా పురుషుని వీర్యములో చేరెదరు. ఆ తర్వాత ఆ పురుషుని ధర్మపత్ని శోణితములో కలిసి రేతస్సుగా

స్త్రీ యోనియందు ప్రవేశించి పదిమాసముల తర్వాత ఆమెకు పుత్రుడుగానో, పుత్రికగానో పుట్టుచున్నారు.

ఉపాసనలు ఉపనిషత్తులలో అనేకములు కలవు. సూక్ష్మపరిచయమునకై ఛాందోగ్యోపనిషత్తునందు ఉన్న కొన్ని ఉపాసనలు ఈ విధంగా కలవు. ప్రథమాధ్యాయమున ఉద్గీథ విద్యకు అంగముగా కొన్ని ఉపాసనలను చెప్పెను. మొదటి ఖండమున ప్రణవమునందు బ్రహ్మోపాసన. పర బ్రహ్మాభిధాయకమైన ఓంకారము అర్చాది మూర్తులయందు (శివ ప్రతిమ, సాలిగ్రామము) భగవంతుని ప్రతీకలవలె పరమాత్మోపాసనకు శ్రేష్టమైన ప్రతీకముగా గలదు. "పరోక్ష ప్రియా ఇవ హి దేవాః" అనే శ్రుతి వాక్యముచేత లోకమున "ప్రియ" అనే పేరు (శబ్దము) ఇష్టమైనదిగా, అనుగ్రహోపాదకమైనట్లు గలదు. ఐతే ఓంకారము ఆత్మ ప్రసాద హేతువు అనే అభిప్రాయంలో మనలాంటి మదాంధకారుల విషయమైన కర్మాంగోపాసన లోనిది. తర్వాత ఉపాసన ఉద్గీథావయవమైన ప్రణవమునకు ప్రాణ రూపోపాసన. ఇది కూడా ఒక విధమైన ఓంకార ప్రతీకోపాసన. ఉద్గాతృ క్రియాంగమైన ఉద్గీథాక్షర స్వరూప వాచ్యమైనది. అన్నిటికన్నా గొప్పదైన ఈ ఓంకార ప్రతీకోపాసనకు ఉద్గీథోపాసన అనే సంజ్ఞ కలిగినది. ఇదే అధ్యాయమున మూడవ ఉపాసన. ఉద్గీథావయవమైన ప్రణవమునకు ఆదిత్యోపాసన. దీనివలన చీకట్లు పోయి వెలుగులు పొందెదరు. 4. అమృతాభయ గుణక బ్రహ్మదృష్ట్యా ప్రణవోపాసన. దీనివలన కర్మ లేకుండగా కోరునది పొందుట. 5. ఆదిత్య రశ్మి దృష్టి ఉపాసన. ఋగ్వేదములో సాధారణ ఓంకారమునందు ఆదిత్య దృష్టిని పోగొట్టి అచటనే భేద విశిష్టాదిత్య ఉపాసనను విధించెను గనుక విశిష్టమైన ఫలము ఉండును. 6. అథ ఏషో అంతరాదిత్యః। ఈ ఉపాసనాఫలము సంపదలను ఇచ్చుట. ఇచట ఆదిత్యునిగా చెప్పబడే పురుషుడు పరమ పురుషుడైన శివుడే. "నమో హిరణ్య బాహవే, హిరణ్య వర్ణాయ, హిరణ్య రూపాయ, హిరణ్య పతయే, అంబికా పతయే, ఉమాపతయే నమో నమః" "నమో హిరణ్య బాహవే సేనాన్యే దిశాం చ పతయే నమః" ఇటువంటి అనేక శ్రుతి వాక్యములచేత శివుని రూప సామ్యమునకు సరిపోవును. కానీ కొందరు ఆదిత్యుని శ్రీమన్నారాయణాంశగా పురాణములలో వర్ణింతురు. మరి ఆదిత్యునిగా అనేకులకు పేర్కొనుచున్ననూ, కైలాసవాసియగు సాంబశివునికే పర్యాయపదమని శ్రుతులు చెప్పుచున్నవి. 7. ఉద్గీథావయవమైన బ్రహ్మకు సంపాదుపాసన. దీనివలన భూమియందు విశిష్ట జీవనము తనకు తన పుత్రులకు ఇహ పరలోకములయందు గూడా విశిష్ట జీవనము. 8. ఉద్గీథ భక్తితో ఆదిత్యుని ప్రతిహార భక్తితో ఉన్న దేవతను ఉపాసించుట. 9. శౌవ ఉద్గీథః అన్న లాభముచేత శునకములు అరచినట్లుగా ఉపాసకుడు మిక్కిలి ప్రార్థించెను. ద్వితీయాధ్యాయమున సామవిషయకములైన ఉపాసనలను చెప్పెను. 10. పంచవిధ సామోపాసన. పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశములను ఉపాసించుట. సప్త భక్తిషూపాసన. రోజును ఏడు విధములుగా విభజించి చేయు ఉపాసన. మూడవ అధ్యాయమున 11. మధువిద్య. సూర్యుడు దేవతలను సంతోష పెట్టుటకై మధువును పంచెను. తుమ్మెదలు పువ్వునుండి తేనెను తీసుకొని తెట్టెగా పెట్టును. నాలుగు వేదముల మంత్రములనెడి తుమ్మెదలు వివిధ రంగులతో ఆదిత్యమండలములోని దేవతలను మధువుతో తృప్తి పరిచెదరు. దీని ఫలము క్రమముక్తి. ఋక్ మంత్రములనే తుమ్మెదలు ఎర్రని తేనెల కాంతులతో ఆదిత్య మండలములోని వసువులను తృప్తి పరిచెదరు. యజుర్వేద మంత్రములనే తుమ్మెదలు హోమ సమయమందు విహితమైన క్రియలనే తెల్లని కాంతులు వెదజల్లే పుష్పములతో అగ్నిచే హుతమైన సోమాదులను అమృతమయంగాచేసి ఆదిత్య మండలమున ఉన్న రుద్రులను

తృప్తి పరిచెదరు. సామ వేదీయ మంత్రములనే తుమ్మెదలు హోమ సమయమందు విహిత క్రియలనే నల్లని పుష్పములతో రశ్మినాడులు అగ్నిచే హుతమైన సోమాదులతో ఆదిత్యులు తృప్తి పడెదరు. అధర్వ వేదీయములు, ఇతిహాస, పురాణ మంత్రములనే తుమ్మెదలు హోమసమయమందు విహిత క్రియలనే అతికృష్ణ పుష్పములతో ఆదిత్య మండలమున మరుత్తులు, సంతోషింతురు. ఉపాసన తుమ్మెదలు ప్రణవ పుష్పములతో జీవింతురు. 12. గాయత్రీ విద్యా. ఈ ఉపాసనా ప్రధాన ఫలం బ్రహ్మలోక ప్రాప్తి. 13. జ్యోతిరుపాసన. ఈ ఉపాసనవలన శరీరసౌందర్యము, కీర్తి ప్రధాన ఫలం. 14. శాండిల్య విద్యా. బ్రహ్మను మనస్సుగా హృదయమున భావించిన బ్రహ్మలోక ప్రాప్తి కలుగును. 15. భువనకోశవిజ్ఞానము. ఈ ఉపాసనము వలన ఫలం ఆదిత్య స్వరూప ప్రాప్తి. దృష్టి ఫలము శబ్దసిద్ధి. 16. సంసర్గ విద్యా. వాయువును ఆత్మగా భావించిన దృశ్యకాత్మనమైన సర్వ దర్శి అగును. 17. సత్యకామజాబాల విద్య. ఈ ఉపాసకుడు భూలోకమున అందరికి ఆశ్రయమివ్వగలడు. పరలోకమున అతనికి ఆయతన సిద్ధి కలుగును. 18. ఉపకోసల విద్య. జాబాల మహర్షి శిష్యుడైన ఉపకోసల వాసి ఐన కామలాయననకు అగ్నిచేత ఈవిద్య చెప్పబడెను. 19. గార్హపత్యోక్తావిద్యా. సర్వపాప నివృత్తి, దేవలోక ప్రాప్తి, దీర్ఘాయుష్యత్వం, భూలోకమున దేవలోకమున అగ్నిని కాపాడుట. 20. దక్షిణాగ్నివిద్యా. ఇదికూడా అగ్నివిద్యే. అగ్ని విద్యకు అనుష్ఠాన సిద్ధికి వచ్చే ఫలితము దీనికి కూడా వచ్చును. 21. ఆహవనీయ విద్య. దీనిలో అర్చిరాజి మార్గమును ఉపదేశించి ఆ తర్వాత ధ్యానము కొరకు ఉపాసనా మహిమచేత ఉపాసకుడు మరణానంతరము బ్రహ్మలోకమును చేరును. పంచమాధ్యాయమున. 22. ప్రాణవిద్యా. ముఖ్య ప్రాణము జ్యేష్ఠ, శ్రేష్ఠ, వశిష్ఠః ప్రతిష్ఠా సంపత్. ఆయతనమని గుణషట్కముచేత విశిష్టముగా ఉపాసింపవలెను. ఇదిగూడా ప్రాణ విద్యాంగమైనది. దీనికి ఫలము ప్రాణోపాసకుడు ఉపాసనామంత్ర సిద్ధి కలిగినచో లోకాంతరములకు వెళ్ల వచ్చును. 23. పంచాగ్ని విద్యా. పంచాగ్ని అనగా ఆకాశము, మేఘము, పృథివీ, పురుషుడు, స్త్రీలను అగ్నులతో కల్పించ బడుచున్నవి. వీని ఫలం. యజ్ఞముచేసిన యజమాని ఒ పుణ్యమును స్వర్గాదిలోకమున అనుభవించవలెను. ఆయుష్షు తీరినగాని ఆలోకమునకు వెళ్ళి ఆ పుణ్యఫలమును అనుభవించుట కుదరదు. అంతవరకు యజ్ఞము ఆచరించిన పుణ్య విశేషము ఏమగును? అనిన పూర్వ మీమాంసకులు దానికి "అపూర్వం" అని చెప్పిరి. యజమాని ఆ పుణ్యఫలం అనుభవించే వరకు అది అపూర్వ రూపంలో ఉండును. ఈ ఉపాసకుడు అపూర్వ (పుణ్యం) సహితుడై దేవతలతో స్వర్గలోకమునకు వెళ్ళి అచట కొంతకాలముండి, ఆ తర్వాత చంద్రలోకమున కొంతకాలముండి, స్వర్గలోకాది నివాస కర్మ క్షయమైన తర్వాత అతను ఆ అపూర్వంతో మేఘములనుండి వర్షముద్వారా భూమిమీదపడి, మనము నిత్యము భుజించే ఫలములు – కాయ కూరలు, ఆకు కూరలు, ఓషధులు మొదలగు వానిలో చేరి తద్వారా పురుష వీర్యమున (పురుషాగ్ని) చేరెదరు. ఆ పురుషుడు తనతో కలసి మెలసి ఉన్న సతియోనియందు రేతస్సుగా (యోషాగ్ని) ప్రవేశించి ఆమెనుండి పదిమాసముల తర్వాత ఆమెకు పుత్రుడుగానో, పుత్రికగానో పుట్టుచున్నారు. దీనికి కారణం, ఈ పంచాగ్ని విద్యయే. దీని ద్వారానే ఉపాసకుడు భూమియందు పుట్టి మరలా పుణ్యవశమున దేవాదిలోకమునకు వెళ్ళుచున్నాడు. కనుక అగ్నియే దీనికి ప్రధాన కారకుడు అని అగ్నిని ధ్యానించుచూ అర్చిరాది మార్గముచేత బ్రహ్మలోకమును చేరును. 24. వైశ్వానరవిద్యా. ఈ ఉపాసనవలన సర్వపాపములు దహించును. ఆరవ అధ్యాయమున నిర్గుణ పరబ్రహ్మ పరమైన విషయములు ఏడవ అధ్యాయమున నామ బ్రహ్మోతి

అనే ఉపాసనల ఫలములు. చివరలో భూమవిద్యను చెప్తూ, ఇది నిర్గుణ బ్రహ్మ విద్య అని నిరూపించెను. ఎనిమిదవ అధ్యాయమున 25. దహరోపాసన. దహరమనగా హృదయము. (దహ. భస్మీకరణే అనే ధాతువునకు అరః అనే కృత్య ప్రత్యయము రాగా దహరః అనే శబ్దము వచ్చును). దీనికి బాలకుడు, తమ్ముడు, వరుణుడు అనే అర్థములు కూడా కలవు. దహరాకాశము - పరమాత్మ ఈ ఇద్దరూ హృదయమనే పద్మములోపల ఉన్నారు. అట్లు వారిని తలచి ఉపాసింపవలెను. ఈ ఉపాసనగూర్చి అనేక వాక్యములలో ఛాందోగ్య ఉపనిషత్తుయందు, బృహదారణ్యక ఉపనిషత్తుయందు, తైత్తిరీయ ఉపనిషత్తుయందు, కైవల్యోపనిషత్తునందునూ ఉన్నవి. ఈ ఉపాసనాచర్చలో ఈశాన శబ్దము విష్ణు పరమా లేక శివ పరమా అని చర్చించి శివ పరముగానే సిద్ధాంతము చేసిరి. ఇంకా అనేక ఉపాసనలు అనేక ఉపనిషత్తులయందు కలవు. విస్తర భయముచేత అవి అన్నియు వివరించుటలేదు. ఉపాసనలు - వాటి ఫలితములు గూర్చి సూక్ష్మ పరిచయముచేయుట సంభవించినది.

ముక్తుల గూర్చి చెప్తూ సాలోక్యము, సామీప్యము, సార్ష్టితా సారూప్యము, సాయుజ్యము, సమానలోకత్వం అని ఐదు విధములు కలవు. సామాన్యముగా ముక్తులు నాలుగు రకములుగా పెద్దలు చెప్పిరి. ఇచట సమాన లోకత్వముక్తి ప్రత్యేకముగా చెప్పబడెను. కర్మలచేత విద్యావంతులకు దేవలోకమును చేరుట ఇచట విద్య అనగా ఉపనిషద్విద్య వేదాంతవిద్య అని మాత్రమే అర్థము. ఎవరైతే ఈ ఉపనిషద్విద్యను ఉపాసించిరో ఆ విద్యాంసులు (ఉత్ + గమనం) ఉదగమనమున స్వర్గలోకమున కలిసి పోవుచున్నారు అని వేదము చెప్పుచున్నది. కేవలము కర్మలను మాత్రమే అనుష్ఠానము చేయువార్కి పితృలోకావాప్తి కలుగును. ఎవరైతే దక్షిణాయన కాలములో మరణింతురో వారికి ఉత్తమ గతులు లభించవని శ్రుతి వాక్యము. అత్యంత నియమ నిష్ఠలతో మహాలింగము మొదలగు శివదీక్షా తత్పరులు సదాశివునే ప్రతీక (గుర్తు, ధ్యానమునకు ఆలంబనము, ఆధారము)ను ఉపాసించే వార్కి సాలోక్యము ముక్తి కలదు అంటే కైలాసవాస నివాసము లభించును. ఆ ప్రతీకోపాసనలోనే అతిగొప్పదైన ప్రణవ ప్రతీకోపాసనను సన్యాసులు ఆచరించిన వారికి కైలాస వాసి ఐన సదాశివునికి సమీపమున ఉండేముక్తి లభించును. ప్రతీకోపాసనలలో ప్రణవ ప్రతీకము తీవ్ర ఫల ప్రాప్తిని చేకూర్చును. ప్రణవమనగా ఓంకారము. ప్రతీకముకాక తనకన్నా వేరైన అనేకరకములైన ఐశ్వర్యములను విశిష్టముగా సమకూర్చే విభూతి ప్రదాత ఐన సదాశివోపాసనవలన ఉపాసకుడు ఏదేవతను ఉపాసించు చున్నాడో సార్ష్టి (సమానమైన శక్తి కలది) + తల్ ప్రత్యయము సమూహార్థకమున తద్ధిత ప్రత్యయముచేసి టాప్ ప్రత్యయము వలన సార్ష్టితా లేక సార్ష్టిత (ఉదాహరణ జనతా-జనత). ఆ ఉపాస్యదేవతకుగల మహిమలు ఉపాసకునికి లభించుట. దేవతకు ఉపాసకునికి శక్తి సామ్య రూపమైన సారూప్యముక్తి లభించును. జగత్తుకు సృష్టిస్థితి లయలకు కారణ భూతుడు అగు సాంబ మూర్తిని. అహంగ్రహోపాసనద్వారా ఉపాసించి తద్ద్వారా ఆయనలో కలిసి పొయ్యే తాదాత్మ్యరూపమైన సాయుజ్యముక్తిని పొందెదరు. ఇటువంటి ఉపాసనలవలననే ఉపాసకులు దేవతల సాయుజ్య, సార్ష్టితా, సమాన లోక వాసమును పొందెదరు అని శ్రుతి సప్రమాణముగా చెప్పుచున్నది. ఇవి కర్మ ఫలముల వలన వచ్చిన ముక్తులు. కానీ వీటివలన ఆవృత్తి రహితమైన ముక్తి లభించదు. ఆత్మజ్ఞానమువలనే సరైన ముక్తి లభించును, బ్రహ్మాత్మైకత్వజ్ఞానమువల్లనే కైవల్య రూపముక్తి లభించును. దీనికి ప్రమాణం ''బ్రహ్మ విదాప్నోతి పరం''. (తైత్తిరీయోపనిషత్తు 2-1-1.)

బ్రహ్మాత్మైకత్వజ్ఞానాదేవకైవల్యం భవతీతి ''బ్రహ్మ విదాప్నోతి పరం'' ఇతి ప్రమాణం. అత్ర శివస్థానమృతానాం అధికారవిచారానర్హాణాం చిత్త శుద్ధ్యను సారేణ పంచధాసు ముక్తిషు అధికారోఽస్తి.

తదుప పత్తిః అగ్రే మణికర్ణ మంత్రే వక్ష్యతే. అత్ర శ్రీమద్దక్షిణ కైలాసే లూతాగజ భుజంగాదయః విశిష్ట పూర్వకర్మభిః లబ్ధేశ్వరానుగ్రహా జాతిస్మరాశ్చ నియమేన దేవముపాస్య శివపద ఏవాసూన్ త్యక్త్వా శ్రీజ్ఞానసంబంధ శ్రీకంఠవిద్యేశాది వత్ సాంబమూర్తిం సాక్షాత్కృత్య తత్తాదాత్మ్య రూపాం సాయుజ్య ముక్తిం గతాః ఇత్యత్ర కానుపపత్తిః।

ఉపాసనల తారతమ్యములచే ముక్తి తారతమ్యములు పూర్వము చెప్పితిమి. ఉపాసలు లేక కేవలం కర్మల వచ్చే పుణ్య విశేషమును గూడా విచారించితిమి. కానీ ఏరకములైన పుణ్య కర్మలు లేక శివ సాన్నిధ్యమున మరణించిన వార్కి ఏరకమైన ముక్తి లభించును అని విచారించినచో పైన చెప్పిన పంచవిధ ముక్తులు వార్కి లభించు. అసలు శివసాన్నిధ్యములో మరణించిన వారు ఏముక్తికి తగని వారా అని చెప్పగా ఆ వివరణ గూర్చి ముందు వచ్చే మణికర్ణ మంత్ర వివరణలో విచారింపబడును. ఐతే ప్రసిద్ధ శివక్షేత్రములలో శివారాధన చేసికొందరు. శివతత్త్వమును సమాజముగా తలచి సమాజ సేవచేసి శివసాయుజ్యమును పొందిన వార్లలో నాయనార్లు ప్రముఖులు. అందులో చాలామంది చోళ దేశమునకు సంబంధించినవార్లు కాగా పాండ్య దేశము, వర్ష దేశము, చేది దేశము, కొంకణ దేశము, మలెనాడు, తురుమునైప్పాడి మొదలగు దేశములకు సంబంధించిన నాయనార్లు కలరు. వీరిలో కొందరు జన్మాంతర సంస్కారముద్వారా శివతత్త్వము సంపాందించి శివసాయుజ్యమును పొందిరి. మరి కొందరికి ఏ సంస్కారములు లేకనే శివానుగ్రహంతో శివ సాయుజ్యమును పొందిరి. అటువంటి పుణ్యాత్ముల నామస్మరణం ప్రస్తుతం అప్రస్తుతమైనను, శివతత్త్వము తెలుసుకునే ముందు శివభక్తుల గూర్చి తెలుసుకొనుట ఏమంత అప్రస్తుతం కాదని అనుకొని నాయనార్లలోని ప్రముఖులను కొందరిని స్మరింతము. 1. సుందరమూర్తి నాయనారు. ఇతనికి నంబియూరూరివారు అనే నామాంతరముకలదు. ఇతని తల్లి ఇశైజ్ఞానమ్మ తండ్రి శడయనయనార్. ఇతను ఆదిశైవుడు. తిరునావలూరు గ్రామమున జన్మించెను. 2. నేత్రేశనాయనారు. ఇతనిని కన్నప్ప లేక తిన్నడు అనెడివారు. ఇతను పొత్తపినాడు ఉడుమూరులో జన్మించెను. ఇతను బోయ జాతికి చెందినవాడు. ఇతని తల్లిపేరు దత్త. ఇతని తండ్రిపేరు నాగడు. 3. అమర్నీతినాయనారు. ఇతని చోళ దేశములోని తిరునల్లూరు గ్రామవాసి. వైశ్యకులజుడు. 4. చండీశ్వరనాయానారు. ఇతను బ్రాహ్మణుడు. కశ్యప గోత్రజుడు. చోళదేశీయుడు. తల్లి పేరు పవిత్ర. తండ్రిపేరు యజ్ఞశర్మ. 5. నీలకంఠ నాయనారు. ఇతను చిదంబర క్షేత్రవాసి. కుమ్మరి జాతీయుడు.

మోక్షము ఉపనిషత్తులలో చెప్పిన ఉపాసలన ద్వారానే కాకుండా అఖండమై అచంచలమైన శివ భక్తితో శివసాయుజ్యమును పొందుట శ్రీజ్ఞానసంబంధమూర్తి శ్రీకంఠవిద్య వలన ఈశ్వరానుగ్రహం పొంది, సాంబమూర్తిని సాక్షాత్కరించి ఆ స్వామిలో తాదాత్మ్య సంబంధమైన సాయుజ్యముక్తిని పొందిరి అనుటలో సందేహము-సంశయము ఎందుకు అని ప్రశ్నించినచో శివ తాదాత్మ్యమే సాయుజ్యముక్తి అనినచో ఒక వృక్షమునందు మరివేరొక వృక్షాంకురము మొలిచినట్లుగా శ్రీకాళహస్తిలోని మహాలింగమైన శివలింగమందు ఏనుగు దంతములు కనిపించుటయందు ఆ ఏనుగుకు సాయుజ్యముక్తి వచ్చినదా అని ప్రశ్నించిన దీనికి ప్రాచీనాచార్యులు సమాధానముగా ఇట్లు చెప్పిరి. శివలింగమున గజదంతములు తాదాత్మ్యమున ఉన్నవి.

అయినంత మాత్రమున ఆ తాదాత్మ్యము విశిష్టమైనదా లేక సంపూర్ణమైనదా అనే విచారము కలుగ వచ్చును కదా. విచారమునకు అభిప్రాయములు వారి వారి భావములు ఏర్పాటు అయ్యేవి కానీ అవి సిద్ధాంతములు కావు.

సదాశివుడు భక్తవశంకరుడు, భక్తులందరూ వారి వారి భక్తితో ఆ స్వామిని ఏది కోరినను దానిని ఇచ్చును. అదే అనంత భక్తితో కొలిచిన వారిని ఆ సదాశివుడే భక్తుల ప్రేమకు లోబడి రక్షించెదనని భావమా? భగవద్గీతలో "అనన్యాశ్చింతయంతో మాం... యోగక్షేమం వహామ్యహం" అన్నట్లు మర్కటకిశోర న్యాయము, కిశోర న్యాయము. కోతి మర్కటమనగా కోతి అనియు, కోతిపిల్లలే కోరిక గట్టిగా పట్టుకొనవలెయును. ఒక కొమ్మ మీదనుండి మరో ఒక కొమ్మమీదికి దూకునప్పుడు పిల్లల విషయం కోరిక లేదని గట్టిగా పట్టుకునే బాధ్యత పిల్లలదే. అట్లాగే ఏనుగు మొదలగునవి పరమశివుని గట్టిగా పట్టుకుని వేడాలనా? అంటే అయితేకాదు అని అర్థము. అదే శరీర త్రయ నాశమైన పిదప అందే శరీర త్రయనాశమంటే చెప్పిన ఉపాధి భేదముచేత మూడు విధములు. అవి విశ్వ, తైజస, ప్రాజ్ఞ భేదములు. విశ్వుడనగా "అవిద్యాంతఃకరణ స్థూల శరీరావచ్ఛిన్నుడై జాగ్రదవస్థాభిమానుడైన వాడు". తైజసుడనగా అవిద్యాంతఃకరణస్థూల శరీరాభిమాన రహితుడునగా ఉపాధిద్వయముచేత ఉప హితుడునగా స్వప్నాభిమాని యగువాడు. ప్రాజ్ఞుడు అనగా శరీరాంతఃకరణోపాధి ద్వయ రహితుడు, అంతఃకరణ సంస్కారావచ్ఛిన్నావిద్యా మాత్రోపహితుడు, సుషుప్త్యభిమాని అని శరీర త్రయమని భావము. ఆ శరీర త్రయ నాశముచేత పరమశివుని తాదాత్మ్యమును పొందిన వారలకు మాత్రమే ఆముక్తి సమయమందు సదాశివుని ఏమి కోరితే అది ఇచ్చు వాడుగనుక భక్తులు కొందరు నాగుర్తును, నాపేరును, నా చర్మమును నీవు ధరించవలెను అని. అది లోక హితమునుకోరి ధరించవలెను. ఇచట లోక హితమనగా లోకమునకు మంచిని చేకూర్చి మనుష్యులను పరస్పరహితమును కోరునట్లుగాను, సదాశివుడు భక్త వశంకరుడు గనుక అనంతల భక్తితో ఆ స్వామిని ఏది కోరితే అది ఇచ్చే హితకారిగా అందరికి తెలియుటకై (శివుని తత్త్వము తెలియని వారికై) ఆ స్వామిని ప్రార్థింపగా ఆ సదాశివుడు ఆ భక్తులను అనుగ్రహించి ఆ భక్తుడు కోరిన విహ్నమును తన నిరాకారమైన లింగమున ధరించెను. సర్పము, ఏనుగు, సాలెపురుగు, ఆ స్వామిలో ఐక్యము కోరిరి. అందువలన వారు స్వామిలో ఐక్యము చెందిరి. అందువలన ఆ స్వామి అనుగ్రహంవలన సంసార బాధలలోపాటు ముక్తిని పొందగలరని ఈః కాళేభాజం జవధ్వంసీ నామమునకు తాత్పర్యము.

## సితాభ్ర సలిలాప్లుత: 16

సితం అభ్రసలిలం ఆకాశే విద్యమానం స్వచ్ఛం ఆకాశగంగాజలం తేనాప్లుతః సంస్నాతః ఆప్లవతి వపుః వంలం అనేన ఇత్యాప్లవః తేన యుక్తః ఆప్లుతః ఇతి వృత్తౌ గతా.

సితమనగా తెల్లనైనది, స్వచ్ఛమైనది అని అర్థము. అభ్రసలిలం = అభ్రమనగా ఆకాశము. అందుండునీరు. ఆకాశమున ఉండే నీరు స్వచ్ఛమైన నీరు. గంగాదేవి మొదట స్వర్గలోకమున ఉన్నది. భగీరథుండు తన పితరులను తరింపచేయుటకై ఆగంగాదేవిని ప్రార్థింపగా ఆమె స్వర్గమునుండి భూమిమీదకు అతర్వాత పాతాళమునకు వెళ్ళి సగర పుత్రులను అనుగ్రహించినది. భగీరథుని ప్రార్థనతో భూమి మీదకు వచ్చినది గనుక ఆమెకు భాగీరథి అని జాహ్నవీ అని

అనేక నామాంతరములు కలవు. గంగావతరణ వృత్తాంతము వాల్మీకి రామాయణమునందు నానావిధ పురాణములందు కలదు. ఆ ఆకాశగంగా జలములో మునిగి, స్నానము చేసినచో శారీరకమలినములను పోగొట్టుకొని పరిశుద్ధుడైన వాడని అర్థము. ఆప్లుతః అనే శబ్దము ప్లుఙ గతౌ అనే ధాతువునుండి పుట్టినది.

భక్తిర్నామ మధాస్తి లోకవిదితా స్వాభావికాందదా,
శంభోః ప్రీతికరీ జగద్ధితకరీ లోకోత్తరా శాంతిదా।
పీత్వా సౌఖ్యమయీమిమాం బుధ జనాః సంపాదయధ్వం నిజం
మోక్షం లోకసుఖం యశశ్చ విమలం లోకే సుఖేనా చిరాత్॥
అశేష జన్మార్జిత పాపహారిణే సమస్త శాస్త్రోదిత సారధారిణీ
నౌకేవ సంసార సముద్ర తారిణీ భక్తిర్భవేత్ భూజన భద్రకారిణీ
సంసారరోగేణ చిరం సుతప్తాః కుతోఽపి శాంతిం న పరాం ప్రసన్నాః।
శ్రుత్యబ్ధి నిర్మంథన లబ్దసారం సంతః సదా భక్తి రసం పిబంతు.
(భక్తిరస విమర్శ)

కలియుగమున యజ్ఞయాగాదులు, ఉపాసనాది వ్రతములు చేయుటకు దేశకాలస్థలములు అనుకూలించనందున మోక్షేచ్ఛగల వారికి ఏది ఉపాయము అని ప్రశ్నించినచో భక్తి ఒక్కటే ప్రస్తుత కాల తరుణోపాయము. కాలడినుండి కాశ్మీరంవరకు కాలినడకన పర్యటించి అద్వైత ప్రతిష్ఠాపన చేసిన ఆదిశంకరులు మందాధికారులకై షణ్మత స్థాపనచేసి భక్తిద్వారా కర్మ పరిపక్వతను సంపాదించి తద్వారా ఆత్మ జ్ఞానమును పొందవచ్చునని చిన్న ఉపాయమును అనుగ్రహించిరి. ఆ తర్వాతి అద్వైత ఆచార్యులుగూడా అద్వైత సిద్ధిలాంటి ఉద్గ్రంథములను వ్రాసినను భక్తిని గూడా తమసాధనగా మలచుకొనిరి. భగవంతుని నామ మహిమ సృష్టిలో సాధించలేనిది ఏమీ లేదని భక్తుల దివ్యగాథల ద్వారా తెలుసుకున్నాము. శివుడుగాని, విష్ణువుగాని, శక్తిగాని లక్ష్మిగాని, గణపతిగాని సుబ్రహ్మణ్యంని, సూర్యుడుగాని మరేదేవత ఐనను ప్రతీకకోసం ఆయావిగ్రహములను కొలుచుట మన సనాతన సంప్రదాయం. ఇతరదేవతల ద్వేషభావన విజ్ఞులకు అసలే ఉండదు. ఇది మన ప్రాచీన మహర్షులు మనకు ప్రసాదించిన ఐక్యతారూప భావస్వామ్యం. అందరూ ఆపరబ్రహ్మకు ప్రతిరూపాలే. అందరూ మనలను ఉద్ధరించుటకై భూమిపై అవతరించిన వారిని తామస దృష్టిలో ద్వేషించుట అపచారం కదా! కనుగ సంసార సాగరమును దాటుటకై ఎవరికి తోచిన రీతిలో ఆయాదేవతలను ధ్యానించి ముక్తి పొందుటకు అందరూ అర్హులే. ఇది భగవన్నామ సంకీర్తనమహిమను ఆస్వాదించినగాని దాని రుచి తెలియదు.

గంగావతరణ విషయమున అనేకులు అనేకవిధములుగా చెప్పిఉన్నారు. ''విష్ణు పాదోద్భవా గంగా'' అని ''శివ జటాజూట విస్రష్టా గంగా'' అని మరికొందరు చెప్పినారు. ఈ రెండింటికి పురాణగాథలు కలవు. ''గంగాయాం ఘోషః'' అనే పదమునకు శాస్త్రజ్ఞులు గంగలో గొల్లపల్లె అని ఆపదమునకు అర్థము చెప్పిరి. దీనిని వాచ్యార్థమని అభిధ అని వారు అందురు. కానీ గంగా ప్రవాహమున గొల్లపల్లె ఉండునా? ఉండలేదు గనుక పైన చెప్పిన అర్థము ఇచట కుదరదు. కనుక వేరే అర్థము చెప్ప వలయును. అది గంగ ఒడ్డున గొల్లపల్లె అని చెప్పినచో సామాన్యముగా నది ఒడ్డున చెట్టుచేమ మొదలైనవి ఉండును. వాటితో పాటే ఈ గొల్లపల్లెకూడా ఉందని చెప్పిన దానియందు విశేషములే ఇచట లక్షణార్థము కూడా కుదరదు కనుక వ్యంగ్యార్థముద్వారా ''గంగాయాం ఘోషః'' అన్నపుడు గంగానది ప్రక్కన ఉన్న గొల్లపల్లెకు చల్లని గాలులతో

పవిత్రతతో గొప్పతనము వచ్చెను. కనుక ప్రక్షాళతము గంగా విష్ణు పాదోద్భవియా? లేక శివజటాజూట విస్రష్టయా అనే చర్య ఎంతవరకు సమంజసము. ఈ రెండు లేకున్నను ఆగంగకు ఉన్న పవిత్రత తగ్గదు కదా! పాపహారిణీ తాపహారిణీ అనే యశస్సు ఆమెకు తగ్గవు కదా!

అత్ర సితా ఛత్స విశిష్ట సలిల శబ్దస్తు త్రివిక్రమ చరణ ఘట్టిత బ్రహ్మాండభిత్తి వివర నిస్సృత విష్ణుపదీ గంగాత్స వ్యాఖ్యాత్యర్థకః సను అథాపి యత్పాదనఖావసృష్టం జగద్విరించోపసృతార్హణాంభః । సేశం పునాత్యన్యతమో ముకుందాత్కోనామ లోకే భగవత్పదార్థ ఇతి ॥ యచ్ఛౌచనిస్సృతసరిత్ప్రవరోదకేన తీర్థేన మూర్ధ్ని విధృతేన శివశ్శివో భూదితి ।

ఇచట స్వచ్ఛమైన ఆకాశ గంగయొక్క విశిష్టమైన ప్రత్యేకతను సంతరించుకున్న సలిల శబ్దము విష్ణుపాదోద్భవిగా ప్రసిద్ధిగాంచినది. అది ఎట్లనిన త్రివిక్రముని యొక్క పాదములచే గట్టిగా చేయబడిన గోడయొక్క రంధ్రమునుండి కారబడిన గంగ విష్ణు పాదోద్భవి అనే పేరుతో వరిఐనది. శ్రీమహావిష్ణువు దేవతల ప్రార్థనను మన్నించి వామనుడిగా అవతరించి బలిచక్రవర్తి యజ్ఞశాలకు వచ్చి యజ్ఞ దక్షిణగా మూడు అడుగులు భూమిని దానమడిగెను. బలిచక్రవర్తి ఇచ్చిన దానమును పురస్కరించుకొని ఆకాశము వరకు వ్యాపించి ఒకపాదము భూమిమీద రెండవ పాదము కలదు. ఆకాశమునకు చాచగా ఆపాదాఘాతమునకు అచట చిల్లపడి ఆ ఆకాశమునుండి విష్ణుపాదములమీదగా భువికి గంగ చేరినది. ఆకాశమునకు వ్యాపించిన విష్ణుపాదమును చుట్టి భువికి చేరినది. ఇచట ఒక సందేహము. ఏ శ్రీమహావిష్ణువుయొక్క పాదములగోళ్ళనుండి జారినది గంగ. ఐన జగత్తును సృష్టి చేసే బ్రహ్మచేత పూజ్యభావనగా, అర్చించే తాత్పర్యంతో తాకి ఆయన గౌరవించిన ఆ గంగాజలము శివుణ్ణే పవిత్రము చేయజాలదు. ఈ ఇతిహాసముద్వారా శ్రీమహావిష్ణువు మినహా మరి ఒకరిని ఈములోకమున భగవంతుడుగా అంగీకరించలేము. ఏ గంగానది శుచిగా, నైర్మల్యముగా ఆకాశమునుండి జారి మిక్కిలి శ్రేష్టమైన నీటిచేత పావనమైన జలముగా తీర్థముగా విశేషముగా ధరించి స్వీకరించుటచేత శివుడు శివుడుగా మంగళ ప్రదుడుగా ఐనాడు. విష్ణుపాదోద్భవి ఐన గంగను శివుడు ధరించుటచేత ఆ శివుడు పవిత్రుడు ఐనాడు అని భాగవతులు ఐన వైష్ణవులు చెప్పిన వచనముల ఆధారముగా విష్ణు పాదోద్భవి ఐన గంగను శివుడు ధరించెను అనే విషయము కొన్ని పురాణములలో కుదరదు. అది కవి ఐన వాల్మీకి మహర్షి ప్రణీతమైన రామాయణమున, వ్యాసమహర్షి ప్రణీతమైన వామన పురాణముల విరోధము వచ్చును. ఐనను భాగవతమున విష్ణు పదోద్భవి ఐన గంగ క్రమమున సముద్రమున చేరును అని ఉన్నందున విష్ణు పదోద్భవి ఐన గంగను శివుడు ధరించెను అనే వాక్యమునకు విరోధము వాటిల్లదు.

ఒక శ్రుతిలో నీవు దేవతలయందు బ్రాహ్మణుడవైతివి అని విష్ణువునకు, అధిపత్యమును ఇంద్రునకు భాగముకలిగిన వాడున్నూ క్షత్రియులను సృష్టిచేయువాడని ఇంకా ఇటువంటి వేదవాక్యములచేత శివునకు విష్ణువునకు ద్విజ బాహుజత్వములు సిద్ధించగా శ్రీమహావిష్ణువుయొక్క పాదోదక ధారణము శివుడు చేసెను అనే వాక్యము న్యాయ విరుద్ధముగా ఉన్నందున శ్రీమహావిష్ణువు పదసన్నిధిలో ఉన్నగంగను భగీరథుడు పాతాళమునకు తెచ్చుటకై ప్రార్థించెను అనే మాటకూడా చాలా అందలి హీనము చరిత్రకథా భంగము వాటిల్లును. అదియునుగాక సదా శివుడు ధరించిన గంగ విష్ణు పదోద్భవికాదు. ఆమె హిమవంతుని పుత్రిక. హిమవంతుని పుత్రిక ఐన గంగను మాత్రమే సదాశివుడు తన జటాజూటమున ధరించెను. వాల్మీకి మహర్షి రచించిన శ్రీమద్రామాయణమున బాలకాండ 35 వ సర్గలో

11 వ శ్లోకమునుండి 24వ శ్లోకమువరకు గంగ హిమవంతుని పుత్రికగాను 36 వ సర్గలో శ్రీరామచంద్రుడు విశ్వామిత్రుని ఇట్లు అడిగెను. మూడు మార్గములలో వెళ్ళిన గంగను గూర్చి వినగోరుచున్నాను అని అడుగగా అంతట విశ్వామిత్రుడు సమాధానము చెప్పెను. హిమవంతుడు పర్వతరాజు ఒకడు కలడు. అతను గైరికాది ధాతువులకు ఓషధులకు గొప్పనిధి. అతనికి భూలోకమున సౌందర్యముచే సాటిలేని కుమార్తెలు ఇద్దరు కలరు. ఈ ఇద్దరి పిల్లలకు తల్లి పేరు మనోరమ. ఈమె మేరు పర్వత రాజ పుత్రిక. హిమవంతుని భార్య ఈ మనోరమ. హిమవంతుని పెద్దకూతురు గంగ. రెండవ కూతురు ఉమ. దేవతల దేవకార్యము చక్కబెట్టుటకై మూడు మార్గములలో ప్రవహించు గంగానదిని ఇమ్మని పర్వతరాజైన హిమవంతుని దేవతలు కోరిరి. అంతట హిమవంతుడు దేవతల ప్రార్థనను త్రోసిపుచ్చలేక తనమనోధర్మముచే స్వేచ్ఛా మార్గమును కలిగి లోకములను పవిత్రము చేయుటకై తనకుమార్తెను దేవతల వెంటపంపెను. కనుక గంగ హిమవంతుని పుత్రిక అని రామాయణమున వివరింప బడెను.

దధారా వావహితో గంగాం పదపూతజలాం హరేరితిచ । భాగవతవచనైః విష్ణుపదోద్భవామేవ గంగాం భవో దధారేతిచేన్న శ్రీమద్రామాయణ వామనపురాణాది విరోధాత్, న్యాయవిరోధాత్, అనుపపత్తేశ్చ । యదా విష్ణుపదీ జాతా తదేవ సముద్రగతేతి । భాగవతే ప్రతిపాదనాత్ ।

శ్రు । త్వం దేవేషు బ్రాహ్మణోఽ సీతి ఇంద్రస్య భాగోఽసి విష్ణోరాధిపత్యం క్షత్రగ్స్పృతమితిచ శ్రుతిభ్యాం హరమాధవయోర్ద్విజ బాహుజత్వే చ సిద్ధే హరిపాదోదక ధారణం హరకృతమిత్యుక్తేర్న్యాయ విరుద్ధత్వాత్ విష్ణుపదీప్రవర్తనస్య భగీరథగంగాభ్యర్థనస్య చ చిరకాలవిప్రకర్షాదనుపపత్తేశ్చ అన్యాం ''హిమవత్కన్యామేవ గంగాం భవో దధార చ శ్రీమద్రామాయణే బాలకాండే శ్రీరామః భగవన్ శ్రోతుమిచ్ఛామి గంగాం త్రిపథగాం'' నదీమితి ప్రశ్నస్య విశ్వామిత్రేణోచ్యతే ।

**శైలేంద్రో హిమవాన్నామ ధాతూనామాకరో మహాన్ ।**
**తస్య కన్యాద్వయం రామ రూపేణాప్రతిమం భువి ॥ (రా.1 35 14)**
**శ్వేతాంగీ పద్మ పత్రాక్షీ నీలకుంచిత మూర్ధజా ।**
**శ్వేతమాల్యాంబరధరా కుటిలా చ పరేత్యుమా ॥**
**ఇత్యాదినవభిస్సర్గైః ప్రపంచ్యతే ।**

హిమవంతుని కుమార్తెలైన ఉమ గంగలలో ఇద్దరు చాలా అందగత్తెలు. తెల్లనైన శరీరము గలిగినది పద్మములరేకులవంటి కన్నులు కలిగినది, నీలిరంగులో వంకరలుగల కేశములు కలిగినది. తెల్లని పూలు తెల్లని వస్త్రములు ధరించినదియు వంపులు కలిగినదియు చంచలమైన కన్నులు గలిగినదే ఉమా. కనుక ఉమాదేవి అక్కగారైన గంగాదేవి భూమిమీదికి అవతరించేది విషయమును తొమ్మిది సర్గలతో రామాయణము బాలకాండలో వర్ణింపబడినది.

తత్రహి । దేవైరభ్యర్థమానేన హిమవతా దత్తాం బ్రహ్మసన్నిధిం సురైర్నీతాం కిమియం గుహం జనయిష్యతీతి సురపృష్టోధిరియమసమర్థా వవికీముచ్యరామితి తద్వచనేన కుపితాం గంగా త్వం ప్రాప్య విధిం ప్రవాహైర్భర్త్స్యంతీం వేదచతుష్టయపాశేన విధి నిబద్ధాం కుటిలా నామ్నీం హిమవత్సుతామేవ భవో దధారేతి వామనపురాణరామాయణ వచనాని సంతి పునశ్చ రామాయణే దేవాన్ప్రతి విధిః ।

**ఇయమాకాశగాగంగా యస్యాం పుత్రం హుతాశనః ।**
**జనయిష్యతి దేవానాం సేనాపతిమరిందమమితి ॥ (రామాయణం 1-37-7)**

ఇది ఇట్లుండగా దేవతలచే దేవకార్యార్థమై హిమవంతుని ప్రార్థింపగా అతని పెద్దకుమార్తెను ఆదేవతలకు అప్పగింపగా ఆమెను ఆదేవతలు బ్రహ్మదేవుని సన్నిధికి తీసుకొని వెళ్ళి ఈమెను తారకాసురుడను రాక్షసుని చంపగల కుమారస్వామిని ఇవ్వగలదా? అని దేవతలు అడుగగా అంతట బ్రహ్మదేవుడు. ఈమె తారకుని చంపగల పుత్రుని ఇవ్వలేదు. కావున ఈమెను వదలగలరు అని చెప్పగా అంతట ఆమె ఎంతయును కోపగించినదై గంగగా మారి బ్రహ్మదేవుని బెదిరించినది. నాలుగు వేదములచే పొందబడుచేత బంధింపబడినదై కుటిలా అనే పేరుగల హిమవంతునిపైనే సదాశివుడు ధరించెను అని వాల్మీకి పురాణమును రామాయణమునందునా కొన్ని మాటలు గలవు. ఆ రామాయణమునందే దేవతలతో బ్రహ్మదేవుడు ఆకాశమున తిరిగే ఈ గంగయందు అగ్నిహోత్రుడు శత్రువులను సంహరించే దేవసేనాపతియగు కుమారస్వామిని ఈశ్వరానుగ్రహింపక ఇవ్వగలడు.

**స్వమందిరవికటస్థాకాశగంగాం ప్రత్యువాచ । పునర్భగీరథతపః ప్రసన్నః విధివచనం ।**
**ఇయం హైమవతీ గంగా జ్యేష్ఠా హిమవతస్సుతేతి ।   రామాయణం 1-42-32**
**యదా హైమవతీ జాతా శివేన శిరసా ధృతేతి ।**
**శిరసా ధారయిష్యామి శైలరాజసుతామహమితి చ ।   రామాయణం 1-43-3**

తన మందిరమున తనచెంతని ఉన్న గంగను గూర్చి బ్రహ్మదేవుడు మరలా ఈ విధముగా చెప్పెను. భగీరథుని తపస్సు గూర్చి, తను అతనియందు ప్రసన్నుడనైనట్లు చెప్పి దేవతలతో ఈమె హిమతుషారములకు సన్నిహితమై (ఎప్పుడు అచటనే ఉంటూ) ఉంటూ హిమవంతుని పెద్దకూతురై. ఈమె భువికి వచ్చుటకు ఈమెను ధరించుటకు సదాశివుడు భక్తులను అనుగ్రహించుటకై అంగీకరించెను. ఆమెను ధరించుటకు సదాశివుడు మినహా మరి ఒకరులేరు. అంతట భగీరథుడు సదాశివుని ప్రార్థింపగా అంతట ఆసదాశివుడు భగీరథునితో ఓరాజ శ్రేష్ఠా! నీ ప్రార్థనకునేను ప్రీతినొందితిని. లోకకళ్యాణము కొరకు నీకు ప్రియమాచరించెదను. హిమవంతుని పెద్దకూతురైన గంగను నాతలపై ధరించెదను అని అతనిని అనుగ్రహించి గంగాధరుడైనాడు.

తత్ర తత్రో మా ''జ్యేష్ఠాం గిరిజాం కుటిలామేవానువదతి'' వచన జాతం భాగవత విష్ణుపురాణాది వచనానాం కా గతిరిత్యత్ర శ్రోతృభక్తి సిద్ధ్యర్థం గంగాత్వసామ్యాత్ విష్ణుపదీం భవో దధారేత్యుక్తమిత్యన్వేయమిత్యర్థః । అతస్సితాభ్రమలిశైః బ్రహ్మలోకస్థితాకాశగంగాజలైరాప్లుతః యద్వా సువర్ణముఖర్యాస్సితాభ్రసలిలత్వాత్ ।

**సువర్ణమివ లోకానాం భాగధేయా వియున్నదీ ।**
**అగస్త్యేన భువిన్నీతా ముఖరీకృతదిఙ్మఖేతి ॥**

మూలపురాణనిర్వచనాద్వియద్గంగాత్వసిద్ధేః తేన స్వచ్ఛేన సువర్ణముఖరీజలేన నిత్యాభిషేకాది పూజాను ఆప్లుతః సంస్నాతః ఇత్యర్థః

హిమవంతుని కూతురైన ఉమాదేవిని పెద్దదై గిరిజయై వంపుసొంపులు కలదైన గంగతో ఇట్లు అన్నది అనేమాటలు భాగవతం, విష్ణు పురాణం మదలగు వాటి వచనములకు ప్రమాణము ఏమి? అన్నచో గంగావతరణగాథను వినే వార్కి భక్తి భావమును కలిగించుటకై గంగఅనే శబ్దసామ్యము, సమానత్వముచేత విష్ణు పదములనుండి పుట్టిన గంగాదేవి శివుడు ధరించెను అన్నది ఒక పురాణగాథగా స్వీకరింపవలయును అంతేగాని ''విష్ణు పదీం భవః దధారః''

అన్నది సరియైనది కాదు. అందువల్ల ఇచట తెల్లనైన ఆకాశగంగాజలము బ్రహ్మలోకమునుండి వచ్చిన గంగాజలంచేత ఇరువైపులనున్న ఒడ్డును ఆనుకొని సమానవేగముతో విస్తరించి వెళ్ళునది అని ఆప్లుతమునకు అర్థము. అట్లు కానిచో శ్రీకాళహస్తీశ్వరుడు జ్ఞాన ప్రసూనాంబతో పరివారములో స్వర్ణముఖీతీరమున అవతరించడు గదా! గంగాజలమును ఈశ్వరుని ఆజ్ఞతో ఆగస్త్యుడు శ్రీకాళహస్తి క్షేత్ర సమీపమునకు తెచ్చెనని పురాణగాథ ఒకటి కలదు. అది సువర్ణముఖరము అనగా బంగారమువలె మెరిసేది, బంగారము వలె మ్రోగునది. బంగారురంగుగలది, స్వచ్ఛమైన జలము గలిగినది. స్వర్ణముఖీనది. మానవులకు బంగారము మీద ఎంత ఆశో, పాపములను పోగొట్టే గంగానదిలో స్నానమునకు కూడా అంత మక్కువ. పూజ్యుడైన అగస్త్యుని చేత భూలోకమునకు తీసుకొని రాబడినదై శంఖనాదమువలె శబ్దము చేయు ముఖములదై దిక్కులనే ముఖములనుండి శ్రీకాళహస్తీశ్వరుని నామమును ప్రతిధ్వనింపు చేయునది స్వర్ణముఖినది. ఈ స్వర్ణముఖీ గంగాదేవే గంగాదేవియే స్వర్ణముఖి. స్వర్ణముఖి మహిమ అనేక పురాణాల ప్రసిద్ధము స్వచ్ఛమై శుద్ధమై ఆకాశ గంగను గుర్తుచేసే ఈ స్వర్ణముఖీనదీజలములతో ప్రతి రోజూ అభిషేకము మొదలగు ఉపచారయుక్తమైన పూజలచేత ఆరాధింపబడే వాడును ఆ జలములతో అభిషేకోత్సవము జరిపించుకొనువాడు అని అర్థము. కనుక శ్రీకాళహస్తీశ్వరుడు సిలాభ్ర సలిలాప్లుతుడు.

## తేజోనిధిః 17

సూర్యాదీనాం సర్వేషాం తేజాంసి అస్మిన్నిధీయంతే ఇతి తేజోనిధిః శు॥ ఆత్మనైవాయం జ్యోతిషాః తే పల్యయతే కర్మ కురుతే విపల్యేతీతి. యేన సూర్యస్తపతి తేజసేద్ధ ఇతి.

అనేక తేజస్సులకు నిధి శ్రీకాళహస్తీశ్వరుడు. తేజస్సుల సమూహము కలవాడు ఆస్వామి. తేజోమయులు సామాన్యముగా సూర్యుడు చంద్రుడు నక్షత్రములు గ్రహములు మొదలగునవి తేజోమయములు. ఇటువంటి అనేక తేజస్సమూహుడు శ్రీకాళహస్తీశ్వరుడు. సచ్చిదానందస్వరూపుడైన పరమాత్మ ఈయనే. ఆపరమాత్మ ఎల్లవేళలా ప్రకాశిస్తూ నిత్యము ఉండేవాడునూ సందర్శించేవార్కి అఖండానందము ఇచ్చేవాడని అర్థము. గుట్టమునకు వీపు మీదరంగురంగుల జీను ఎలాకప్పుతారో అలా భక్తులను అనుగ్రహించుటకై అనేక తేజస్సమూహమును ఆస్వామి తనయందు ధరించి ఉన్నాడు. సప్తాశ్వరథుడు సూర్యుడు సప్తవర్ణములతో కిరణములను ప్రసరింప చేయువాడు. ఆయన ఆవర్ణములను శుక్లము, కృష్ణము పీతము, హరితము, రక్తము, నీలము, కపిశము, చిత్రము మొదలగునవి. ఇవి అన్నియు నిండి ఉన్నవాడు గనుక ఆస్వామి తేజోనిధి.

## జగద్యోనిః 18

**జగత్ షడ్భావవికారాన్ గచ్ఛంతీతి జగంతి తేషాం యోనిః జగద్యోనిః । శ్రు । తే ధ్యానయోగానుగతా అపశ్యన్ దేవాత్మశక్తిం స్వగుణైఃనిగూఢాం । యః కారణాని నిఖిలాని తాని కాలాత్మయుక్తా న్యధితిష్ఠత్యేక ఇతి ॥**

అభిప్రాయము భావము అనగా రీతి, ఉనికి, సత్త, తటస్థముగుట నిశ్చయము. ప్రకృతి, ఉద్దేశ్యము, రత్యాదిస్థాయీభావము ప్రేమ పుట్టుక నిశ్చయము భక్తి హ్లాదము ధ్యానము, నడవడి, చేష్ట, ఇష్టము, మనోవికారము, విభూతి, మోహాభినయనము మొదలగునవి.

సమష్టియొక్క పరిణామమును చెప్పెను. సమష్టియొక్క ఏమయిపోవు అని అర్థములు కూడా చెప్పు. జనిస్తు అనగా కొంతము, భూమి జలము, పెరుగునది అని అర్థములు భావవికారములు ఆరు. అవి 1. జాయతే 2. అస్తి. 3. విపరిణమతే 4. వర్ధతే 5. అపక్షీయతే 6. వినశ్యతి అని చెప్పు. జాయతే అనగా ''పూర్వభావస్యాదిం ఆచష్టే. నాపరభావమాచష్టేన ప్రతిషేధతి'' పుట్టినప్పుడుయు అతని ఉనికి ప్రారంభమగును. పుట్టినంచిన తర్వాత ఆ ఉనికి నశించును. దీనినే జాయతే అని అందురు. అస్తి అనగా ''ఉత్పన్నస్య సత్వావధారణం'' ఉన్నప్పుడు అతని ఉనికిని వారి చెప్పెది. విపరిణామము అనగా ''అప్రచ్యవమానస్య తత్వాద్వికారం'' ఉనికి యొక్క మార్పును సూచించును. కానీ అది వృద్ధి కాదు. ఆ ఉనికి సంపూర్ణము కాదు. వర్ధతే అనగా ''స్వాంగాభ్యుచ్చయం సాం యౌగికానాం వాఽర్థానాం'' తన శరీరాంగములు పెరుగుట దానికి తగ్గట్టు ఇతరవ్యాపకములు పెంచుకొనుట. అపక్షయమనగా వృద్ధిపొందిన శరీరావయువము క్షయమును పొందుట. ధ్వంసమగుట భ్రంశమగుట. వినశ్యతి అనగా ''అపరభావస్యాదిమాచష్టే న పూర్వభావమాచష్టే న ప్రతిషేధతి'' విశేషముగా నాశనమును పొందుట ఇచట పూర్వభావము ఉండదు. అది విలీనము చెందును. ఈ ఆరు వికారములు పుట్టిన జీవునకు క్రమరూపేణ సంభవించును. ఈ విషయమును నిరుక్త గ్రంథమున నైఘంటుక కాండంలో వార్ష్యాయణి అనే మహర్షి భావవికారములు ఆరు అని చెప్పి వాటిని వివరించెను. జగత్తు ఈ భావవికారములకు కారణము. ఇది వికారముల సమూహము. ఈ విషయమున శ్రుతి ఇలా చెప్పుచున్నది. మునులు మహర్షులు ధ్యానముచేత యోగసమాధినుండి ఆ దివ్యతత్త్వము చూచిరి. తమలో రహస్యముగా దాచిన దేవాత్మ శక్తి అదేనని తెలుసు కొనిరి. ఒకే తత్త్వము కాలానుగుణముగా అనే రకములైన కారణములుగా ఉంటున్నది. సనాతనుడైన ఈశ్వరుడు సర్వభూతములకు (పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము) ప్రభువై అనేక లోకములను సృష్టి చేసి ఆసృష్టిలో చేతనుడు. తను కర్తగా, పరమపురుషుడుగా తాను గా ఉంటూ, దానికి కారణభూతుడుగా శివుడు ఉన్నాడు. విష్ణువు బ్రహ్మ, చంద్రుడు, సూర్యుడు దేవేంద్రుడు ముక్కోటి దేవతలు మొదలగు వారందర్నీ తానే సృజించి లయకాలము తానే తనలో కలుపు కొనుచున్నాడు. ఇది తమోగుణ ప్రధానంగా జరుగును. సమస్తమైన జగత్తు తనలో లయమైనందున తను ఒకడే మహేశ్వరుడుగా ప్రకాశించు చున్నాడు. అందువల్లనే సర్వజగద్యోని పరమేశ్వరుడని అర్థము అని భీష్మ పర్వమందు చెప్పబడెను.

**భీష్మపర్వణి**

**యత్ర భూతపతిః సృష్ట్వా సర్వాన్ లోకాన్ సనాతనః ।**
**ఈశ్వరః చేతనః కర్తా పురుషః కారణం శివః ॥**
**విష్ణు బ్రహ్మ శశీ సూర్యః శక్రో దేవాశ్చ సాఽఽవ్యయాః ।**
**సృజతే గ్రసతే చైతాన్ తమోభూత మిదం యదా ॥**
**అప్రజ్ఞాతం జగత్సర్వం తదాహ్యేకో మహేశ్వరః ।**
**తస్మాత్సర్వజగద్యోనిః పరమేశ్వరః ఇత్యర్థః ।**

## దివ్య మంగళ విగ్రహః 19

**దివ్యాని ఉత్కృష్టాని కళత్రపుత్రమిత్ర వర్గాదీని మంగళాని యద్విగ్రహారాధనాత్ లభ్యంతే సదివ్య మంగళ విగ్రహః మంగళం సుఖం లాతీతి మంగలం లా దానే మంగతి ధన్యమితి వా మంగి గతౌ ।**

దివ్యమనగా మహోవ్యవహారములయందు జయింపబడిన సత్యము, బాస, దివియందు పుట్టినది, అని అర్థము. ఈ దివ్యము ఐదువిధములు - 1. తులాదివ్యము. 2. అగ్నిదివ్యము. 3. జలదివ్యము. 4. విషదివ్యము. 5. కోశ దివ్యము అనునవి. మంగళము అనగా శుభము క్షేమము. ఇక మానవునికి దివ్యములనగా గొప్పవి. ఆగొప్పతనం మరణానంతరం మనిష్కి - స్వర్గసుఖం ఐతే. భూమిమీద కళత్ర పుత్ర మిత్రాదులు. ఇవి మానవుడు చేసుకున్న అదృష్ట విశేషమువలనే కలుగును. అదృష్టము పుణ్యమువల్ల లభించును. ఆ పుణ్యము విగ్రహారాధన దేవతా ఉపాసనవలన కలుగును. ఆ విగ్రహారాధన దివ్యమైన మంగళ పరంపరలను ఇచ్చే విగ్రహముల ఆరాధన వలన విశేష ఫలము వచ్చును. మంగళములు ఎప్పుడూ సుఖములనే ఇచ్చును. సదా శివునికి భక్తులుకోరిన దాని ఇచ్చుటయందే తనను ధన్యుడుగా భావించును. అందుకే ఆయన కల్మషం లేని వరప్రదాత. బోళా శంకరుడు అని కూడా అందురు. అందుకే సదా శివుడు దివ్య మంగళ విగ్రహుడు. ఆదివ్య మంగళ విగ్రహ స్వరూపుడినే పార్వతిదేవి తపస్సు చేత భర్తగా పొంది. ఆయనకు అనురాగవతియై అర్థ శరీరములో ఆయనను పొందినది. శ్రీకాళహస్తీశ్వరుడుకూడా దివ్యమంగళ విగ్రహుడు.

## అనేక కోటి బ్రహ్మాండ పిండీకరణ పండిత: 20

అనేకేతి. అమతి చరతి ప్రాణిజాతమేష్వీత్యండాని బ్రహ్మణాస్సృష్టాని బ్రహ్మాండాని అనేక కోటి సంఖ్యాకాని యాని బ్రహ్మాండాని తేషాం పిండీకరణే ముసలాలఖండేషు దండధర వత్ ప్రధ్వంసనే అయం పండితః పండతే జానాతీతి పండితః ష డి గతౌ సర్వే గత్యర్థాః జ్ఞానార్థాః తేషు పండాః ధీః అస్య జాతేతి వా పండితః

అనేకలోకాలతో నిండిన ఈ ప్రపంచము ఒక బ్రహ్మాండము. ఈ బ్రహ్మాండ విస్తీర్ణము అనేక కోట్ల యోజనములు. ఇటువంటి బ్రహ్మాండమును పొడిపొడిగా, పిండిగా, చూర్ణముగా చేయుటలో పండితుడు. కుమ్మరివాడు చేసిన కుండను పగులగొట్టి పొడి పొడిగా చేయుట చూస్తున్నాము గదా? అట్లాగే సృష్టించిన ఈ అనేక కోటి యోజన విస్తీర్ణ బ్రహ్మాండము పిండిగా చేయుగల సమర్థుడు సదాశివుడు ఒక్కడే. ఒక వస్తువును సృజించుటకు ఎంతతెలివి అవసరమో ఆ వస్తువుయొక్క శరీర నాశనమందు గూడా సామర్థ్యముగల తెలివి అవసరము. వస్తునాశనమునకు గూడా ఒక ప్రత్యేక సామర్థ్యముగావల్సి ఉన్నది. ఆసామర్థ్యము సదాశివునికి మాత్రమే కలదు. అందుకే ఆయన లయ కారకుడు.

ప్రపంచమున ప్రాణులు చరము, అచరము, అని కదిలిక కలిగినవి కదలిక లేనివి అని రెండు రకములు. ఇందులో జరాయుజమని అండజమని స్వేదజమని, ఉద్భిజమని నాలుగు రకములు. ఇటువంటి అనేక లోకములు బ్రహ్మదేవుని చేత సృష్టింపబడినది కనుక అవి బ్రహ్మాండము (బ్రహ్మచే సృజించిన అండములు) లు. ఈబ్రహ్మాండములు అనేక కోటి సంఖ్యాకములు. ఇటువంటి బ్రహ్మాండముల లయము చేయుటయందున్నా చూర్ణము చేయుటయందున్నా పరమేశ్వరుడు సమర్థుడు. కుమ్మరివాడు చేసిన కుండను ఒక కర్రతో ముక్కలు ముక్కలు చేసినట్లు ప్రపంచమును లయము చేయగలడు. జగత్తుయొక్క తత్త్వమును యదార్థముగా ఎరిగినవాడు. బాగా చదువరి. పడిగతౌ అనే ధాతువునుండి పుట్టినది ఈ పదము. సామాన్యముగా వాక్యములు అన్నియు రెండు అర్థములను తెలుపును. గతిని స్థితిని. ఏవి గతిని, స్థితిని బోధించునో అవి జ్ఞానమును గూడా బోధించును. అందరిలోకన్నా జ్ఞానము

ఎక్కువగా ఉండి సృష్టియొక్క ఉత్పత్తి స్థితి లయమును తెలిసిన వాడు పండితుడు. అనగా బ్రహ్మాండములో ఎన్ని లోకములు కలవు. ఆలోకవాసుల స్థితిగతులు, ఆలోక విస్తీర్ణము, అందుండు విశేషములు మొదలగు విషయముల సంపూర్ణపరిజ్ఞానము కలిగి ఉండువాడే పండితుడు. అండ భిత్తి మానముయొక్క విస్తీర్ణము రంగుతో ప్రారంభించి ఊర్ధ్వమానమున గల విస్తీర్ణమును మనము వర్ణించుట కలదు.

ననుపరమేశ్వరస్య భ్రాంతివత్ బహుళాయాసవిరచిత నానాస్థాన విలసదనేక బ్రహ్మాండ ధ్వంసనే కిం పాండిత్యం కిం వా ఫలం లభ్యతే ఏకస్య అండస్య లక్షణం దక్షకాండాదావేవం దృశ్యతేహి.

సర్వజ్ఞుడైన పరమేశ్వరునికి సైతం భ్రాంతిని పొందించునటుల మిక్కిలి ఆయాసము, ప్రయాసముపొంది సృష్టించిన అనేక ప్రదేశములు, లోకములు కల యావత్ప్రపంచమును నాశనమును చేయుటకు లయమును చేయుటకు ఏరకమైన పాండిత్యము కావలయును ఆరకముగా లయమును పొందించుటలో ఏ ఫలము లభించును. ఒక్కొక్క అండముయొక్క లక్షణము దాని వైశాల్యములను వర్ణించుచున్నారు.

అధోభాగే అండ భిత్తి మానం సువర్ణమయం కోటియోజనం తదుపరి కాలాగ్ని రుద్రమూర్త్యుత్సేధమానం కోటియోజనం తజ్జ్వాలా దశకోటికం. తద్ధూమవ్యాప్తిః పంచకోటి యోజనావధికా తతః నాగలోకః ద్వాదశ లక్షోత్తర ఏకోన త్రింశతః కోటికం. తతః కూష్మాండ దేవస్థానం లక్షోన కోటియోజనం తతః కేవలాకాశం నవలక్షయోజనం తతః సప్త పాతాళం త్రిషష్టిలక్షయోజనం తతః కనిష్టికా పాతాళమసుర స్థానం అష్టలక్ష యోజనం. తతః హాటకేశ్వరమందిరం నవలక్షం. అథ వింశతి లక్షోత్తర కోటి యోజన మాకాశం. అథ అనంతఫణాః సహస్రవిధృత గిరి సాగరవనపుర గ్రామనదనదీ విజృంభిత భూమిరశీతిలక్షయోజనఘనా భువి. ఇదమండస్య మధ్య స్థానం.

భూమికి క్రింద ఉన్న అండము యొక్క గోడ కొలత (మానము మూడువిధములు 1. తులామానము. 2. అంగులీమానము. 3. ప్రస్థమానము (కొలతవిశేషము)) బంగారు రంగులో ఒక కోటియోజనముల విస్తీర్ణము కలిగినది. ఆతర్వాత కాలాగ్నుడైన రుద్రునియొక్క శరీరము పొడవు వైశాల్యము ఒకకోటి యోజనముల విస్తీర్ణము కలిగినది. ఆరుద్రునినుండి వచ్చిన కాలాగ్నిజ్వాల పదికోట్ల విస్తీర్ణము కలిగినది. ఆకాలాగ్ని జ్వాలలనుండి వచ్చిన ధూమముయొక్క వ్యాప్తి ఐదుకోట్ల యోజనముల విస్తీర్ణము కలిగినది. నాగలోకమనగా పాతాళ లోకము పన్నెండు లక్షల యోజన విస్తీర్ణము కలిగినది. ఆ తర్వాత కూష్మాండము అనగా గుమ్మడికాయ లేక పిశాచ లోకము లేక గర్భములో ఉన్న పిండ విశేషము అని అర్థము. అటు తర్వాత కేవలము ఆకాశము మాత్రము తొమ్మిది లక్షల యోజన విస్తీర్ణము కలిగినది. పాతాళము అనగా క్రింది లోకము, బడబాగ్ని అని అర్థము. సప్త పాతాళములు అరవై మూడు లక్షల యోజన విస్తీర్ణము కలిగినది. అటు తర్వాత చివరిది చిన్నది ఐన పాతాళలోకమున రాక్షసులు ఉందురు. అది ఎనిమిది లక్షల యోజన విస్తీర్ణము కలిగినది. హాటకము అనగా బంగారము, ఉమ్మెత్త అని అర్థము. హాటకేశ్వరుని మందిరము తొమ్మిది లక్షల యోజన విస్తీర్ణము కలిగినది. హాటక దేశము అర్జునుడు దిగ్విజయ యాత్రలో అచటికి వెళ్లెను. అచట మానసము అను ఒక పెద్ద సరోవరము కలదు. దాని సమీపమునందు ఒక పెద్ద ఈశ్వరాలయము కలదు. అందువెలసిన స్వామిని హాటకేశ్వరుడు అని అందురు.

సామాన్యముగా ఆకాశముయొక్క విస్తీర్ణము ఒకకోటి ఇరవైలక్షల యోజనవిస్తారము కలిగినది. వెయ్యికన్నా ఎక్కువగా ఉన్న పడగలుగల ఆదిశేషునిచే మోయబడుచున్న ఈ భూమి లోపల ఎత్తైన అమితమైన వైశాల్యముగల పర్వతములు నదులు ద్వీపములు వనములు, అరణ్యములు, పురములు, నగరములు గ్రామములు నదములు (తూర్పునుండిపశ్చిమదిక్కునకు ప్రవహించేది) నదములు, విస్తారముగా వ్యాపించి ఉన్నభూమి ఇవన్నీకలిపి ఎనభైలక్షలయోజన విస్తీర్ణము ఘనమైనదిగా కలదు. ఇంతవరకు చెప్పినది అండముయొక్క మధ్యమ భాగ స్థానమును భూమి లని అందురు. ఈ భూమికి పైభాగమును అనగా ఆకాశమున మేఘములు, పక్షులు, గిద్దలు, కాకులు మొదలగు పక్షులు సిద్ధులు ఆకాశ గంగ మొదలగు వాటి స్థానములు మొత్తము పది లక్షయోజన విస్తీర్ణము కలిగినది.

సూర్యుడు, ఇంద్రుడు, చంద్రుడు నక్షత్రములు గ్రహములు మొదలగు వాటి స్థానము మూడు లక్షల యోజన విస్తీర్ణము. శుక్రుడు గురువు కుజుడు శనైశ్చరుడు బుధుడు వీరిస్థాన వైశాల్యము పదిలక్షల యోజనములు, సప్తర్షి ధృవమండల విస్తీర్ణము రెండులక్షలు స్వర్గలోక విస్తీర్ణము ఎనభై ఐదు లక్షల యోజన విస్తీర్ణము కలిగినది. మహర్లోకము రెండుకోట్ల విస్తీర్ణము కలిగినది. జన లోకము ఎనిమిది కోటి యోజన విస్తీర్ణము కలిగినది. తపోలోకము పన్నెండు కోట్లయోజన విస్తీర్ణము కలిగినది. కార్యబ్రహ్మలోకము పద్నాలుగు కోట్ల యోజన విస్తీర్ణము కలిగినది. బ్రహ్మలోకము మూడు కోట్లయోజన విస్తీర్ణము కలిగినది. వైకుంఠము మూడు కోట్ల యోజన విస్తీర్ణము కలిగినది. కైలాసము నాలుగు కోట్ల యోజన విస్తీర్ణము కలిగినది. పైన ఉన్న ఆకాశము ఎనభైలక్షల యోజన విస్తీర్ణము కలిగినది. పైన ఉన్న అండముయొక్క గోడకొలత ఒకకోటి యోజన విస్తీర్ణము కలిగినది. మొత్తము కలిపిన ఆకాశము యొక్క పైభాగములు వందకోట్ల యోజనవిస్తీర్ణము కలిగిన దాయెను. ఈ ప్రకారముగా నిలువుగా ఉన్న విస్తీర్ణము వందకోట యోజనములు. ఇట్లాగే అడ్డముగా కూడా ఇంతే విస్తీర్ణము ఉండును. (భూమివిస్తీర్ణ విషయమున అనేక భేదాభిప్రాయము కలవు).

ఈ ప్రకారముగా అనేక కోట్ల విస్తీర్ణము కలిగిన ఈ లోకముల సృష్టి (సర్గమనగా సృష్టి అని అర్థము ఇది తొమ్మిది విధములు. 1. మహత్సర్గము, 2. అహంకార సర్గము 3. భూతసర్గము 4. ఇంద్రియ సర్గము 5. దేవసర్గము (ఇది ఎనిమిది విధములు) తమస్సర్గము (ఇవి ఆరు ప్రాకృతములు) 7. వనస్పత్యాది సర్గము (ఇది ఆరువిధములు) 8. తిర్యక్ సర్గము (ఇది ఇరవై ఎనిమిది విధములు) 9. మనుష్య సర్గము (ఇవి మూడు వైకృతములు ఇవికాగ కుమారసర్గమని ఒకటి కలదు) చేయవలెనన్న ఎంతకష్టమైన కార్యము. సదా శివుడు ఒక్కడే బహు విస్తారమైన ప్రపంచమును వ్యాప్తిచేయుట (సృష్టించి సంరక్షించుట) ఎంతకష్టము? అసృష్టించిన ప్రపంచమును సక్రమముగా లయము చేయుట ఎంతకష్టము. ఇంత ప్రయాసతో కూడిన పనిని చేయుటలో ఆయన ఫలమేమి? గృహస్థుడైనవాడు తన భార్యా పిల్లలపోషణ తోషణయందే జీవితమంతా అంకితమౌతున్నాడు. ఇంత కష్టమునకు ఫలము తను లేవలేనప్పుడు తనను చూచుకుంటారనే ఆశ. స్వార్థము. మరి జగన్నాథుడైన ఆపరమేశ్వరుడు ఏనిమిత్తంతో ఈ సృష్టి -సంహారములు చేయుచున్నాడు అనిన ఒక మహారాజు తమాషాకు జూదమాడి తన గుర్రములను రథములను పందెమున పెట్టినట్లుగా సదాశివుడు సృష్టి - లయములకు తన స్వార్థము ఏమీలేకపోయిననూ తనలీలా విభూతి కొరకై సృష్టి - లయమును చేయుచున్నాడు. ఏప్రయోజనములేకుండగానే సృష్టి-లయములను సదాశివుడు చేయుచున్నాడు అనిన

వేదములచేత అనేకవిధములుగా గొప్పగా కీర్తింపబడిన సదాశివుడు ఒక పిచ్చివానివలె నిష్ప్రయోజనమైన పనులు చేయునా ? అన్నచో చేయడు మరి సదాశివునకు సృష్టి-లయములు చేయుటలో పరమ ప్రయోజనమును వేదములో కూడా చెప్పబడి ఉన్నది. భూలోకములో ఉన్న జీవుల దుఃఖములచే మానసిక ఖేదమును అనుభవించుచున్నందున వాటి విశ్రాంతి కొరకు వారి వారి కర్మలను పండించుటకై వారి సుకృత దుష్కృత రూప పరిపాకమునకై మాయామయముచేత నిర్మింపబడిన ఈ ప్రపంచమును శ్రీసదాశివుడు మహాలయమును చేయుచున్నాడు. సంహరించు చున్నాడు. మరలా ఆసదాశివుడు సృష్టి చేయవలెననే తలంపుతో అవిద్యా, అజ్ఞానము అనే రెండు మాయల సహాయంతో జీవుల కర్మభోగముకొరకై మరలాసృష్టిచేయుచున్నాడు. సంహారము కూడా ప్రాణుల ఉపకారము కొరకై చేయుచున్నాడు.

ఏతద్బ్రావేః ఉపరి జలద గరుడ సిద్ధవిద్యాధర గంగాదిస్థానం లక్షయోజనం । అథ రవీంద్ర చంద్ర నక్షత్ర స్థానం త్రిలక్షయోజనం । అథ శుక్రగురు కుజ శనైశ్చర బుధ స్థానం దశలక్షం । సప్తర్షి ధృవమండలం ద్విలక్షం । అథ స్వర్లోకః పంచాశీతిలక్షకం । మహర్లోకః ద్వికోటియోజనః । జనోలోకోష్ట కోటికః । తపోలోకః ద్వాదశ కోటికః । కార్య బ్రహ్మలోకశ్చ చతుర్దశ కోటికః ।

బ్రహ్మలోకః త్రికోటికః । విష్ణు పదం త్రికోటికం । రుద్ర పదం చతుష్కోటికం ఉపరిత్యాశీతిలక్షం కేవలాకాశం । ఉపరి అండభిత్తిమానం కోటియోజనం ఆసీత్ । ఆహత్య ఊర్ధ్వాధోమానం శతకోటి యోజన మాసీత్ । ఏవం తిర్యక్ సర్వతశ్చ భవతి । ఇత్థం భూతాండ కోటి సర్గే యత్నగౌరవసాధ్యే కర్మణి కథం ఏకః సన్ వ్యాప్రియంతే. కథం వా అంతే తాని వినాశయతి । కి ఫలం లభత ఇత్యత్రేదం ఉచ్యతే । భూపతేః దురోదరక్రీడాశ్వరథాదివత్ స్వలాభమంతరేణాపి శివస్యశీలామాత్రం పరమ ప్రయోజనం. అస్త్యేవేత్యాగమాః తథాహిః

**విశ్రాంత్యై భవినాం చ ఖిన్నమనసాం పాకాయ కర్మావతే**
**ర్మాయా వాగ్భం సంభవాయ కురుతే శంభోః మహాసంహృతిం ।**
**శిష్యంతే పశవః సశక్తిరమలః శంభుశ్చ మాయాద్వయం**
**పుష్ట్యైర్యం దయయా తతశ్చ కురుతే భోగాయ పుంసాం పునః**

ఇతి సంహారోఽపి ప్రాణినాముపకారాయైవ భవతీత్యర్థః అపిచ కస్యచిత్ చేతనస్య స్వప్న ప్రపంచ నివర్తన ప్రవర్తనే తన్నివర్తనేఽ పి యథా ఏవం హరస్య సర్వసర్గ సంహారయోః నకోఽపి భారః ఇత్యర్థః

**శ్రుః భోగార్థం సృష్టిరిత్యన్యే క్రీడార్థమితిచాపరే**
**దేవస్యైష స్వభావోఽయ మాప్తకామస్య కా స్పృహా ॥**

ఇతి సర్గమప్యుపగమ్యేత్థం వికల్ప్యతే । పరమార్థతః సృష్టిరేవ నాస్తీతి శ్రుతి మతం । తదస్తీతి చేత్ సాధన సంపన్నానాం కల్పాంతే అవసానాశ్యాసే ఆత్మైకత్వబోధనే తేషాం జగద్భ్రాంతిం వినాశయతి । న ఏవ సర్వ సంహార ఇత్యనుసంధేయం.

**శ్రుః న విరోధో నచోత్పత్తిః న బద్ధో న చ సాధకః ।**
**న ముముక్షుః నవై ముక్తః ఇత్యేషా పరమార్థః ॥** ఇతి

తస్మాత్ శ్రీకాళహస్తీశ్వరస్య జగత్సర్గాది కార్యం స్వప్నదృజ్ఞయనోన్మీలన నిమీలనవత్ స్వచ్ఛందతః సర్వం భవతీత్యర్థః

సదాశివుడు చేసే లీలను మరి ఒక విధముగా సమర్థించుచున్నాడు. ఒక చేతినుండైనను మనుష్యునకు స్వప్నమందు మనస్సు కొన్ని సృష్టులను చేయుచూ మరి కొన్నిటిని విసర్జించుచూ కొన్నిటియందు తిరిగి వచ్చుచుండును, కొన్ని వస్తువులను సమపుట మొదలగునవి చేయును. అవి తను కావలెనని చేయదు. మనస్సు మాత్రమే అన్నిటిని గామాని, తర్వాత తానే అన్నింటిని విరమించును. ఈ క్రియయందు జీవునకు శ్రమ ఏమియును లేదు. అట్లే శ్రీసదాశివుడుకూడా లీలావిలాసముగా సృష్టిని చేయును. ఇది ఎవరికి భారము, కష్టము కాదు. వేదమున ఇట్లు కలదు. పరమేశ్వరుడు తన సృష్టి జీవులభోగము కొరకు అని క్రీడా విలాసము కొరకు అని మరికొందరు. పరమేశ్వరుని స్వభావమే అంత అని మరికొందరు. ఇలా పరమేశ్వరుని లీలా విభూతిని అనేకులు అనేకరకములుగా చెప్పుదురు. పారమార్థిక వ్యావహారిక ప్రాతి భాషిక సత్త (ఉండుట)లో ఒకక్షణం కళ్ళకు కనుపించి వెంటనే మాయమయ్యే సృష్టి ఒకటి అదే తాడుయందు సర్పము ఒక క్షణకాలము కనిపించి మరుక్షణమే ఆసర్పము మాయమగును. ఇక వ్యావహారికసత్తా. వ్యవహారదశయందు జీవుల సృష్టి ప్రక్రియ, స్థితి ప్రక్రియ, లయ ప్రక్రియలు జరుగును. వ్యవహార దశయందు అంతయు సత్యముగానే జరుగును. ఇక పారమార్థిక సత్తయందు ఈ జీవులు ఈ సృష్టిమొదలగు అన్నియు అసత్యములు అనగా మిథ్యా భూతములు. కనుక అప్పుడు పరమాత్మ ఒక్కడే, అతని మినహా తక్కిన ప్రపంచము అంతయు మిథ్య. ఈ విషయము అనేక శ్రుతులలో ఉపనిషత్తులలో చెప్పబడినది. అసలు సృష్టే లేదని పరమాత్మ లీలా విభూతి కొరకై ఈ సృష్టి జరుగుచున్నది. శ్రుతులలో ఉపనిషత్తులలో సృష్టికలదని చెప్పినచో ఆత్మైక్యమునకై సాధన చతుష్టయ సంపన్నులైన వారు ప్రపంచముగలదని కల్పాంతమునగాని తమ అవసానసమయమందుగానీ జగద్భ్రాంతిపొందుటకు అవకాశములేదు. శ్రీసదాశివుడే సర్వ సృష్టి స్థితి సంహారకర్త అని తలచవలెను. సదాశివునకు ఏదీ విరోధములేదు. సృష్టికి, ఉత్పత్తి కారణమంటూ ఏదీ లేదు. బంధమునకు, సాధనకు ముక్తి కోరే వాళ్ళకు దేనికిని సంబంధము లేదు. ఇది పరమార్థసత్యము. అంతయు తనంతటతానుగానే జరుగును. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరునకు సృష్టి – లయకార్యములు నిద్రలో స్వప్నమునందు ఉండువాడు కళ్ళు మూసుకొనుట, మరలాతెరుచుకొనుటలాగా అప్రయత్నముగా స్వచ్ఛందముగా జరుగునట్లు జరుగును. కావున శ్రీకాళహస్తీశ్వరునకు అనేక కోటి బ్రహ్మాండ పిండీకరణ పాండిత్యము అప్రయత్నముగా లీలా విభూతి అబ్బినది.

## పంచ బ్రహ్మోతనుః 21

**పంచేతి సదేవ సోమ్యేదమగ్ర ఆసీదేకమేవాఽద్వితీయం । యదాతమః తన్న దివా న రాత్రం న సత్ నచాసత్ శివ ఏవ కేవలః ఇతిశ్రుతేః ।**

**అగ్రే శివమాత్రమేవేదం నామరూపరహితమాసీత్ ।**

తతః శివాజ్ఞయా ఈశాన తత్పురుష అఘోర వామదేవ సద్యోజాతాఖ్యాని సప్తకోటి మహామంత్ర ప్రాధాన్యాత్ భూత భౌతికాది కారణత్వాచ్చ పంచబ్రహ్మ సంజ్ఞకాని అభవన్ తథాహి యజ్ఞ వైభవే ।

ఓ సౌమ్యుడా! సత్ పదార్థము చైతన్యము ఒక్కటేఇదం అని ఈ ప్రత్యక్షముగా కనబడుచున్నది నామ, రూప, క్రియా భేదముచేత భిన్నమైన కార్య ప్రపంచమంతా, అగ్రే = సృష్టికి పూర్వ భాగమందు. అద్వితీయం = రెండవ వస్తువులేనిదియూ, ఏకం ఏవ = సర్వ గతాఽసంగ

చిద్రూపా నిర్వికారాఖండైక రసస్వరూపమైనందున సత్ ఏవ = అబాధిత సత్తామాత్ర స్వరూపముగానే, ఆసీత్ ఉండెను. ఛాందగ్యోపనిషత్తున ఆరవ ప్రపాఠకంద్వితీయ ఖండంలో మొదటి మంత్రమునకు పూర్వ గ్రంథమున ఇట్లున్నది ఒకానొక వస్తు స్వరూపం తెలియుటవలన సమస్తము తెలియబడుచున్నదని మట్టితో చేసినట్లు తెలిసిన కుండ, పళ్లె, మూకుడు, ప్రమిద మొదలగునవి తెలిసినట్లు దృష్టాంత పూర్వకముగా ఉద్దాలకునిచే అవి నిరూపింపబడినవి. అట్టి వస్తుస్వరూపమును నాకు ఉపదేశపూర్వకముగా అను గ్రహింపవలెనని ప్రార్థించెడి శ్వేతకేతువునకు తండ్రియైన ఉద్దాలకుడు సర్వజగత్కారణమై ఉన్న అధిష్ఠాన సత్తామాత్ర స్వరూపమును నిరూపించి ఉపదేశము చేసెను. నామరూపక్రియలయొక్క భేదముచే అనేక విధములుగా భిన్నమై ప్రత్యక్షాది ప్రమాణ విషయముగా స్ఫురించుచున్న భూతవికార రూపమైన ప్రపంచమంతయును సృష్టికి పూర్వకాలమున భేదములేక సర్వ వ్యాపకమై నిర్వికారాసంగ చిద్రూపాఖండైకరసమై. అబాధితమై అధిష్ఠాన సత్తామాత్ర స్వరూపముగానే ఉన్నది. ఇటువంటి వస్తుస్వరూపమును నిరూపించెడి విషయమున భ్రాంతులైన శూన్యవాదులు, మరికొందరు నామరూపక్రియల బేధముచే అనేక విధములుగా వ్యక్తీకరించు చున్నారు. ఈ ప్రపంచ మంతయును ఉత్పత్తికి పూర్వము నామరూపక్రియల బేధములేక అనిర్వచనీయమై ప్రత్యక్షాది గోచరము కానందున ఏమియును లేదని అభావము (శూన్యము) మాత్రమే ఉండెనని చెప్పుదురు. ఇట్లు చెప్పుట అసంగతము. ఎట్లనిన అభావమనగా లేదనుట (నాస్తి) ఐనది. శూన్యమై ఉండెడి సమయమున అట్టి శూన్యమును తెలుకుకొని చెప్పువాడు సంభవించుట కూడా అసంగతమై ఉన్నదని చెప్పును. కానీ శూన్య కాలముల శూన్యమును గ్రహించెడివాడు లేనందున ఇది శూన్యము అని నిరూపించుటకు ప్రమాణము లేదు. మంత్రమున అసత్ శబ్ద నిరూపణము సదభినివేశ రూపమైన విపరీత గ్రహణ విప్రత్తి పూర్వక స్వరూపమును బోధించుటకు చెప్పబడినది. వేరే అభిప్రాయము కొరకు కాదు.

సదాశివుడు ఒక్కడే పరమాత్మ. ఆయన తత్త్వమును తెలుసుకొనుటకై నిషేధ రూపమున ''నేతినేతి'' (బృహదారణ్యకోపనిషత్ 3-9-26, 4-2-4, 4-4-22) అన్నట్లుగా తమస్సుగారు, పగలు కాదు రాత్రికాదు సదసత్తులు కూడా కాదు అని చెప్పినవి. ఆతర్వాత సదాశివుడు ఒక్కడే ఈ సృష్టిలో నామరూప క్రియా రహితుడై ఉండెను. ఆతర్వాత సదాశివాజ్ఞ చేత ఈశాన = మిక్కిలి వెలుతురు ప్రకాశముగల త్రినేత్రుడు. పరమాత్మఐన సదాశివుడు. అఘోరః = అతిభయంకరుడు (అంతకంటె ఘోరరూపులు మరి ఒకరు లేరు) వామదేవ = ముక్కన్నులు గల సదాశివుడు; సద్యోజాతుడు = భక్తులను అనుగ్రహించుటకై అప్పటికప్పుడు అవతరించేవాడు. సదాశివుని అనంతకోటి అవతారములకై ఆ అవతార అర్చనాదికైంకర్యములకై అనేకమహామంత్రములు ప్రధాన వినియోగమునకై కలవు. పృథివీ అపోతేజోవాయు ఆకాశరూపుడై ఆయాక్షేత్రములలో విరాజిల్లుచుండెను. అసలు బ్రహ్మ అనగా బ్రాహ్మణుడని ఋత్విజుడని, పరమాత్మ అని వేదమని, తపమని అర్థములు కలవు. సామాన్యముగా బ్రహ్మలు తొమ్మిదిమంది. వీరినే ప్రజాపతి అని పిలుతురు. 1 – భృగువు 2. పులస్త్యుడు 3. పులహుడు 4. అంగీరసుడు 5. అత్రి 6. క్రతువు 7. దక్షుడు. 8 వసిష్ఠుడు 9. మరీచుడు. భూతభౌతికాధికారణముల చేత శ్రీసదాశివుడు పంచబ్రహ్మ సంజ్ఞకు డాయన యజ్ఞ వైభవమున.

**తత్రైవం పతి శబ్దస్తు సాక్షాదీశాన ఏవ చ**
**పుర్యః తత్పురుషో రూపః అఘోరః పరికీర్తితః ॥**
**వామదేవో రసః ప్రోక్త గంధః పద్య ఉదాహృతః**

**సదాశివేశ్వరౌ రుద్రో విష్ణు బ్రహ్మ చ సువ్రతాః ॥**
**క్రమాచ్ఛబ్దాది భూతానాం దేవతాశ్చ ప్రకీర్తితా ॥**

దేవతలను స్ఫురింపజేసే ప్రతినామము శ్రీసదాశివుని ప్రతిఫలింపునదే. ఆకోవలోనే ఈశాన, తత్పురుష అఘోర వామదేవ రుద్రనామములు కూడా కలవు. విష్ణు బ్రహ్మాది నామములు క్రమముగా భూత భౌతికమంతయు శ్రీసదాశివుని మయమే. వేరుమరొకటిలేదు. ఈశానాది పంచరూపములు పృథ్వి, నీరు, నిప్పు, గాలి, ఆకాశములకు ప్రతి రూపములు. (ప్రతీకలు)

ఏవం మనోబుద్ధ్యంహకార చిత్తాంతఃకరణానాం, శ్రోత్రత్వక్ చక్షుః జిహ్వాఘ్రాణానాం, వాక్పాణి పాదపాయుపస్థానాం తత్తదధిదేవతానాం చ పంచ బ్రహ్మాత్మకత్వం తదుత్పన్నత్వాత్ తదాధారత్వాత్ న కించిద్వ్యతిరిచ్యత ఇతి. సఏవ ముముక్షు సుభాయ పంచబ్రహ్మాకారేణ అవస్థితః పంచబ్రహ్మణి ఏవశిరః ఆద్యవయవ సంపూర్ణా తనుః యస్య సపంచబ్రహ్మతనుః పాయాదిత్యర్థః

దేహములోని ఇంద్రియములను నియంత్రించునది మనస్సు. ఆ మనస్సు నాలుగు రకములు. అవి మనస్సు, బుద్ధి అహంకారము చిత్తములని (అంతకరణములు అని మనస్సుకు మరోపేరు). బుద్ధి గుణములు ఆరు. అవి మేధ, పంప, చార్వి, గృహితి, శ్రౌతి, చత్సరి. ఇంకాను శుశ్రూష, శ్రవణము, గ్రహణము, ధారణము, ఊహ, అపోహ, అర్థవిజ్ఞానము, తత్వజ్ఞానము మొదలగునవి. అహంకారమనగా గర్వము. చిత్తమనగా మనస్సు మది. అంతఃకరణమనగా దేహములోపలి ఇంద్రియము. మనస్సుకు అధిదేవత చంద్రుడు, బుద్ధికి అధిదేవత బృహస్పతి అహంకారమునకు అధిదేవత రుద్రుడు చిత్తమునకు అధిదేవత క్షేత్రజ్ఞుడు. క్షేత్రజ్ఞుడు అనగా జీవుడు అని అర్థము. (చెయ్యి, ముఖము, దంతములు, శిరస్సు, నేత్రములు, చెవులు, మెడ, శరీరము హృదయము, మేఢ్రములనే పన్నెండింటిని క్షేత్రములన బడును.) జ్ఞానేంద్రియములు ఐదు. అవి శ్రోతము త్వక్, చక్షు జిహ్వా ఘ్రాణము చెవులు, చర్మము కళ్ళు, నాలుక, ముక్కు చెవికి అధిదేవత దిక్కు. ''దిశః శ్రోత్ర భూత్వా కర్ణే ప్రావిశత్''. ''శబ్ద గుణకమాకాశం'' చర్మమునకు అధిదేవత వాయుః'' ఓషధి వనస్పతయః లోమానిభూత్వా త్వచం ప్రావిశత్'' రూపరహితస్పర్శవాన్ వాయః ఇంద్రియం స్పర్శగ్రాహకం త్వక్. దీనిని కనుగొనుట వృక్షాదుల కంపనము చేత గుర్తించబడును. ''వాయుః ప్రాణో భూత్వా నాసికే ప్రావిశత'' కళ్ళకు అధిదేవత ఆదిత్యుడు. ''ఇంద్రియం రూపగ్రాహకం చక్షుః'' కృష్ణ తారాగ్రవర్తి. నాలుక (జిహ్వా) కు అధిదేవత వరుణుడు. ''వరుణో వా ఏతం గృహ్ణాతి, శన్నో మిత్రస్యం వరుణః'' శీతస్పర్శ వత్యాపః శరీరం వరుణలోకే, ఇంద్రియం రసగ్రాహకం రసనం జిహ్వాగ్రవర్తి. విషయః సరిత్ సముద్రాదిః'' ముక్కు (ఘ్రాణము) కు అధిదేవత పృథివి. ''వాయుః ప్రాణో భూత్వానాసికే ప్రావిశత్'' ''గంధవతీ పృథివీ. శరీరం అస్మదాదీనం, ఇంద్రియం గంధ గ్రాహకం ఘ్రాణం, నాసాగ్రవర్తి, విషయః మృత్పాషాణాదిః ఇక కర్మేంద్రియములు గూడా ఐదు. అవి వాక్ పాణి పాదపాయూ ఉపస్థలు. వాక్కు అగ్ని అధిదేవత చేతికి (పాణి) ఇంద్రుడు అధిదేవత ''ఇంద్రో మే బలే శ్రితః, బాహవో బలం'' పాదమునకు విష్ణువు అధిదేవత. ఉపస్థకు అధిదేవత ప్రజాపతి'' ఆపోరేతః భూత్వా శిశ్నం ప్రావిశత్ తమస్సుకు ఈశ్వరుడు అధిదేవత. ఆయా ఇంద్రియముల అధిదేవతలు కూడా పంచబ్రహ్మాత్మకులే. ఐతే ఉత్పత్తి ఆధారములచేత

వారివారికి ఏమాత్రము వ్యతిరేకము లేదు. ఇంద్రియములలో గూడిన జీవుడే సాంసారిక బంధములనుండి విముక్తిని పొందినట్లయితే ఆనందమును పొందును. శివుడే పంచ బ్రహ్మలుగా వారి పంచముఖములు కల బ్రహ్మగా సృష్టికి ఆదినుండి లయము పొందించు పర్యంతము సంప్రాప్తమైన శరీరధారియై జీవులను రక్షించుచున్నాడు. అందువలన ఆసదాశివుడు పంచ బ్రహ్మ దేహధరుడు.

ఈశానాది పంచబ్రహ్మాణి నిర్వక్తి ఆగమః ।
య ఈష్టే సర్వ విద్యానాముపదేష్టు మహాత్మనాం ।
బ్రహ్మాదికారణం శంభుః స ఈశాన ఇతి స్మృతః ।
తాసు తాసు చ ధీః పూర్వ్నవిశన్ తత్త్వాత్మనా స్థితః ॥
యః తత్పురుష వాచ్యో నః స పాయాదవ్యహం హృదీ
ఇతియథా సుధాంశుర్ధార్తస్య సంతాపం శమయేద్ధృతం
తథా ఘోర ప్రశాంతోఽపి పాప నిర్దహకారకః ॥ ఇతి
స్వజనాఘౌఘ మానవానాం హరత్యహరహో హరః
అఘోర ఇతి విఖ్యాతః సదా పాయాత్పురార్యపీతి ॥
వామయా ఉమయా గౌర్యా వామార్ధవపుషా సదా
దీవ్యత్యయమభీష్టార్థదాతా యః పరమేశ్వరః ॥ ఇతి
సద్యోజానాం మూర్తయః సంభవంతి యస్యేచ్ఛాతః తేన సద్యోభిధానః ।
భక్తానాంనా పూజనాత్సద్యః ఏవ సాక్షాదగ్రే జాయతే తస్తథోక్తః । ఇతి

శశిధరముకుటుడైన సదాశివుడు పంచముఖుడు. అవి ఈశాన తత్పురుష, అఘోర, వామదేవ, సద్యోజాతములు. ఇదివేదమందు, పురాణ, ఆగమములయందును చెప్పబడినది. మహాపురుషులకు సకల ఐహికాముష్మిక విద్యలను ఉపదేశించుటలో సదాశివుడే సమర్థుడు. బ్రహ్మాది దేవతలు వారి వారి పనులను సక్రమముగా చేసుకొనుటకు శక్తి సామర్థ్య ప్రదాత శ్రీసదాశివుడే.. అతనినే సదాశివుడు అని అందురు. విజ్ఞానుల మేధస్సున నిలిచి వారి మేధోసంపదలను వృద్ధిచేయువాడు సదాశివుడే. ఎవరిని పరమ పురుషునిగా ఆరాధించుచున్నానో ఆ పరమపురుషుడు నాహృదయ పుండరీకమున ఎల్లప్పుడు ఉండుగాక. ఎవరి ఆకలిని, ఆర్తిని తాపమును నిశ్శేషముగా శమింపజేసి అతనికి అమృతమును ఇచ్చునో ఆ శివుడే నాకు దిక్కు. అమితగంభీర ఘోర యోగసమాధిలో ఉన్ననూ భక్తుల పాపములను నిర్దయగా దహింపగలడు. తన వారి పాపములను సమూలముగాపోగొట్టువాడు గనుక అతనిని ఆ సదాశివుని అఘోరుడు అని స్తుతి చేయుదురు. అతను త్రిపురాసులను సంహరించిన వాడు కూడా. స్త్రీలలోకెల్ల ఉత్తమ స్త్రీయై పసుపు ఛాయలలో వెలుగొందే పార్వతీదేవి (గౌరీ అనగా ఋతుమతి కాని కన్యక) గౌరీ దేవియై శంకరుని అర్ధశరీరమునుపొంది విలక్షణమైన అర్ధనారీశ్వర మూర్తిగా వెలుగొందే భక్తుల అభీష్టములను ఇచ్చే దయామూర్తి సదాశివుడు. భక్తుల సంరక్షణార్థమై అనేక రూపములను ధరించు వాడుగనుక ఆసదాశివుడు సద్యోజాతుడు భోళాశంకరుడై ఆర్తితో భక్తులు పిలిచిన తోడనే కన్నుల ముందు ప్రత్యక్షమై వారి కష్టములను కడతేర్చు వాడు ఆసదాశివుడే. అనేక ముఖములలో భక్తులకు సదారక్షించువాడు గనుక ఆయన పంచబ్రహ్మ తనవు కలిగినవాడు.

## సర్వమంగళాలంకృతాకృతిః 22

మంగళా అనిన శుభమును చేకూర్చునది అని అర్థము. యోగక్షేమములను ఇచ్చునది. ఆమె పార్వతి, గౌరి, దుర్గా కాత్యాయనీ, శ్రీరాజరాజేశ్వరీ రూపములుగా భక్తులకు దర్శనము ఇచ్చునది. ఆమెయే శ్రీదేవి గూడా. ఆమె పరమాత్మని తత్త్వముతో అభిన్నము. ఆ తత్త్వముతో నిత్యానపాయినిగా (అపాయములేనిదిగా) ఎన్నడు వేరుకాని తత్త్వమే ఆమె. ఆమె ఆదిమధ్యాంతరములు లేనిది. అనాటినుండి నేటివరకు ఉపాసకులు ఈ పరతత్త్వమును తదేక భావనతో ఉపాసించుట, లోకమున పరిపాటిగా ఉన్నది. ఏదేవతోపాసనమైనను ఉపాసకులు ఆదరింపవలసిన దేవతారూపములు మూడుకలవు. అవి స్థూల, సూక్ష్మ, తాత్వికములని, వీటిలో స్థూలరూపము ఉపాసకులకు సులభముగా అందుబాటులో ఉండును. ఈ రూపమున కరచరణాద్యవయవములు, పరికరములు షోడశోపచారాదులచే పూజించుట ఆవశ్యకము. ఈ ఆరాధనను బహిర్యాగమందురు. సూక్ష్మరూపమున ఆయాదేవతలకు సంబంధించిన మంత్రములే వాటి సూక్ష్మ రూపములని శాస్త్ర వ్యవహారము. శ్రీదేవికి సంబంధించిన అనేకమంత్ర రాజములలో వాగ్బీజ, కామరాజబీజ, భువనేశ్వరీ బీజ, నవార్ణమంత్రములు గలవు. దేవతల తత్త్వము అంతయు సంక్షిప్తముగా మంత్రములో ఉండుటచేత మంత్రములు దేవతల సూక్ష్మ రూపములని వ్యవహారము. ఇది బహిర్యాగము కంటే చాలాగొప్పది. పరరూప విషయమనగా వాక్కునకు, మనస్సునకు అందనిదై అనుభూతిలో మాత్రము గోచరించునదియు, ఉపాసకులకు జీవన్ముక్తి దశనం కలుగజేసి జీవన్ముక్తులకు సర్వదా అనుభవములో గోచరించునదియు, అగు పరతత్త్వపు సూక్ష్మతమ రూపమునకు పరరూపమని వ్యవహారము. ఈ పరతత్త్వ రూపముతో వేరుగాక కలిసి ఉండి సృష్టి స్థితి లయ తిరోధానానుగ్రహములనెడి పంచకృత్యములను నిర్వహించు పర శక్తియే మూల తత్త్వము. ఆమె లేనిదే విశ్వమందేదియు లేదు. అసలు విశ్వమే లేదు. ఆతల్లియొక్క పరిణామమే ఈవిశ్వము. విశ్వ మందలి ప్రతి అణువు ఆతల్లి రూపమే. ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియా శక్తి అని శక్తి మూడు విధములు సృష్టి జరుగుటలో మొట్టమొదటి పరతత్త్వములో కలుగు ప్రథమ స్పందనమే ఇచ్ఛాశక్తి రూపము. ఇదియే సృష్టిచేయుటకై చేయు భగవానుని సంకల్పము. విశ్వ నిర్మాణమునకై కావల్సిన సామగ్రి సంపాదనకై చేయు వ్యాపారమే జ్ఞానశక్తి. ఆనిశ్చయాను సారముగా విశ్వమును రూపొందించు శక్తియే క్రియా శక్తి. జగన్మాత ఇచ్ఛాశక్తి రూపిణి అగుటచే ఆమె ఇచ్ఛామాత్రముననే ఈ విశ్వమంతయు రూపొందించుచున్నది. శ్రీదేవీ రూపపరిణామమే సకల చిద్ చిదాత్మక చరాచరాత్మక జగత్తులగుటచే ఆమె సర్వ స్వరూపిణీ. ఆమె చిద్రూపీ అగుటవలన అమే చైతన్య రూప, చైతన్యాత్మకమగు ఆమెయొక్క పరిణామమగు ఈ జగమునందలి సకల భూతములును చిద్రూపులే కావలయును కావున ఆమె సర్వభూతములయందలి చైతన్యమై ఉన్నది. ఇట్లు సర్వజ్ఞత్వ సర్వశక్తిమత్వాది లక్షణ లక్షితమైన శ్రీదేవీ రూపము మాయా శబలిత బ్రహ్మగా చతుర్ముఖ బ్రహ్మకు ప్రేరకురాలిగా సర్వులకు శుభములు, ఐహికాముష్మిక సుఖములు ఇచ్చే తల్లి గనుక ఆమే సర్వమంగళా. ఆమే గిరిజ, ఆమే శర్వాణి. ఆమే జ్ఞాన ప్రసూనాంబికా.

సర్వేభ్యో మంగళం ఐహికాముష్మికం సుఖం లాలీతి సర్వమంగలా గిరిజా, శర్వాణీ, సర్వమంగళేతి. అత ఏవ హి జనాః తత్తచ్ఛాస్త్ర మర్యాదాం విలంఘ్యాపి శక్తిశాస్త్రమువలంబంతే. తథాహి. శాస్త్రం ద్వివిధం. వైదికం తాంత్రికం తత్ర తంత్రే భోగలిప్సయా ప్రాయశో చేతి జనాః ప్రవర్తంతే. వైదికానాం వైదికమార్గః ఏవ ప్రవృత్తిః ప్రశస్తా. స్వాధికారానుగుణ్యేన వైదికః

తాంత్రికో వా సముపాస్తే యది పరమం శ్రేయః ఆప్నోత్యేవ. ఇదం సమస్త దేవతా సాధారణముపాసనం. తథాపి శివశక్త్యోరుపాసనం విశిష్టమితి శాస్త్రేష్వవగమ్యతే ॥. భగః శక్తిః భగవాన్ కామఃఈశ ఉభౌదాతారావిహ సౌభగానామితి. వైదికం తాంత్రికం ద్వివిధ్య సర్వదేవోపాసన మితిదిశతి.

వైదికే వైదికస్త్యైవ తాంత్రికే తాంత్రికస్య తు ।
ఇత్థం సమస్త దేవానాం పూజాః విప్రాః ప్రకీర్తితాః ॥ ఇతి

**తస్మాద్యథా కథంచిత్ భజతాం భోగం మోక్షం చ సుఖం**
**దదాతీతి సర్వమంగళా తయా ఽలంకృతా ఆకృతిః ర్మూర్తిః**
**యస్య స సర్వమంగళాలంకృతాకృతిః కాళహస్తీశ్వరః మమ హృది విభాతు.**

అందరికి ఐహికమైన ఆముష్మికమైన సుఖమును సంతోషమును శాంతిని ఇచ్చునది గనుక ఆమె సర్వమంగళా. ఆమె గిరిజ, పార్వతి, శర్వాణి మొదలగునవి ఆమెకు పేర్లు. ఆమె సర్వమంగళస్వరూపా. అందువలననే లోకమున ఉపాసకులు ఆయా శాస్త్రములు సంప్రదాయములు ఒక్కొక్కప్పుడు వాటి శక్తియే ప్రధానముగా శాక్తేయ సంప్రదాయమును అనుసరించు చున్నారు. ఆమె సృష్టి స్థితి సంహారములకు కారణము. శక్తి విశిష్టాద్వైతమువ పరాశక్తియే సర్వ స్వరూపిణి. సామాన్యముగా శాస్త్రము రెండు విధములు వైదికమని తాంత్రికమని. ఈ రెండింటిలో భోగములను ఐశ్వర్యములను అనుభవించుటకై తరచుగా జనులు తంత్రములను అనుసరింతురు. వైదికులు వేదమార్గమున స్మృతిచోదిత స్మృతి బోధిత కర్మలయందే ప్రవర్తించెదరు. కాని వైదికమార్గము అపాయములేని ఉపాయము. కాని వారి వారి అభిరుచులు యోగ్యతలను అనుసరించి వైదిక మార్గమునుగాని తాంత్రిక మార్గమును అనుసరించి వారి వారి కోరికలను తీర్చు కొనుచున్నారు. ఇది అన్ని ఉపాసనలకు దేవతలందరికి సాధారణమైన శాస్త్రవిధానము. ఐనప్పటి వేదోక్తమైన దేవతలందరిలో కంటే గౌరీ శంకరుల ఉపాసన చాలాగొప్పదని అనేకశాస్త్రములు చెప్పుచున్నవి. శైవ శాక్తేయ ఆగమముల వలన గూడా తెలియుచున్నది. భగము అనగా జ్ఞానము, వైరాగ్యము. కీర్తి, ధర్మము మోక్షము ద్వాదశాదిత్యులలో ఒకడు, ఇచ్ఛ, వీర్యము. మహాత్మ్యము. యోని అని అర్థము. శక్తిని ధరించువాడు, భరించువాడు భగవంతుడు. అతనే ఈశ్వరుడు. అతను కోరిన కోరికలను ఇచ్చువాడు. కనుక వైదిక మార్గమున గాని తాంత్రిక మార్గమున ఆయనను ఉపాసించిన ఆయన ఫలప్రదాతే. భోగము మోక్షమును సుఖ శాంతులను ఇచ్చునది కనుక పార్వతి సర్వమంగళా. ఆమెచే అర్ధశరీరమును అలంకరింపబడినవాడు అర్ధనారీశ్వరుడు ఆయన. సర్వమంగళచే అలంకరింపబడిన మూర్తి కలవాడు. అటువంటి సర్వమంగళాలంకృతుడైన శ్రీ కాళహస్తీశ్వరుడు నాహృదయమున ఎల్లవేళలా ప్రకాశముగా ఉండుగాక.

## అనాదినిధనః 23

ఆది అనగా జన్మకు మొదలు. జన్మ లేనిది అనాది. ఆది అనగా మొదలు పుట్టుక, ప్రారంభము మొదలగునవి ఆది పదమునకు అర్థము. ఆది లేనిది అనాది. అనాది అనే పదమునకు చాలాకాలము అనే అర్థము కూడా కలదు. నిధనం అనగా వినాశము. చావు, చేటు అని అర్థము. కనుగ అనాది నిధనః అనగా పుట్టుక చావులేని వాడు అని అర్థము. ఆదిః అనగా పుట్టుకకు కారణము కలిగినది. (సంచిత ప్రారబ్ధకర్మలు) నియతమైన పూర్వవర్తి కారణము కలిగినది ఆ కారణము లేనిది అనాదిః ఆది లేకున్నను చాలా కాలము ఉండునది.

ఆదిః ప్రారంభః ఉద్భవః, నిధనః నివృత్తిః అర్థ సంబంధః అత్రేతి నిధనః, నవిద్యతే ఆదిః నిధనశ్చ అస్యేతి అనాదినిధనః జనిమృతిరహిత ఇత్యర్థః

**అజాత ఇత్యేవం కశ్చిద్భీరుః ప్రపద్యతే ।**
**న తస్య కశ్చిత్పతిరస్తి లోకే నచేశితా నైవ చ తస్య లింగం**
**నకారణం కరణాధిపాధిపో న చాస్యకశ్చిజ్జనితా నచాధిప ఇతి**

ననుః యదుత్పద్యతే తస్యాంతో భవతి. యన్నోత్పద్యతే తన్నిత్య మితి వ్యవహారాత్ అనాది శబ్దాదేవ అర్థ సిద్ధేః కిమర్థం నిధనశబ్ద ఇతి చేత్ ఉచ్యతే. అనాదిః సాంత ప్రాగభావః కశ్చిత్పదార్థః సాదిరనంతః ప్రధ్వం సాభావః చేతి కేషాంచిత్తీర్థ కరాణాం వ్యవహారదర్శనాత్ తదుభయనివృత్యర్థం అనాదినిధనః ఇత్యుచ్యతే. ఏవం భూతో భగవాన్ రక్షత్విత్యర్థః

ఆదిః అనగా ప్రారంభము పుట్టుక అని అర్థము కుండను చేయుటకు మట్టిని ముద్దగా చేయుట ఘటనిర్మాణమునకు ప్రారంభము. నిధనమనగా నివృత్తి అనగా ప్రవృత్తి నుండి విరమించు కొనుట సంసారమును వృద్ధి చేయవలెనని భార్యను పరిగ్రహించి ఆమెద్వారా సంతానమును పొంది వారిలో అనుబంధము ప్రేమ, మమకారములు పెంచుకొని వారికోసం ధనకనక వస్తువాహనాదికములను సంపాందించుకొనుట ( ఆత్మనస్తు కామాయ సర్వం ప్రియం భవతి) సంసార ప్రవృత్తి. ఈ ప్రవృత్తి సంబంధమునుండి అప్రయత్నముగా విడిపోవుట, మరణించుట, తన ఉనికిని తెలియనీయకుండుట, నిధనము, అది లేనిది అనాది. పరమేశ్వరుడు ఆదియు అంతములేనివాడని అర్థము. పుట్టుక ఉంటే గదా! మరణించుట. కనుక పరమేశ్వరుడు జనన మరణములకు అతీతుడు. అసలు పరమేశ్వరునికి పుట్టుకే లేదని వేదము చెప్పుచున్నది. పుట్టుకలేనివాడు అనేక లోకములతో గూడిన బ్రహ్మాండములను రక్షించుచున్నాడు. ఎవరికి ఉత్పత్తి కలదో వారికే నాశము కలిగి ఉండుట లోకసహజముగా చూచుచున్నాము. దేనికైతే ఉత్పత్తి లేదో అది నిత్యముగా ఉండునని లోకవ్యవహారము. ఆది లేనప్పుడు అంతము కూడా ఉండదు అందువల్ల నిధన శబ్దమును ఎందుకు చెప్పవలసి వచ్చినదనిన అభావములు నాలుగు విధములు. ప్రాగభావమని ప్రధ్వంసాభావమని అత్యంతాభావమని అన్యోన్యాభావమని. ప్రాగ భావనముగా ''అనాదిః సాంతః ప్రాగభావః ఉత్పత్తేః పూర్వం కార్యస్య'' ఒక కార్యముయొక్క ప్రారంభమునకు ముందు ఉండునది. అనాది ఐనది అంతము కలది ప్రాగభావము ఘటనిర్మాణమునకు ముందు క్షణమువరకు ఘట ప్రాగభావము గలదు. ఇప్పుడు చేసే ఘటమునకు ముందు ఉండేది ప్రాగభావము. ప్రధ్వం సాభావము అనగా ''సాదిరనంతః ప్రధ్వంసాభావః ఉత్పత్యనంతరం కార్యస్య'' కర్రచేతగాని రాయిచేతగాని మరేపరికరములచేత కుండను పగుల కొట్టినచో ఆకుండ ధ్వంసమైపోవును. ధ్వంసకు ప్రాగభావత్వము లేదు. ఒకసారి పగిలిన కుండ మరలా మాటిమాటికి పగలదు గనుక ధ్వంసకు ప్రతియోగిలేదు. సామాన్యముగా ధ్వంస పుట్టిన తర్వాతేవస్తువు సంభవించును. ఇక అత్యంతాభావమనగా ''త్రైకాలిక సంసర్గాభావః'' త్రైకాలికమనగా నిత్యము.-ఎల్లవేళలా ఉండునది అని అర్థము. ''ప్రాగభావ అప్రతియోగిత్వే సతి ప్రధ్వంసాప్రదియోగిత్వేసతి అనోన్యా భావభిన్నత్వే సతి అభావత్వం '' ఇది ఆరువిధములు. సామాన్యాభావము. విశేష, బేధము, విశిష్ట భేదము. ఉభయభేదము, అన్యతర భేదము, సముదాయ భేదము. ప్రత్యేక భేదము మొదలగునవి అన్యోన్యాభావమనగా ''తాదాత్మ్య సంబంధావచ్ఛిన్న ప్రతియోగితాకోఽభావో అన్యోన్యాభావః దీనికి 'యేన సంబంధేన యన్నాస్తీ త్యుచ్యతే తన్నిష్ఠా ప్రతి యోగితా తత్సంబంధావచ్ఛిన్నా''

అద్వైతాభావముగా మనము మనముగాదు. ఉన్నదే మనము మనము కాదు అని చెప్పెను. అటువంటి అద్వైత విభావన్నయితైన అనాదినిధనుడైన సదాశివుడైన శ్రీకాళహస్తీశ్వరుడు మమ్ములను రక్షించుగాక.

## శంభుః 24

శం సుఖం భక్తానాం భావయతీతి శంభుః సుఖమును అనగా సుఖము నిచ్చువాడు, సుఖరూపము మనసు నిచ్చువాడు, భక్తులకు సుఖ శాంతులను కలుగజేయువాడు శంభుః శివుడు.

శం సుఖం పరమానందో మోక్షః అస్మాదేవ భవతీతి శంభుః యద్యపి స్వదేశికోపదిష్టజ్ఞానేన సాధనసంపన్నాః ముక్తాః భవంత్యేవ. తథాపి తేషాం తేషామపి గురూణాం శంభురేవ పరమో గురురితి. భగవాన్ పతంజలిః సూత్రయామాస ఈశ్వరం ప్రస్తుత్యాహ సపూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాదితి. శివ పురాణే చ:

**ప్రతిసర్గం ప్రసూతానాం బ్రహ్మణాం శాస్త్రవిస్తరం ।**<br>
**ఉపదేష్టా స ఏవాపీత్కాలావచ్ఛేద వర్తినాం ॥**<br>
**కాలావచ్ఛేదయుక్తానాం గురూణామప్యసౌ గురుః ॥ ఇతి**

తస్మాద్శిష్యాయ తత్త్వోపదేశసమయే గురుశ్శివోఽహం భావనయా ఉపదిశతి.తథాహి న పరేణాపరేణ ప్రోక్త ఏష సువిజ్ఞేయో బహుధా చింత్యమానః అనన్య ప్రోక్తే గతిరత్ర నాస్తి హ్యణీయాన్హ్యతర్క్యమణు ప్రమాణాదితి తస్మాన్మూలగురుః స శంభుః అస్మాకం మోక్షం దద్యాదిత్యర్థః.

శం అనగా సుఖము, పరమానంద రూపమైన మోక్షము ఈ సదాశివుని ద్వారానే అగును. కావున అతనే శంభుః అసలు ఆయా కులగురువుల, ఆచార్యుల ఉపదేశముల ద్వారా ఆత్మ జ్ఞానముసకై సాధన సంపన్నులై జ్ఞానముద్వారా ముక్తిని పొందుచున్ననూ, ఆయా ఉపదేశికులకు, ఆచార్యులకు, కులగురువులకు కూడా శివుడే మూల గురువు అని పతంజలి మహర్షి ఈశ్వరుని తత్త్వమును సూక్ష్మముగా చెప్పెను. ఆసదాశివుడు అన్ని కాలములయందు అందరికి పరమగురువు. అతడే అన్ని శాస్త్రములను వేదసారమును, మనుష్యుడు తరించే మార్గమును మోక్షమును ఇచ్చుటలో, భౌతికములైన ఇహ లోకమును గూర్చిన విజ్ఞానము బోధించగలడు. శివపురాణమున బ్రహ్మదేవుడు సృష్టి చేయు ప్రతీసారీ ఆయాకాలమునకు అనుగుణముగా సదాశివుని ఉపదేశాను సారముగా మహత్తు. అహంకార, భూత, ఇంద్రియ దేవ, తమస్సు, వనస్పతి, తిర్యక్ మనుష్య సర్గరూపములైన నవవిధ సృష్టిని చేసి సదాశివుని అనుగ్రహమునకు పాత్రుడాయెను. కావున బ్రహ్మదేవునకు సర్గ ప్రతి సర్గ ప్రసూతమైన ఈ సృష్టిని చేయు విధానమును ఉద్దేశించిన సదాశివుడు ఆది గురువు. కాలానుగుణముగా వచ్చిన ప్రతివ్యక్తికి అతడే గురువు. ఇప్పుడు కూడా పిల్లలకు అక్షరాభ్యాసము చేయునప్పుడు శివ పంచాక్షరి ఐన "ఓం నమః శివాయ" అని పలకల మీద దిద్దించుట కలదు. కావున అక్షరాలు నేర్చిన వారందరికి శివపంచాక్షరీ అధినాథుడైన సదాశివుడే పరమ గురువు. కాలానుగుణముగా వచ్చే గురుపరంపరకు కూడా సదాశివుడే ఆది గురువు. "సదాశివ సమారంభాం శంకరాచార్య మధ్యమాం" అనికదా సంప్రదాయము. అందువలన శిష్యునకు తత్త్వోపదేశ సమయము శ్రీసదాశివుడే గురువుగా భావించి భక్తి ప్రపత్తులతో విద్యాభ్యాసము చేయవలెను. "ఈశ్వరానుగ్రహాదేవ పుంసాం అద్వైత భావన' అద్వైత వేదాంత జ్ఞానమును ముముక్షువులు పొందవలెనన్నచో శ్రీసదాశివుని

అను గ్రహము తప్పక అవసరము. ఆయన అను గ్రహము వలననే మానవులకు అద్వైత భావన. ఆధ్యాత్మిక దృష్టి కలుగును.

కఠోపనిషత్తునందు ప్రథమాధ్యాయము ద్వితీయవల్లి 8వ మంత్రమున ''న నరేణావరేణ .... అణుప్రమాణాత్'' అని కలదు. తత్త్వము గూర్చి దానిని ఉపదేశించినవారి గూర్చిన వివరణ ఈ మంత్రమున కలదు. సామాన్యముగా ఆత్మ తత్త్వమును ఉపదేశించువారు దార్శనికులు. సామాన్యముగా ఉపదేశికులు ఉత్కృష్టులు నికృష్టులని రెండు విధములు. ఉత్కృష్టులు తత్త్వ సాక్షాత్కార సంపన్నులు శ్రేష్ఠమైన ఉపన్యాసకులు, వరిష్ఠులు గూడా. ఆత్మను గూర్చి తత్సాక్షాత్కారము గూర్చి సరైన అవగాహనలేక తత్త్వమును సరిగా ఉపన్యసించలేక ఏదో మాట్లాడే వారిని నికృష్టులు, ప్రాకృతులు అవరులు అని అందురు. ఆత్మ తత్త్వ సాక్షాత్కారమున మోక్ష విషయమున దార్శనికులలో కొద్ది భేదాలు కలవు. విషయమును ప్రతిపాదించుటలోను చెప్పే విధానములో చాలా భేదాలు కలవు. అద్వైత వేదాంత దర్శనమున ఉపదేశించబోవు ఆత్మతత్త్వము పారమార్థికముగా అన్యముకాదని తానూ ఆ పరతత్త్వ రూపుడని ఎరిగిన ఆచార్యుడు ఉపదేశింపగా ఆపర తత్త్వమే నీవని మోక్షము గూడా ఆ పరతత్త్వమే అని నిశ్చయ జ్ఞానము గల ఆశిష్యుడు ముక్తుడాయెను. ఈతత్త్వము ఊహింపరానిది. ఊహించుటకు నిలకడలేని కుశాగ్రబుద్ధులైన తార్కికుల సైతము పరతత్త్వము ఊహతో ప్రయత్నించి నిర్ణయించిన విషయమును ఆతర్వాత మరి ఒక తెలివైన వాడు ఆ నిర్ణయమును తలక్రిందుల చేసి మరొకరీతిన నిర్ణయింపగలరని భావము. కావున తార్కికమైన ఊహకు పరిధులు, అవధులు లేవు. ఆ ఊహ సక్రమము కానిచో అది శుష్క తర్కమై నిష్ప్రయోజనము కాగలదు. కావున కేవలము శుష్క తర్కముతో ఆత్మ తత్త్వము ఊహింపరాదు. ఆత్మతత్త్వము ఆచార్యోపదేశమే కావలయును. సింహము మొదలగు క్రూర జంతువులనుండి అవును కాపాడినట్లు ఆత్మతత్త్వోపదేశమునకు తర్కమునుండి సద్గురువే కాపాడగలరు. కావున పరతత్త్వము బ్రహ్మ నిష్ఠుడై ఆత్మసాక్షాత్కార సంపన్నుడైన సద్గురువు వలననే తెలుసుకొనవలెను. కావున ఆచార్యులందరికి ఆచార్యుడైన శంభువు మనకు మోక్షము ఇచ్చుగాక.

## సచ్చిదానందరూపధృక్ 25

**సచ్చ చిచ్చ ఆనందశ్చ సచ్చిదానందాః తేషాం రూప ధత్త ఇతి సచ్చిదానందరూపధృక్. ''సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ సదేవ సోమ్యేద మగ్ర ఆసీత్'' (ఛాందోగ్యః 6-2-11 పింగలః 1-1 తైత్తరీయ 2-2-1, సర్వసారం: 6. నారాయణ ఉతా, 1-5, (త్రి.వి.మహానా: 3-3)**

ఆనంద ఆత్మేతి ఏతే సచ్చిదానంద శబ్దాః శివస్య లక్షణార్థాః భవంతి యత్ కాలత్రయాబాధ్యం తత్సత్ యా స్వయం ప్రకాశతే సాచిత్ జ్ఞానం యన్నిత్యనిరుపాధికనిరతిశయ సుఖమానందః ఏకస్మిన్ ఘటే వృదాత్మికా సత్తా ఘటరూపేణ భానం చిత్ తన్నిష్ఠ ప్రియమేవానంద ఇతి సచ్చిదానందాః కారణ నిష్ఠ లక్షణాని సర్వత్రాను భూయంతే. తతః సచ్చిదానందాత్మకం పూర్ణం రూపం ధత్త ఇత్యర్థః।

యేన రూపేణ యద్రూప్యతే యేన రూపేణ వినా యన్నావగమ్యతే తదేవ తస్య రూపమితి న్యాయాత్ సర్వాత్మా సః శివః సచ్చిదానందరూపధృక్ ఉక్తార్థే పురాణ సూక్తిశ్చ అసత్యాలంబనత్వేన సత్యః సర్వజడస్య తు సాధకత్వేన చిద్రూపః సదా ప్రేమాస్పదత్వతః

**ఆనందరూపః సర్వార్థః సాధకత్వేన హేతవా**
**సర్వసంబంధవత్త్వేన సంపూర్ణః శివసంజ్ఞితః ॥**
**ఇతి సచ్చిదానందరూపీ కాళహస్తీశ్వరో మహ్యం సాక్షాత్కరోత్విత్యర్థః ।**

సచ్చిదానందమనగా సత్యమైనదియు నిత్యమైనదియు ఆనందమైనదియు అగునది. సత్ అనగా నిర్మలమైనది, స్వచ్ఛమైనది, దోషరహితమైనది అని అర్థము. నిత్యమనగా భూత భవిష్యద్వర్తమాన కాలములలో నాశరహితముగా ప్రకాశించునది. ఆనద రూపము కలిగినది ఈ రకములైన రూపములను ధరించినవాడు శ్రీకాళహస్తీశ్వరుడు. సత్యము, జ్ఞానము, అనంతము బ్రహ్మము అనగా అది సత్యమై జ్ఞానమై అనంతమైయున్నది. అదే పరమవస్తువు, సత్యమనగా ఏవస్తువు, ఏరూపముగా నిశ్చయింపబడుచున్నదో ఆవస్తువు. ఆరూపమునందు మారక ఉండేది. జ్ఞానమనగా తెలివిగల వస్తువు, అనంతమనగా ఏదీ ఏచోటను విభజింపబడనిదియు ఎల్లలు లేనిది ఆ వస్తువు అగును. సర్వప్రపంచమును సత్ అను శబ్దముచే వ్యవహరింపబడుచూ సద్రూపముగానే స్ఫురించుచూ సత్తామాత్రము చేతనే వ్యాపింపబడి ఉన్నది. కనుక ఈ ప్రపంచముయొక్క చైతన్యమే అంతటా వ్యాపింపబడి ఉన్నది. కనుక ఈ ప్రపంచము యొక్క ఉత్పత్తికి పూర్వము నామరూప క్రియాకల్పితమైన భేదము లేక, అద్వితీయాఖండైక రసస్వరూపమై నిర్వికారాంగ చిన్మాత్రాధిష్ఠాన సత్తా మాత్రమే ఉన్నదని చెప్పుటయే శ్రుతి తాత్పర్యము. ఆత్మ ఆనంద స్వరూపము ఆనందములలో మిక్కిలి గొప్పది బ్రహ్మానందము. సత్, చిత్ ఆనంద శబ్దములు శ్రీసదాశివుని తత్త్వమును ఆయన లక్షణములను తెల్పును. చిత్ అనగా ప్రకాశము అని అర్థము. అది జాగ్రత్ స్వప్న సుషుప్తి కాలములయందునూ భూత భవిష్యద్వర్తమానకాలములయందు నాశములేనిదై అసత్ స్వయం ప్రకాశముగలదై ఉన్నది. చిత్ అనగా జ్ఞానము అని అర్థము. ఇది నిత్యము ప్రకాశించునది. మానవాది దేహ రూప ఉపాధిలేనిదై నిరతిశయమైన సుఖమును ఆనందమును సమకూర్చువాడు పరమేశ్వరుడు. ఇది ఎలాగంటే ఒక కుండయందు మట్టి కలిగి ఉండేటివంటిది (సత్) కుండగా కనిపించే ఒకరూపం మరియు ఆకారం (చిత్) దానియందు ఉండే అభిమానం మమకారం (ఆనందః) మొదలగు సవియే సచ్చిదానందమైన కారణముఖ ఆలక్షణములు అంతటా కనిపించి వాటిని మనము అనుభవమునకు తెచ్చుకొనుచున్నాము. పరమేశ్వరుడు సచ్చిదానందరూపుడై సంపూర్ణ ప్రకాశమును ధరించి ఉన్నాడు. ఏతత్త్వముద్వారా నిరతిశయమైన స్వరూపము తెలియబడుచున్నదో, ఏ స్వరూపము తెలియనిచో ఏదీ తెలియదో అదే అతని రూపమనే న్యాయమువలన సర్వాత్మకుడైన పరమశివుడు సచ్చిదానందరూపుడై అనేక స్మృతి శ్రుతి పురాణాగమములచేత సదాశివుడు ఆనందస్వరూపుడు అని, భక్తులను అనుగ్రహించుటకై శ్రీకాళహస్తీశ్వరుడిగా అవతరించిన ఆయన నన్ను అనుగ్రహించి నాకు ఆదివ్య మంగళ విగ్రహదర్శన భాగ్యాన్ని ప్రసాదించుగాక.

## హిరణ్య గర్భ జనకః 26

సృష్టి చేయుటకు సౌకర్యమునకై చతుర్ముఖ బ్రహ్మ విశ్వుడు, హిరణ్య గర్భుడు, అని ఇద్దరిని సృష్టించెను. ఈ హిరణ్యగర్భుడు అనగా అపంచీకృత పంచమహాభూతములు, వాటి తన్మాత్రలు, వాటి కార్యములు, పంచప్రాణములు, పది ఇంద్రియములు మనస్సు బుద్ధిని కలుపుకొని 17 సంఖ్యగల శరీరమునకు లింగ శరీరము అని దీనిని భౌతిక లింగ శరీరము. ఈ శరీరాభిమాని హిరణ్య గర్భుడు. ఈ సూక్ష్మ శరీరమునకే ఆత్మ అనిపేరు.

జ్ఞానేంద్రియాణి పంచైవ పంచకర్మేంద్రియాణి చ ।
శ్రోత్రత్వక్ నయన ఘ్రాణ జిహ్వేదీంద్రియ పంచకం ॥
వాక్పాణి పాదపాయూపస్థా కర్మేంద్రియ పంచకం ।
మనో బుద్ధి రహంకారః చిత్తం చేతి చతుష్టయం ॥
సంకల్పాఖ్యం మనోరూపం బుద్ధిః నిశ్చయ రూపిణీ ।
అభిమానాత్మకః తద్వదహంకారః ప్రకీర్తితః ॥
అను సంధాన రూపం చ చిత్తం ఇత్యభిదీయతే ।
ప్రాణోఽపానః తథా వ్యానః ఉదానాఖ్యః తథైవ చ ॥
సమానశ్చేతి పంచైతాః కీర్తితాః ప్రాణ వృత్తయః ।
ఖం వాయ్వగ్ని అంబుక్షితయో భూత సూక్ష్మాణి పంచ చ ॥
అవిద్యా కామ కర్మాణి లింగం పుర్యష్టకం విదుః ।
(శ్రీసురేశ్వరాచార్య విరచిత పంచీకరణవార్తికము)

అసలు హిరణ్యగర్భుడనగా సర్వజీవులకు సూక్ష్మ శరీరముగా ఉండే ఆత్మఅని, బంగారు అండమునుండి పుట్టినవాడని, బంగారపు అండములను సృజించువాడని అర్థము కలదు.

హిరణ్మయం రుద్రవీర్య పరిణామరూపం గర్భే జఠరస్థిత్యవస్థాయాం యస్య నః హిరణగర్భః తం జనయతీతి హిరణ్యగర్భజనకః నను విష్ణురేవహి నిజనాభి పంకజ ద్వారా విధిం జనయామాసేతి తథా సవిధిశ్చ రుద్రమితి భాగవతే దృశ్యతే. కథం రుద్రస్య బ్రహ్మాజనకత్వం ఉపపద్యతే ఇతి చేత్ సత్యం. క్వచిత్కల్పాదౌ విష్ణునాభి సుషిరాదేవజాతః విధిః తద్ధిరణ్మయం బీజం రౌద్రమితి తస్య జనకః త్వముక్తం రుద్రతేజో సో హిరణ్మయత్వం ప్రసిద్ధం.

హిరణ్మయము అనగా రుద్రుని వీర్యము యొక్క పరిణామ రూపముగా గర్భమునందు జఠరాగ్నిలో ఎవరికి ఐతే ఉన్నదో అతను హిరణ్యగర్భుడు. అంటే రుద్ర వీర్యమునకు అగ్నికి అభేదము. మనము తినిన ఆహారమును జఠరాగ్ని వీర్యముగా మార్చి శరీరమునకు బలమును చేకూర్చును. హిరణ్యగర్భుని పుట్టించినది అతని జన్మకు కారకుడైనవాడు, తండ్రి లాంటివాడు గనుక సదాశివుడు హిరణ్య గర్భజనకుడు. ఐతే ఇచట ఒకప్రశ్న ఉద్భవించుచున్నది. అది ఏమనిన హిరణ్యగర్భుడనగా బ్రహ్మ. ఆబ్రహ్మ శ్రీమహావిష్ణువుయొక్క నాభికమలమునుండి పుట్టినాడని, కావున అతని తండ్రి శ్రీమహావిష్ణువు. కనుక రుద్రజనకత్వం బ్రహ్మకు ఎట్లు లభించును అన్నచో ఒక్కొక్క కల్పములో సృష్టి విధానము ఒక్కొక్క విధముగా ఉండును. సృష్టి విధానము పరబ్రహ్మయొక్క సంకల్పము మీద ఆధారపడి ఉండును. అందువల్ల ఒక కల్పమునందు శ్రీమహావిష్ణువుయొక్క నాభిరంధ్రమునుండి బ్రహ్మదేవుడు పుట్టెను. కావున అది ఆకల్పమునకే అది పరిమితము. ఆ కథే ప్రచారములో ఉన్నందు మిగతా కథలు సామాన్యులకు తెలియవు. కావున ఆ రుద్ర సంబంధమైన బంగారు రంగుగల రేతస్సునుండి హిరణ్య గర్భుడు జన్మించెను. కనుక అతని తండ్రి సదాశివుడు. రుద్రుని తేజస్సు బంగారు రంగులో ఉండునని అందరికి తెలిసినదే గదా!

శ్రీమద్రామాయణ స్కాందాదౌ: – ''యోబ్రహ్మాణం విదధాతి పూర్వం యో దేవానాం ప్రభవశ్చోద్భవశ్చ విశ్వాధికో రుద్రో మహర్షిః. హిరణ్య గర్భం జనయామాసేతి. రుద్రవీర్యస్య విష్ణుః క్షేత్రమాసీత్. శ్రీగార్యంశభూతే హరౌ సర్గాదౌ నిహితం యద్రౌద్రం తేజః తత్కాలేన పరిణతో విధిః తన్నాభిః సుషిరాన్నిజగామేతి. లైంగబ్రహ్మాండయోః దృశ్యతే. తత్రతః –

**ఉమాయా సా హరిః సాక్షాత్ యో హరిః సా శివా స్మృతా**
**ప్రకృతిస్త్వం పుమాన్రుద్రః త్వయి తద్వీర్యమాహితం**
**త్వన్నాభిపంకజా జ్జాతః పంచవక్త్రః పితామహః ॥** ఇతి

శైవసిద్ధాంతవచనేషు విధిః విష్ణూ రుద్ర ఏవ సృజతి సంహరతి చ. తథాచ విశ్వతైజస ప్రాజ్ఞ ఇతి వేదాంతమతం.

బ్రహ్మజననము గూర్చి శ్రీమద్రామాయణ స్కాందపురాణములలో వివరముగా కలదు. ఎవరైతే సృష్టి చేయుటకు ముందు బ్రహ్మను సృష్టి చేయుచున్నారో ఎవరు దేవతలను విచిత్ర శక్తిమంతులుగా ప్రభావశాలులుగా తీర్చిదిద్దిరో విశ్వమునకు ప్రభువైన అట్టి రుద్రుడు హిరణ్యగర్భుని పుట్టించెను. రుద్రుని వీర్యమునకు విష్ణువు క్షేత్రముగా మారెను. శ్రీగౌరీదేవి అంశగా శ్రీహరి అవతరించిరి. సర్గమనగా అధ్యాయమని, విసర్జనమని, నిశ్చయమని, ఉత్సాహమని మోహమని స్వభావమని సృష్టి అని అర్థము. ఆ సర్గసమయమున రుద్ర సంబంధమైన తేజస్సు ఎచట ఉంచబడినదో అది కాలాంతరమున పరిణామముచెంది బ్రహ్మదేవుడు శ్రీహరి నాభిరంధ్రమునుండి బయటకు వచ్చెను. ఉమాదేవి శ్రీహరిగా శ్రీహరే సాక్షాత్ ఉమాదేవే అని సాక్షాత్ ఉభయులకు అభేదము. విష్ణువు ప్రకృతిగాను రుద్రుడు పురుషుడుగాను స్త్రీగా ఉన్న విష్ణువుయందు పురుషుడైన రుద్రుని వీర్యము ద్వారా బ్రహ్మ ఉదయించెను. నాభి, పంకమునుండి బ్రహ్మ పుట్టెను. కనుక అతను పంచవక్త్రుడుగా పితామహునిగా లోకమున ప్రసిద్ధి వహించెను. మరి ఒక కల్పమున రుద్రుడే బ్రహ్మను విష్ణువు సృజించి లయము చేసెను. విశ్వుడనగా ''విశ్వం వైరాజరూపేణ పశ్యేద్భేద నివృత్తయే'' – తైజసుడనగా 'గ్రాహ్య గ్రాహక రూపేణ స్ఫురణం స్వప్న ఉచ్యతే, అభిమానీ తయోర్యస్తు తేజసః పరికీర్తితః ''ప్రాజ్ఞుడనగా'' అభిమానీ తయోర్యస్తు ప్రాజ్ఞఇత్యభిధీయతే జగత్కారణ రూపేణ ప్రాజ్ఞాత్మానం విచింతయేత్'' విశ్వతైజసప్రాజ్ఞులను ఓంకారముగా స్మరించుట కలదు.'' అకారమాత్రః విశ్వః స్యాదుకారః తైజసః స్మృతః ప్రాజ్ఞోమకార ఇత్యేవం పరిపశ్యేత్క్రమేణతు. అకారం పురుషం విశ్వం ఉకారే ప్రవిలాపయేత్ ఉకారం తైజసం సూక్ష్మం మకారే ప్రవిలాపయేత్, మకారం కారణం ప్రాజ్ఞం చిదాత్మని విలాపయేత్ చిదాత్మాఽహం నిత్యశుద్ధ బుద్ధ ముక్త సదద్వయః అందువల్ల జాగ్రత్ స్వప్న సుషుప్తులయందు విశ్వుడు తైజసుడు ప్రాజ్ఞుడు అభిమానులు అని అద్వైత వేదాంతులు చెప్పుచున్నారు. ఏవం తర్హి :

**లలాటే చింతయన్ బ్రహ్మ తపస్యగ్రే వ్యవస్థితః ।**
**తల్లాటాద భూచ్ఛంభుః సృష్ట్యర్థం తన్నరూషణం ॥**

ఇతి సృష్టి జిజ్ఞాసయా నిధ్యాయతో విధేః స్తంభాన్నిర్గచ్ఛన్నరహరివత్ ఫాలతః ఆవిర్భావమాత్రేణ యది రుద్రస్య నికర్షవాదః కశ్యపముని దశరథాది వీర్యసంసర్గ గర్భ వాసాదీన్ విష్ణోః నికర్ష వాదాన్ కథంవా పరిహరేత్ తస్మాద్గుణమూర్తయః విధివిష్ణు హరాః శివస్య విభూతయః ఏవ తే తు శివమారాధ్య పరస్పరం జన్యజనక భావ మాప్నువంతి. తేషు రుద్రః వరిష్ఠః ఏవ.

ఒక సమయమున చతుర్ముఖ బ్రహ్మ సదాశివుని గూర్చి ఘోర తపస్సుచేసి శ్రీసదాశివుని ప్రసన్నుని చేసుకొని లలాటమున ఆయనను దర్శించి ఆయన అనుగ్రహమున సృష్టి చేయుట ప్రారంభించెను. ప్రహ్లాదుని రక్షించుటకు శ్రీహరి నరసింహ రూపునిగా స్తంభమున అవతరించినట్లు సృష్టి విజ్ఞానమునకై బ్రహ్మ శ్రీసదాశివుని దర్శనమునకై ఎదురు చూచుచుండగా

ఫాల ప్రదేశమున సాక్షాత్కరించెను. దేవతలు మానవ గర్భ వాసమున జన్మించుట పురాణములలో కలదు. శ్రీమహావిష్ణువు. కశ్యప ప్రజాపతి గర్భమున వామన మూర్తిగా, భృగుమహర్షి గర్భమున పరశురాముడుగా, దశరథుని గర్భమున శ్రీరామునిగా వసుదేవుని గర్భమున శ్రీకృష్ణునిగా అవతరించిరి. సత్త్వరజస్తమో గుణములకు ప్రతీకులైన బ్రహ్మావిష్ణుమహేశ్వరులు పరమేశ్వరుని ఐశ్వర్య రూప ప్రతిరూపములు.

ఆ త్రిమూర్తులు పరమేశ్వరుని ఆరాధించి ఆయనను తండ్రిగా పొందిరి. ఆ త్రిమూర్తులలో రుద్రుడు చాలా గొప్ప వాడు.

**తథాచ సనత్కుమార సౌరసంహితాదౌ:-**

**తే రుద్ర విష్ణు బ్రహ్మాణః పరస్పర జయేషిణః ।**
**క్వచిత్కల్పే ప్రధానోఽభూత్ బ్రహ్మహరి హరాదపి ॥**
**ఉపసర్గా భవేతాం హి తదా విష్ణు భవా ఉభౌ ।**
**బ్రహ్మహరేః నాభితోఽపి జాతః తత్ఫాలతో హరః ॥**
**క్వచిత్కల్పేఽథ రుద్రో సౌ ఉభౌ విష్ణు విధీస్సృజన్ ।**
**అన్యోన్యకారణాత్మానౌ భవంతి శివసేవయా ॥**
**తత్తత్కల్పాంత వృత్తాంతం పురాణాని వదంతి హి ।**
**తథాపి రుద్రః సంహర్తా వరిష్టః ఇతి సంమ్మతం ॥**
**ఉత్కర్షశ్చాపకర్షశ్చ న శివే పరమాత్మని ।**
**కింతు సౌరూప్యతః శంభో రుద్రే మూఢాః వదంతి హీతి ॥**

తస్మాన్మహాసంహార ప్రళయావసానే రుద్ర విష్ణు విధ్యాదీన్ శివః ఏవ సృజతి. పునరవాంతరే శివతేజోవ్యాప్త్యా హరిః హరో వా విధిర్వా స్వసామర్థ్యం ప్రకటయంతి. అతశ్చాత్ర బ్రహ్మణః శరీర బీజం రౌద్రం తత్‌క్షేత్రం హరిః ఇత్యుక్తం అత ఏవ హిరణ్య గర్భ జనకత్వం తస్యేతి మంతవ్యం స శివః పుత్రాదిసంపదం దద్యాదిత్యర్థః.

సనత్కుమార సౌర సంహిత మొదలగు సంప్రదాయ పురాణముల యందు ఒకప్పుడు బ్రహ్మవిష్ణుమహేశ్వరులు ఒకరిని మరిఒకరు జయించు కొనవలెనని ఒక కల్పాంతమందు భావించగా అందులో పరమేశ్వరుడే అందరికన్నా ప్రధానుడుగా అవతరించెను. ఆపరమేశ్వరుడు మొదట విష్ణువును సృజించగా, తర్వాత శ్రీహరినాభినుండి బ్రహ్మ పరమేశ్వరుని ఫాలభాగమునుండి మహేశ్వరుడు ఉదయించిరి. మరి ఒక కల్పమున రుద్రుడే బ్రహ్మ విష్ణువులను సృజించెను. బ్రహ్మ విష్ణువులు సృష్టి చేయుటకై వచ్చినవారు. వారు కారణ జన్మలు, పరమేశ్వరుని సేవకై అవతరించినవారు. పురాణములలోని కథలు. ఆయాకల్పముల వృత్తాంతముల ప్రకారము పరమేశ్వరుడే గరిష్ఠుడు, వరిష్ఠుడు సర్వశక్తి సమన్వితుడు. ఆయనకు ఉత్కర్షలు, అపకర్షలు లేవు. సర్వమునకు అతీతుడు కానీ మూర్ఖులు ఆయనను తెలుసుకొనలేక తామసముగా మాట్లాడుదురు. మహాప్రళయమైన పిదప మరలా జగన్నిర్మాణముకై పరమేశ్వరుడు బ్రహ్మ విష్ణు మహేశ్వరులను సృష్టి చేయును. వారు శివతేజస్సును ధరించిన పిదప వారు సమర్థులగుచున్నారు. అందువలన బ్రహ్మ శరీరోత్పత్తికి బీజము రుద్రసంబంధమైన. క్షేత్రము శ్రీహరిది. అందువల్లనే హిరణ్య గర్భ జనకత్వం శ్రీసదాశివుడిదని తెలుసుకొనవలయును. హిరణ్య గర్భునికి తండ్రియైన శ్రీసదాశివుడు మనకు సత్పుత్రులను సంపదలు మొదలగునవి ఇచ్చుగాక.

## జ్ఞాన ప్రసూనాంబికాపతిః 27

తనను నిష్ఠతో పూజించే వారికి జ్ఞానం ప్రసాదించే దేవతగా ఈమెను అభివర్ణించెదరు. సంతానము లేని స్త్రీలు దుష్ట గ్రహములచేత పీడితులైన స్త్రీలు. ఈమెను ధ్యానిస్తే అభీష్టములు నెరవేరునట. ఈమె తిరుమలలోని శ్రీవెంకటేశ్వరునికి సోదరిగా అభివర్ణించెదరు. అప్పుడు లింగ రూపమున ఉన్న ఈశ్వరుని చూచుటకు వచ్చి ఆ శివసాన్నిధ్యమున జ్ఞాన ప్రసూనాంబగా అవతరించెను. వశిష్ఠుడు ఈమెను కొలిచి ముక్తుడయ్యెనని పౌరాణిక కథ కలదు.

జ్ఞానమేవ సూనం జ్ఞానసూనం । తదంబయతి జనయతి భక్తానామితి జ్ఞానసూనాంబా । స్వార్థే క ప్రత్యయః । తాం జ్ఞానసూనాంబికాం దక్షిణ కైలాసే తపస్యంతీం పాణిగ్రహణమంగళపూర్వకం శ్రీమత్పంచాక్షరీ విద్యోపదేశే నః పాతి రక్షతీతి జ్ఞాన సూనాంబికాపతిః । అత్ర పురా రజతాచలే మంత్రోపదేశార్థం మౌనదీక్షాం విధాయ తన్మధ్యే నిజసఖీభ్యాం సంభాషితవతీం దేవీం విద్యాసంప్రదాయ ధర్మ పాలనార్థమేవ దేవో మందప్రజ్ఞా మానుషీ భూత్వా తపః కురు పశ్చాద్రక్షామీత్యశపత్ । తచ్ఛాపేన శ్రీమద్దక్షిణకైలాసమేత్య తపంతీం తామీశ్వరో రరక్షేతి కథా । తథాచ । మూలపురాణే । వృద్ధ వచనం । పుష్యేమాసి శుభేలగ్నే పుష్యర్క్షే పూర్ణిమాతిథౌ ।

**స ఏవ సాక్షాజ్జగతాం శంకరశ్చంద్రశేఖరః ।**<br>
**పురతస్తే సమాగత్య ప్రీత్యా పరమయా యుతః ।**<br>
**ప్రదాతా వాంఛితార్థానాం భవిష్యతి న సంశయః ।** ఇతి<br>
**ఏవం భూతాయ జ్ఞానసూనాంబికాపతయే తుభ్యం నమః ॥**

జ్ఞానమనిన పదార్థములను గ్రహించెడి మానసిక వృత్తి, అది, బుద్ధి వృత్తి వివేచకమైన యోగము, దేవతా ధ్యానము, పరమాత్మ విషయకమైన వివేచనము, తత్త్వ జ్ఞానము, అహం బ్రహ్మా నే ఉపాసన, శబ్దయుక్తులచేత కలిగే ఆత్మ నిశ్చయము, పరమాత్మ జ్ఞాన సాధనము దానికి శాస్త్రాధ్యాయనాదులచే కలిగిన ఆత్మ సాక్షాత్కారము, వేదము వేదాంగముల అర్థ విషయమైన ఎరుక ఆత్మ స్వరూప ప్రకాశనము. మోక్షఫలకమైన బుద్ధి. ఇది విజ్ఞాన శబ్దమునకు అర్థములు. జ్ఞానమే ఒక పుష్పము. అంబ అనగా అమ్మ అని అర్థము. ఈ అంబలు ముగ్గురు వారు జ్ఞానాంబ, భ్రమరాంబ, మూకాంబలు ప్రసిద్ధులు. (అంబ అనునది ప్రేమతోగాని, గౌరవముతో గాని స్త్రీని సంబోధించుటకు గూడా ఉపయుక్తమైన శబ్దము) శ్రీకాళహస్తీశ్వరుని పట్టపురాణి తనను నమ్మి కొలచిన భక్తులను రక్షించునది. భక్తుల బాధలను పోగొట్టి వారికి సుజ్ఞానమును, విజ్ఞానమును ఇచ్చునది జ్ఞాన సూనాంబయే.

ఆజ్ఞాన సూనాంబిక ఒకప్పుడు దక్షిణ కైలాసమందు తపస్సు చేయుచూ ఉండెను. ఆ తపస్సుకు మూలకారణం సర్వమంగళకరుడైన శ్రీసదాశివుని పాణిగ్రహణముకొరకు, శ్రీసదాశివుని భర్తగా పొందుటకు సకల మంగళకరమగు శ్రీపంచాక్షరీవిద్యను సాధనముగా చేసి ఆయనను సంపాదించినది. ఆ పంచాక్షరీ విద్యవలన రక్షణ కలదు. దానికి కారకుడు శ్రీ జ్ఞానసూనాంబికాపతియే. రజతాచలమైన వెండి కొండయందు దివ్య మంత్రమును ఉపదేశమును పొందగోరి మౌనదీక్షను వహించి ఉండగా! ఆ దీక్ష మధ్యలో తన చెలికత్తెలతో మాట్లాడుతూ ఉన్న ఆమెను సద్విద్యా సంప్రదాయమును ధర్మ పరిపాలనముకొరకు శ్రీసదాశివుడు సామాన్య జ్ఞానముకల మనిషిగా భూలోకమున అవతరించమని ఆమెను ·

ఆదేశించెను. కాలాంతరమున నిన్ను రక్షింపగలనని ఆమెకు అభయమిచ్చెను. అందువల్ల ఆ ఆదేశానుసారము శోభాయమానమైన దక్షిణకైలాసముగా ప్రసిద్ధి చెందినదియు గజారణ్యమున అమృత లింగమూర్తి ఆమె ధ్యానమునకు మెచ్చి ఆమెను రక్షించెనని ఒక కథ కలదు. పుష్య మాసమున పుష్యమీ నక్షత్ర యుక్త శుద్ధ పూర్ణిమ నాడు సర్వమంగళమును ఇచ్చే శంకరుడు చంద్రశేఖరుడైన కాళహస్తీశ్వరుడుగా జగత్తున అవతరించెనని వృద్ధుల మాట. అనేక కల్యాణ గుణవిశేషణ విశిష్టుడైన శ్రీజ్ఞాన సూనాంబికాపతి భక్తులను రక్షించవలెననే పరమానంద భరితుడైన శ్రీకాళహస్తీశ్వరునిగా అఖండ బిల్వ కాననమునందు అవతరించెను. వాంఛితార్థ ప్రదాత ఐన శ్రీకాళహస్తీశ్వరుడు మనలను రక్షించుగాక. అటువంటి జ్ఞానప్రసూనాంబికాపతికి అనేక నమస్కారములు.

## మయూరార్తి ప్రహర్తా 28

మయూరనామాకశ్చిత్కేరలీయో ద్విజ హాతకః ॥ దుర్వినియోగార్థం ధనలిప్సయా పితరం రహసి నిహత్య పశ్చాత్తాపేన సోపాధ్యాయో బహుధనేన తీర్థ క్షేత్రాణి పరితో పర్యటిత్వా కృఛ్రేణా త్రాయాతస్తమీశో గజరూపేణ భయం ప్రదర్శ్య పునశ్చివ ద్విజాకారో దిష్ట్వా దక్షిణ కైలాస స్థలమా హూయానుజగ్రాహేతి కథా । తథాచ । మూలపురాణం ।

**భక్తి స్థైర్యం మనస్థైర్యం తస్య విజ్ఞాయ శంకరః ।**
**గజాకృతిం పరిత్యజ్య మాయయా సముపాగతాం ॥**
**మాయాశివః ద్విజాకారో భూత్వా తన్నికటం యయౌ ।**
**తం దృష్ట్వా రవిసంకాశం కరుణావరుణాలయం ॥**
**భస్మోద్ధూళితసర్వాంగం మందస్మితలసన్ముఖీం ।**
**వృద్ధవేషధరం శాంతం ప్రేక్షణీయం మహాద్యుతిం ॥**
**ప్రణమ్య పరయా భక్త్యా మయూరో వాక్యమబ్రవీదితి ।**
**ఏవంభూతస్య మయూరస్య పితృవధజనిత పాప పీడాం యోఽపా హరత్ ।**
**స మయూరార్తి ప్రహర్తా। మదార్తిమపనుదత్విత్యర్థః ॥**

మయూరుడనే ఒక కేరళదేశ నివాసి చెడు కర్మలయందు ఆసక్తి కలవాడుగా జీవించుచుండెను. అతను ధనమునందుకల ఆశచేత రహస్యముగా ఒక బ్రాహ్మణుడిని తన తండ్రిని చంపెను. ఆ డబ్బుతో చాలా వినోదముతో గూడిన జీవనము చేయుచుండెను. కాలాంతరమున అతను పశ్చాత్తాపము చెంది అనేక తీర్థములు క్షేత్రములు భక్తి శ్రద్ధలతో సంచరించుచూ తాపావేశముచేత శ్రీకాళహస్తీశ్వరుని సన్నిధికి వచ్చిన పిదప గజారణ్యమున అమృత లింగమూర్తిగా ఉన్న శ్రీకాళహస్తీశ్వరుడు గజరూపమున అతనికి దర్శన మీయగా మయూరుడు భయపడి ఈశ్వరధ్యానముచేయగా ఆ ధ్యానమునకు మెచ్చి దివ్యక్షేత్రమైన దక్షిణకైలాసము ఐన శ్రీకాళహస్తీ క్షేత్రమున ఉండుటను అనుగ్రహించెను. ఈ కథకు పురాణ ప్రమాణము కూడా కలదు. మయూరుని భక్తిని, అచంచలముగా మనస్సును ఈశ్వరార్పణము చేయుటచే శ్రీసదాశివుడు మిక్కిలి సంతోషించి గజరూపమును వదిలి బ్రాహ్మణవేషమును ధరించి అతని చెంతకు వెళ్లగా అంతట ఆ మయూరుడు అసమాన సూర్యతేజస్సుతో నిండిన వాడునూ, కరుణా సముద్రుడునూ, భస్మధూళిచే నిండిన శరీరముకల వాడునూ, చిరునవ్వుచేత అందమైన ముఖము కలవాడునూ వృద్ధ బ్రాహ్మణ వేషమును ధరించిన వాడును ప్రశాంత మూర్తి ఐనటువంటి మిక్కిలి కాంతివంతమైన శరీరముగల శ్రీకాళహస్తీశ్వరునికి పరమభక్తి తత్పరతతో

నమస్కరించి తనకు సర్వపాప పీడాపరిహారమును నివృత్తిచేయుమని వేడుకొనెను. అంతట శ్రీకాళహస్తీశ్వరుడు ఆ మయూరుని ఆర్తిని పోగొట్టబడెను. ఆర్తితో పిలిచినచో సకల ఆర్తులను పోగొట్టువాడు శ్రీకాళహస్తీశ్వరుడు కావున ఆయన నా ఆర్తిని గూడా పోగొట్టుగాక.

## రామమోహనిబర్హణః 29

శ్రీరామచంద్రుడి మోహము పోగొట్టినవాడు శ్రీసదాశివుడు. అసలు మోహనమనగా స్మృతి తప్పుట, మూర్ఛ, కలవరపడుట, తబ్బిబ్బగుట, అవిద్య, నెవ్వరపాటు, ఆశ్చర్యము, అజ్ఞానము, దుఃఖము, ధర్మవిమూఢత్వము, శత్రువుని భ్రాంతి పెట్టుట లేక కలవరపరచుటకు చేసిన ఇంద్రజాలిక క్రియ, (మంత్ర శాస్త్ర సంబంధమైనది) వలపు, కామానుబంధము, మోహరూప అజ్ఞానము. మొదలగు అర్థములు కలవు. ఆదికవి వాల్మీకి రచించిన రామాయణ మహాకావ్యమునందు విష్ణ్వంశగా, దశరథుని కుమారుడుగా శ్రీరామచంద్రుడు నాయకుడు కూడా ఆయన "రామో విగ్రహవాన్ ధర్మః" అనగా అతిక్లిష్ట సమయములయందుగూడా ధర్మమూర్తిగా అవతరించెను. ధర్మమును ఆచరించి చూపిన ఆదర్శపురుషుడు. శ్రీరాముడే ఆదర్శ పురుషుడు మనకు రామరాజ్యం కావాలని నేటికి కోరుకునే సకల కళ్యాణ గుణాభిరాముడు అంతటి ఆదర్శపురుషుడికైనా దుఃఖము, మోహములు తప్పవని శ్రీరాముడి పాత్రద్వారా అవగతమౌతున్నది. శ్రీరాముడు సీతావియోగమున, లక్ష్మణుని మూర్ఛ మొదలగు సందర్భములలో మోహగ్రస్తుడాయెను. అవతారపురుషుల మోహముల సైతము నాశనము చేయగలవాడు శ్రీసదాశివుడు. అందువల్ల ఆయనను రామమోహనిబర్హణుడని కీర్తించెదరు.

రామస్య మోహో రామమోహః। తస్య నిబర్హణం నిర్వాసనం కరోతీతి రామమోహనిబర్హణః। ఉక్తం చ పాద్మే। శ్రీరామ స్సీతా వియోగజదుఃఖేన శ్రీమదగస్త్య మునిముపగమ్య తదుపదిష్టమార్గేణ విరజాదీక్షామనుతిష్ఠన్ మాసచతుష్టయాధౌ శ్రీశివావిర్భావ సమయే రాక్షసమాయా శంకయా పునరధికం ముమోహేతి। అథ రామగిరౌ రామః పుణ్యే గోదావరీ తటే శివలింగం ప్రతిష్ఠాప్య కృత్వా దీక్షాం యథావిధీత్యుపక్రమ్యాహ।

రామునికి సంబంధించిన మోహమును రామమోహమందురు. దానిని వెళ్ళగొట్టుట లేక చంపుట చేయగల వాడు శ్రీకాళహస్తీశ్వరుడు. భక్తుల దుఃఖములను మోహములను చంపగలవాడు. శ్రీకాళహస్తీశ్వరుడు ఒక్కడే. పద్మ పురాణమున ఈ విధముగా ఉన్నది. శ్రీరాముడు సీతావియోగమువల్ల పుట్టిన దుఃఖము చేత బాధపడుచుండగా మహాతేజస్సంపన్నుడైన అగస్త్యమునిని చేరి ఆయన చెప్పిన మార్గమును విరజాదీక్షతో అనుసరించెను. విరజాదీక్ష అనగా రజోగుణరహితమైనది. కామక్రోధాది గుణవికారములులేనిది అగు జీవనవిధానము అని అందురు. ఈ దీక్షను నాలుగు నెలలు ఆచరించుమని శ్రీరామునికి అగస్త్యుడు చెప్పెను. ఈ సమయమందు శ్రీసదాశివుని ఆవిర్భావమందు రాక్షసులు మాయోపాయములచేత తన సాధనను సరిగా జరగనీయరో అని మరలా మోహగ్రస్తుడయ్యెను. అటు తర్వాత రామగిరి అనే చిత్రకూట పర్వత సానువుల యందు సీతాలక్ష్మణులతో ఉంటూ ప్రతిదినము పవిత్ర గోదావరీ తీరమున శివలింగమును ప్రతిష్ఠించి దీక్షగా విధివిధానముగా ఆ దీక్షను ప్రారంభించి చేసెను. కొంతకాలము తర్వాత ఒకనాడు ప్రళయకాలమున పుట్టే మహానాదము వంటి శబ్దమును శ్రీరాముడు విన్నవాడై ఆశబ్దమునకు తడబడినవాడై ఆశబ్దము వచ్చిన దిక్కువైపుగా సుతీక్ష్ణముగా చూచెను. ఆ దిక్కునందు వెలుగుల పుంజము ఆవిర్భవించినదై ఆతేజస్సు కన్నులతో చూచుటకు అలవికానివాడై, కొంతకాలము మోహితుడై మరలా తెప్పరిల్లి

ధనస్సును సిద్ధముచేసి ఆతురతతో ఎదురు చూచే శ్రీరామచంద్రుడి మోహమును ఆర్తిని శ్రీసదాశివుడు నివారించెను.

అథ జాతో మహానాదః ప్రళయాంబుద భీషణః ।
తమాకర్ణ్యాతిసంభ్రాంతో యావత్పశ్యతి పుష్కరం ॥
తావదేవ మహత్తేజో రాశిం పశ్యన్ ద్విజోత్తమాః ।
తేజసా తేన సంభ్రాంతో నాపశ్యత్పదిశో దశ ।
అంధీకృతేక్షణస్తూర్ణ మతిమోహేవ రాఘవః ।
అథోత్థాయ మహావీర స్సజ్జీకృత్య స్వకం ధనురితి ।
మోహితస్య తస్య మోహన్నివారయామాసేతి । యద్వా మూలం పురాణే ।
శత్రువధానంతరం శ్రీరామవచనం ।
క్షత్రధర్మం పురస్కృత్య రావణో నిహతో మయా ।
శత్రుహస్తాత్పునరపి సీతాఽ సీన్మద్వశంగతా ।
అకీర్తిశ్చ గతా మేఽద్య కృపయా పరమేశితుః ।
సీతయా మమ కిం కార్యం మాత్రాభ్రాత్రా చ కిం మమ ।
సుహృద్భిర్వాథ రాజ్యేన కిం ధనేన బలేన వా ।
సీతాయా త్వమయోధ్యాం వై గచ్ఛ లక్ష్మణమాచిరం ।
ఇత్యాది మోహవచనం రామం ప్రతి లింగాదావిర్భూతశ్శివః ।
తస్మైకాదశసాహస్రం వర్షాణి జగతీతలే ।
వర్ణాశ్రమాణాం రక్షార్థం సంకల్పిత ముపాస్యవై
శ్రీమద్దక్షిణ కైలాసా భిధం గత్వా మహామతే ।
విద్యాశైలసమారూఢం స్కందముద్దిశ్య మత్ప్రతం ।
తపఃకురు మహాభాగ తతస్తన్ముఖసారవిత్ ।
ఇత్యాద్యుపదేశ ప్రకారేణ తస్య సర్వం మోహం నివారయామాసేతి ।

మూల పురాణమున ఈవిధముగా ఉన్నది. శత్రువైన రావణుని వధించిన తర్వాత శ్రీరాముడు తమ్ముడైన లక్ష్మణునితో ఇట్లు అనెను. క్షత్రియుడు ప్రజలకు రాజు. ప్రజల కష్టములను పోగొట్టవలసిన బాధ్యత రాజుపైన ఉన్నది. దండకారణ్యము మొదలగు ప్రదేశములయందు సాధువులై తపస్సుచేసుకొనుచున్న మహర్షులను రావణ అనుయాయులైన రాక్షసులు వారిని పీడించుచూ, బాధించుచూ, వారి తపస్సుకు విఘ్నములు కలిగించుచుండిరి. వారి ప్రార్థనను మన్నించి వారి ఎదుట రావణ వధకుప్రతిజ్ఞ చేసితిని. అప్పుడు సీత అడవికి వలదని చెప్పిననూ వినలేదు. శూర్పనఖద్వారా సీతారాముల వృత్తాంతము తెలిసి రావణుడు సీతాపహరణము చేయగా హనుమంతునిద్వారా సీతావృత్తాంతమును తెలుసుకొనెను. లంకపై దండెత్తి శ్రీరాముడు రావణుని సంహరించెను. ఇది అంతయూ మహర్షుల కోసమే చేయవలసివచ్చినది. రావణుని పురమున ఉన్న సీతను చూచి లక్ష్మణునితో రాముడు ఇట్లు అనెను. శత్రువులనుండి సీతను రక్షించితిని. వచ్చిన అపకీర్తి వెంటనే పోదు. కావున సీతతోగాని తల్లులతోగాని తమ్ములతోగాని బంధువులతోగాని స్నేహితులతోగాని రాజ్యముతోగాని సైన్యముతో అయోధ్యతోగాని నాకు ఏరకమైన సంబంధములేదు. సీతను తీసుకొని నీవు అయోధ్యకు వెళ్ళుము అని ఈ ప్రకారముగా మోహముతో కూడిన మాటలను శ్రీరాముడు

లక్ష్మణునితో పలికెను. అంతట శ్రీసదాశివుడు శ్రీరాముని ఎదుట ప్రత్యక్షమై శ్రీరాముని మోహమును పోగొట్టి శ్రీరామునితో నీవలన ఈ భూలోకమున కొన్ని వేల సంవత్సరముల వరకు నిలిచే లాగ ధర్మ సంస్థాపన, వర్ణాశ్రమాచారములు నీవలనే నిలవగలవు. ధర్మస్థాపనకు నీవే సమర్థుడవు. నీవు ధర్మమును ఆచరించి ఇతరులకు చెప్పెదవు. కావున శ్రీదక్షిణకైలాసమనే పేరుగల దివ్యక్షేత్రమున విద్యాశైలమనే పర్వతమును ఎక్కి నా కుమారుడైన కుమారస్వామిని ఉద్దేశించి తపస్సు చేయవలసినది అని చెప్పి అతని మోహమును నివారించెను.

మూలపురాణం । తస్మాద్రావణమాయేతి మహాభయప్రదం పూర్వోక్తం మోహం చ రావణవధానతరం సర్వే యథా గతం యాంత్విత్యాది మూలపురాణోక్త మోహం చః యః శ్రీకాళహస్తీశో నివారయామాస స రామ మోహనిబర్హణః । నితరాం బర్హణం నిబర్హణం ।బర్హ । పరిభాషణహింసా దానేషు । శ్రీకుమారస్వామిముఖేన శ్రీరామస్య సాంసారికాన్ శోకమోహాదీన్ హరః ఉపాహరదిత్యర్థః ॥

మూలపురాణమున ఈవిధముగా చెప్పబడెను. రావణ వధానంతరము మాయచే మోహితుడైన శ్రీరాముడిని శ్రీకాళహస్తీశ్వరుడు నివారించెను. నితరాం బర్హణం నిబర్హణం. నిశ్శేషముగా చంపునది నిబర్హణము బర్హమనగా పరిభాషణము అంటే మాట్లాడుట. హింసా అనగా చంపుట, దానము అనగా ఇచ్చుట. శ్రీకుమారస్వామి ద్వారా శ్రీరాముడు సాంసారికమైన శోకమును మోహము మొదలగునవి పోగొట్టుకొనెను. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరుడు రామమోహనిబర్హణుడు

## వేదాంతవేద్యః 30

వేదము సంహిత బ్రాహ్మణ అరణ్యకము ఉపనిషత్తులు అని నాలుగు విధములు. వేదమునకు చివరిభాగము ఉపనిషత్తులు ఉన్నందున వాటిని వేదాంతమందురు. ఉపనిషత్తులు జ్ఞానమార్గమును ఉపదేశించినవి. ''జ్ఞానాదేవ తు కైవల్యం'' ఆత్మజ్ఞానమువలననే పునరావృత్తిరహితమైన మోక్షము లభించును. అసలు వేదాంతమంటే అద్వైతముననే స్వీకరింతురు. అన్ని దర్శనములలో, మతములలోకెల్లా శ్రీమచ్ఛంకరభగవత్పాదులచే ప్రచారము చేసిన అద్వైత మతమే సర్వమూర్ధన్యము. అద్వైతమతమున బ్రహ్మ ఒక్కటే సత్యము మిగిలిన ప్రపంచమంతయు అసత్యము మిథ్య. జగత్తు అంతయూ శుక్తియందు రజితమువలె బ్రహ్మయందు కనపడును. బ్రహ్మ నిర్గుణము. అందువల్ల శబ్దముచేత చెప్పలేనిది. అందువలన బ్రహ్మ వాక్, కళ్ళు మనస్సు మొదలగు వాటికి గోచరము కాదని ఉపనిషత్తులు చెప్పుచున్నవి. సర్వజ్ఞుడు, సర్వశక్తిసమన్వితుడు మొదలగు గుణములుకూడా బ్రహ్మయందు ఔపాధికములే. జీవుడు బ్రహ్మ రూపముతో ఉన్నప్పటికి అజ్ఞానము వలన భిన్నుడుగా కనిపించుచున్నాడు. మనస్సు, బుద్ధి, అహంకారము మొదలగు వాటిచేత జీవులందరూ నేను, నాది అనే ప్రతీతి కూడా ఔపాధికమే. కర్మేంద్రియ జ్ఞానేంద్రియ విషయేంద్రియ అంతఃకరణచతుష్టయముతో కూడా జీవుడు ఒక్కడే. అనేకులు కారు. ఐతే అంతఃకరణాదిభేధములచేత సుఖదుఃఖానుభవము మారును. అందువల్ల జీవులు అనేకులుగా కనిపించుదురు. చైతన్యము సర్వవ్యాపకము. కావున అంతటా నిండి ఉన్నదని భావము ఆ చైతన్యమునే ఆత్మ అని పిలిచెదరు. ఆ ఆత్మే ఉపాధి భేదముచేత ఈశ్వరుడని, జీవుడని, సాక్షి అని పిలిచెదరు. సమస్తమైన జగత్తు ఆవిర్భావమునకు మూలకారణము అజ్ఞానము. ఆ అజ్ఞానమునందు చైతన్యము కలిసిపోగా ఆత్మస్వరూపులై జీవులు

పుట్టుచున్నారు. ఆత్మ రెండు విధములు. ఒకటి పరమాత్మ రెండవది జీవాత్మ. పరమాత్మే ఈశ్వరుడు అని పిలిచెదరు. ఆ ఈశ్వరుడే సత్త్వ రజస్తమోగుణ ప్రధానముగా విష్ణు బ్రహ్మ రుద్రులుగా మారి సృష్టిస్థితి లయములను చేయుచున్నాడు. వేదవిహిత కర్మలచేత చిత్త శుద్ధిని పొంది బ్రహ్మనిష్ఠుడైన సద్గురువును ఆశ్రయించి 'అహం బ్రహ్మాఽస్మి తత్త్వమసి' అనే వాక్యములద్వారా జ్ఞానోపదేశము చేయవలెను. శ్రవణమనన నిదిధ్యాసనముల ద్వారా సన్యాసాశ్రమమునందు అధికారము సంపాదించిన జీవుడే సుస్థిరమైన ఆత్మజ్ఞానసంపన్నుడై మోక్షమును పొందగలడు. మోక్షప్రాప్తికి ఆత్మ జ్ఞానమొక్కటే సరైన సాధనము ఐతే కర్మోపాసనయందు చిత్త శుద్ధి చిత్తైకాగ్ర్యమును పొందతగును.

వేదాః వేద్యతే అవగమ్యతే ఆత్మానాత్మవివేకః ఏభిరితి వేదాః। ఏతేషామంతా శ్శిరస్థానీయా వేదాంతాః ఉపనిషద్భాగాః తైరేవ వేదాంత వాక్యైః వేదితుం యోగ్యః భవతీతి వేదాంతవేద్యః ఉపనిషన్మహావాక్య విచారమంతరేణ స్వరూప ప్రతిపత్తయే ద్వారాంతరాభావాత్ తథాహి :-

నావేద విన్మనుతే తం బృహంతం తద్వేద గుహ్యోపనిషత్ సుగూఢం, తద్బ్రహ్మ వేదతే బ్రహ్మయోనిం - (శాట్యాయన - 47 ఇతిహాస - 20) పురాణేఽపి

**ఈశ్వరస్య స్వరూపే చ జగత్సర్గాదిషు ద్విజాః ।**

**అతీంద్రియార్థేష్వన్యేషు మానంతు శ్రుతిరేవహీతి**

**అతశ్చ వేదాంతమహావాక్యవిచారైక సమధిగమ్య శ్రీమద్దక్షిణ కైలసపతిః దేదీవ్యతు ఇత్యర్థః ।**

ప్రపంచమున ఆత్మ ఏది అనాత్మ ఏది అని తెలుసుకొనుట. వేదములోని విజ్ఞానమును వివేకముతో విశ్లేషణతో తెలుసుకొనుచున్నారు. కనుక అవి వేదములు. ఈ వేదములు ఋగ్వేదము యజుర్వేదము (శుక్ల +కృష్ణ అను భేదములతో) సామవేదము అధర్వణ వేదము. వీటిలో ఒక్కొక్క వేదము సంహిత బ్రాహ్మణము, ఆరణ్యకము ఉపనిషత్తులు అని నాలుగు రకములు. వేదములో సంహితకన్నా చివరలో ఉపనిషత్తులు ఉన్నవి కనుక ఉపనిషత్తులను వేదాంతమందురు. వేదములకు శిరస్సు వంటివి ఉపనిషత్తులు. ఆ ఉపనిషద్వాక్యముల ద్వారానే శ్రీసదాశివుని తెలుసుకొన దగినది. కావున ఆయన వేదాంతవేద్యుడు. ఉపనిషద్వాక్యవిచారము, చర్చ చేయనిదే పరమేశ్వరుని స్వరూపమును తెలుసుకొనలేము. వాటికి మార్గాంతరము కూడా లేదు. శాట్యాయనీయ ఉపనిషత్ ఇతిహాసోపనిషత్తులయందు చాలా గొప్పదైన ఆత్మ విద్యను చాలామంది తేలికగా తెలుసుకొనలేకున్నారు. ఆత్మ తత్త్వము చాలా గూఢమైనది. ఆత్మను గూర్చి ఉపనిషత్తులద్వారానే తెలుసుకొనవలెను. బ్రహ్మను తెలుసుకొనినవాడు బ్రహ్మ అగును. పురాణములో ఈశ్వరుని స్వరూపమును జగత్తుయొక్క సృష్టి రహస్యమును గాని మామూలు ఇంద్రియములవల్ల తెలుసుకొనలేరు. దానిని అతీతమైన శక్తి ద్వారానే తెలుసుకొనవలయును. అందువల్ల వేదాంతమహావాక్య విచారములచేతనే తెలుసుకొనదగిన తత్త్వజ్ఞానమును నాకు శ్రీదక్షిణ కైలాసాధిపతి ఐన శ్రీకాళహస్తీశ్వరుడే ఇచ్చుగాక.

## కాలాత్మా 31

కాలము అనగా సమయము అది భూత భవిష్యద్వర్తమానములు, వసంత గ్రీష్మ వర్ష శరత్ హేమంత శిశిరమునకు సంబంధించినది. పగలు రాత్రికి సంబంధిచినది. వీటన్నిటికీ పరమేశ్వరుడే ఆత్మ స్వరూపుడు.

కల్యతే సంఖ్యాయతే జీవరాశ్యాఽఽయుః అనేనేతి కాలః కలసంఖ్యానే స ఏవ ఆత్మ స్వరూపం యస్య స కాలాత్మా. యేన కాలాత్మనా గ్రస్తే నయు వా ఇవ సర్వేఽపి పరిచ్ఛింద్యంతే యశ్చ కాలో న కేనచిత్పరిచ్ఛిద్యతే । స హితే కాలాత్మా । తథాచ వాయుసంహితాదివచనం ।

మహాభూమిరియం నష్టా భవిష్యతి మహోదధౌ ।
సముద్రాస్సప్తవిప్రేంద్రా నశ్యంతి బడబానలే ॥
బడబాన మహావహ్నౌ వహ్ని ర్వాయౌ వినశ్యతి ।
వాయుర్నశ్యతి చాకాశే స ఆకాశస్స్వకారణే ॥
నశ్యత్యేవ స్వభావేన కిం నిత్యం గమ్యతే నఘాః ।
బ్రహ్మవిష్ణుదివేచైకో విష్ణ్వారుద్రది నే తథా ॥
ఈశ్వరస్య తథా రుద్రస్సాదాఖ్యస్య మహేశ్వరః
తస్మిన్ సాక్షాచ్ఛివేనైష కాలాత్మా సంప్రవర్తత ఇతి ।
విష్ణు ర్విశ్వజగద్యోనిః ప్రాదుర్భావైస్స కైస్సహ ।
వినాశం ప్రళయం యాతి కిం నిత్యం గమ్యతే నఘాః ।
అతస్సాక్షాత్పరంజ్యోతి స్స్వభావః పరమేశ్వరః ।
ఏక ఏవ సదా నిత్య స్తతోఽన్యత్సకలం మృషేతి ।
తస్మాత్ చేతనాచేతనం జగత్పరిచ్ఛినత్తీతి కాలాత్మా । అథవా కాలయతి సర్వం ప్రేరయతీతి కాలాత్మేత్యర్థః ॥

కాలము ఎవరికి ఆత్మగా కలదో వాడు కాలాత్ముడు. కాలము స్వభావముగా చేయబడిన స్థావరజంగములయందు ఎల్లప్పుడు ఉండును. (సాత్త్వికః రాజసాశ్చైవతామసావేచ కేచన) భావాః కాలాత్మకాః సర్వ ప్రవర్తంతే హి జంతుషు, జంగమాః స్థావరాశ్చైవ దివి వా యది వా భువి సర్వే కాలాత్మకాః సర్వంకాలాత్మక మిదం జగత్, ప్రవృత్తయశ్చ లోకేఽస్మిన్ తథైవ చ నివృత్తయః తాసాం విక్రియాయోయాశ్చ సర్వం కాలాత్మకం స్మృతం'' ఆదిత్యః చంద్రమా విష్ణుః ఆపః వాయుః శతక్రతుః అగ్నిః ఖం పృథివీమిత్ర ఔషధ్యః వసవస్తథా సరితః సాగరాశ్చైవ భావాభావౌచ పన్నగః సర్వే కాలేన సృజ్యంతే హ్రియంతే చ తథా పునః । (మ.భా. 13-1-456-49)

జీవరాసులయొక్క ఆయువు సంఖ్యలతో లెక్కించునది కనుగ దానిని కాలము అని అందురు. ఆత్మ స్వరూపము అన్వేషించుటలో ఇదికాదు అదికాదు అని లెక్క పెట్టునది కాలము. ఆ కాలాత్మకు అందరూ లోబడియుందురు. కానీ కాలాత్ముని ఎవరూ లోబరుచుకోలేరు. కావున అందరికి గొప్పవాడు కాలాత్ముడు. వాయుసంహితలో ఈ విధముగా ఉన్నది. నాశము పొందిన భూమి మహాసాగరమున మరలా ఉదయించును. సప్త సముద్రములు బడబాగ్నియందు నివశించుచున్నవి. బడబాగ్ని వహ్నిలో కలిసి ఉన్నది. వహ్నివాయువువల్ల నశించు. వాయువు ఆకాశమున లయమగును. ఆకాశము స్వకారణమున లయమగును. స్వభావసిద్ధముగా నాశ స్వభావము కలిగినది కాలము బ్రహ్మవిష్ణు మహేశ్వరులు కాలానుగుణముగా సృష్టిస్థితి లయములను చేయుదురు. అందువల్ల పరమేశ్వరుడు. జ్యోతి స్వరూపుడు అతనే నిత్యుడు. అతడుగాక వేరేది అంతా అసత్యము. అందువలన చేతనము అచేతనము ఐన జగత్తు కాలపురుషుడైన పరమేశ్వరునిచే నియమింప బడినది. ఆ కాలపురుషుడే ప్రేరకుడు లయకారకుడు. అతనే శ్రీకాళహస్తీశ్వరుడు. కాలాత్ముడైన శ్రీకాళహస్తీశ్వరుడు మమ్ములను రక్షించుగాక.

## విచిత్ర బహుశక్తిమాన్ 32

విచిత్రాః వివిధాః బహ్వ్యః వామాద్యాః నవ జ్ఞానక్రియాద్యాశ్చ శక్తయః అస్య సంతీతి తథోక్తః శ్రు॥

పరాస్య శక్తిః వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞానబలక్రియా చేతి, సంక్షేప శారీరకే -: చిచ్ఛక్తిః పరమేశ్వరస్య విమలం చైతన్యమేవోచ్యతే। హ్యస్త్యే వాఽస్యజడా పరా భగవతః శక్తిస్తు విద్యోఽచ్యతే ఇతి ఏవం స్వాభిన్న విచిత్ర బహుశక్తి మత్త్వేన సర్వజగత్తంత్రం కురుతే ఇత్యర్థః।

శక్తి అనగా బలము. ఇచ్ఛాశక్తి జ్ఞానశక్తి క్రియాశక్తి. అని శక్తులు మూడు రకములు. ఇచ్ఛాశక్తికే ద్రవ్య శక్తి అని పేరు. శక్తికే ఉత్సాహమని పేరు. అవి ఉత్సాహము. ప్రభుత్వము మంత్రము అనిమూడురకములు. శక్తికే గుణమని అవి సత్త్వము, రజస్సు, తమస్సు అని మూడు రకములు. శకసామర్థ్యే అనేధాతువునకు క్తిన్ ప్రత్యయము ద్వారా శక్తి పదము పుట్టును. దీనికి త్రాణము, బలము, సామర్థ్యము. ఈపదము ఈ అర్థములోనే బోధింప వలెను అనే ఈశ్వర సంకేతము మరియు శాస్త్ర కారుల సాంకేతికము. వివిధ రూపములైన చలాచలస్థితిని కలుగుజేయు బలము అని అర్థము. విచిత్రమనగా విశేషేణ చిత్రం అని వి అనే ఉపసర్గతో కూడిన చిత్రము అని దానివ్యుత్పత్తి. అనేక రకములై వామాచారములకు సంబంధించిన నవజ్ఞాన క్రియాశక్తులు శాక్తేయమున కలవు. పరా పశ్యంతీ అనువాక్ యొక్క శక్తి ఎవరిదైతే కలదో అది రెండురకములుగా కలదు. స్వాభావికమైన జ్ఞానముయొక్క బలము క్రియాఅని సంక్షేప శారీరకమనే గ్రంథమున పరమేశ్వరుని యొక్క విశుద్ధమైన చైతన్యమునకే చిత్ శక్తి అనుపేరు కలదు. భగవంతుడు సర్వశక్తి సమన్వితుడు కావున అతనికి చిత్ర విచిత్రములైన అనేక శక్తులు వాటిద్వారా అనేక భంగిమలలో భిన్నభిన్న సృష్టి జరుగును. ఆయన స్వతంత్రుడు సర్వశక్తి సమన్వితుడు కనుక ఆయన విచిత్ర బహుశక్తి మంతుడు. కనుక శ్రీకాళహస్తీశ్వరుడు చిత్ర విచిత్ర బహుశక్తి సమన్వితుడు. అటువంటి ఆయన నన్ను రక్షించుగాక.

## స్థిరధన్వా 33

స్థా గతినివృత్తౌ కిరచ్ కృత్యప్రత్యయమున స్థిరశబ్దము వచ్చును. దీనికి అర్థము. కొండ, చెట్టు, వెలమచెట్టు, ఎద్దు, మోక్షము, పరుషము సరళముకాని హల్లు. నిలకడదనము. స్థిరత. గట్టిది. కదలనిది,. కలతనొందనిది, అని స్థిర శబ్దార్థము. ధను శబ్దే అను ధాతువునుండి ధనుశ్శబ్దము పుట్టెను. దీనికి అర్థము. విల్లు, ఒకరాశి, వింటినారి, విల్లు నాలుగుమూరలు కలది అని అర్థము. ధనుర్వేదము విలువిద్యను బోధించు ఒక వేదము. ఇది శస్త్రాస్త్ర ప్రయోగాదులను తెలిపెడి ఒక శాస్త్రము. ధనుర్వేదము యజుర్వేదమునకు సంబంధించిన ఉపవేదము. ఇందు నాలుగు పాదములు కలవు. ఇది ముఖ్యముగా ఐదు విధములై ఉండును.

1. మంత్రముక్తము. అగ్ని గోళములు, బాణములు, మొదలైనవి. దూరమునుండి యంత్రముల మూలకముగా ప్రయోగించి చేయుయుద్ధము. 2.పాణిముక్తము. చేతితో విసిరివేయు ఈటె చిల్లకోల, రాళ్ళు మొదలగు వానితో చేయుపోరు. 3. ముక్త సంధారితము ఈటె మొదలైన వానితో పొడిచి కొట్లాడుట. 4. అముక్తము. చేతితో పట్టుకొని శత్రువుమీద విసిరే కత్తి మొదలగు వాటితో యుద్ధము చేయుట. 5. నియుద్ధము: ఆయుధములు ధరింపక చేతులతో, బాహువులతో యుద్ధము చేయుట. ఇంకా ఇది శస్త్రాస్త్ర విద్యలన్నింటికి ఆధారము. ఇది యుద్ధ తంత్రమును బోధించును. భుజ యుద్ధము, మాయాయుద్ధము, అని యుద్ధము రెండు విధములు. కానీ వీటిలో మాయాయుద్ధము నీచమైనది.

స్థిరం నిశ్చలం శాశ్వతం ఉజ్జ్వలం ధనురస్యాస్తీతి స్థిరధన్వా కిం నామాస్య స్థిరధనుః హస్తేష్వపి అలంక్రియతే ఇతి చేత్ కాలః కాలః మేరుః వాస్య ధనుర్భవేదితి ప్రతీయతే ఏతే హి స్థిరాః కాలస్య నిరవధికత్వాత్ వేదసారస్య ప్రణవస్య నిత్యత్వాత్ మహామేరోరాకల్పం నిశ్చలత్వాచ్చ.

**భారతే కర్ణ పర్వణి:- విచిత్రవ్యృతుభిః షడ్భిః కృత్వా సంవత్సరం ధనుః ఇతి**
**శాంతి పర్వణి:- స్వకృత్వా ధనురోంకారం సావిత్రీం జ్యాం మహేశ్వరః**
**ఇతి**

లైంగపురాణేనగేంద్ర కార్ముకం వాసేల్ జ్యాభుంజగాధిపః స్వయ మితిస్వేషుః సుధన్వేతి శ్రుత్యంతరాచ్చ స్థిరం ధృఢం అత ఏవ శోభనం ధనురస్యాస్తీతి స్థిరధన్వా. స పాయాదిత్యర్థః।

వాల్మీకి రామాయణమున ధనుర్విద్యను గూర్చిన చర్చ చాలా చోట్ల గలదు. ధనుః కాంచన భూషితం, ధనుః కాలాంతకోపమం, పరపురంజనం ధనుః పరమ భాస్వరం, ధనూ రుద్రస్తు సంక్రుద్ధః ధనురానీయతాం దివ్యం ధనుః భీమ పరాక్రమం, ధనుః భీమః బలో భీమం, ధనుర్వేద విదాం శ్రేష్ఠః ధనుర్వేదే చ నిరతః, ధనుషీరాద్రదర్శనే స్థిరమైన నిశ్చలమైనది, శాశ్వతమైనది పరికరములలో చేయని ధనుస్సు ఆయనకు ఉన్నందున ఆయన స్థిరధన్వా. శ్రీసదాశివుని చేతులలో అలంకారమైన ధనుస్సు మేరువే ధనుస్సుగా మారి శ్రీసదాశివుని చేరినది. కాలము ఎల్లవేళలా ఉండునది. కనుక అది స్థిరము. వేదసారమైన ప్రణవము నిత్యము. మహామేరు పర్వతము కల్పము చివరివరకు నిశ్చలముగా ఉండును. మహాభారతమున కర్ణ పర్వమునందు ఛాయామేవాత్మనః చక్రే ధనుర్జ్యామక్షయాం రణే। కాలోహి భగవాన్ రుద్రః తస్య సంవత్సరో ధనుః దేవతలకు బ్రహ్మకు జరిగిన సంభాషణలో విచిత్రమైన ఆరు ఋతువులలో కలిసిన ఒక సంవత్సరమునకు ధనుస్సు అనిపేరు పెట్టిరి. అట్లాగే శాంతి పర్వమందు పరమేశ్వరుడు ఓంకారమును ధనుస్సుగాచేసి సావిత్రి అన మంత్రమును అల్లెత్రాడుగా చేసెను. లింగపురాణమునందు శ్రీసదాశివుడు పర్వత రాజును ధనుస్సుగాను సర్పరాజును అల్లెత్రాడుగాను స్వయముగా నిర్మించెను. స్థిరమనగా ధృఢమని అర్థము. అదే శ్రీసదాశివుని శోభన గుణము స్థిరమైన ధనుస్సు ఎవరికైతే కలదో అతనే స్థిరధన్వా. అటువంటి స్థిరధన్వుడు మమ్మల్ని రక్షించుగాక.

## పశుపతిః 34

పశూనాం పతిః పశుపతిః జీవులకు నాథుడు పరమేశ్వరుడు కనుక ఆయనను పశుపతి అని అందురు. ఇంకా పశువులకు స్వామి, పశువుల కాపరి, పశుధనము కలవాడు. పెక్కు పశువులకు సొంతకాడు. ఇతను సర్వవిద్యలకు మొదటి ప్రభువు. సనాతనుడుగూడా. వరాహ పురాణమునందు పరమేశ్వరుడే జీవులమధ్య ఉంటూవాటికి ప్రభువైనందువల్ల ఆయన పశుపతి అని ఉన్నది. పల్లవములవలె పశువులకు ప్రియమైనవాడు. పాశుపత తంత్రముననుసరించి గ్రంథములు అనేకములు కలవు. ఎనభైనాలుగువుంది శైవభక్తులు పరమాచార్యులై తమసిద్ధాంతములను బోధించిరి. శివుడు తన భక్తులనుద్ధరించుటకై తన పంచముఖములనుండి ఇరవై తంత్రములను ప్రకాశింపచేసెను. వీనితత్త్వములను బోధించే ఆగమములు ఉపాగమములు సంహితలు కలవు. శివ తత్త్వశాస్త్రమే ముక్తికి ఉపాయమని పాశుపతుల అభిప్రాయము ఈసంప్రదాయమునుననుసరించి మహామహేశ్వరులు అనేకులు ఎన్నియో గ్రంథములు వ్రాసినారు. శైవులలో వీరశైవులు కొందరు కలరు. శివుని ముఖమునుండి వెలువడిన ఆగమములను

ఆమ్నాయముఅని అందురు. 1. పూర్వామ్నాయము సృష్టిరూపము ఇది మంత్రయోగము నిరూపించును. 2. దక్షిణామ్నాయము స్థితిరూపము. ఇది శక్తియోగమును చెప్పును. 3. పశ్చిమామ్నాయము సంహారరూపము. ఇది కర్మయోగమును నిరూపించును. 4. ఉత్తరామ్నాయము అనుగ్రహరూపము ఇది జ్ఞానయోగమును ప్రతిపాదించును. 5. ఊర్ధ్వామ్నాయము సకల విశేషములను ఉద్బోధించును.

పశూనాం మాయయా కర్మాణ వాఖ్య పాశ త్రయః బద్ధానాం ద్విపదాం చతుష్పదాం సర్వజంతూనాం చ పతిః స్వామీ పశుపతిః శ్రు॥ ఏషామీశే పశుపతిః పశూనాం చతుష్పదాముత చ ద్విపదామితి. జాబాలోపనిషది చ : కథం జీవాః సర్వే పశవః స కథం తత్పతిరితి. తముమవాచ. యథా తృణాశినో వివేకహీనాః పరప్రేష్యాః కృష్యాది కర్మసు వినియుక్తాః పురుషాః దుఃఖ చరాః స్వస్వామిబధ్యమానాః గవాదయః తథామే. సర్వజ్ఞః ఈశ్వరః తేషాం పతిః పశుపతిః తదజ్ఞానపాశేన బధ్నాతి. తత్ జ్ఞానినం మోచయతి. తత్జ్ఞానం కేనోపాయేనేతి. విభూతి ధారణాదేవేతి. తత్ప్రకారః కథమిత్యాది లైంగశైవాది పురాణేషు పాశుపత్యముచ్యతే.

పశువులు మాయ అనే కర్మ చేత బంధమనే పాశత్రయముచేత లోబడిన రెండు కాళ్ళజంతువులు నాలుగు కాళ్ళజంతువులన్నిటికి ప్రభువు స్వామీ ఐనవాడే సర్వేశ్వరుడు. సృష్టిలోపల ఉన్న జీవరాశులన్నిటికి ప్రభువు సర్వేశ్వరుడై. జాబాలోపనిషత్తునందు జీవులందరు పశువులు ఎట్లు ఐనారు? ఈశ్వరుడు ఆ జీవులకు పతి ఎట్లు ఐనాడు అని అడుగగా పచ్చిగడ్డిని ఆహారముగా తీసుకొనే పశువులు జంతువులు వివేకము, విజ్ఞానములేనివి. ఇతరుల ప్రచోదనముతో కదలిక గలిగినవి. వ్యవసాయము ప్రయాణము మొదలగు వాటికి (బండిని లాగుటకు) ఉపయుక్తములైనవి. దుఃఖములనే ఎక్కువగా భరించేటువంటివి. తమతమ యజమానిచేత బంధింపబడే వృషభములవలె సంచరించే వారందరికి ఈశ్వరుడే పతి ప్రభువు. అజ్ఞానపాశముచేత బంధిపబడేవారు జీవులు. ఐతే జ్ఞానులైనవార్ని అనుగ్రహించి పరమేశ్వరుడు ముక్తులుగా చేయుచున్నాడు. అజ్ఞానముదేని వలన లభించును అనగా లింగపురాణము శివపురాణము మొదలగు వాటియందు ఆవిషయములను సువిస్తారముగా చెప్పిరి. ఇదియేగాక శైవులలో నాలుగు తంత్రములుకలవు. 1 పాశుపతము 2. శైవము 3. కాలగమనము 4. కాపాలికము అనివానిపేర్లు.

**స్వతస్సిద్ధం పతిత్వం మే యుష్మాకం పశుతాపి చ ।**
**తదేవ దర్శయామ్యద్య పుణ్యాబంధ వినోదతః ॥ ఇతి**
**ఆత్మనః పశవః ప్రోక్తాః సర్వే సంసార వర్తినః ।**
**తేషాం పతిత్వాద్దేవేశః శివః పశుపతిః స్మృతః ॥ ఇతి**
**కర్ణ పర్వణిః– పతిత్వం చైవ మే లోకాః సర్వే కల్ప్యంతు పీడితాః ।**
**పశూనాం చ పతిశ్చాహం భవిష్యామి సురోత్తమాః ॥**
**ఇతి దేవాః వచః శ్రుత్వా దేవదేవస్య శూలినః**
**విషాదమగమన్ సర్వే పశుత్వం ప్రతి శంకితాః॥**

ఇతి ఏవంచ శివాదన్యేషాం సురనరతిర్యక్ జాతీనాం సర్వేషాం పశూనాం యః పతిః స్వామీ సమదజ్ఞాన పాశం ఛింద్యాదిత్యర్థః ।

శ్రీపరమేశ్వరునికి పశుపతిత్వము స్వతసిద్ధముగా వచ్చినది. సంసారసముద్రమున బాధపడేవాడు పశువుతో సమానము. అటువంటి వారికి ప్రభువు. దేవతలకు కూడా అయినే

ప్రభువు. ఆయనే సదాశివుడు. మహాభారతమున కృష్ణపర్వమున దేవతలను ఉద్దేశించి శ్రీసదాశివుడు నేనే సర్వలోకములకు ప్రభువును. నాభక్తులందరి బాధలను పోగొట్టుటకై నేను అవతరించితిని అని చెప్పెను. శ్రీసదాశివునిగాక వేరేవారెవ్వరూగాని సురలుగాని, నరులుగాని మరెట్టి జీవులుగాని తిర్యగ్జంతువులుగాని అందరూ శ్రీసదాశివునే ధ్యానించెదరు. ఆయనే భవబంధములను పోగొట్టగలడు.

## సర్వతత్త్వ ప్రబోధకః 35

అసలు తత్త్వమనగా దాని భావమని, బ్రహ్మ అని, సత్త్వరజస్తమస్సులలో ఒకటి అని, నిజరూపు అని, ఉన్నసంగతి అని, యథార్థము అని, చేతనము వస్తువు అని, స్థూల్యాదివిలంబితమౌనము అని, స్పష్ట వ్యయ భూతమగు పదార్థము అసిస్వభావము తస్య భావంతత్ + త్వం అని, అర్థములు సృష్టికి మూలపదార్థములగు తత్త్వములు ఆయామతముల సిద్ధాంతమును బట్టి అనివేర్వేరుగా కనపడుచున్నవి. అద్వైతులు బ్రహ్మ ఒక్కడే అని, ద్వైతులు ప్రపంచము. బ్రహ్మసత్యమని, విశిష్టాద్వైతులు (జీవుడు ప్రపంచము, బ్రహ్మ చిత్తు, అచిత్, ఈశ్వరుడు సత్యమని) బౌద్ధులు శూన్యము ఒకటి అని, పాశుపతులు, నకులీశులు శైవులు పశువుపతి పాశము అని మూడుతత్త్వములని, చార్వాకులు పృథివీ, అప్పు, తేజస్సు, వాయువు అని నాలుగుతత్త్వములని, ఆర్హతులలో ఒక శాఖవారు జీవము ఆకాశము, ధర్మము, అధర్మము, ఉద్గలము అని ఐదు తత్త్వములుగాను, ఆర్హతులలో వేరొక శాఖవారు. జీవము, అజీవము ఆస్రవము, బంధము, సంవరము, నిర్జరము అనుతత్త్వములుగనూ, సాంఖ్యము: అవ్యక్తము, బుద్ధి, అహంకారము, పంచతన్మాత్రలు, పంచభూతములు, ఏకాదశేంద్రియములు ఆత్మ మొదలగునవి ఇరవై ఐదు తత్త్వములు అని, యోగులు: సాంఖ్యులు చెప్పిన అవ్యక్తాదులు ఇరవై ఐదులో ఈశ్వరుడితో మొత్తము ఇరవై ఆరు తత్త్వములు కలవని బోధకుడు అనగా ఉపాధ్యాయుడు, బోధచేయువాడు, యదార్థ జ్ఞానమును తెలుసుకొనువాడు, చక్కగా తెలుపువాడు, ప్రేరేపించువాడు జ్ఞానోపదేశముచేయువాడు, మనస్సును వికసింపచేయువాడు అని అర్థము. సర్వ పదముచేత అన్ని దర్శనముల తత్త్వములు అని అర్థము. శ్రీసదాశివుడు జ్ఞానస్వరూపుడు. ఆయనకు సర్వతత్త్వములు తెలుసును. మనకు పురాణేతిహాసములద్వారా శివపార్వతుల సంభాషణమున ఎన్నోగాథలు, మరెన్నో మహాత్మ్యములు, మరెన్నో తత్త్వములు తెలిసినవి.

సర్వేభ్యః సాధనసంపన్నేభ్యః తత్త్వం తద్భావః తస్య పరమేశ్వరస్య పారమార్థికం రూప మాత్మతత్త్వం శ్రీగురుమూర్తి రూపేణ ప్రకర్షేణ బోధ యత్తత్ సర్వ తత్త్వ ప్రబోధకః శ్రీదక్షిణామూర్తి గురురేవహి. సనకాది సర్వలోకస్య తత్త్వోపదేష్టేతి శాస్త్ర ప్రసిద్ధిః

సర్వులు అనగా సాధన సంపన్నులు. తత్త్వం అనగా భగవంతుని స్వరూపము. ఆ పరమేశ్వరుని పారమాత్మిక, పారమార్థిక రూపమే ఆత్మతత్త్వము. ఆతత్త్వమును సద్గురువులు తేలికగా అర్థమయ్యేటట్లుగా బోధించెదరు. సద్గురువుకే ఆత్మ ప్రబోధము కలిగించే సదాశివుడే సర్వతత్త్వ ప్రబోధకుడు. శ్రీదక్షిణామూర్తే సద్గురువుగా విరాజిల్లుచున్నాడు. ఆయన సనక సనందనవాదులకు తత్త్వోపదేశము చేయగా వారు సర్వలోకమునకు తత్త్వోపదేష్టలు ఐరి అని లోకమున, శాస్త్రమున ప్రసిద్ధి కలదు.

ననః ఆదినారాయణ ఏవ బ్రహ్మణ ఉపదేష్టేతి నారాయణోపనిషది శ్రూయతే. తర్హి శివస్య సర్వోపదేష్టృత్వం కథమితి చేత్? సత్యం నారాయణో బ్రహ్మణో సోఽపి

సనత్కుమారాదిభ్యః తే తేస్వస్వ శిష్యేభ్యః ఉపదిశంత్యేవ. తథాపి మూలగురుః శివః ఏవ సర్వార్థాన్ దేవ్యై సముపాదిశత్। తదా కుమారః శ్రుత్వా సనకాదిభ్యః ఇతి కాచిత్ గురుసంతతిః శివః ప్రథమం హరయే హరిర్విధయే విధిః వ్యాసాయ ఉపదిశతీతి అన్యా గురుసంతతిః బృహజ్జాబాలా ఆహుః శివః స్వవక్షసి స్థితం భస్మ నఖేన ఆదాయ అభిమంత్ర్య పంచాక్షరేణ హరిమస్తక గాత్రేషు సమక్షిపత్ తదా హృది ధ్యాయస్వేతి. సహరిః హృదిధ్యాత్వా దీపో దృష్ట ఇతి. తతో భస్మ భక్షయిత్వా శివం స్తువన్ దృష్టైశ్వర్యో భక్తి మగమత్. భస్మాఽభక్షయదచ్యుతః

నారాయణ ఉపనిషత్తునందు వైకుంఠ వాసి ఐన ఆదినారాయణుడే బ్రహ్మదేవునకు తత్త్వమును ఉపదేశించెను అని ఉన్నది. కానీ అది అట్లుండగా శ్రీసదాశివునకు సర్వతత్త్వోపదేష్ట్రుత్వము ఎట్లు సంభవించును అని ప్రశ్నింపగా ఆ ప్రశ్న సమంజసముగానే ఉన్నది. కాని తత్త్వోపదేశక్రమము అనేకవిధములుగా ఉన్నది. అందు ఒక విధానమున శ్రీమన్నారాయణుడు బ్రహ్మకు తత్త్వమును ఉపదేశింపగా ఆ బ్రహ్మ సనకసనందాదులకు వారు వారి శిష్యులకు ఇట్లు గురుశిష్యపరంపరగా నేటికి తత్త్వోపదేశము జరుగుచుండెను. మరొక విధానమున అసలు తత్త్వోపదేష్టలకు మూల గురువు శ్రీసదాశివుడే. ఆయనే సర్వోపదేష్ట. ఆయననుండి ఉపదేశమును కుమారస్వామి పొందగా, ఆయననుండి సనకాదులు పొందిరి. వారి ద్వారా వారి శిష్యులు. ఇట్లు ఒక గురుశిష్య పరంపరకలదు. ఇట్లాగే మరి ఒక గురుశిష్య ఉపదేశ పరంపర కలదు. అందు మొదట శ్రీసదాశివుడు శ్రీహరికి తత్త్వమును ఉపదేశించెను. అంతట ఆహరి బ్రహ్మకు, ఆబ్రహ్మ వేదవ్యాసునకు, వేదవ్యాసుడు తన శిష్యులకు ఇట్లు ఇది ఒక గురు శిష్య ఉపదేశ పరంపర కలదు. బృహజ్జాబాలుడు ఇట్లు పలికెను. శ్రీసదాశివుడు తనవక్షస్థలమందు ఉన్న విభూతిని గోటితో తీసికొని శివపంచాక్షరిచేత అభిమంత్రించి శ్రీహరి శరీరమందు చల్లెను. అంతట శ్రీహరి తత్త్వమును ధ్యానింపగా హృదయమున ఒకదీపమును చూడబడెను. అంతట ఆభస్మమును తిని సదాశివుని ధ్యానించి ఆయనను దర్శించి ఆయన భక్తుడాయెను. కనుక శ్రీసదాశివుడు ఇచ్చిన భస్మమును భుజించుటచే ఆయనకు తత్త్వము తెలిసెను.

**తత్రాఽఽశ్చర్యోమహానాసీత్ప్రతిబింబ సముద్యుతిః**
**వాసుదేవః శుద్ధముక్తాఫల వర్ణోఽభవత్ క్షణాత్**
**తతః ప్రభృతి శుక్రాంగో వాసుదేవ ప్రసన్నధీః ఇతి శ్రుతేః స పూర్వేషామపి గురుః కాలేనానవచ్ఛేదాదితి పాతంజల సూత్రాత్.**

**ఈశానః సర్వవిద్యానాం స ఏవాదిగురుః బుధాః ।**
**తస్య శిష్యో మహావిష్ణుః సర్వజ్ఞాన మహోదధిః ॥**
**తస్మాదాత్త పరిజ్ఞానో బ్రహ్మ సర్వజగత్పతిరితి సూతవచనాచ్చ బ్రహ్మాది సకలలోక గురోః నారాయణ స్యాపి గురుః శివః ఏవేత్యాశయేన సర్వతత్త్వబోధకః శివః ఇత్యర్థః**

అంతట అచట గొప్ప ఆశ్చర్యము జరిగెను. బింబమునకు ఎంతటి శక్తికలదో ప్రతిబింబమునకు కూడా అంతే శక్తి సమకూరెను. వాసుదేవ స్వరూపుడైన శ్రీహరి బాగా పండిన ఫలమువలెపరిశుద్ధుడై ముక్తుడాయెను. ఆ సదాశివుడు అనాదికాలమునుండి అందరికి తత్త్వమును బోధించుచుండెను. శ్రీసదాశివుడే సర్వవిద్యలకు విద్వాంసులందరికీ, గురువులందరికి మొదటివాడు. కానీ అతడు దేశకాల అవస్థలచేత బంధింప బడేవాడు కాదని

పాతంజలసూత్రములవలన తెలియుచున్నది. కనుక సదాశివుడే మహావిష్ణువునకు సకలజ్ఞానమును ఉపదేశించెను. ఆవిష్ణువు తర్వాత బ్రహ్మకు ఉపదేశించెను. కనుక సర్వవిద్యాతత్త్వమును, సృష్టి స్థితి సంహార రూపమైన తత్త్వమును విష్ణువునకు శివుడే ఉపదేశించెను.

## శబరాభయదః 36

శవతి గచ్ఛతి మృగయయా వనమితి శబరః। తస్మై జనిమృతిభీతస్య అభయం మోక్షం దదాతీతి శబరాభయదః। అథవా। తస్య శబరస్య పూజావసరే ద్విజానాం సాహాయం పశ్యతాం సతామీశ్వరాజ్ఞయా కశ్చిన్మహాధ్వనిరజాయత। తచ్ఛ్రుత్వా ద్విజా మండపోఽద్య పతిష్యతీతి। సర్వే నిర్జగ్ముః తదాఽయం లింగభేదభయేన స్వశరీరం విలాసీకృత్య లింగమాచ్ఛాద్య। వినమున్నాసీత్। తదను తస్మై శబరాయ యో దేవోఽభయం దదౌ। తస్మై శబరాభయదాయ నమ ఇత్యర్థః।

శవగతౌ అనే ధాతువునుండి శవశబ్దము వచ్చినది. దీనికి అర్థము ప్రవాహము, నీరు, పీనుగు, గమనము కలిగినది అనే అర్థములు కలవు. శవశబ్దమునుండే శబర - శబరులు అనునవి వచ్చినది. ఆటవికులు ఒకచోట స్థిరముగా ఉండరు. ఆహారము ఎక్కువగా దొరకేచోట నివాసమేర్పరుచుకొనుటచేత వారిని అట్లు పిలిచెదరు. శబరము అనగా ఒక ఆటవికులు ఉండే దేశము, కొండవాళ్ళు, బోయవాళ్ళు. శివుడు ఒక ప్రసిద్ధమీమాంసా శాస్త్ర పండితుడు అని అర్థములు కూడా శబర శబ్దమునకు కలవు. కిరాతులు, శబరులు, పులిందులు అనునవి మ్లేచ్ఛజాతికి చెందినవి. వన్యప్రాణులను చంపి వాటినే ఆహారముగా తీసుకొని జీవించేవారు. అటువంటి వారలకు శ్రీకాళహస్తీశ్వరుడు అభయము ఇచ్చెను. తిన్నడుకూడా ఆటవిక జాతికి చెందినవాడే ఐనను దయార్ద్రహృదయుడు పరమకరుణామూర్తి ఐన ఆ శ్రీకాళహస్తీశ్వరుడు అతని మూఢ భక్తికి మెచ్చి మోక్షమును ఇచ్చెను. అందువల్ల ఆయన శబరాభయదుడు.

శివతి అనగా గచ్ఛతి. ఆటవికులకు వేట భుక్తిని ఇచ్చే ఒక క్రీడ. వారిక్రీడ దట్టమైన అడవిలోనే భుక్తిని వినోదమును ఇచ్చే వృత్తిని స్వీకరించినందువల్ల వారిని శబరులు అని అందురు. అటువంటి వారియందు శ్రీకాళహస్తీశ్వరునకు ఎందుచేతనో జననము మరణము ఈరెండింటికి సంబంధించిన భయమును పోగొట్టి అభయమును ఇచ్చి మోక్షమును గూడా ఇచ్చెను. అందువల్ల ఆయన శబరాభయదుడు.

మూఢమైన భక్తి కలిగిన ఆ శబరులు ఒకానొక రోజున శ్రీకాళహస్తీశ్వరుని అచంచలభక్తి తత్పరతతో అర్చనచేయుచుండగా అసూయాపరులైన కొందరు దానిని ద్వేషింపగా ఈశ్వరాజ్ఞతో అచట ఒక మహాధ్వని వినిపించెను. ఆభయంకర శబ్దమునకు భయపడిన ఆ అసూయాపరులు తాము ఉన్న మండపము కూలి క్రిందపడును అని భావించి దిక్కులు తోచక పరుగులు తీసిరి. అంతట శ్రీసదాశివుడు ఆ లింగమున తన శరీరమును సాక్షాత్కరింపచేసి తన దివ్యమంగళ స్వరూపమును అందరికి కనపరచెను. అంతట ఆ శబరులు మిక్కిలి భక్తి ప్రపత్తులతో శ్రీకాళహస్తీశ్వరుని స్తోత్రములు చేయగా ఆయన ప్రసన్నుడై వారికి అభయమిచ్చెను. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరుడు శబరాభయదుడు. అందువల్ల ఆయనకు అనేక నమస్కారములు.

## గౌరః 37

గుర్ ఉద్యమే అనే ధాతువునకు క్విప్ ప్రత్యయము అణ్ ప్రత్యయము చేసిన గౌరః శబ్దము వచ్చును. గౌరమనగా బేహారి, వర్తకుడు, గవరి, ఒకానొక జాతి మృగము, తెల్లావాలు, పద్మకేసరము, అకరువ, కుంకుమపువ్వు, బంగారు ఎర్రనిది, తెల్లనిది, పసుపు పచ్చనిది, స్వచ్ఛమైనది, చంద్రుడు, బ్రహ్మ. ఆకరువు ఒకేగిట్ట కలిగిన ఒకజాతి పశువు అని గౌర శబ్దమునకు అర్థము.

గౌరఇతి । పీతో గౌరో హరిద్రాభ ఇతి । ని । శివస్య స్వతో సకోఽపి వర్ణసంక్రమః । అతోహిమశిలాఖండ మహాకాశ వన్నిర్మల ఏవ తస్య విగ్రహః తథాపి శ్రీగౌరీపరిగ్రహీత వామ కళేబరత్వాత్ । గౌర్యాస్తప్తజాంబూ నదారుణప్రభాత్వాత్ । తథాచ । బోధాయనోక్తపంచ ముఖస్తవే వామభాగం ప్రస్తుత్యత్య బాలార్కాగ్నితటిత్రుతప్తకనక ప్రస్ఫూర్తి తేజోమయం । గంభీర ధ్వని సామవేదజనకం తామ్రాధరం, సుందరమితి ॥ గౌరీదేహోభాసాకబళిత్వాత్ శివస్య యుక్త మేవ గౌరత్వం । అథవా అవదాతస్సితో గౌరో వళక్షో ధవళోఽర్జున ఇతి నిఘంటుతః గౌరశ్శారదాభ్ర సంకాశశ్శివ ఇత్యర్థః గురతే మనోస్మిన్నితి గౌరః । గురఉద్యమనే । గూయతే కీర్త్యతే సర్వోత్తర ఇతిగౌరః । గు శబ్దే । అనేన సర్వమనోహరత్వం బహుకీర్తిమత్వం చ ద్యోతితం భవతి ॥

గౌరః అనగా గౌరవర్ణము కలిగినది. పసుపు వర్ణము కలిగినది. పసుపు కాంతికలిగినది అని అర్థము. శివుడు స్వభావముగా ఏ వర్ణమునకులోబడి ఉండువాడు కాడు. వర్ణములే ఆయన అనుగ్రహమునకు లోబడి ఉండును. అందువలననే ఆయన మంచురాళ్ళముక్కలవలె స్వచ్ఛమైన మహాకాశమువలె మిక్కిలి నిర్మలమైనవాడు. శ్రీసదాశివుని రూపము. ఆ రూపము ఆప్రకారముగా ఉన్నప్పటికినీ శ్రీగౌరీదేవిని తన ఎడమభాగమున అమర్చుకొనుటవలన శ్రీగౌరీదేవి నేరేడుపండువంటి రంగుతో ప్రకాశించుచున్నది. అర్ధనారీశ్వరుని స్వరూపమున ఒకభాగము స్వచ్ఛమైన తెల్లని కాంతిగలినదియు, మరి ఒక భాగ ము బాగాపండిన నేరేడు పండువంటి రంగున ప్రకాశించునదియు ఐ ఉన్నది. బోధాయన మహర్షి తన పంచముఖస్తవమున శ్రీసదాశివుని ఎడమభాగముగూర్చి స్తోత్రము చేయుచూ, బలార్కమనే అగ్నినుండి లేచిన మెరుపు బాగా అగ్నిలో కాల్చబడిన బంగారపు ముక్క తేజస్సు అంతటా వ్యాపించి ఉన్నది. సామవేదమునుండి పుట్టిన గంభీరమైన ధ్వని అతి సుందరమైన ఎర్రనైన అధరములనుండి బయటపడినదని ఆశ్లోక భావము. శ్రీగౌరీదైవి యొక్క శరీరకాంతిచేత శ్రీసదాశివుని దేహకాంతి మ్రింగి వేయుటవలన శ్రీసదాశివునకు గౌరత్వము తగినదే. అట్లుగానిచో ఏ రంగులు శివుని అంటవు. తెలుపునకు నిఘంటువున కొన్ని పర్యాయపదములు కలవు. అవి. 1. అవదాత, (తెల్లనిది, పచ్చనిది, స్వచ్ఛము, శ్రేష్ఠము అనే అర్థములు కలవు). 2. సితః (తెల్లనైనది) 3. గౌరః (ఎర్రనిది, తెల్లనిది, పసుపుపచ్చనిది, స్వచ్ఛమైనది) 4. వళక్షః (తెలుపు, తెల్లనిది) 5. ధవళః (ఆవు, తెలుపు ఆంబోతు, తెల్లనిది, చక్కనిది) 6. అర్జునః (కసవు, బంగారు కంటితేవులు, ఏరుమద్ది, తెలుపు) గౌరః అనగా శరత్కాలపు కాంతి చేత స్వచ్ఛమై ఆకాశమువంటి కాంతి కలిగిన దేహము శ్రీసదాశివునిది. లోకకళ్యాణముకై సాహసమైనవియు, ఉద్యమముతో కూడుకొనునవి అగు పనులను చేయగలవాడు శ్రీసదాశివుడు ఒకడే. లోకమున సర్వోత్తముడు, సర్వశక్తిమంతుడు అని అనేకమందిచేత కొనయాడబడేవాడు కీర్తింపబడేవాడు శ్రీసదాశివుడు. గు అనే శబ్దము చేత సర్వోత్తరత్వం చెప్పినది. శ్రుతి వాక్యములు వేదములు శ్రీసదాశివుని సర్వమనోహరునిగా బహుకీర్తిమంతునిగా స్తోత్రము చేయబడుచున్నవి.



భక్త కన్నప్ప

## శబరేక్షణపూజిత: 38

సామాన్యులు ఏవిధముగా శ్రీసదాశివుని అనుగ్రహమునకు లోనగుదురో వర్ణింప అలవికానిది. భక్తులు ఎట్లు స్వామిని అర్చించి ముక్తిని పొందుదురో అదిగూడా శ్రీసదాశివుని అనుగ్రహము మీద ఆధారపడి ఉన్నది. భగవద్భక్తి సామాన్యముగా ఎనిమిది విధములు. అవి శ్రవణం, కీర్తనం, స్మరణం, పాదసేవ, అర్చనం, వందనం, దాస్యము, సఖ్యము, ఆత్మనివేదము అని కలవు. భాగవత వాత్సల్యము, భగవత్పూజయందు అను మోదము, భగవదర్చన, భగవద్విషయానందము. భగవత్కథా శ్రవణేచ్ఛ, స్వరనేత్రాంగ వికారము, సదా భగవదనుస్మరణము, అమాంసభక్షణము మొదలగునవి. భజ సేవాయాం అను ధాతువునుండి క్తిన్ అనే కృత్యప్రత్యయమువలన భక్తి రూపము వచ్చెను. భగవంతునియందు అనురాగము అని భక్తి శబ్దార్థము.

పొత్తపినాడునందు ఉడుమూరు అను గ్రామమున నాగడు అనుబోయవాని- దత్త అని బోయవాని భార్యకు చాలాకాలం సంతానము కలుగలేదు. సుబ్రహ్మణ్యేశ్వర స్వామి అనుగ్రహమున వారికి- తిన్నడు అను కుమారుడు కలిగెను. అతడు తండ్రివద్ద విలువిద్యను నేర్చి తనమిత్రులైన నాణుడు, కాముడులతో వేటకై అడవికి వెళ్ళి ఒకపందిని వేటాడి సంహరించిరి. ఆకలి గొన్నవారు ఆపందినికాల్చి తినవలెనని నిశ్చయించి స్వర్ణముఖీతీరమునకు ఆపందిని తీసుకొని వచ్చిరి. మిత్రులు ఆ పందిని కాల్చుచుండగా పర్వతంపైనున్న శ్రీకాళహస్తీశ్వరుని యాదృచ్ఛికముగా దర్శింపగోరి వచ్చిరి. ఈశ్వర సందర్శనము వెంటనే తిన్నడి జీవితము చిత్తప్రవృత్తి అంత మారిపోయి ఆక్షణమున అతనికి అచంచల శివభక్తి తత్పరత ఏర్పడి ఆరుదినములు శివపూజ చేయుగా ఒక నాడు తిన్నడుని శ్రీకాళహస్తీశ్వరుడు పరీక్షింపగోరి అతను అర్చనకై వచ్చువేళ. దేవుని కంటినుండి రక్తము కారుట చూచి కంటిని తిన్నడు అనేక పర్యాయములు తుడిచెను. ఐనను రక్తము కారుచునే ఉన్నది. అనేక మూలికలతో చికిత్సచేసినను రక్తముగారుట ఆగలేదు. అంతట తిన్నడు తనకంటిని ఒకదానిని పెరికి ఈశ్వరుని కంటిపైన ఉంచెను. అంతట ఆకన్ను అచటనే అతికి రక్తపుధార ఆగెను. కాని రెండవకంటి వెంటమరిలా రక్తపుధార కారుచుండగా చికిత్స తెలిసిన తిన్నడు రెండవ కంటిని పెరుకుటకు బాణమును కంటిమీద పెట్టగా ఈశ్వరుడు ప్రత్యక్షమై 'కన్నప్పా' అని పిలిచి అతనికి ముక్తిని ప్రసాదించెను. అప్పటినుండి తిన్నడు కన్నప్ప నాయనారని పిలువబడెను. నేత్రేశనాయనారు అనునది సంస్కృత నామము శబరుడు అన, ౦ తిన్నడు. అతను పరమభక్తి పారవశ్యముతో శ్రీకాళహస్తీశ్వరుని నేత్రములతో పూజించినందున తిన్నడు ముక్తినిపొందెను. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరుడు శబరేక్షణపూజితుడు.

శబరో జన్మాంతరే నిత్యశివలింగారాధకేన కేన చిద్వ్యాధేన పాలితః । కశ్చిచ్ఛరణాయుధః స్వామిభుక్తి సమయే శివనివేదిత మాంసకణం తన్ముఖస్ఖలితం ఖాదన్ సద్యస్తేన మారితః । పరస్మిన్జన్మని నిర్మాల్యప్రభావేన శబరరాజకులే జనిత్వా పూర్వజ్ఞానేన దిష్ట్యా సందృష్టం శ్రీమద్దక్షిణ కైలాస విలసద్వాయులింగం శ్రద్ధయాఽఽరరాధ । తతశ్చ దివస చతుష్టయాదర్వాగేవ తద్భక్తి శోధనార్థం ద్విజాత్యభిమాన గర్వనిర్వాపణార్థం చ భగవద్దృష్టిస్థానే రుధిరముదభూత్ । తత్పరిహర్తు కామేన కృతవివిధ చికిత్సావైయర్థ్యేన అనేన శబరరాజకుమారేణ స్వవీక్షణేన పూజితః । శివలింగదృక్స్థానే స్వనేత్రగోళకం నిహితమిత్యర్థః । అథ ద్వితీయనయనే దేవస్య తథావిధే స్వీయం ద్వితీయం నయన మపి ఛ్చురికయోజ్ఝహార । తదైవ హరః ఆవిర్భూయ ముక్తి సుఖమస్మై దదావితి కథాను సంధేయా । అతస్తేన శబరేణ స్వవీక్షణేన పూజిత ఇత్యర్థః ।

శబరుడు పూర్వజన్మలో నిత్యము శివుని ఆరాధించేవాడు. ఆ శబరుడు ఒకానొక వ్యాధుని రక్షణలో ఉన్నాడు. ఆ వ్యాధుడు ఒక కోడిని పెంచుతూ ఉండెను. ఆ శబరుడు శివభక్తుడు. శివునకు నివేదించిన మాంసమును మాత్రమే అతడు భుజించుచుండెను. ఆసమయమున అతని ముఖమునుండి జారిన మాంసఖండము ఆకోడి తినుచుండగా అతను దాని చంపెను. శివప్రసాదమును స్వీకరించిన పుణ్య విశేషమున తర్వాత శబరరాజకులములో పుట్టి పూర్వజన్మ పుణ్య సంస్కారముచేత అప్పటి అదృష్ట విశేషములో చూచిన శ్రీమద్దక్షిణ కైలాసమున వెలసిన వాయు లింగమును శ్రద్ధగా ఆరాధించెను. అటుతర్వాత నాలుగు రోజులలో అతని భక్తిని శోధించి అతని భక్తి వైశిష్ట్యమును లోకమునకు చాటవలెనని శ్రీకాళహస్తీశ్వరుడు తలచెను. అంతట ప్రతిమారూపుడైన శివుని కంటివెంట నెత్తురు కారుచుండెను. ఆకారే

నెత్తురును ఆపవలెనని శతవిధముల ప్రయత్నములు, వైద్యములు, చిట్కాలు చేసిననూ ఆగలేదు. అంతట శబరరాజకుమారుడు బాణములో తనకంటిని తీసి శివుని ప్రతిమకు నేత్రస్థానమున ఉంచగా అది అచట అతికి నెత్తురు కారుట ఆగినది. రెండవనేత్రం నుండి మరలా నెత్తురు కారుట చూచి ఆస్థానమునకూడా తన రెండవ కంటిని కత్తితో పెకలింపబోవగా అంతలో శ్రీసదాశివుడు ప్రత్యక్షమై ముక్తి సుఖమును అతనికి ప్రసాదించెను. అందువల్ల శివుడు శబరేక్షణములచేత పూజింప బడినవాడు అని అర్థము. శ్రీకాళహస్తీశ్వరుడు శబరేక్షణ పూజితుండుగా, కన్నప్పకు మోక్ష ప్రదాతగా వెలుగొందెను.

## సువర్ణముఖరీ తీరవాసీ 39

పవిత్రమైన స్వర్ణముఖీనది శ్రీకాళహస్తి దివ్యక్షేత్రమునకు పడమరదిక్కున ఉత్తరం దక్షిణ వాహినిగా ప్రహించుచున్నది. దీనిని సువర్ణముఖి, సువర్ణముఖరీ, మొగిలేరు అనేపేర్లతో పిలుచుచున్నారు. పూర్వము పార్వతీపరమేశ్వరుల కల్యాణం హిమవంతుని గృహమున అత్యంత వైభవముగా జరిగెను. ముక్కోటి దేవతలు వాణీ హిరణ్యాగర్భులు, శచీపురందరులు, శ్రీదేవీ భూదేవి సహిత శ్రీమన్నారాయణులు, సప్తర్షులు, అష్టదిక్పాలకులు బ్రహ్మాండమున విరాజిల్లే ప్రముఖులెల్లరు ఉత్తర దిక్కులో ఉండే హిమవత్పర్వతమును చేరిరి. దైవలీలగా అచటి పర్వతము క్రిందికి కుంగినది. ఆ ఆశ్చర్య సంఘటనకు భయపడి అందరూ పరమేశ్వరుని ప్రార్థింపగా అంతట శివుడు ప్రసన్నుడై అగస్త్య మహర్షిని కొంతకాలం దక్షిణ దేశంలో ప్రసిద్ధి చెందిన అఖండ బిల్వకాననమున నివాసము ఉండమని అజ్ఞాపింపగా అంతట అగస్త్యుడు శివునితో ఇలా విన్నవించుకున్నాడు. దక్షిణదేశంలో నివాసం ఉండాలంటే నీళ్ళు కావాలి ఆబిల్వకాననంలో జీవనది ఏదీలేదు. తమరు పార్వతితో అచట శ్రీకాళహస్తీశ్వరుడు వచ్చే ముందుగా గంగను పంపవలసినదిగా ప్రార్థింపగా బ్రహ్మద్వారా ఆకాశగంగ శ్రీకాళహస్తికి వచ్చినది. దానినే స్వర్ణముఖీనది అని అందురు. గౌతముని ఆశ్రమమున శపింపబడ్డ దేవేంద్రుడు ఈనదిలో స్నానంచేసి, తన పాపాలను పోగొట్టుకున్నాడు. ఈనది చంద్రగిరికి 20 మైళ్ళదూరమున మంగళం పేటకు దగ్గరలోని మల్లప్ప నాయని చెరువున పుట్టి దామల్ చెరువు మీదుగా ప్రవహించి శ్రీకాళహస్తికి చేరినది. ఈ నదికి ఇరువైపుల ఉండే గట్లమీద ఈనాటికి అనేక మొగలి పొదలు ఎక్కువగా ఉండుటచేత దీనిని మొగిలేరు అనేవారు. ఈ నది ఆవిర్భావమునకు మరి ఒక ఇతిహాసము కలదు. శ్రీపరమేశ్వరుని ఆదేశమున వశిష్టుడు అరుంధతితో దక్షిణదేశమున శ్రీకాళహస్తిని దర్శింపవచ్చి అచట నీటివసతి లేకుండటచే బ్రహ్మను గూర్చి తపస్సు చేయగా బ్రహ్మ శివునివద్దకు వెళ్ళి బ్రహ్మర్షి కోరికను నివేదించగా శివుడు బ్రహ్మర్షి కోరికననుసరించి తన జటాజూటమున ఉన్న గంగను బ్రహ్మవెంట పంపగా గంగాదేవి బ్రహ్మర్షి ఐన వశిష్టుడు తపమాచరించు ప్రదేశమునకు సువర్ణకాంతులతో విరజిమ్ముచూ ప్రవహించినందున ఆగంగకు సువర్ణముఖీ అనుపేరు కలిగినది. వారణాశిలో గంగవడ్డున ఉన్న శివుడు విశ్వనాథుడు. సువర్ణము వడ్డున (గంగ) ఉన్న శివుడు శ్రీకాళహస్తీశ్వరుడు. అటువంటి శ్రీకాళహస్తీశ్వరుడు మమ్ములను కాపాడుగాక.

**సువర్ణముఖరీనామనిర్వక్తి । మూలపురాణం ।**
**సువర్ణమివ లోకానాం భాగధేయా వియున్నదీ ।**
**అగస్త్యేన భువం నీతా ముఖరీకృత దిఙ్మఖేతి ।**

యథా లౌకికానాం సువర్ణం కనకరాశి ర్వాభాగధేయం భవతి । తథేదాసీం వియన్నదీస్వర్గంగా అత్రత్యముని సంఘప్రార్థితేన శ్రీమదగస్త్యేన భువం భూమిన్నీతా ఆనీతేతి ముఖరీక్షితదిఙ్ముఖా విరాజ ఇతిశేషః । తస్యాస్తీరం సువర్ణ ముఖరీతీరం తత్రైవ నిత్యం వసతీతి సువర్ణముఖరీతీరవాసీ । కథం శివస్య తత్తీరవాసిత్వం బహవస్సంత్యాలయాః దేవాంతరాణామపీతి చేత్ సంతః దేవాంతరాణాం మనుష్యాణాం తిరశ్చాం వాలయాః ప్రాధాన్యేన శ్రీకాళహస్తీశ్వరస్యైవ పూజార్థం మునిసింహేనానీతా తజ్జలాదిభిశ్శంకరః పూజితశ్చ పశ్చాత్సర్వజంతూనాం పాపక్షయ ద్వారా ముక్త్యర్థ మవగాహన ప్రాశనాది భుక్త్యర్థం చ భవతి । కించేయం వియన్నదీ శ్రీకాళహస్తిక్షేత్రాలంకారాయై వావిరాసీదితీమమర్థం స్వప్రవాహగతి భేదేనైవ సూచయతి ఖలు । సర్వతః పూర్వవాహినీయం తటినీ శ్రీమద్దక్షిణకైలాస ఏవోత్తరవాహిన్యభూత్ । కూర్మవచనంచ ।

**పశ్చిమాభిముఖం లింగం నదీచోత్తరవాహినీతి ।**
**తస్మాచ్ఛివ పూజార్థం మగస్త్యేనానీతా నదీ సకలహితంకరీ తత్తీరవాసీ దేవ ఇత్యర్థః ।**

బంగారమునందు మానవులకు మక్కువ ఎక్కువ. బ్రహ్మలోకమునుండి ఆకాశమార్గమున భూమి మీదికి వచ్చినది కనుక ఆ నదికి ఆకాశగంగా అనిపేరు. ఈనదిని అగస్త్య మహర్షి పరమేశ్వరుని అనుగ్రహంతో భూమిమీద తీసుకొనివచ్చిరి. ముఖరము అనగా ధ్వని చేయునది, ఎడతెగని చప్పుడు చేయునది. ఘల్లు ఘల్లుమని మ్రోగునది. దిక్కులు మారుమ్రోగునట్లు చప్పుడు చేయునది. ఈ నది అని అర్థము. లౌకికులైన వార్కి సువర్ణమన్ననూ కనకమన్ననూ మిక్కిలి ప్రేమ అదే భాగ్యముగా భావించుకొనెదరు. అఖండ బిల్వకాననమున నివాసముండే అనేకులైన మహర్షులు అగస్త్యుని ప్రార్థింపగా ఆ మహర్షి ఆకాశ గంగను భూమి మీద ఉండే అఖండబిల్వకాననమునకు రప్పించెను. ఆ నది ఇచటకు వచ్చుటచే ఆ నది పరిసరప్రాంతములనియూ మిక్కిలి పవిత్రములై తేజోవంతములైనవి. ఆ నదీ తీరమునందు నివశించు చున్నందున వారు నదీతీరవాసులైరి. సర్వేశ్వరుడుకూడా ఆ నదీతీరమందు నివాస మేర్పరచుకొనెను. సామాన్యముగా ఆంధ్రదేశమున కృష్ణా, గోదావరీ నదీతీరములలో శివక్షేత్రములే ఎక్కువ. శివుడు గంగాధరుడు కనుక గంగ ఎచట ఉంటే శివుడు ఆమె చెంతనే ఉండగలడు. కనుక స్వర్ణముఖీతీరమున శ్రీకాళహస్తీశ్వరుని నివాసము సహజసిద్ధము.

కానీ ఆ తీరమందు ఇతర దేవతలు, మనుష్యులు జంతువులు మొదలగునవి ఉంటునప్పుడు సర్వేశ్వరుడు ఉండుటలో ఒకవిశేషము గలదు. ముఖ్యముగా శ్రీకాళహస్తీశ్వరుని పూజకొరకు ముని సింహుడైన అగస్త్యునిచేత ఆ గంగను తీసుకొని రాబడి ఆజలములచేత శంకరుడు పూజింపబడినవాడై తర్వాత సమస్తప్రాణులకు పాపక్షయముద్వారా ముక్తిని పొందించినది. ఆ నీరు త్రాగుటచేత శరీర కల్మష హరము జరుగును. ఆ నది శ్రీకాళహస్తి క్షేత్రమునకు అలంకారమై ఆవిర్భవించి శ్రీకాళహస్తీశ్వరుని అనుగ్రహమునకై తన గమనమును మార్చుకొన్నది. ఈనది పుట్టుకనుండి పూర్వవాహినై శ్రీమద్దక్షిణకైలాసమైన శ్రీకాళహస్తి క్షేత్రమందు ఉత్తర వాహినిగా మారెను. ఇది అపూర్వ విశేషముగదా! కూర్మ పురాణ వచనము ఈ విధముగా ఉన్నది. ''పశ్చిమాభిముఖం లింగం నదీచోత్తర వాహినీ'' శ్రీకాళహస్తినందు శివుడు పశ్చిమాభిముఖుడై ఉండెను. ఆస్వామి సన్నిధిలో ప్రవహించే నది ఉత్తర వాహినిగా ఉండెను. అందువల్ల సర్వేశ్వరుడైన శివుని పూజకొరకు అగస్త్యుని చేత తీసుకొనిరాబడిన ఈస్వర్ణముఖీనదీతీరమున ఉన్న శ్రీకాళహస్తీశ్వరుడు సకలహితములను అందరికి ఇవ్వగలడు.

## విజయంవముక్తిదః 40

ఈ కాళహస్తి క్షేత్రము సంసారబంధపాశమును విచ్ఛేదనము చేయుటలో ప్రసిద్ధిని వహించినది. శ్రీ, కాళము, హస్తి. కన్నప్ప మొదలగువారు సంసార బంధ పాశమును వీడి శివసాయుజ్యముక్తిని పొందిరి.

కశ్చిద్ద్విజః శ్రీకాళహస్తిస్థలే మహావైరాగ్య సంపన్నః సుందరీం నిజజాయామపి యువతీం వైరాగ్యేణ విధూయ ఉత్తర దేశే క్రోశదూరే పూజార్థం మహోద్యాన వాటీం నిర్మాయ తత్ర భగవంతమారరాధ । తదాస్య జిహ్వా గుహ్యనిర్జయ సామర్థ్య దర్శనా ద్విజయునామక ఇతి తత్రత్య ముని విరచిత నామాంకితః సన్ కాలేన పశుపతినా కృత దీక్షాదృష్టి స్సంసారపాశముచ్ఛిద్య సాయుజ్యముక్తిం శ్రావణపౌర్ణిమాస్యాం ప్రాపిత ఇతి కథా । అత ఏవ పాశవిచ్ఛేదకక్షేత్ర ప్రసిద్ధిః । తస్మాద్విజయముక్తి దశ్శివ ఏవేత్యర్థః ।

ఒకానొకసద్బ్రాహ్మణుడు శ్రీకాళహస్తికి సమీపమున నివసించుచున్నాడు. అతను మిక్కిలి వైరాగ్య సంపన్నుడు. ఐతే తనకున్న వైరాగ్యమునకు నిరంతర భగవతారాధన చేయవలెనని సంకల్పించెను. యుక్త వయస్సుచేత మిక్కిలి సుందరియైన తన భార్య అనుమతి మీద ఆమెకు దూరముగా ఉండదలచెను. శ్రీకాళహస్తి క్షేత్రమునకు ఒక క్రోసెడు దూరమున ఒక పర్ణ శాలను, ఉద్యానవనమును నిర్మించుకొని తదేకధ్యాననిష్ఠుడై శ్రీకాళహస్తీశ్వరుని ఆరాధించుచుండెను. అప్పుడు అతని నాలుకయందును, సాంసారిక భోగములను త్యజించే ప్రతిభాపాటవములు ఉన్నందున అతను విజయుడను పేరును పొందెను. అచట ఉండే ఒక మహాముని చేత సర్వేశ్వరునికి సంబంధించిన అనేక నామములను కంఠస్తముచేసి ఆధ్యానమందే చేరి ఉండెను. కొంతకాలము తర్వాత పశుపతికి ఆవిజయుడు చేయు తపస్సుకు సంతోషమును కలిగించెను. అంతట సర్వేశ్వరుడు విజయుని దీక్షాదృష్టికి మెచ్చి అతని సంసార పాశమును తెంపి, సాయుజ్యముక్తిని ప్రసాదించెను. ఆముక్తిని విజయుడు శ్రావణ పూర్ణిమయందు పొందెనని పౌరాణిక కథ కలదు. అందువల్ల శ్రీకాళహస్తిక్షేత్రమును దర్శించిన వారి సంసారబంధములు పోవును. కనుక విజయునికి ముక్తి ప్రదాత శ్రీకాళహస్తీశ్వరుడని అర్థము. కనుక ఆయన విజయ ముక్తిప్రదుడు.

## అగస్త్యాయ రమేశాది సురోపాస్యత్వదాయకః 41

పరమేశ్వరుడు అగస్త్యునకు రమేశాది సర్వ దేవతల ఉపాసకత్వమును ఇచ్చెను. అసలు అగస్త్యుని గూర్చి పురాణములలో చిత్రవిచిత్ర కథలు కలవు. అందులో మిత్రుడు వరుణుడు భూలోకమునకు వచ్చుచూ మార్గమధ్యమున ఊర్వశిని చూచిరి. ఆమె సౌదర్యమునకు మోహితులై ఇంద్రియ స్ఖాలిత్యము జరుగగా దానిని కుండయందు ఉంచినందున అందు అగస్త్యుడు ఉదయించెను. అగస్త్యుడు చాలాకాలము బ్రహ్మచర్యమున ఉండగా తన పితృదేవతలకు ఉత్తమ గతులు రావని తెలుసుకొని వివాహమాడవలెనని నిశ్చయించెను. తన ఆశీస్సులతో విదర్భ రాజుకు లోపాముద్ర జన్మించెను. అంతట అగస్త్యుడు అతని వద్దకువెళ్ళి లోపాముద్రను తనకిచ్చి వివాహముచేయుమనగా మొదట అతను తిరస్కరించెను. లోపాముద్ర మనోభీష్టమును తెలుసుకొని అగస్త్యునికిచ్చి వివాహముచేసెను. ధనమును సంపాదించమని లోపాముద్ర అగస్త్యుని అడుగగా అందుకు తన తపస్సును వ్యయపరచలేక శ్రుత పర్యుడనే రాజు వద్దకువెళ్లి అడుగగా తన వద్దలేదని అతను చెప్పెను. ఆ ఇద్దరూ కలసి బ్రధ్నశ్వుని వద్దకు వెళ్ళి అడిగిరి. తనవద్దకూడా

లేదనగా ఆముగ్గురు త్రసదస్యుని వద్దకు వెళ్లిరి. తనవద్దకూడా లేదనగా వారు ఇల్వలుని వద్దకు వెళ్ళిరి. ఇల్వలుడు వారందరిని గౌరవించి వారికి భోజనము పెట్టెను. ఇల్వలుడు ఇదివరకటి లాగానే వాతాపిని మేకగా చేసి అతనిని వండి భోజనమును వారికి వడ్డించెను. ఈ ఉపాయముతో ఇల్వలుడు చాలామంది బ్రాహ్మణులను చంపుచున్న విషయమును అగస్త్యుడు తెలిసికొని 'జీర్ణం జీర్ణం వాతాపి జీర్ణం' అనగా అతను జీర్ణమాయెను. అంతట ఇల్వలుడు ఏమీ తెలియని వానివలె నటించి అగస్త్యునకు కావల్సిన ధనము, భూషణములను ఇచ్చి సత్కరించి పంపెను. బ్రహ్మ అగస్త్యుని వద్దకు వచ్చి శివునిగూర్చి కవేరుని కూతురు తపస్సు చేయుచున్నదని. ఆమెను వివాహము చేసుకొనమని చెప్పెను. అగస్త్యుడు తన కోరికను ఆమెకు చెప్పగా అందుకు ఆమె సంతసించి తను నదిని కాబోవుచున్నానని చెప్పి అగస్త్యుని వివాహమాడెను. వెంటనే ఆమె ఒక అంశ లోపాముద్రలో ప్రవేశించి రెండవ అంశ నదిగా మారెను. నదిగా మారిన ఆమెను తన కమండలమందు ఇమిడ్చి తను వింధ్యపర్వత గర్వమును అణచుటకై వెళ్ళుచూ ఆ కమండలమును తన శిష్యులకు అప్పగించి వెళ్ళెను. అంతట ఆమె సహ్యాపర్వత సమీపమున నదిగా మారి కావేరీ నది ఐనది. వింధ్య పర్వతము విపరీతముగా పెరిగినందున సూర్యచంద్రుల గమనములకు అడ్డము ఏర్పడగా మునులు అగస్త్యుని ప్రార్థించిరి. అంతట అగస్త్యుడు వింధ్య దగ్గరకు వచ్చి తను దక్షిణ దేశమునకు వెళ్ళవలయును దారి ఇమ్మని కోరగా తను మరలా వచ్చు వరకు తగ్గి ఉండమని వింధ్యను కోరి దక్షిణ దేశమునకు అగస్త్యుడు వచ్చెను. కాలకేయులను రాక్షసులు దేవతలను, మునులను బాధించుచుండిరి. వారిని వధించుటకు దేవతలు రాగా వారు సముద్రమధ్యన దాగి ఉండుటచే ఎవరు వీరిని వధించలేకున్నారు. అంతట మహర్షులు అగస్త్యుని వద్దకు వచ్చి సముద్రపానము చేయుమని ప్రార్థింపగా అగస్త్యుడు సముద్రజలమంతయు త్రాగెను. అందు బయటపడిన కాలకేయులను దేవతలు వధించిరి. అటు తర్వాత సముద్రజల పూరణము చేయుమని మహర్షులు అగస్త్యుని ప్రార్థింపగా సముద్ర జలమంతయు జీర్ణించుకున్నందున పూరించుట సాధ్యముకాదని చెప్పెను. అట్లాగే వృత్రాసురుడు సముద్రములో దాక్కొని ఉండగా అగస్త్యుడు ఆ నీటిని త్రాగగా అంతట ఇంద్రుడు వృత్రాసురుని చంపెను. రామాయణమున అరణ్యకాండంలో, శ్రీరామునకు దివ్య ఖడ్గమును శరాసనమును అగస్త్యుడు రాక్షస వధకై ఇచ్చెను. యుద్ధమున ఆదిత్యహృదయమును శ్రీరామునకు ఉపదేశించెను. నహుషుని పాముగా అగస్త్యుడే శపించెను. ఈ ప్రకారముగా అగస్త్యుని గాథలు అనేక విధముగా పురాణములయందు కలవు.

అగస్త్యఇతి న గచ్ఛతీత్యగః। అగంస్త్యాయతి స్తంభయతి అధః కరోతీత్యగస్త్యః స్త్యైస్త్యై శబ్దసంఘాత యోః సురోపాస్యత్వదాయకః. రమతే ఇతి రమా. రమామంగళదేవతేతి తస్మై మునయే రమేశాది దేవతేతి। ని। తయా రంతు మీష్టేఇతి రమేశో హరిః। రమేశ ఆదిర్యేషాంతే రమేశాదయః సురంతి దీవ్యంతీతి సురాః రమేశాదయశ్చ తే సురాశ్చ రమేశాదిసురాః। తైరుపాసితుం యోగ్య ఉపాస్యః। ఉపాస్యస్యభావ ఉపాస్యత్వం తాదృశమహాత్మ్య మగస్త్యాయ దదాతీతి రమేశాదిసురోపాస్యత్వ దాయకః తథాచ మూలపురాణే శివవచనం।

అగము అనగా నడవ తగినది. వెళ్ళ గలిగినది, వృక్షము, కొండ, పాము, సప్తసంఖ్య. ఆదిలేనిది. కానిది అనియు, అగస్తి వెళ్లలేనిది కనుక అగః అగస్త్యః అనగా శివుడు అని అర్థము. వీటిని స్తంభింప చేయువాడు అణగదొక్క పడేవాడు కనుక అతని అగస్త్యుడు అని అందురు. అటువంటి మునికి రమేశాది సురోపాస్యత్వదాయకత్వము శ్రీసదాశివుడు అనుగ్రహించెను.

ఆనందింపచేయునది గనుక ఆమెను రమా అని అందురు. ఆమె మంగళములను ఇచ్చు దేవత. ఆమెలో కలిసి ఆనందించుటకు ఇష్టపడిన వాడు శ్రీమహావిష్ణువు. ఆయనను రమేశుడు అని అందురు. ఎప్పుడు తమ దివ్య శక్తులలో ప్రకాశించే వారు సురులు. వీరందరిచేత ఉపాసింపబడే మహానుభావుడు శ్రీఅగస్త్యమహర్షి. పరమేశ్వరుడే అగస్త్యుని మహాశక్తి సమన్వితునిగా చేసెను. వరాహ పురాణమున పరమశివుని వచనము ఈ విధముగా ఉన్నవి. గొప్ప తెలివి తేటలు గలిగిన అగస్త్యుని తపస్సు అతని స్తోత్రమునకు నేను (పరమేశ్వరుడు) తృప్తి నొందితిని. వింధ్య పర్వతుని గర్వమణచిన నీకు మంగళముగుగాక. నీవు కోరిన కోరికను నీకు ఇవ్వగలను కోరుకొనుము అని పరమశివుడు అడుగగా కుంభసంభవుడైన అగస్త్యుడు తనను సర్వవంద్యుడిగా అందరికన్నా గొప్పవాడిగా మహాజ్ఞానసంపన్నునిగా చేయుమనగా శ్రీచంద్రశేఖరుడు అనుగ్రహించెను. అంతట అతని ఔన్నత్యమునకు విష్ణువు మొదలుగా దేవతలందరూ అతనిని సేవించిరి. శ్రీశివతత్త్వోపదేశికుడై సర్వవిద్యలకు నిధియై గురువై కల్మషములేని శివభక్తులలో ముందుండు వాడును నియమితమైన ఆహారమును తీసుకొనుచూ శ్రీసదాశివుని ఆజ్ఞచేత అగస్త్యుడు అంతటి గొప్పవాడాయెను.

శ్రీవాల్మీకి రామాయణమున అరణ్య కాండంలో సీతాలక్ష్మణులతో శ్రీరాముడు అగస్త్యభ్రాతను సందర్శించి నమస్కరించి మునులు శిష్యులతో తమ ఆగమనమును తెలిపెను. ఇచట అగస్త్యుని గొప్పతనమును సీతాలక్ష్మణులకు తెలిపి ఇచట దేవతలు గంధర్వులు, సిద్ధులు మహర్షులు ఆహార నియమములు కలిగి తపస్సు చేయుచున్న అగస్త్యుని సదా సేవించు చుందురు అని ఆ ఆశ్రమమున అసత్యమాడువాడు, క్రూరుడు మోసగాడు, ఘాతకుడు స్వేచ్ఛాచారులు ఉండరు అని దేవతలు యక్షులు, నాగజాతికి సంబంధించిన వారు. గరుడాది పక్షులకు సంబంధించిన వారు ఆహార నియమముగలిగి ధర్మమును ఆరాధించుచూ నివసించుచున్నారు. ఈ ఆశ్రమమున మహాత్ములగు మహర్షులనేకులు ఇచట తపము చేసి సిద్ధిపొంది తమ నరదేహము విడిచి దివ్యశరీరములను ధరించి సూర్యుని వలె ప్రకాశించే విమానమును ఎక్కి స్వర్గమునకు వెల్లిరి. ఇచట నివసించుచూ తమను ఆరాధించే బ్రహ్మాది దేవతలు నిత్యము అగస్త్యునికి సన్నిహితులై సేవించుచున్న కారణమున ఆయన వారికి యక్షత్వము, అమరత్వము వివిధరాజ్యాధిపత్యము మొదలగు వరములు ఇచ్చెను. కావున లక్ష్మణా! అటువంటి అమిత తేజోసంపన్నులైన అగస్త్యుని ఆశ్రమమునకు మనము వచ్చితిమి. ఆ ఆశ్రమమున ఉపాసక భేధమును బట్టి వారి వారి స్థానములను చూపుతూ బ్రహ్మ దేవుని స్థానమును అగ్ని స్థానమును విష్ణుస్థానమును దేవేంద్రుని స్థానమును, సూర్య స్థానమును చంద్ర స్థానమును భగస్థానమును కుబేర స్థానమును, ధాతృ విధాతృ, వాయువు సర్పరాజగు శేషుని గాయత్రీ వసువులు వరుణుడు కుమార స్వామి, ధర్మ స్థానములను చూచుకొనుచూ సూర్యుని వలె తేజో వంతుడగు అగస్త్యుని పాద పద్మములకు పరమప్రీతిలో శ్రీసీతారామలక్ష్మణులు నమస్కరించిరి.

**తపసా తే౽ద్య తుష్టోస్మి స్తోత్రేణ చ మహావ్రతే ।**
**వరం వరయ భద్రం తే యథేష్టం వింధ్యమర్దన ॥**
**శివే నైవముమజ్ఞాతస్సు మునిః కుంభసంభవః ।**
**వరప్రదాతుః ప్రథమం సకలామరనాయకాత్ ॥**
**వరమప్రార్థయత్సర్వశ్రైష్ఠ్యం జ్ఞానోత్తరత్వతః ।**

తథా శంభోరనుజ్ఞాత శ్చంద్ర శేఖర వల్లభః ॥
తస్మాత్సుమహతీం లేభే సమస్తసురసేవ్యతాం ।
తదాదివిష్ణుప్రముఖా దేవాస్సర్వే శివం వినా ॥
శివతత్త్వోపదేష్టారం సర్వవిద్యానిధిం గురుం ।
అగస్త్యం శివభక్తానామగ్రేసరమకల్మషం ॥
తదాశ్రమే ధామ కృత్వా సమంతాచ్ఛంకరాజ్ఞయా ।
శ్రద్ధయా నియతాహారా అనిశం పర్యుపాసతే ఇతి ॥
ఉక్తమేవ శివపురాణార్థం శ్రీమద్వాల్మీకి మునిః అరణ్యకాండే శ్రీరామవచనేన
విస్పష్టమయాచే ।
తత్రహి । సీతా లక్షణాభ్యాం । శ్రీరామ చంద్రోగస్త్య భ్రాతరమభివాద్య మునిశిష్య
ముఖత
స్స్వాగమం విజ్ఞాప్య తదనుజ్ఞయా ఉ-ఉ శ్రమవాటం గచ్ఛన్నాహ । శ్రీరామః
ఆరాధయిష్యామ్యత్రాహమగస్త్యం తం మహామునిం । ఇతి । స్వసంకల్పం
జానకీలక్ష్మణాభ్యా ముక్త్వా తత్రత్య వైభవం పునరాహ ।
అత్ర దేవాస్సగంధర్వా స్సిద్ధాశ్చ పరమర్షయః ।
అగస్త్యం నియతాహారాస్సతతం పర్యుపాసతే ॥ ఇతి (రామా: అ: 12-89)
వదనుక్తార్థ ప్రత్యాయనాయ పునశ్శపథయతి ।
నాత్ర జీవేన్మృషావాదీ క్రూరో వా యదివా శఠః ॥ ,,
అత్ర దేవాశ్చ యక్షాశ్చ నాగాశ్చ పతగైస్సహ ।
వసంతి నియతాహారా ధర్మమారాధయిష్ణవః ॥ ,,
అగతాస్మ్యాశ్రమపదం సౌమిత్రే ప్రవిశాగ్రతః ।
ఇత్యుక్త్వా తత్తదుపాసక స్థానాని నిర్దిశన్నాహ ॥ ,,
స తత్ర బ్రహ్మణ స్థానమగ్నేస్థానం తథైవ చ ।
విష్ణోస్థానం తథేంద్రస్య స్థానం చైవ వివస్వతః ॥ ,,
సోమస్థానం భగస్థానం స్థానం కౌబేరమేవ చ ।
ధాతుర్విధాతుస్థానే చ వాయోస్థానం తథైవ చ ।
స్థానం చ పాశహస్తస్య వరుణస్య మహాత్మనః । (రామ: అ: 12 20)
స్థానం తథైవ గాయత్ర్యా వసూనాం స్థానమేవ చ ।
స్థానం చ నాగరాజస్య గరుడస్య మహాత్మనః ॥ ,,
ఏవం అగస్త్య నియతాహారా స్సతతం పర్యుపాసత ఇతి । (,, 11 89)

పూర్వోక్తదేవానాం రమాపతి ప్రభృతీనామన్యేషాం చ స్థానాని విస్పష్టమేవ దర్శితాని । తస్మాదగస్త్యాయ రమేశాదిసురోపాస్యత్వమ్మహదైశ్వరం శ్రీకాళహస్తీశ్వరో దదాతీత్యర్థః । అత ఏవ హి శ్రీమతః కుంభయోనేః వరుణ క్రౌంచాసురయో శ్శాసనాత్ । పాథోనిధిపానాద్వింధ్య నిపీడనాద్వాతాపీల్వలనిశాతనాత్ కుద్దాలక క్షేత్రస్థ విష్ణుబింబస్య శివలింగత్వ కరణాత్ తామ్రపర్ణీక వేరజాఘటనా సువర్ణ ముఖరీ ముఖమహానదీ సముత్పాదనాత్ । అనితర సాధ్యలోకహితకర్మభ్యోఽన్యేభ్యశ్చ మహతీకీర్తి స్త్రిభువన ప్రథితాస్తే । తస్మాత్సర్వైశ్వర్య దాత్రే తుభ్యన్నమ ఇత్యర్థః ॥

ఆశ్రమమున మునులతో పాటుగా ఏఏదేవతామందిరాలు ఉండవలెనో అగస్త్యాశ్రమ సందర్శనము వల్ల తెలియుచున్నది. ఆయనకు అటువంటి మహదైశ్వర్యమును శ్రీకాళహస్తీశ్వరుడే ఇచ్చెను. అందువలన అమిత తపస్సంపన్నుడైన కుంభ సంభవుడైన అగస్త్యునికి వరుణుడు, క్రౌంచాసురులు, (క్రౌంచమనగా కొంచపిట్ట, ఒకవిధమైన కొంగ, ఒకానొక పర్వతము కొంచగుబ్బలి, ఒకానొక ద్వీపము అని అర్థము). ఆదేవతలను శాసించుటవలన, సముద్ర జలములను పానము చేయుటవలన వింధ్యుని గర్వమణచినందున ఇల్వలుని వాతాపిని సంహరించినందునను, (కుద్దాలక మనిన నేలను విదలించుకొని బయటకు వచ్చినది అని అర్థము). ఆకుద్దాలకక్షేత్రమునందు వెలసిన విష్ణుబింబము శివలింగముగా వెలయుట కారణమున తామ్రం పర్ణీఘటన వలన స్వర్గముఖీనది. ఆవిర్భావమునకు అనేక అనితర సాధ్యమైన లోకహితమైన అనేక కర్మలతో ఆయన గొప్పకీర్తి ముల్లోకములకు ప్రసిద్ధి గదా! అందువల్ల సమస్త ఐశ్వర్యములను ఇచ్చే ఓ కాళహస్తీశ్వరా! నీకు అనేక నమస్కారములు.

## వైదికాగమ పీఠస్థః 42

వేదమునందు చెప్పబడిన కర్మలను ఆచరించు వారిని వైదికులు అని అందురు. ఆ కర్మములు వైదికములు. ఆలయములోని అర్చామూర్తులకు అనేక రకములైన ఉత్సవములను ఆగమ ప్రకారముగానే జరుగును. ఆ ఆగమములు ప్రధానముగా శైవ వైష్ణవములని రెండు విధములు. శైవాగమము గూడా అనేకరకములుగా ఉండుని. వైష్ణవాగమములు పాంచరాత్ర వైఖానసములని రెండు విధములు. శబ్దకల్పద్రుమమున ఆగమము అనగా సృష్టి, ప్రళయము, దేవతల అర్చన, మంత్రసాధనము, మంత్ర పురశ్చరణము, షట్కర్మసాధనము అని అనేకరకములైన ధ్యానయోగసాధనములతో కూడుకొని ఉన్నది. శైవ తంత్రములు మూడు రకములుగా ఉన్నవి. కొన్ని ద్వైతమును బోధించును. కావున అవి శివతంత్రములని కొన్ని ద్వైతాద్వైతమును ప్రతిపాదించును. అవి రుద్ర తంత్రములని కొన్ని అద్వైతమును ప్రతిపాదించును. అవి భైరవ తంత్రములని వ్యాప్తిలోకలవు. శైవములో నాలుగు సాంప్రదాయములు కలవు. పాశుపతము, శైవము, కాలగమము, కాపాలికము అని కలవు. శైవాగమము దక్షిణ భారతమున చాలా వ్యాప్తిలో ఉన్నది. 84 శైవభక్తులు పరమాచార్యులు తమసిద్ధాంతమును బోధించిరి. పరమశివుడు తన భక్తులనుద్ధరించుటకై పంచముఖములనుండి 20 తంత్రములను ఉద్ధరించెను. ఈతత్త్వమును బోధించు ఆగమములు ఉపాగమములు, సంహితలు చాలా కలవు. ఈ శివ శాస్త్రమే ముక్తికి ఉపాయమని వారిని నిశ్చయము ఈ సంప్రదాయముననుసరించి మహామహేశ్వరులెన్నియో గ్రంథములు వ్రాసినారు. శైవులలో వీరశైవులు లింగాయతులు, జంగమదేవరలన్న భేదములు కలవు. శివుని ఐదు ముఖములనుండి వెలసిన ఆగమములను ఆమ్నాయమందురు. పూర్వామ్నాయము సృష్టిరూపము ఇది మంత్రయోగమును నిరూపించును. దక్షిణామ్నాయము స్థితిరూపము. ఇది భక్తి యోగము చెప్పును. పశ్చిమామ్నాయము సంహారరూపము. ఇది కర్మయోగమును నిరూపించును. ఉత్తరామ్నాయము అనుగ్రహరూపము. ఇది జ్ఞానయోగమును ప్రతిపాదించును. ఊర్ధ్వామ్నాయము సకల విశేషములను ఉద్బోధించును. ఈ ఆగమమున భైరవ, యామళ, మత, మంగళ, చక్రాష్టక, బహురూప, వాగీశ, శిఖాష్టకములని ఎనిమిది తంత్రములు కలవు. మాధవాచార్యులు తన సర్వదర్శన సంగ్రహమందు పాశుపత శైవ ప్రత్యభిజ్ఞాన దర్శనములలో

ఆగమ దర్శన సిద్ధాంత త్రైవిధ్యమును సంక్షేపించి వీటినన్నిటికి సామాన్య ప్రతిపాద్యమగు విషయము పతి-పశువు -పాశము అని అర్థ త్రయములను చెప్పెను. పతి అనగా పరమ శివుడు అతడే విశ్వ కర్త. వ్యవస్థితమైన అవయవములు కలిగినది ప్రపంచము. ఈశ్వరుడు సర్వజ్ఞుడు. ఈశ్వరుడు పాశరహితుడగుటచే ఆయనకు మనకు వలే భౌతిక దేహముండదు. తన అచింత్య శక్తిచే ఈశ్వరుడు ఈ జగత్సృష్టి స్థితి లయములకు హేతువు.

పశువు అనగా జీవుడు, అణువు క్షేత్రజ్ఞుడు, పశువులు అనేకరకములుగా కలరు. ముక్తులు శివభావమునొందినవారు. విజ్ఞానాకలులు, ప్రతివాకలులు, సకలులు అని పశువులు మూడువిధములు. కేవలమలయుక్తుడు మొదటివాడు, మలకర్మయుక్తుడు రెండవవాడు. మలమాయ కర్మరూప బంధ త్రయ యుక్తుడు మూడవవాడు. పాశము, మల, కర్మ మాయా అని రోధశక్తి నాలుగు విధములు. మలమనగా ఆత్మను ఆశ్రయించి ఉన్నదుష్ట భావము. కర్మము ధర్మాధర్మ రూపము ఇది అనాది. మాయ అనగా మూల కారణము దీనినే అవిద్య ప్రకృతి అని కూడా అందురు. అ శక్తులను మరుగు పరచు మలగత దృష్టే రధకశక్తి. శివసాయుజ్యము కోరువారికి విద్య క్రియ యోగము. చర్య ఉపాదేయములు. విద్య అనగా పరమపురుషార్థ హేతువైన దీక్షా పూర్వకమగు మంత్ర మంత్రేశ్వరాది మహాత్మ్యనిశ్చాయక జ్ఞానము. సాంగ దీక్షా విధి ప్రదర్శకమే క్రియ. జపధ్యానాదులు యోగము. విహితాచరణము నిషిద్ధ వర్జనము చర్య. ఇది యోగ సహాయకారి. ఫలము విషయమున నకులీశ పాశుపత దర్శనములయందు ముక్తులు స్వతంత్రులు. శైవదర్శనమందు పారతంత్ర్యము ఉపాదేయము. ప్రత్యభిజ్ఞామతమందు ముక్తునికి శివైక్య ప్రాప్తి.

తంత్ర పదమునకు శాస్త్రము అని అర్థము. 'తన్యతే విస్తార్యతే జ్ఞానం ఇతి తంత్రం' జ్ఞానమును విస్తరింపజేయునది గనుక అది తంత్రము అని భావము. తత్త్వమును మంత్రార్థములను విస్తరింపచేయునది త్రాణమొనర్చునదియు. ఇది శాస్త్రము సిద్ధాంతము అనుష్ఠానము విజ్ఞానములను బోధించునది తంత్రము. మంత్ర యంత్రములతో కూడుకొని సాధన మార్గమును ఉపదేశించునది తంత్రము. దీనినే ఆగమములు అని కూడా అందురు. కలియుగమున ఆగమముల ఉపయోగము ప్రధానముగా ఉండగలదని కులార్ణవ తంత్రము చెప్పుచున్నది. కృతయుగమున వేదాచారము, త్రేతాయుగమున స్మార్తా చారము, ద్వాపరయుగమున పురాణాచారము, కలియుగమున ఆగమాచారము అని తంత్రవిజ్ఞుల అభిప్రాయము. ఇందు విశేషముగా దేవతాస్వరూపము, సత్త్వరజస్తమోగుణస్వరూపము, కర్మాదివిధానములు, ఆయాదేవతల మంత్రములు, ఆ మంత్రోద్ధార క్రమము, ఆయా దేవతల ధ్యానరీతి, పటలము, పద్ధతి, కవచము, నామసహస్రము, స్తోత్రము మొదలగునవి. కుల సృష్టి, ప్రళయము, దేవతాపూజనము, సాధన రీతి, మంత్రపురశ్చరణము, షట్కర్మలు, వాని సాధనములు ధ్యానయోగము అను సప్తవిధములైన లక్షణములు ఆగమమున ప్రసిద్ధములు. శాంతి, వశీకరణము, స్తంభనము, విద్వేషణము, ఉచ్చాటనము, మారణము అనున వి షట్కర్మలు. తంత్ర గ్రంథములలో క్రియాచరణ ముఖ్యము. తాంత్రిక మతము ప్రధానముగా రెండువిధములు. మొదటిది సామాన్యజనులచేత విద్యాబుద్ధులు లేనివారిచేత అనుసరించబడు మంత్ర తంత్రములను ఒక క్రమపద్ధతిలోనికి తీసుకొనివచ్చినది ఆతాంత్రికము. రెండవది మరికొంత సంస్కరింపబడి బాగుగా వృద్ధిపొందిన తాంత్రికము. ఈ తాంత్రిక మతానుయాయులలో యోగులు, సిద్ధులు, వారి శిష్యగణములు కలరు. ఈ ప్రకారముగా ఆగమ

సంప్రదాయము నందు శివ తత్త్వ ప్రతిపాదనలు కలవు. వైదిక రూపములు ఆగమ రూపములు ఐన పీఠములను అధిష్ఠించి ఉన్నవాడు శ్రీ కాళహస్తీశ్వరుడు. ఆయన మమ్ము రక్షించుగాక.

వేద్యతే అవగమ్యతే స్వశివత్వ మాత్మనామేభి రేవేతి వేదాః ఋగ్యజుస్సామాధర్వనామకాస్సాంగాస్తేషామిదం వైదిక మేకం పీఠం ఆగమాఇతి । ఆజ । క్ష్మాతత్త్వమారభ్య శివతత్త్వ పర్యంతం ప్రతిపాదనరూపో గమో గమనమేషామస్తీత్యాగమాః ।

విదజ్ఞానే అనే ధాతువునుండి వేదశబ్దము పుట్టినది. దాని అర్థము తెలుసుకొనుట. దేనిని తెలుసుకొనుట అని ప్రశ్నించినచో తనను తనలోని పరమశివుణ్ణి అని సమాధానము. వేదములు నాలుగు ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అధర్వణ వేదము ఒక్కొక్క వేదము సంహిత బ్రాహ్మణము ఆరణ్యకము ఉపనిషత్తులు అని భేదములు కలవు. ఋగ్వేదమున మహర్షుల కథలు ఇంద్రాది దేవతల సూక్తములు కలవు. ఇది మండలమని అష్టకమని రెండు విధములుగా కలపు. వేదవ్యాసుడు కలిసి ఉన్న వేద వాఙ్మయమును నాలుగు భాగములుగా విభజించి పైలునికి ఋగ్వేదమును, వైశంపాయునికి యజుర్వేదమును జైమినికి సామవేదమును సుమంతునికి అధర్వణ వేదమును ఇచ్చి వ్యాప్తి చేయమని ఆదేశించెను. సూర్యుని అనుగ్రహంతో యాజ్ఞవల్క్యుడు శుక్లయజుర్వేదమును వ్యాప్తిలోనికి తెచ్చెను. ఋగ్వేదమునుండి ఉపవేదముగా ఆయుర్వేదము అవతరించెను. దీనిని చరకుడు, శుశ్రుతుడు మొదలగు వారు వ్యాప్తిలోనికి తెచ్చిరి. యజుర్వేదమునుండి ధనుర్వేదము అవతరించగా దీనిని బ్రహ్మ విశ్వామిత్రుడు మొదలగు వారు వ్యాప్తిలోకి తెచ్చిరి. సామవేదమునుండి గాంధర్వ వేదము అవతరించగా దానిని భరతుడు మొదలగువారు వ్యాప్తిలోకి తెచ్చిరి. అధర్వవేదమునుండి అర్థ శాస్త్రము నీతిశాస్త్రములు అవతరించగా దీనిని బృహస్పతి, శుక్రుడు, కామందకుడు, విదురుడు, చాణుక్యుడు కళింగుడు మొదలగు వారు వ్యాప్తిలోనికి తెచ్చిరి. నాలుగు వేదములు యజ్ఞమునకు ఉపయోగపడును. ఋగ్వేదమును హోత-శుక్ల కృష్ణ యజుర్వేదమును అధ్వర్యుడు, సామవేదమును ఉద్గాత అధర్వణ వేదము బ్రహ్మ నడిపించెదరు. ఋగ్వేదమున **8** అష్టకములు, **64** అధ్యాయములు, **2006** వర్గలు కలవు. ఒక్కొక్క అష్టకమున ఎనిమిది అధ్యాయములు కలవు. **10** మండలములు కలవు. **85** అనువాకములు, **1017** సూక్తములు, **10580** ఋక్కులు కలవు. ఋగ్వేదమున మధుచ్ఛందుడు, గృత్సమదుడు, విశ్వామిత్రుడు,. వాసుదేవుడు. అత్రి భరధ్వాజుడు, వశిష్టుడు కణ్యుడు, అంగీరసుడు, మొదలగు ఋషుల ప్రస్తావన కలదు. ఇందు **21** - శాఖలు కలవు. అందులో శాంకల, బాష్కల, ఆశ్వలాయన, శాంఖాయన, మాండూకాయన శాఖలు ప్రధానమైనవి. ఇందు అగ్ని, ఇంద్రుడు, వరుణుడు, ఉషస్సు, సవిత్ప, పూషా మిత్ర, విష్ణువు, రుద్రుడు, మరుత్, పర్జన్యుడు మొదలగు దేవతల ప్రస్తావనకలదు. సోమరసస్తుతి నవమ మండలంలో కలదు. ఇందు దార్శనికమైనవి. లౌకికమైనవి విషయములు కలవు. ఇందు ఊర్వశీ పురూరవ సంవాదము, యమ - యమీసంవాదము. సరమ-పాపణి సంవాదములు మిక్కిలి రమ్యములు ఇందు చికిత్సకు సంబంధించిన మంత్రములు కూడా కలవు. ఇందు శాకల, బాష్కల ఆశ్వలాయన శాంఖాయన మాండూకీయ సంహితము. ఐతేరేత కౌషీతకీమరియు శాంఖాయన బ్రాహ్మణములు ఐతరేయ కౌషతకీఆరణ్యకములు. కొన్ని ఉపనిషత్తులు కలవు. 'అనియతాక్షరావసానో యజుః' అక్షరాల నియతి లేనిది యజుర్వేదము. యజుర్వేదము ప్రధానముగా దేవతాహ్వాన పూర్వకమైనది. యజ్ఞ విధిని ప్రవర్తింప చేసే మంత్రములు ఇందులో కలవు. ఇది గద్యమయమైన మంత్ర సమూహము. ఇది శుక్లయజుర్వేదమని

కృష్ణయజుర్వేదమని రెండు రకములు. ఇందులో మొదటిది ఛందోబద్ధమైనవి. మంత్రములు కలవు. రెండవదానిలో ఛందస్సు గద్యమయ మంత్రములు కలవు. ఆదిత్య సంప్రదాయము శుక్లయజుర్వేదము, బ్రహ్మ సంప్రదాయమున కృష్ణ, శుక్లయజుర్వేదము కలదు. శుక్ల యజుర్వేదమునకు వాజసనేయ సంహితా అను మరి ఒకపేరు కలదు. ఈ శుక్లయజుర్వేదమును చూచినవాడు యాజ్ఞవల్క్యుడు. ఇతను వాజసనేయుని పుత్రుడు. ఈ వేదము 40 అధ్యాయములుగా కలదు. ఇందు చాతుర్మాస్య వ్రతమునకు సంబంధించినవి. వాజసనేయ రాజసూయ పితృ మేధ పురుషమేధ అశ్వమేధయాగములకు సంబంధించి మంత్రములు యజ్ఞ వేదిక నిర్మాణ పద్ధతులు చెప్పబడినవి. ఇందు కాణ్వ, మాంధ్యందిన శాఖలు. శతపథ బ్రాహ్మణము. బృహదారణ్యక ఈశావాస్యోపనిషత్తులు కలవు.

కృష్ణయజుర్వేదమున 86 శాఖలు ఉన్నప్పటికి ప్రస్తుతం 4 శాఖలు మాత్రమే ప్రచారములలో ఉన్నవి. ఇందు 7 కాండలు, 18,000 మంత్రములు, 4 సంహింతలు ప్రచారము కలవు. కాపిష్ఠల కఠశాఖమధ్యప్రదేశ్‌లోను, తైత్తిరీయ శాఖ దక్షిణాదిన మహారాష్ట్రలోనూ వ్యాప్తిలో ఉన్నవి. ఇందు యజ్ఞ యాగాది విధులకు సంబంధించిన విధిమంత్రములు సోమ, వాజపేయ, రాజసూయ పురుషమేధ అశ్వమేధాది విధివర్ణనలు కలవు. ఇందు కాఠక, మైత్రాయణీయ తైతిరీయ కాపిష్ఠలక సంహితలు. తైత్తరీయ కాఠక మైత్రావరుణ బ్రాహ్మణములు, తైత్తిరీయ మైత్రాయణీయ ఆరణ్యకములు. తైత్తిరీయ కఠ, శ్వేతాశ్వతర మహానారాయణ ఉపనిషత్తులు కలవు. సామవేదమనగా ''సా'' అనగా ఋక్కులని ''అమ'' గాంధారాదిస్వరములు అని అర్థము. ''గీతిషు సామాఖ్యా'' అని జైమిని మహర్షి చెప్పారు. సామ అనగా గానము అని అర్థము. వేదానాం సామవేదోఽస్మి అని గీతాచార్యుడుకూడా చెప్పారు. ''సామాని యో వేత్తి స వేద'' తత్త్వమును తెలిసినవాడగును. యజ్ఞమున ఉద్గాతా అను వాడు సామవేదమును గానము చేయును. జైమిని మహర్షి ఈ సామవేదమునకు ద్రష్టా. ఇందు గేయ ఋక్కులు అగేయ ఋక్కులు అని రెండు విధములు.

''సహస్రవర్మా సామవేదః'' వెయ్యిశాఖలు గల సామవేదము నేడు రాణాయనీయ జైమినీయ కౌథుమీయ శాఖలు మాత్రమే దొరుకుచున్నవి. కౌథుమశాఖ గుజరాత్‌నందునూ రాణాయనీయ శాఖ మహారాష్ట్రలో జైమినీయశాఖ ఆంధ్ర తమిళనాడులలో దొరుకుచున్నవి. ఇది పూర్వార్చికము ఉత్తరార్చికమని రెండు విధములు. ఇందు సంహితలు రాణాయనీయ, కౌథుమ, జైమినీయ (తలవకార) ములు. జైమినీయ, పంచవింశ, తాండ్య (ప్రౌఢ), ఛాందోగ్య బ్రాహ్మణములు. ఛాందోగ్యకేన ఉపనిషత్తులు కలవు.

''ఐహిక ఫలప్రదః అథర్వవేదః'' దీనిద్రష్టా అథర్వుడు. (సుమంతుడు) ఇందులోయజ్ఞమునకు సంబంధించినవి బ్రహ్మజ్ఞానమునకు సంబంధించినవి, ఔషధములకు, మారణ ఉచ్చాటన, రోగచికిత్స శత్రుప్రతీకార క్రిమినాశక సర్పాదివిషపరిహార రాజనైతిక. వశీకరణ వివాహ సంబంధి అనేక విషయములు ఈ వేదమున కలవు. అథర్వుడు అనగా భృగుమహర్షిశిష్యుడు. ఇందులో 20 కాండలు. 706 సూక్తములు. 5987 మంత్రములు. 9 శాఖలు కలవు. కానీ ప్రస్తుతం పిప్పలాద, శౌనక శాఖలు మాత్రమే ప్రచారములో ఉన్నవి. అథర్వణ వేదమున ఉపనిషత్తులకు పూర్వపీఠికలుగా కొన్ని దార్శనిక సూక్తములు కలవు. దీనికి గోపథమనే బ్రాహ్మణము కలదు. ఆరణ్యకములు ఇందులో లేవు. ప్రశ్న ముండక మాండూక్యోపనిషత్తులు ఇందు కలవు.

వేదాంగములు 6. అవి శిక్షా వ్యాకరణం. ఛందస్సు, నిరుక్తం జ్యోతిషం, కల్పమని. ఇవి వేదార్థమును తెలుసుకొనుటకు ఉపయోగపడును. వీటిలో వేదమునకు శిక్ష ముక్కువంటిది. వ్యాకరణం ముఖము వంటిది. నిరుక్తము శ్రోత్రము (చెవి) వంటిది. జ్యోతిషము నేత్రముల వంటిది. ఛందస్సు పాదముల వంటిది. కల్పము చేతుల వంటిది.

శిక్షా ఘ్రాణం తు వేదస్య ముఖం వ్యాకరణం స్మృతం।
ఛందః పాదౌ తు వేదస్య నిరుక్తం శ్రోత్రముచ్యతే ॥
జ్యోతిషాం నయనం చక్షుః హస్తౌ కల్పోఽథ పఠ్యతే ।
తస్మాత్సాంగమధీత్యైవ బ్రహ్మలోకే మహీయతే ॥

వీటిలో శిక్ష అనగా - శిక్షా శిక్షయతే సమ్యక్ వర్ణోచ్చారణ లక్షణం । ఈ శిక్షా గ్రంథ రచయితలు 1. యాస్కుడు 2. పాణిని. 3. నారదుడు 5. పింగళుడు. 5. శౌనకుడు. 6. యాజ్ఞవల్క్యుడు. ప్రధానంలు. వ్యాకరణమనగా ''వ్యాక్రియంతే శబ్దాః అనేనేతి వ్యాకరణం'' పదసాధుత్వజ్ఞానము సుశబ్దప్రయోగము వ్యాకరణ శాస్త్ర ప్రయోజనము పాణిని అష్టాధ్యాయిని వ్రాయగా వరరుచి (కాత్యాయుడు) వార్తికములు వ్రాయగా పతంజలి మహాభాష్యమును వ్రాసెను. పాణినీయ వ్యాకరణమే గాక ఐంద్రము, చాంద్రము కాశకృత్స్నము, శాకటాయనము, సారస్వతము, చాపిశలము, శాకలము, కౌమారము అనే వ్యాకరణములు గూడా కలవు. నిరుక్తము శబ్దవ్యుత్పత్తిని బోధించును. ''నిరుచ్యతే నిశ్శేషేణ ఉపదిశ్యతే నిర్వచనవిధయా తత్తదర్థబోధనాయ పదజాతం యత్ర తత్ర నిరుక్తం'' అని చెప్పబడెను. నితరాం ఉచ్యతే ఇతి నిరుక్తం నానాశబ్దముల సమ్మేళనమే నిరుక్తము. దీనిని యాస్కుడు రచించెను. ఇది ఐదు అధ్యాయములు మూడు కాండలు కలవు. ఇక ఛందస్సు అనగా ''మాత్రావర్ణగణాది బోధకః అని అర్థము. దీనికర్త పింగళ నాగముని, ఇతను వ్రాసిన గ్రంథము పేరు ఛందోవిచితిః ఇందు 8 అధ్యాయములు కలవు. 3 అధ్యాయములు వైదిక మైనది. 5 అధ్యాయములు లౌకికమైనది. జ్యోతిషశాస్త్రకర్తలు ఆదిత్యుడు గర్గుడు. దీని ప్రయోజనము యుగాదుల కాలము గ్రహ సంచారాదులు గ్రహణ, పర్వకాల, సంక్రమణ కాలభేద వివరణ శాస్త్రము. నాలుగు వేదములకు ప్రత్యేక జ్యోతిషగ్రంథములు కలవు. ఋగ్వేదమునకు ఆర్చ్య జ్యోతిషము యజుర్వేదమునకు యాజుష జ్యోతిషము సామవేదమునకు దొరుకుట లేదు. అథర్వణ వేదమునకు అథర్వణ జ్యోతిషము కలదు. వేదాంగజ్యోతిషం నుంచే నూతనాలు జ్యోతిషం అమలు లోనికి వచ్చినది. కల్పమనగా వైదిక ప్రయోగ విధి ప్రతిపాదక శాస్త్రము. ఇది సూత్రరూపమున ఉండును. ఈ సూత్రకర్తలు ఆపస్తంభుడు, బోధాయనుడు, కాత్యాయణుడు, ఆశ్వలాయణుడు సాంఖ్యాయణుడు. లాట్యాయణుడు ద్రీహ్యాయణుడు. ఈకల్పసూత్రములు 4 భాగములు శ్రౌతమని గృహ్యమని ధర్మమని శుల్బమని శ్రౌతయజ్ఞములకు ఆశ్వలాయన సాంఖ్యాయన సూత్రములు హౌత్రప్రయోగమునకు అధ్వరునకు బోధాయన కాత్యాయన సూత్రములు ఔద్గాత్రమునకు లాట్యాయన ద్రీహ్యాయన సూత్రములను ఉపయోగింతురు. ఇకస్మృతులు అనగా వేద బోధిత వర్ణాశ్రమాచార స్వరూపబోధక శాస్త్రము. ఇవి పురుష నిర్మితము. వేదము అపౌరుషేయము. ఈస్మృతులు వ్యవహార, ఆచార ప్రాయశ్చిత్తములని 3 కాండలు.

స్మృతికర్తలు మనువు యాజ్ఞవల్క్యుడు, యముడు, వశిష్ఠుడు, దక్షుడు, గౌతముడు ఆపస్తంభుడు, వ్యాసుడు, పరాశరుడు, నారదుడు, బృహస్పతి కాత్యాయణుడు ప్రధానులు. ఈ ప్రకారముగా 4 వేదములు. వాటి విభాగములు షడంగములు తెలియుట ద్వారా పరమేశ్వర స్వరూపము తేలికగా తెలుసుకొనుట సాధ్యము. కనుక సాంగములతో కూడిన వేదవాఙ్మయ పీఠాధ్యక్షులు శ్రీకాళహస్తీశ్వర స్వామివారే. భూమి మొదలు శివతత్త్వము వరకు సవివరముగా చెప్పేవి ఆగమములు. ఆ ఆగమములు శివధ్యానము, ఆరాధన మొదలగునవి చాలా కూలంకషముగా చెప్పును. సారవంతమైన భూమి శతకోటియోజనములు అచటనుండి ప్రారంభించి వరుసలతో లెక్కింపగా ప్రకృతినుండి మాయే చివరగా శతము అని అది సదాశివుని వరకు వెయ్యి అని అటుతర్వాత శక్తి చివరగా లక్ష అని దాన్కి కొంతదూరముగా అప్రమేయ ఐశ్వర్యముతో కూడిన ఆ సదాశివుడే బిందుస్థానీయముగా చెప్పబడుచున్నారు. ఈ ప్రకారముగా శివతత్త్వమును తెలుసుకొనుచున్నట్లుగా ఆగమములు ప్రతిపాదించినవి. ఐతే అవి ఏవి? వాటిపేర్లు ఏమి? వాటిలక్షణములు ఏవి? అనే విషయమును చెప్పబోవుచున్నాడు. ఆగమములలో కామికము యోగజము కారణము. అజితము దీప్తదము. సహస్రాంశు, సుప్రభేదము, విజయము, నిశ్వాసము తంత్రము భూతము అనలము వీరము రౌరవము మకటం వైమలం, చంద్ర జ్ఞానము, బింబము. ఉద్గీథము. లలితం సిద్ధము, సంతానము శార్వోత్తకము పారమేశము కిరణము. వాతులం మొదలగునవి 28 ఆగమములు శైవములోని. రౌద్రమునకు సంబంధించినవి.

ఉక్తంహి। క్ష్మాతత్త్వం శతకోటి యోజనమతః ప్రారభ్యగౌణాంతకం పంక్త్యాతద్గణనాత్తథా ప్రకృతితో మాయావసానం శతాత్ ॥

సాహస్రాచ్చ సదాశివావధి తత శ్శక్త్యంతతోలక్షత। స్స్యదూర్ధ్వం స శివోహ్యమేయవిభవో బిందోరధిష్ఠాపక ఇతి ఏవం శివతత్త్వావధిగచ్ఛంతి ప్రతిపాదయంతీత్యాగమాః। కేతే కిన్నామకాః కింలక్షణాఇత్యత ఆహ।

ఆదౌ కామికయోగజే చతదథోఽచంత్యం తథా కారణం
తత్పశ్చాదజితం చ దీప్తమథ తత్పశ్చాత్సహస్రాంశుమాన్
తత్త్పశ్చాత్తలు సుప్రభేదవిజయో నిశ్వాసతంత్రం స్వయం।
భూతాఖ్యానలవీరరౌరవమథ స్యాన్మకుటం వైమలం ॥
చంద్రజ్ఞానమథాస్య బింబమథ చోద్గీతం తథా లాలితం।
పశ్చాత్సిద్ధమితీరితం చ తదథో సంతాన శార్వోత్తకం ॥
తత్పశ్చాదపి పారమేశకిరణౌ తద్వాతులం చాపరం।
హ్యష్టావింశతి రాగమాశ్చ దశధా శైవా హి రౌద్రాః పరే ॥

అస్యార్థః కామికయోగజచింత్య కారణాజితదీప్త సహస్రాంశుమత్సు ప్రభేద విజయాఖ్యా దశసంఖ్యాకాః వైదికానుసారిణ శ్శివప్రోక్తాః అన్యే అష్టాదశ సంఖ్యాఽకాః రుద్రప్రోక్తా వేదవిరుద్ధాశ్చ స్వతంత్రాస్తే సర్వే పితాం త్రికాణాముపయుజ్యంతే। పూర్వోక్త కామికాదయోదశాపి శైవా వేదోపసర్జనీ భూతా ఉపయుజ్యంతే కేషాంచిదధి కారిణామిత్యర్థః ఏవమాగమసమూహ ఏకం పీఠం। తయోః పీఠయోః తిష్ఠతీతి పీఠస్థః వేదాగమేషు ప్రతిపాద్య ప్రతిపాదక సంబంధేన స్థితఇతి। భోజనస్థో వ్యవహారస్థ ఇతివత్ తత్ర వేదాంతాః పరశివస్య పరమార్థతత్త్వం బోధయంతి

। తత్రాపిన భూతి విధినిషేధార్థవాదా వేదాః శివాగమా దశవేదానుసారిణః అన్యే చాగమాః రౌద్రాః వ్యావహారికసత్యం బోధయంతశ్శనైః పారమార్థికతత్త్వ ప్రాపకాః భవంతీత్యతశ్చైవ పీఠద్వయోక్తాః అథవా దక్షిణపశ్చిమ సన్నిధ్యోర్విద్యమాన బలిపీఠయో స్సర్వభూతగణాదిరూపేణ తిష్ఠన్ బల్యుపహారాన్ స్వీకృత్యాను గృహ్ణాతీతి వా వైదికాగమపీఠస్థ ఇత్యర్థః।

భూమియొక్క తత్త్వమువందకోట్లు యోజనములు. అది మాయావరణము చేత శక్తిని ఆశ్రయించుకొని శ్రీసదాశివుడు అనేకవేలకోట్ల యోజనములు వ్యాప్తి నొందెను. ఈ ప్రకారముగా శివతత్త్వమును ఆగమములు అనేక విధములుగా ప్రతిపాదించుచున్నవి. అసలు ఆగమములు ఏవి? వేటిని ఆగమములని అందురు? అవి ఎన్ని విధములు. వాటి లక్షణములు ఏవి అని ప్రశ్నించినచో ఇరవై ఎనిమిదిలో పది శైవాగమములు. 18 రౌద్రాగమములు కలవు. అవి కామికము, యోగజము, చింత్యము, కారణము. అజితము, దీప్తము, సహస్రాంశుమాన్ సుప్రభేదము, విజయము, నిశ్వాసము, తంత్రము, స్వయంభూతము, అనలము, వీరము రౌరవము, మకుటము, వైమలము, చంద్రజ్ఞానము, బింబము, ఉద్గీతము లాలితము సిద్ధము సంతానము, శార్వోత్తకము అని కలవు. ఇందులో కామికము, యోగజము, చింత్యము, కారణము, అజితము, దీప్తము, సహస్రాంశుమత్, సుప్రభేదము, విజయము మొదలగు 10 ఆగమములు వైదిక మతానుసారముగా శివప్రోక్తములు. మిగిలిన 18 ఆగమము వేదమతవిరుద్ధములు. స్వతంత్రములు. వాటిని అన్నింటిని త్రికములకు ఉపయోగింతురు. కామికాది ఆగమములు వేదములకు ఉపోద్బలకములుగా కొంత మంది అధికారులకు ఉపయోగపడును. ఈ ప్రకారముగా ఆగమ సమూహములు ఒక పీఠముగా ఉన్నది. శ్రీసదాశివుడు వేదములయందు ఆగమములయందును, ప్రతిపాద్య ప్రతిపాదక సంబంధముచేత ఉన్నవాడు. సామాన్యముగా లోకమున భోజనము చేయుచున్నప్పుడు, రచ్చబండమీద తీర్పు చెప్పునప్పుడు దానియందే నిమగ్నత ఎట్లు లభించునో వేదములు ఆగమముల యందును. అంతకన్నా ఎక్కువ నిమగ్నత ఆయనకు లభించును. వేదములకు చివరి భాగములైన ఉపనిషత్తులు వేదాంతమును వైరాగ్యమును బోధించును. ఆ వైరాగ్యము పరమ శివుని పరమార్థ తత్త్వ జ్ఞానమువల్లనే లభించును. ఆ జ్ఞానసాధనకు ఉపయోగపడే విధినిషేధ అర్థవాదనలు వేదమున ఎంతగానో ఉపయోగపడును. వేదములను అనుసరించి ప్రవర్తించున్నవే పది శైవాగమములు. రౌద్రాగమములు వ్యావహారికములు. సత్యమును బోధించుచూ మెల్లగా పరమార్థికమైన తత్త్వమును పొందేటట్లు చేయును. వేద పీఠమును ఆగమ పీఠమును శ్రీకాళహస్తీశ్వరుడే అధిష్టించి ఉండి భక్తుల మనోభీష్టమును నెరవేర్చు చున్నాడు.

## మణిజాలార్చన ప్రియః 43

"పత్రంపుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి" అని భగవద్గీతలో శ్రీకృష్ణుడు చెప్పెను. సర్వసమర్పణమే నిజమైన భక్తికి ఉదాహరణ. కొంతమందికి స్వామి అభిషేక ప్రియుడు కనుక అనేక స్నపన ద్రవ్యములతో అభిషేకముచేసిన అది ఒక తృప్తి. అనేక పుష్పములతో అర్చించినచో అది ఒక తృప్తి. వెలుగు అంధకారాన్ని పోగొడుతున్నది. మనిషిలోని అజ్ఞానాన్ని పోగొట్టేది వెలుగే. అదే జ్ఞానము. అటువంటి వెలుగును ఎల్లప్పుడు తనలో నింపుకోవాలని అనేక వెలుగులతో స్వామిని అర్చిస్తారు. అనేక మణులతో అర్చించినమా స్వామి తృప్తి పడతారు. నాగాభరణుడైన శ్రీకాళహస్తీశ్వరుడు అనేకమణులతో అర్చించినమా తృప్తి పడగలడు. స్వామి అర్చన ప్రియుడు. అభిషేక ప్రియుడు.

మణీనాం రత్నానాం జాలం రాశిః జాలం సమూహ ఆనాయో గవాక్ష క్షారకా వపీతి । ని । మణి సమూహై రర్చనే ప్రీతిరస్యాస్తీతి మణిజాలార్చన ప్రియః । అత్ర మహామణి గర్తే శ్రీమద్దక్షిణ కైలాసస్థవాయులింగం సంపూజయతోర్గంధర్వయోర్నికటం కశ్చిద్ద్విజో౽భ్యేత్యమహ్యమపిపూజార్థం రత్నం దిశతామిత్యయాచత, తదా తౌ నాగలోకం గచ్ఛ యథేష్టం రత్నం లభ్యేత ఇత్యుక్త్వా అంతర్ధానం జగ్మతుః తదాది స ద్విజః కథం నాగలోక గతిః సంభవేత్ మమ భీరోః కథం వా రత్నప్రాప్తి రితి చింతయాన ఏవ మమార । పునః పూర్వభావేన కృష్ణ సర్పో భూత్వా ప్రతిది నమీశాజ్ఞయా స్వశిరస్సముత్పన్న పంచరత్నైః శివ మారాధ్య ముక్తో౽భూదితి కథా విజ్ఞేయా ।

మణులనగా రత్నములు వాటి జాలమనగా సమూహము. ఎక్కువ సంఖ్య కలిగినవి. అటువంటి అనేక రత్న సముచ్చయముతో అర్చించుటయందు మిక్కిలి ప్రీతి కలిగిన వాడు శ్రీకాళహస్తీశ్వరుడు. అందువల్ల ఆయన మణిజాలార్చన ప్రియుడు.

ఇచట ఒక సుందరమైన కథ ఒకటి కలదు. దక్షిణకైలాసం ప్రసిద్ధినొందిన వాయు లింగాకారుడుగా శ్రీకాళహస్తీశ్వరుడు విరాజిల్లు చుండెను. ఒకనాడు ఇద్దరు గంధర్వులు అనేక రత్నములతో అమూల్యమైన మణులలో పరమభక్తి పరవశులై స్వామిని అర్చన చేయుచుండిరి. అంతలో వారి సన్నిధికి ఒక బ్రాహ్మణుడు వచ్చి అది చూచి తనకు ఆ ప్రకారముగా శ్రీకాళహస్తీశ్వరుని అర్చించవలెనని కోరిక కలిగెను. తన కోరిక ను ఆ గంధర్వులకు నివేదించెను. అటువంటి రత్నములు భూలోకమున లభించవు. నాగలోకమున మాత్రమే లభించగలవు. అచటకు వెళ్ళినచో కోరినన్ని మణులు లభించగలవని వారు చెప్పి మాయమైరి. అప్పటినుండి ఆ బ్రాహ్మణునకు తను నాగలోకమునకు ఎట్లు వెళ్ళవలెను. వెళ్ళుటకు తను అసమర్థుడు. కావున ఆ నాగలోకమున అనేక రత్నములను సంపాదించి శ్రీకాళహస్తీశ్వరుని ఎట్లు అర్చించవలెను అని ఆలోచించుచూ చాలాకాలము తర్వాత మరణించెను. నాగలోకస్మరణముచే మరణించుట వలన అతను మరుసటి జన్మలో కృష్ణ సర్పముగా జన్మించెను. పరమేశ్వరుని ఆజ్ఞచేత ప్రతిదినము తనశిరస్సున పుట్టే దివ్యమైన పంచరత్నములతో అర్చించుచుండెను. కొంతకాలము తర్వాత పరమేశ్వరానుగ్రహంతో ఆ కృష్ణసర్పము ముక్తిని పొందెను. భక్త జనవశ్యుడు గనుక శ్రీకాళహస్తీశ్వరుడు తన భక్తులందరికీ ముక్తిని ఒసంగ గలడు.

## మణి కర్ణః 44

మణి కర్ణికా ఘట్టము కాశీక్షేత్రములోని 60 ఘట్టాలలో ఒకటి. కాశీ మహాత్మ్యమును వర్ణించే ఒక శ్లోకం కలదు. అది.

**విశ్వేశం మాధవం ఢుండిం దండ పాణించ భైరవం ।**
**వందే కాశిం గుహాం గంగాం భవానీం మణి కర్ణికాం ॥**

వారణాసిలో విశ్వేశ్వరుని ఆలయం ( భవానీ) అన్నపూర్ణ ఆలయం. ఢుండి వినాయకుడి ఆలయం కేదార ఘట్టానికి దగ్గర కలదు. దుర్గా ఘట్టానికి దగ్గరగా కాల భైరవుని ఆలయం పంచగంగా తీరమందు బిందు మాధవుని ఆలయం కలదు. కాశీపట్టణమునకు ఉత్తరముగా వరుణనది. దక్షిణమున అసినది రెండును పవిత్ర గంగానదిలో సంగమమౌ చున్నవి. ఈమధ్య ఉండే భూమిని వారణాసి అనే పుణ్యక్షేత్రమైనది. అసి వరుణల మధ్యన గంగానది ధనుస్సు

ఆకారముగా ప్రవహించుచున్నది. గంగకు పడమటి ఒడ్డున కాశీపట్టణము ఏర్పడినది. ఇది అవిముక్త క్షేత్రము కనుక ఇక్కడ దేహము వదిలిన జీవాత్మునికి తారకోపదేశము దొరుకున్నదని పురాణ ప్రసిద్ధి కలదు. గుహా అనే బిలము కాశికి దక్షిణ భాగమునందు కలదు. కాశీలో చెప్పే సంకల్పము ''ఆర్యావర్తైకదేశే అవిముక్త వారణాసీ క్షేత్రే అసి వరుణయోః మధ్య ప్రదేశే మహాశ్మశానే, ఆనందవనే, గౌరీముఖే త్రికంటక విరాజితే భాగీరథ్యాః పశ్చిమ తీరే'' అని చెప్పవలెను. ఒక్క కాశీక్షేత్రమందే 108 గణపతులు కలరని ప్రసిద్ధి. కలియుగమున పాపప్రక్షాళనకు గంగకు మించిన పుణ్య తీర్థములేదని స్కాందపురాణములోని కాశీ ఖండమున చెప్పబడినది. అటువంటి గంగ ఇటువంటి క్షేత్రమున కలిసినందున పరమాత్ముడు అనేకులను భక్తితో ఆకర్షించి తరింప చేయుచున్నాడు. వారణాసికి దక్షిణమున అసినదీ తీరమున దుర్గాదేవి గుడి ఒకటి కలదు. ఈ దేవతే పట్టణమునకు కావలిగా ఉండే శక్తి అని ప్రతీతి. ఈమెకు ప్రతి మంగళవారము విశేష అర్చనలు జరుగును.

ఒకనాడు శ్రీమహావిష్ణువు తన చక్రముచేత కాశీపట్టణమందలి ఒక తీర్థమును కల్పించుకొని శివుని గూర్చి తపస్సు చేస్తూఉండగా పార్వతీసమేతముగా పరమేశ్వరుడు అచటకు వచ్చెను. శివుడు శ్రీహరి తపస్సుకు మెచ్చి, కష్టపడి శ్రీహరితొవ్విన పుష్కరిణిని కూడా అచటనే చూచెను. పార్వతీ దేవి కూడా వంగి ఆ పుష్కరిణిలోని జలమును చూచుచుండగా కుడిచెవియొక్క ఆభరణములోని మణి ఆజలములో పడెను. కర్ణికలోని మణి ఆపుష్కరజలములో పడినందున ఆ చక్రతీర్థమునకు మణి కర్ణిక అనే పేరు వచ్చెను. పరమేశ్వరానుగ్రహంతో భగీరథుడు గంగను భూలోకమున ప్రవేశించి ప్రవహించు చుండగా ఈ తీర్థమాహాత్మ్యము తెలిసి ఆ చక్ర తీర్థములోని జలముతో కలిసి గంగ ప్రవహించెను. మణికర్ణికా ఘట్టము ఈస్థలమునకు అతి ముఖ్యమైనది. ఈచక్రతీర్థములోనే ప్రథమ స్నానము చేయవలెనని పూర్వీకుల ఆచారము ''కాశ్యాం మరణాన్ముక్తిః అథవా పుత్రసన్నిధౌ'' అని ''అహ్నాం కాశీం గమిష్యామి తత్రైవ నివసామ్యహం । ఇతి బ్రువాణ సతతం కాశీవాసఫలం లభేత్ '' కాశికి వెళ్ళి అచట నివాసముంటానని సంకల్పము చేతనే కాశిలో ఉండే ఫలం వస్తుండగా అచటనే నివాసముంటే ఎంత పుణ్యమో? కదా!

మణిరివమణిః కర్ణే ముముక్షూణాం భవతీతి మణి కర్ణః తారకోపదేశరూపః ప్రణవః తదుపదేష్టాపి ప్రణవ ఇత్యుచ్యతే వాచ్య వాచక యోరభేదోపచారాత్ శ్రుతిశ్చ ప్రణవం హీశ్వరం విద్యాత్సర్వస్య హృదయే స్థిత మితి । యత్ర కుత్ర చిత్ శివస్థలసీమని మరిష్యతః ప్రాణినస్తత్కర్మసామ్యం తత్తద్దేహేను భవేన కారయిత్వా రుద్రస్తారకముపదిశతి । శ్రు । అత్రహి జంతోః ప్రాణై రుత్క్రమ మాణే రుద్రస్తారకం బ్రహ్మవ్యా చష్టే । యేనాసావమృతీ భూత్వా మోక్షీ భవతీతి ।

ఆది మణి వంటి మణి. మామూలు మణి శరీరమునకు అందాన్ని ఇస్తుంది. చెవులకు కూడా అందాన్ని ఇస్తుంది. కానీ ఈ మణి ముక్తిని కోరేవార్కి పరమఉపకారకమైనది. ఇది తరించేందుకు ఉపదేశకమైనది. అది ప్రణవస్వరూపమైనది. ప్రణవస్వరూపుడైన పరమశివుడు అందరి హృదయములలో నిండి ఉండేవాడు. జీవుడు ఎక్కడైనా శివసన్నిధిలో గాని శివాలయ పరిసరములలో గాని మరణించినచో దయాళువైన ఆ శివుడు అతని సుకృత దుష్కృత రూపకర్మలను ఆయాదేహానుభవమును బట్టి ఆ జీవునకు అవసానమందు జీవుడు ముక్తిని పొందే మంత్రమును చెవిలో రహస్యముగా శివుడు ఉపదేశించును. వేదమున ఇట్లు ఉన్నది.

జీవులకు ప్రాణము. ఉత్క్రమణ సమయమందు రుద్రుడే బ్రహ్మ ప్రార్థనను అనుసరించి తారకమంత్రమును ఉపదేశించగా అతను మరణము తర్వాత ఉత్పత్తి లేనివాడుగా మోక్షమును పొందుచున్నాడు. అంటే వారణాశిలో మరణించిన వాడికి శ్రీరుద్రుడు తారక మంత్రోపదేశము చేసిన వల్లనే మోక్షము లభించును అని తేలినది. మరి అందరూ జీవులు వారణాశిలో మరణించే అదృష్టవంతులు కాలేరు గదా, ఇతరత్ర మరణించినచో వార్కి మోక్షము లభింపదు అని తేలినది. మరి పురాణములు - ఇతర గ్రంధములలో వారణాశిలోనే మరణించిన వార్కి మాత్రమే మోక్షము ఉన్ననూ ఇతరత్రా ఉన్న దివ్యక్షేత్రములలో మరణించిన వార్కి కొద్ది మోక్షము కలదని తెలుపు చున్నవి. ఐతే మోక్షములోనే తారతమ్యములు కలవు.

నను కురుక్షేత్రం దేవానామిత్యాది అత్రియాజ్ఞవల్క్య ప్రశ్నోత్తరవచనైః కాశ్యేవాగమ్యతే । తతశ్చాత్ర హీతి శబ్దస్తనిష్ఠ ఏవేతి చేన్న । శివస్థలే ఏవ ప్రయత ఉత్క్రమణే రుద్ర ఉపదిశతి । నాన్యత్రేతి హిశబ్దో వ్యంజయతి ఇదమనుసంధేయం దేవతాంతరస్థల మృతస్య జంతోస్సరక్తస్య తత్తల్లోక మహాభోగానంతరం భువి సత్కులజ నిర్భవతి । విరక్తస్య తు తల్లోకే పరాంతకాలే తదుపదిష్ట జ్ఞానేన క్రమముక్తి రితి । అవిముక్తేతరశివక్షేత్రేషు విరక్తస్య మృతస్య తారకోపదేశేన సద్యో ముక్తిః । సరక్తస్య పరాంతకాలే క్రమముక్తిరితి అవిముక్తే ప్రయతః ప్రాణిమాత్రస్య సర్వస్య రుద్రస్తత్త్వముపదిశతి విరక్తస్తావత్తైవముచ్యతే । సరక్తః పునరుపదేశాత్పరాంతకాలే ముచ్యత ఇత్యయమేవ విశేషః యథా కథంచిత్ శివస్థల మృతస్యైవోప దిశతీతి హి శబ్దార్థః ।

మోక్షవిషయమున అనేక సందేహములు ఉదయించుచున్నవి. కురుక్షేత్రము ధర్మక్షేత్రముగా ప్రసిద్ధినొందినది. అచట మరణించినవార్కి కూడా ముక్తి కలుగవలసి ఉన్నది. అత్రి యాజ్ఞ వల్క్యుని సంభాషణలో కాశీలో మరణించిన వానికి మాత్రమే జనన మరణములు లేని మోక్షము లభించును అని ఉన్నది. మూలములోని వాక్యమున హి శబ్దము ఆ విషయమునే స్పష్ట పరచుచున్నది. శివ సన్నిధిలో ప్రాణములు వదిలిన వానికి రుద్రుడు స్వయముగా వచ్చి తారక మంత్రోపదేశము చేయును అని హి శబ్దము తెలియపరచుచున్నది. కానీ ఇచట ఒక విషయమును తెలుసుకొనవలసి ఉన్నది. ఇతర దివ్య దేశములలోగాని పుణ్యక్షేత్రములో గాని పవిత్ర నదీ సమీపములోగాని ప్రాణములు వదలిన జీవునికి పుణ్య వశమున పుణ్య లోకములలో మహాభోగములను అనుభవించి పుణ్య క్షయము కాగానే భూలోకమున మంచికులములో పుట్టుక లభించును. పుణ్యాపాపకర్మలయందు విరక్తుడై ప్రాణములు విడిచిన వాడు పుణ్యాధిక్యమున లభించిన పుణ్యలోకములలో నివాసముండి అచట ఆత్మ జ్ఞానమును పొంది క్రమముక్తి ద్వారా మోక్షమును పొందెదరు. విరక్తులైనవారు ముక్తిని ప్రసాదించే శివక్షేత్రములయందు ప్రాణములు విడచిన వారికి తారకోపదేశము ద్వారా సద్యోముక్తి లభించును. పుణ్యలోకనివాసమును కోరువారికి మరణాంతరమున క్రమముక్తిని, విరక్తుడైన వాడికి మరణానంతరము ముక్తి లభించును. కనుక రుద్రుడు శివస్థలములలో మరణించిన వారికి తారకమంత్రోపదేశము చేసి సద్యోముక్తిని ప్రసాదించుచున్నాడు.

**తథాచ బ్రహ్మానందాః ।**

**కాశ్యాదిస్థానమరణం జ్ఞానద్వారేణ ముక్తిదం ।**
**విరక్తానాం హరిస్థానే మృతానాం శంకరాజ్ఞయా ॥**
**విష్ణులోకే శివజ్ఞానం బోధయత్యేవ కేశవః ।**
**సరక్తానాం విరక్తానామపి స్థానేషు శార్ఙిణః ।**

ప్రయతానామంత్యకాలే బ్రహ్మోపదేశో న విద్యతే। అవిముక్తేతరశివస్థానేషు ప్రయతాం నృణాం।
తదా స్వయం విరక్తానాం తత్త్వం బోధయతీశ్వరః।
సరక్తానాం తదా తత్ర తత్త్వం నోపదిశేచ్ఛివః॥
పరాంతకాలే కృపయా తేషాం తత్త్వం ప్రబోధయేత్।
ప్రాణిమాత్రస్యావిముక్తే ప్రయతః పరమేశ్వరః॥
తారకం బ్రహ్మవిజ్ఞానం తదా బోధయతి స్వయం।
విరక్తస్తావతా ముక్తో భవత్యేవ న సంశయః॥
సరస్యాంతే పునస్తత్త్వం బోధయేత్కామినాం శివః।
ఏవం స్థానవృత్తి నృణాం జ్ఞానద్వారేణ ముక్తి దేతి॥

తస్మాదత్ర హీతి శబ్దశ్శివస్థల సామాన్యవిషయః। శివమాహాత్మ్య ఖండే ఉత్తమాధికారిణాం విచారజ్ఞానాన్ముక్తిం ప్రతిపాద్య పునస్సర్వ సులభం జ్ఞానద్వారమాహ।

కాశీలో మరణించినచో జ్ఞానముద్వారా ముక్తి లభించును. విరాగులైన వారు శ్రీహరి సన్నిధిలో మరణించినచో శంకరుని ఆజ్ఞచేత వారికి ముక్తి లభించును. విష్ణులోకమైన వైకుంఠమునందు ఉన్నవారికి కేశవుడే శివతత్త్వమును బోధించును. సంసారబంధమునందు అనురక్తులైనవారికి విరక్తులైన వారికికూడా శ్రీకేశవుడే ఉపదేష్టా. ప్రయతుడు అనగా పరిశుద్ధుడు అని అర్థము. ఆ పరిశుద్ధునికి మరణము దగ్గరకు వచ్చినపుడు బ్రహ్మోపదేశము అతనికి లేదు. పరిశుద్ధుడైన వానికి శివస్థానమరణముద్వారా ముక్తి తప్పనిసరిగా ఉండును. సంసారమునందు అనురక్తుడైన వానికి శ్రీపరమశివుడు తత్త్వమును ఉపదేశింపడు. అటువంటివారు విశేషముగా ఆయనను ప్రార్థించినచో వారికి మరణకాలమునందు శ్రీపరమశివుడు తత్త్వమును ఉపదేశించును. తారకమంత్రమే బ్రహ్మవిజ్ఞానము. విరక్తుని విషయమున మోక్షము నిశ్చయముగా లభించును. పరిశుద్ధుడైన సంసారకామికి కూడా. శ్రీపరమేశ్వరుడు తత్త్వమును బోధించును. ఈ ప్రకారముగా శివసాయుజ్యములో మరణించిన వారివిషయము సంసారానురక్తుని మరణానంతర విషయము ప్రయతుడు - కాముకుడు, మరణానంతరము వారి స్థితి గతులను విచారించి ఎవరికి పరమశివుడు తత్త్వమును బోధించును అనే విషయములు కూడా విచారించితిమి.

శివమహాత్మ్య ఖండమున ఉత్తమాధికారులకు ఆత్మజ్ఞానమును విచారించిన పిమ్మట ముక్తి లభించును అని చెప్పి ఆత్మ జ్ఞానార్జనకు సులభమార్గమును చెప్పుచున్నాడు.

విశుద్ధం బ్రహ్మవిజ్ఞానం విశుద్ధస్యైవ సిధ్యతి।
అతస్సర్వమనుష్యాణా న్న హి ముక్తి రయత్నతః॥
తస్మాదయత్నతో ముక్త స్సర్వేషాం యేన హేతునా।
తద్వదామి మహావిష్ణో హితాయ జగతాం శృణు॥
సంతి లోకే విశిష్టాని స్థానాని మమ కేశవ।
తేషామవ్యతమే స్థానే వర్తనం భుక్తిముక్తిదం॥
శ్రీమద్వారాణసీపుణ్యా పురీ నిత్యం మమ ప్రియా।
యస్యాముత్క్రమమాణస్య ప్రాణైర్జంతో కృపాబలాత్॥

తారకం బ్రహ్మవిజ్ఞానం దదామి శ్రేయసే హరే ।
స్థానం దక్షిణకైలాస సమాఖ్యం సత్కృతం మయా ॥
యత్ర సంవత్సరం భక్త్యా యో వా కో వా దివా నిశం ।
దృష్ట్వా దక్షిణకైలాసవాసినం కరుణానిధిం ।
భుంక్తే తస్య మహావిష్ణో జ్ఞానం సమ్యగ్విముక్తిదం ॥
జాయతే మరణే కాలే తేన ముక్తో భవేద్ధ్రువమితి ।
ఏవం చిదంబరవృద్ధాచలస్థలకథానాంతరం ॥
తస్మాద్విముక్తి మన్విచ్ఛన్న యత్నేనైవ మానవః ।
భజేదభిమతం స్థాన మేతేషాం శ్రద్ధయా సహేతి । తస్మాత్సర్వశివక్షేత్రేషు మరిష్యమాణజంతుకర్ణే
మణిమివ మణిం శివజ్ఞానరత్నముపదిశది । తథాచ ముక్తి ఖండే ।
శివస్థలవాసినాం పాపానాం హీనదేశవాసినాం ప్రణవ పంచాక్షరీశ్రీరుద్రజపలింగారాధనాది మహాపుణ్యవతాం
చావసానే తారక ముపదిశతీత్యాహ ।

విశుద్ధమైనది, స్వచ్ఛమైనది, బ్రహ్మవిజ్ఞానము. అటువంటి పరిశుద్ధమైన జ్ఞానము నిర్మలమైన శుద్ధ మనస్కునికి మాత్రమే లభించును, అందువల్ల ముక్తి అందరికి అప్రయత్నముగా లభించుటలేదు. ఎంతో సాధనద్వారా మాత్రమే లభించును. కష్టపడకుండగా ముక్తిని పొందే ఉపాయము ఏదైనా కలదా ? అనే ప్రశ్నకు శివకేశవుల సంభాషణలో మనకు తెలుస్తుంది. జగత్తులో ఉండే జీవుల హితమునుకోరి శ్రీపరమేశ్వరుడు శ్రీమహావిష్ణువునకు చెప్పుచున్నాడు. దానిని సావధానముగా వినవలెను. ఓ కేశవా! ఈలోకమున శివునకి సంబంధించిన దివ్య క్షేత్రములు అనేకములు కలవు. అదివ్యక్షేత్రములలో ఒక ప్రసిద్ధమైన దివ్య క్షేత్రము పవిత్రనదీతీరమున కలదు. ఆ క్షేత్రము భుక్తిని, ముక్తిని ఇచ్చునది. ఆ క్షేత్రమే నాకు ముఖ్యమైనది, ఇష్టమైనది, పుణ్యప్రదమైనది. అదే వారణాసీక్షేత్రము. ఆ క్షేత్రమున ఏ జీవుడు ప్రాణములను విడుచునో ఆ జీవియందు దయతలిచి, అతని శ్రేయస్సుకై పరమేశ్వరుడు బ్రహ్మ విజ్ఞానమును తెలియచేసే తారకమంత్రమును ఉపదేశించి ముక్తిని ఒసగుచున్నాడు. అటువంటి దివ్యక్షేత్రముతో సమానమైనదే దక్షిణ కైలాసముగా ప్రసిద్ధ వహించిన శ్రీకాళహస్తీశ్వర క్షేత్రము. ఏ క్షేత్రమున భక్తి ప్రత్తులతో ఒక సంవత్సరముగాని, అవకాశములేనివాడు ఒక రాత్రింబవళ్ళు నివసించినచో, కరుణామయుడైన శ్రీసదాశివుడు శ్రీకాళహస్తీశ్వర క్షేత్రమున ముక్తిని పొందే సద్విజ్ఞానమును వారికి పొందించు చున్నాడు. (ఇచ్చుచున్నాడు) అందువల్ల ఆ జీవుడు మరణానంతరము నిశ్చయముగా నిర్భయముగా ముక్తినిపొందును. ఈ ప్రకారముగా శైవక్షేత్రములైన చిదంబరము, వృద్ధాచలము మొదలగు దివ్య క్షేత్రముల దివ్య చరిత్రలు చెప్పిన తర్వాత దివ్యమైన శివక్షేత్రములే ముక్తిని ఇవ్వగలవు అని ప్రయత్న పూర్వకముగా ఆక్షేత్రములు వెతికి అచట నివాసముండి ఆక్షేత్రాధిదేవత అనుగ్రహము సంపాదించిన కాని కోరిన ఫలితముండగలదు. అందువల్ల శివక్షేత్రములలో మరణించిన జీవుని చెవిలో మణిలాంటి మణి ఐన శివజ్ఞాన రత్నమును శివుడే ఉపదేశించుచున్నాడు. అందువల్ల ముక్తి ఖండములో శివక్షేత్రములలో నివాసమున్న వారి పాపములు అన్నియూ పోవును. హీనమైన జీవనమును, హీనమైన స్థలములో నివాసమున్ననూ, చివర శివక్షేత్రములో మరణించినచో శివసాయుజ్యము లభించును.

ప్రాణముతో కూడిన శివ పంచాక్షరీ జపఫలము శ్రీరుద్ర జప ఫలము నిరంతర శివలింగారాధనా మొదలగునవి ఎవరు చేయుదురో వారు మహాత్ములు పుణ్యవంతులుకూడా. అటువంటివారు మరణించినను శ్రీసదాశివుడు తారక మంత్రమును ఉపదేశముచేసి ముక్తిని ప్రసాదించును. తారక మంత్రము ఒక మహామణి అటువంటి మణిని అవసాన కాలమందు శ్రీసదాశివుడు కర్ణమున ఉపదేశము చేయును. అందువల్ల అది మణి కర్ణిక.

శివుడనగా శాంతుడు అని అర్థము. అంతః కరణములను, సకల ఇంద్రియములను జయించి నిగ్రహించిన విజేతలలో ఈయన మొదటివారు. దుష్టసంహారమును చేసి ప్రపంచమున శాంతి సౌభాగ్యములను స్థాపించినది కూడా మొదట ఈయనే . ''శ్యామ్యతి పరమానందరూపత్వాత్ నిర్వికారో భవతీతి శివః'' పరమానందరూపుడై నిర్వికారుడై శాంత స్వభావము కలిగినవాడు శివుడు, ''శేరతే సజ్జన మనాంసి అస్మిన్నితి శివః'' సజ్జనమనస్సులలో లీనమగువాడు శివుడు, అంటే మార్కండేయాది మహాభక్తుల మనస్సులో మెలగువాడు ఈయనే. ''శివం కళ్యాణం, తద్యోగాద్వా శివః'' మంగళ పరంపరలను శుభసముదాయములను, అనేక శుభయోగములు ఇచ్చువాడు శివుడు. నీవు మాకు మంగళ కరుడవు కమ్ము. నీవు శివుడవైతే మాకు సదా శివమే జరుగును. అట్లాగే నీవు మాకు సుమనస్కుడవు కమ్ము. నీవు జ్ఞానదాతవు ఐతే మమ్ములను సుజ్ఞానులుగా చేయుము. ఓ సదాశివా! నీవు సద్గురు రూపమున మావద్దకు వచ్చి, మా సంసార విషవృక్షమును ఛేదించి, మాకు తత్త్వోపదేశము చేసి నీభక్తులమగు మమ్ములను కృతార్థులను చేయుము. పరమశివుడే పర్జన్యుడై లోకమున నీటిని ఇచ్చుచున్నాడు. సూర్యుడై ప్రకాశమును, చంద్రరూపుడై కుండలినీ శక్తితో కంఠమున అమృతమును వర్షించుచున్నాడు. నీచేతులలో గల అనేక ఆయుధములను మాశత్రువులపై విసిరి వారిని సంహరింపుము.

శివుడే పరమాత్మ. అతని రూపాంతరములే బ్రహ్మ విష్ణు మహేశ్వరులు, దిక్పాలకులు, పంచభూతములు, సూర్యచంద్రులు, సమస్త ప్రపంచము, వ్యక్తావ్యక్త స్వరూపమంతయు శివమయమే. అతనే పరబ్రహ్మ శివుడు సాక్షిచైతన్యముగానుండి జీవులకు పరమానందమును చేకూర్చు చున్నాడు. పరమశివుడు తల్లితండ్రి రూపమున జీవులకు లౌకిక సుఖములను చేకూర్చు చున్నాడు. భగవంతుడైన శివుడు కేవలము ముక్తులను ముముక్షువులనే కాక సంసార సముద్రములో మునిగిన వారిని కూడా కాపాడును. అందువల్ల ఆయన ప్రతరణుడు, ఉత్తరణుడు. పరమశివుడు అష్టసిద్ధులు కలవాడు కావున లోకములకు స్వయముగా కళ్యాణమును చేకూర్చువాడు. అభ్యుదయమును, నిశ్శ్రేయసమును ఇచ్చువాడు ఆయనే. తీర్థుడు అనగా గురువు పరమశివుడు గురుస్వరూపుడు. శం - సుఖములను, కరః - చేకూర్చువాడు. కావున శివుడు శంకరుడాయెను. వనవాసులైన మహర్షులకు తత్త్వ జ్ఞాన సంశయములను (శంకలను) రః శివుడే ఉపదేశికుడై తొలగించినవాడు కావున శివునకు శంకర అనునామము వచ్చెను. (శివపురాణమువలన) శివుడు సాక్షి చైతన్యముగా ఉండి జీవులకు పరమానందమును చేకూర్చు చున్నాడు కావున శంకరుడాయెను. ''ఐశ్వర్యమీశ్వరాదిచ్ఛేత్'' శివుని నుండే ఐశ్వర్యమును కోరవలెనని పెద్దలు చెప్పుదురు. ''శామ్యతీతి శివః పరమానందత్వాత్ నిర్వికారో భవతి'' పరమానందమును ఇచ్చే శివుడు నిర్వికారుడు.

**యాని బాహ్యాని కర్మాణి మరణాదూర్ధ్వమచ్యుత ।**
**మమ జ్ఞానప్రదానాని కథితాని మయా తవ ।**
**తాని కల్యాణవృత్తస్య విద్ధినాన్యస్య కస్య చిత్ ।**
**పాపిష్టానామపి శ్రద్ధా విహీనానాం జనార్దన ।**
**ముక్తిదం మరణాదూర్ధ్వం శివక్షేత్రేషు వర్తనం ।**
**పురా కోలాహలో నామ వృషలో విధిచోదితః ।**
**కామేన పీడితస్తస్య పితరం పంకజేక్షణ ।**
**హత్వా మాతరమాదాయ గత్వా మోహేన కేశవ ।**
**వేదారణ్యే యథాకామం చరిత్వా మరణం గతః ।**
**తత్ర వర్తనమాత్రేణ స పునః పురుషోత్తమ ।**
**ప్రణష్టపాపశ్శుద్ధాత్మా వేదారణ్యే మృతో మమ ।**
**ప్రసాదాదేవ వేదాంతజ్ఞానం లబ్ద్వాఽమృతోఽభవత్ ।**
**తస్మాద్విముక్తి కామానాం విశిష్టేషు జనార్దన ।**
**శివక్షేత్రేషు మద్భక్త్యా కేవలం వర్తనం పరమితి ।**

శివుని గూర్చి తెలియక శివధ్యానం గురించి కూడా తెలియక ఎవరు ఇతర లోకములకు వెళ్ళెదరో ఓ అచ్యుత! వార్ని గూర్చి చెప్పెదను. పాపాత్ములకైనను శ్రద్ధ లేకుండగా చేసే పని గలిగినవార్కి అభివృద్ధి, కల్యాణ పరంపరలు శివధ్యానం చేయనిదే అవి కలగవు. శివక్షేత్ర నివాసము మరణించిన తర్వాత ముక్తి శివానుగ్రహంతోనే లభించును. పూర్వము వేదారణ్యమునందు వృషలుడనే శూద్రుడు అధార్మికుడై పాపాత్ముడై సేద్యమునకు ఎద్దులను తెచ్చుట మానివేసి, కోలాహలుడిగా సంచరించుచూ కామమోహితుడై పంకజేక్షుడనే తన తండ్రిని చంపి తన తల్లితో యథేచ్ఛగా తిరిగి ఆమెయందు తనవాంఛలను తీర్చుకొనుచూ కొంతకాలము తర్వాత మరణించెను. కొంతకాలము తర్వాత ఆ వేదారణ్యములోనే అతను జన్మించెను. జన్మాంతర పాప సంస్కారములు పోయి పరిశుద్ధుడై ఈశ్వరానుగ్రహంతో వేదాంతజ్ఞానమును నేర్చి శివసాయుజ్యమును పొందెను. కావున శివక్షేత్రసంచారముచేతనే శివభక్తి లభించి మానవులు ముక్తిని పొందగలరు.

మరణపర్యంతం శివస్థాన వర్తనమేవ పరం శ్రేష్ఠమిత్యర్థః। శివస్థానస్య కిం మానం ఇత్యత అహ। సుప్రభేదే ।

**లింగార్ధస్తశతం స్థానం శివస్థానం సమంతతః ।**
**యత్తు మానుషకం లింగం క్షేత్రమానమిదం స్మృతం ।**
**స్వయంభూతే సహస్రం స్యా దార్షే చైవ తదర్ధకం ।**
**అంతరాలే చ సర్వాణి స్థావరాణీతరాణి చ ॥**
**దివం ప్రయాంత్యసందేహః ప్రభావాత్పరమేష్ఠిన ఇతి ।**
**సర్వజ్ఞానోత్తరే ।**
**లింగార్ధస్తశతం క్షేత్ర మాచార్యస్థాపితాద్భవేత్ ।**
**ద్విసహస్రం స్వయంభూతే చార్షేఽపి తు తదర్ధకం ।**

జన్మించినది మొదలు మరణించే వరకు శివ సన్నిధిలో ఉండటం చాలా ఉత్తమము. శివస్థానము లేక శివక్షేత్రము అని ఎట్లు చెప్పవలెను అనే విషయమును సుప్రభేదము అనే

గ్రంథములో ఇట్లు చెప్పబడి ఉన్నది. ఐదువందల శివలింగములు ఎచట ఉండునో అది శివస్థానములో సమానము. ఎచట మనుష్యుని వంటి ఎత్తుగల శివలింగముండునో అది క్షేత్రములో సమానము. స్వయంభువు అయిన లింగము ఎచట నుండునో అది వెయ్యిలింగములలో సమానము. మహర్షులచే ప్రతిష్ఠితమైన లింగము ఐదువందల లింగములలో సమానము. సంఖ్యలో పనిలేకుండగా గర్భాలయములోనివి బయట ప్రతిష్ఠితములైనవి అర్చించినను విశేషఫలము లభించును. సర్వజ్ఞానోత్తరమందును ఇదే విధముగా చెప్పబడెను. నిష్ఠాగరిష్ఠుడైన ఆచార్యునిచే ఐదువందల శివలింగములను స్థాపించినను స్వయంభూవులైనవి ఒక వెయ్యిలో సమానమని మహర్షి ప్రతిష్ఠితమైనవి ఐదువందలలో సమానమని చెప్పెను.

**ఆదిత్య పురాణే క్రోశమాత్రం శివక్షేత్రం సమంతాత్పరమేష్టిన:**
**దేహినాం తత్ర పంచత్వం శివసాయుజ్యకారణం ॥**
**మనుష్యస్థాపితే లింగే క్షేత్రమాన మిదం స్మృతం**
**స్వయంభువే యోజనం స్యాదార్షే చైవ తదర్థకం ॥**
**పాపాచారేఽపి యే నిత్యం నిరతా: మనుజా: భువి**
**తేఽపి యాంతి శివస్థానం దేవై రపి సుదుర్లభం**
**తస్మాదావసథం కుర్యాచ్ఛివస్థానసమీపత: ।**
**ఇతి క్షేత్రసామాన్య పరిమాణామాపీత్. అత్ర దక్షిణ కైలాసమాన మహ సూత: -**

క్రోశడు దూరములో శివక్షేత్రమున్నప్పుడు ఆసమీపములో ఎవరైనా మరణించినచో, వారు శివసాయుజ్యమును పొందుటకు కారణము కాగలదు. ఐతే ఇందులో మానవులచే శివలింగ ప్రతిష్ఠ చేసినచో ఆ క్షేత్ర పరిధిలో మరణించిన వారికి మాత్రమే ముక్తి లభించును. స్వయంభువువైన శివుడు వెలసినచోట యోజనదూరమును, మహర్షి ప్రతిష్ఠితమైన దానికి అర్థ యోజన పరిధిలో మరణించిన వార్కి ముక్తి లభించును. భూలోకపు మానవులు సహజముగా పాపాచార పరాయణులు. అటువంటి పాపాత్ములుకూడా శివానుగ్రహంతో ముక్తిని పొందుచున్నారు. కావున శివసన్నిధి నివాసము ఎల్లప్పుడు ముక్తి కారకమగును. ఈ ప్రకారముగా క్షేత్ర సామాన్య నివాసఫలమును చెప్పెను. ఇప్పుడు దక్షిణకైలాసమైన శ్రీకాళహస్తిస్థలమానమును సూతమహర్షి ఈ విధముగా చెప్పెను.

**శ్రీమద్దక్షిణ కైలాసం సర్వస్థానోత్తమోత్తమం ।**
**పంచయోజన విస్తీర్ణం దశ యోజన మాయతమితి ॥**
**తస్మాద్యథా కథచిత్పురుష ప్రయత్నేన శివస్థలమాశ్రిత్య ముక్తో భవేత్.**
**భారతే**
**జ్యోతీంషి త్రిదశా నాగా: యక్షాశ్చంద్రార్క మారుతా:**
**సర్వే పురుషకారేణ మనుష్యా: దేవతాంగతా: ॥**
**ఇత్యత: పురుషకార: పరమఫలద: భవతి ।**

దక్షిణ ప్రాంతకైలాస క్షేత్రముగా ప్రసిద్ధి చెంది, శివస్థానములకెల్ల ఉత్తమోత్తమ మైనదియు ఐన శ్రీకాళహస్తిక్షేత్రము ఐదు యోజనముల విస్తీర్ణము కలిగినదియు పదియోజనముల విస్తృతి కలిగినది. ఇటువంటి దివ్య క్షేత్రమును ఆశ్రయించి అచటనే నివాసముండి శివభక్తితత్పరుడై శివానుగ్రహంతో ముక్తిని పొందగలడు. స్వర్గలోక వాసులు నాగలోకవాసులు

యక్షులు సూర్యచంద్రులు, మరుద్గణము మొదలగు వారందరు పూర్వ జన్మలో మనుష్యులే. వారి వారి సాధన బట్టి, పుణ్య విశేషమును బట్టి ఆయా లోకములలో ఉందురు. కనుక పుణ్యవిశేషమున ఉన్నత లోకములలో ఉన్నతపదవులు లభించగలవు.

నను కర్మసామ్యేత్వనాయాసాత్ జ్ఞానం సిధ్యతి నాఽన్యథేతి వచనశతైః పురుషస్య బహుజన్మానుష్ఠిత కర్మణామేకస్మిన్ జన్మన్యుపభోగేనాపహాతుమక్షమతయా తత్పుణ్య పాప సామాన్య భావకరణ్యాపి దుర్జ్ఞేయత్వాత్ కథం తారకం రుద్రోప్యుపదిశతి. కథం వా జంతుర్ముచ్యతే. తత్ర శ్రుణు కారణం ప్రయాణసమయే ఏకక్షణోపారూఢ విచిత్ర వివిధ విగ్రహ పరిగ్రహ తత్తత్కర్మ ఫలానుభవముద్భావయన్ స సర్వజ్ఞో రుద్రః ప్రాణికర్మ సామ్యసమయమీక్ష్య తారక ముపదిశతి. తతో ముక్తో భవతి. ఉక్తంచ.

కర్మ సామ్యము ఉన్నందువల్ల సాధనలేకుండగా జ్ఞానము సిద్ధించునా అనే ప్రశ్నకు సిద్ధించదు అని సమాధానము. అనేక ఉపనిషద్వాక్యముల వల్ల భగవంతునిని ఉపదేశ శతముచేతనూ మానవుడు అనేక జన్మలలో అనుష్ఠించిన పాపపుణ్య విశేషములను ఒకే జన్మలో అనుభవించి ఆకర్మ ఫలమును పోగొట్టుకొనుటకు అసమర్థుడు అగుచున్నాడు. ఏ పుణ్యపాపమును సామాన్యముగా భావించుట కుదరదు కనుక జీవుడు చేసుకొనిన పుణ్యపాపములను పోగొట్టి శివుడు ఎట్లు ముక్తిని ప్రసాదించును? ఆ పుణ్య పాపములతో ఉన్న జీవుణ్ణి ఎట్లు ముక్తుని చేయగలడు అని ప్రశ్నించినచో జీవునకు మరణమాసన్నమగునప్పుడు జీవుడు చేసిన పుణ్యకర్మను ఆధారముగా చేసుకొని వానిని అనుగ్రహించి వానికి తారకమంత్రోపదేశముచేసి ముక్తిని ప్రసాదించుచున్నాడు.

**బ్రహ్మదేవమనుష్యేషు పశుషు స్థావరేషు చ**
**పంచధా యా విభక్తాత్మా వర్తతే చిద్వ్య పాశ్రయా ॥**
**తామవిద్యాం తథా భూతాం భగవాన్ పరమేశ్వరః**
**సంహర త్యుదయే నైవ సహస్రాంశుస్తమో యథా ॥**

తస్మాత్పరమేశ్వరదర్శనమాత్రేణ సర్వకర్మాణి నాశమాయాంతి అత్రేదముచ్యతే. శ్రీమద్దక్షిణకైలాస నిలయకారిణానాం పూర్వ పుణ్య కర్మణాం భూయస్త్వాత్ ప్రారబ్ధశరీరేణ క్రియమాణయోః పుణ్యపాప యోః అసంభవాత్. ప్రారబ్ధకర్మణః భోగాదేవ క్షయాత్ సువర్ణముఖరీ స్నానదేవదర్శనాభ్యాం నష్టావశిష్ట కర్మణః సద్యోముక్తి కరం పరమితి సూతవచనాత్ సద్యోముక్తేరవశ్యం భావిత్వాత్ ప్రారబ్ధ ఏవ శరీరే తద్భోక్తవ్యతోత్పత్తేః '

అత్యుక్తటైః పుణ్యపాపై రిహైవఫలమశ్నుతః । ఇతి వచనాత్ । శివస్థల కృతయోః కర్మణోరుత్కటత్వేన ప్రారబ్ధ ఏవ శరీరే తద్భోక్తవ్యత్వనియమాచ్చ జంతూత్క్రమణ పూర్వక్షణే । అనేక కాలికేష్టా నిష్టకర్మఫలోపభోగ యోగ్యశరీరాంతరానుప్రవేశం మాయయోద్భావ్య స్వప్నకల్పాన్ భోగా ననుభావ్య కర్మసామ్యసమయం ప్రతీక్షమాణః పశ్చాత్తారకోపదేశేన మోచయతీతి ।

బ్రహ్మ శరీరమందును దేవతల శరీరమందునూ మానవ శరీరమందును, పశు శరీరమందును స్థావరములైన పర్వత వృక్షములయందును చిత్ స్వరూపుడైన పరమాత్మ ఐదు విధములుగా నిండి ఉండెను. సూర్యుడు తన సహస్ర కిరణములతో చీకటిని పోగొట్టి జగత్తుకు వెలుగును ఎట్లు ప్రసరింపచేయునో అట్లే తన భక్తులలో ఉండు అవిద్యను సంహరించి వారికి జ్ఞానమును

ఉపదేశించి వారిని ముక్తులుగా చేయుచున్నాడు. అందువల్ల పరమేశ్వరుని దర్శన మాత్రముచేతనే సర్వ కర్మ ఫలాలు నాశనము పొందును. ఐతే శ్రీదక్షిణ కైలాసదర్శనము చేత నశించిన పాపములు కల భక్తులకు వారి పూర్వజన్మ పాపవిషయములు ఉండుట చేత అవికూడా నాశమును పొందును. సంచిత ప్రారబ్ధ కర్మలు కూడా స్వామి అనుగ్రహముచేత నాశమును పొందును. పాపనాశ సమనంతరమే ముక్తి కలుగును. మిక్కిలి ఎక్కువగా పెరిగిన పాప-పుణ్య ఫలములు ఇచటనే అనుభవించవలెను అనే నియమమున శివక్షేత్రములలో చేసిన పుణ్యములు ఎక్కువైనందువల్ల అవి ఇచటనే అనుభవించి తీరవలెనన్న నియమానుసారముగా అటువంటి మానవుని మరణమునకు ముందుక్షణమున అవి అన్నియు నశింపచేసి అతనికి పరమేశ్వరుడు ముక్తిని కలిగించును. పరమేశ్వరుడే చాలాకాలము జీవులకు ఇష్టానిష్ట కర్మఫలోపభోగయోగ్య శరీరములను ప్రవేశించుట కల్పించి, స్వప్న భోగములలోని వ్యక్తువలె ఆయాసమయములలో అతనికి తారకమును ఉపదేశించి పరమేశ్వరుడే అతనిని ముక్తినిగా చేయుచున్నాడు.

తథా చ సూతః

ఈదృశీ పరమా నిష్ఠా గురోస్స్వక్షాన్నిరీక్షణాత్ ।
కర్మసాపేక్ష్యత్వనాయాసా త్విర్ధ్య్త్యేవ న సంశయ ఇతి ।
కథమేకక్షణే బహుకాలానుభావ్య కర్మఫల మనుభూయతే ।
ఇత్యత్రాఖ్యాయికా స్పంతి । తథాహి । వాసిష్ఠే
యథా స్వప్నే ముహూర్తే స్యాత్సంవత్సరశత భ్రమాః ।
తథా మాయావిలాసోత్థే జాయతే జాగ్రతి భ్రమ ఇతి ।
తథా సంక్షేపశారీరకే । సుప్తో జంతుస్స్వల్పమాత్రే పి కాలే కోటీః పశ్యేద్వ్యత్త సంవత్సరాణాం ।
కోటీః పశ్యేదేవమాగామినీనాం జాగ్రత్కాలే యోజయేత్సర్వ మేతదితి ।

సూతమహర్షి ఈవిధంగా చెప్పెను. సద్గురువు పర్యవేక్షణలో పరమనిష్టతో పరమశివుని ధ్యానించినచో అనాయాసముగా శ్రీసదాశివుని దర్శన భాగ్యము కలిగి చాలా కాలము సంపాదించిన కర్మఫలములు నశించి ఈశ్వర సాయుజ్యమును పొందెదరు. స్వప్నమున అనేక సంవత్సరాల కథలు క్షణమాత్రము కనపడి ఎలా వెళ్ళుచున్నవో అట్లాగే మాయావిలాసము గల ఈ ప్రపంచమున సుఖ దుఃఖములు పరమేశ్వరానుగ్రహము చేత క్షణ కాలములో మాయమగును అని వాశిష్ఠములో కలదు. సంక్షేప శారీరకములో ఇట్లా ఉన్నది. వేగులు, చారులు గూఢచారులు రాజ్యమున జరిగే వృత్తాంతములను రాజునకు రహస్యముగా చెప్పుదురు. రాజ్యములోని ప్రజలు నిద్రించిననూ పరిసరములను గమనించి వార్కి కావల్సిన విషయములను సేకరించుకొని వెళ్ళుదురు. కనుక వార్కి నిద్ర గూడా మెళకువ వంటిదే. కనుక జీవుల కర్మఫలములు శ్రీసదాశివుని అనుగ్రహముతో ముక్తి సోపానములు అగుచున్నవి.

స్కాందేచ । గంగాతటే మునిః కశ్చిచ్ఛంభుమాయావిమోహిత ఇత్యా రభ్యాహ । నారదముని ర్మోహేన కన్యాత్వమాప । కశ్చిత్కిరాతస్తాం పరిణీయ పుత్రాన్ పుత్రీంశ్చ తస్యా మజీజనత్ । సంసారదుఃఖం చిరమనుభూయ గంగాజల గ్రహణార్థం జాతు సా సమాగతా చేలం విముచ్య కుంభం చ తటే నిధాయ నిమజ్జంతీ పూర్వరూపమాప । తత్పుత్రాదయోన్విష్య త చ్చేలం ఘటం చ దృష్ట్వా గంగాయాం మృతేతి విలపత్సుతేషు । అహమస్మీతి బ్రువంతం మునిం దృష్ట్వాపి న విస్రంభమాపుః । పునః పూర్వాభిజ్ఞానై ర్బహుభిర్బోధితా ఏవమేవవిధివిచిత్రమితి

తే గతా ఇతికథా ॥ తస్మాన్మహతి శివస్థలే మృతానాం దేవస్సర్వజ్ఞః కర్మ సామ్యం సంపాద్య సద్యోముక్తిం దిశతీత్యర్థః ।

స్కాంద పురాణమున ఒక కథలో గంగానదీతీరమున ఒకమహాముని శ్రీసదాశివుని మాయకు లోబడి మోహమును చెంది స్త్రీగా మారిన కథ ఒకటి కలదు. శ్రీనారద మహాముని శ్రీసదాశివుని మాయతో స్త్రీగా మారెను. స్త్రీగా మారిన ఆ నారదుడు ఒక బోయవానిని వివాహము చేసుకొనెను. కొంతకాలము తర్వాత వారికి పిల్లలు కలిగిరి. ఇట్లు సంసార సాగరంలో చాలా కాలం ఆ నారదుడు ఉండెను. పరమేశ్వరుని అనుగ్రహంతో ఒక రోజు స్నానం చేసి మంచి నీరు తెద్దామని గంగానది తీరమునకు వచ్చి వస్త్రములను కుండను ఒడ్డున పెట్టి ఒకసారి మునిగి తేలగా పూర్వరూపమైన స్త్రీ దేహము పోయి నారదుడుగా మారెను. గంగానదికి వెళ్ళి తిరిగి రానందున బోయవాడు తనపిల్లలతో గంగానదీ వడ్డుకు వచ్చి విడిచిన వస్త్రములు కుండను చూచి తనభార్య గంగలోపడి మరణించినదని బోరున విలపించు చుండెను. అంతట నారదుడు అచటికి వచ్చి జరిగిన వృత్తాంతమును వారికి తెలుపగా వారు సంభ్రమాశ్చర్యములతో తమ ఇళ్ళకు వెళ్ళిరి. ఇచట మాటిమాటికి నారదుడు తనపూర్వ వృత్తాంతమును చెప్పినందున బోయవాళ్ళు ఇది విధి విచిత్రమని తెలిసికొని వాళ్ళ ఇళ్ళకు వెళ్ళిరి. అందువల్ల ప్రసిద్ధ శివక్షేత్రమున మరణించిననూ క్షేత్రసమీపమున ఉన్న పవిత్ర నదీజలములలో మునిగి ఉన్ననూ సర్వజ్ఞుడైన ఆ పరమేశ్వరుడు కర్మ సామ్యమును ఇచ్చి సద్యోముక్తిని ఇవ్వగలడు అని కలదు.

అత్రాఽపి నీలా నామ్నీ కాచిద్బ్రహ్మనిష్ఠశతావమానేన పిశాచీ భూత్వా శ్రీకుంభయోనినానుగృహీతా భైరవం దేవముపాసమానా స్వల్పేన కాలేన స్వకర్మఫలమనుభూయ దక్షిణ ద్వార్యావిర్భూతమణికర్ణేశ్వర సముపదిష్ట తత్త్వజ్ఞానాన్ముక్తిం గతేతి కథా । ఇదం నీలోపాఖ్యానం శ్రుతౌ శ్వేత కేతూపాఖ్యాన వత్ శివస్థలమమమార్షజనానుభూతసామ్యముక్తిబోధక మిత్యర్థః । ఏవం భూతో మణికర్ణాఖ్యో దేవో మహ్యం తారకముపది శేదితి భావః ।

ఉపనిషత్తులలో శ్వేతకేతూపాఖ్యానము వలె ఇచట నీల అనే ఒక యువతి కథకూడా కలదు. నీలా అనేయువతి ఆటవికవృత్తి చేత జీవించుచూ యథేచ్ఛగా అడవిలో తిరుగు చుండెను. ఆ ప్రవృత్తి యందు రుచి మరిగి ఉచ్చనీచములను, మంచి చెడులను మరచి, క్రూర ప్రవృత్తిని నేర్చి అమాయకులను, అర్భకులను, సాధువులను, సత్పురుషులను, మహర్షులను పీడించుచూ ఉండగా ఒకనాడు వారి శాపముల పర్యవసానముగా రాక్షసిగా మారి సంచరించు చుండగా ఒకనాడు అగస్త్యుని ఎదుట పడెను. ఆ మహర్షి ఆమెను కరుణించి ఈశ్వరారాధనను ఉపదేశించెను. ఆతర్వాత ఆమెకు భైరవదీక్షను కూడా ఇచ్చెను. ఆ అగస్త్యుని ఆదేశానుసారము ఆనీల తన పూర్వపు క్రౌర్య ప్రవృత్తిని మాని సాత్త్వికురాలై కొద్ది కాలమునకే ఈశ్వరానుగ్రహమును సంపాదించి దక్షిణద్వారమున వెలసిన మణి కర్ణేశ్వరునిద్వారా ఈశ్వర తత్త్వమును తెలిసికొని ముక్తి పొందినది. ఈ కథవల్ల శివక్షేత్రములలో ముక్తిని పొందగోరే వార్కి వారి ప్రవృత్తితో నిమిత్తము లేకుండగా ఆర్తితో శివధ్యానము చేసినచో ముక్తి లభించును అని తెలియుచున్నది. ఆర్తత్రాణ పరాయణుడైన మణికర్ణేశ్వరుడు నాకు ముక్తి ఉపాయమును ఉపదేశించి తరింప చేయప్రార్థన. నీల అనేయువతి శ్రీకాళహస్తిలో వెలసిన అనేక మూర్తులలో మణికర్ణేశ్వరుని సేవించి ముక్తిని పొందినది. మణికర్ణేశ్వరాలయము శ్రీకాళహస్తిలో ఒక పురాతన చిన్న దేవాలయము. నీలను గూర్చి స్థలపురాణమున మరి ఒక కథ కలదు. శూలాగ్రశిక్షను

పొందిన ఈమెను భైరవుడు దయతలిచి తన యోగశక్తితో విసరగా ఆమె శ్రీకాళహస్తిలో పడెను. స్వామి కృపచే ఆమెకు ప్రణవమంత్రం చెవిలో వినపడెను. సువర్ణముఖిలో స్నానమాడి అచటి స్థల రత్నజ్ఞులు చెప్పగా పురాతనమైన గుర్తులలో, గొప్పదైన విశిష్ట శిల్పములలో, అప్రమేయ కళా విభవములో తులతూగుచున్న ఆ ఆలయమున ఏకాంతముగా ఉండి అచంచల భక్తితో శ్రీమణికర్ణేశ్వరుని ధ్యానించి ఆయన అనుగ్రహంతో ముక్తురాలయ్యెను. పతితురాలైన నీలకు చివరిదశలో కర్ణమున దివ్యమణిలాంటి తారక మంత్రమును ఉపదేశించి ముక్తి నొసగెను. కనుక శ్రీకాళహస్తీశ్వరుడేకాక ఆయన అనుమతిలో వారి పరివారదేవతలు కూడా ముక్తిని ఇవ్వగలరు. కోరినది తడవుగా తను, తనపరివారముచేత కూడా మోక్షమును ఇప్పించే శ్రీకాళహస్తీశ్వరుడు ఎంతటి దయామయుడో కదా!

## హరి బ్రహ్మాదృష్టపాదశిరాః 45

హరిశ్చ బ్రహ్మాచ హరి బ్రహ్మాణౌ. నదృష్టే అదృష్టే పాదశ్చ శిరశ్చ పాదశిరసీ హరి బ్రహ్మాభ్యాం అదృష్టే పాద శిరసీ యస్య తథోక్తాః. పురా కల్పాదౌ శంభుః మాయామోహితః విధిః జగత్సృష్ట్యాభితః విలోక్య గర్వావిష్టః విష్ణుం జలధౌ శయానం నిర్బత్స్య తేన సాకం నియుధ్య శస్త్రాస్త్రగణైః భువనాశక్తైః తన్మధ్యే విచిత్రం లింగం ఆవిర్భూతం దృష్ట్వా అస్య శిరోఽవలోక్య ఝుడిత్యాయాస్యామి త్వం మూలం విలోక్య ఆయాహీతి ప్రతిశ్రుత్యాగచ్ఛదితి పురాణం.

పూర్వము శ్రీసదాశివుడు బ్రహ్మను పరీక్షింపగోరి మాయను అతనిలో ప్రవేశింపచేసెను. శివతత్త్వము తెలియని బ్రహ్మ జగత్సృష్టి చేయలేకపోయెను. గర్వితుడైన బ్రహ్మ విష్ణువును సంప్రదించుటకై బయలు దేరగా ఒకచోట అమిత తేజోవంతమైనదియు అనేక శస్త్రాస్త్రములతో ప్రకాశించునదియు పాదము శిరస్సు తెలియనంతగా విశ్వమున వ్యాపించి ఉన్న ఒక ఆకారమును చూచెను. ఆ ఆకారము ఏమై ఉండునా? అని ఎంతగా ఆలోచించిననూ అతని బుద్ధికి అది తోచలేదు. పాలసముద్రములో నిద్రించుచున్న శ్రీహరిని బలవంతముగా లేపి తను చూచిన ఆకారమును చూపించుటకు తీసుకొని వచ్చెను. బ్రహ్మవిష్ణువులు ఎంత ఆలోచించిననూ అమితతేజస్సుతో గూడిన ఆ లింగముయొక్క తత్త్వము, అమూలాగ్రములు తెలుసుకొనలేకపోయిరి. అంతట బ్రహ్మ నేను శిరస్సును తెలుసుకొని త్వరగా వచ్చెదను నీవు మూలమును తెలుసుకొని రమ్మని విష్ణువును పంపెను అని ఒక పురాణ కథ కలదు.

**తద్గర్వపరిహారార్థ ప్రభోధార్థం చ దేవయోః ।**
**మధ్యే సముత్థితం లింగ మైశ్వర్యం తేజసాన్నిధిం ॥**
**జ్వాలామాలావృతం దివ్య మప్రమేయమనూపమం ।**
**యోజనాయతవిస్తీర్ణం స్థితం తద్విమలేంభసి ॥**
**తదా విస్మయమాపన్నౌ పశ్యంతావమరాధిపౌ ।**
**లింగమధ్యే పరం లింగం స్థితం ప్రాదేశసమ్మితమితి ॥**

బ్రహ్మవిష్ణువులను మేలుకొలుపుటకై బ్రహ్మదేవునికి ఉండే గర్వమును పరిహరించుటకై వారిని పరీక్షింపగోరి తేజో పుంజమైన ఒక దివ్యమైన లింగాకారము వారివద్ద వెలసెను. ఆ ఆకారము అనేక దివ్య కాంతులతో వలయాకారపు శ్రేణి కలిగినదై మితిలేకుండగా ఉండునదియు, యదార్థముగా తెలుసుకోలేనిదియు, పోలికలేనిదియు, ఆమడపు (యోజన) దీర్ఘము

కలిగినదియు అంతటి విస్తారమును కలిగి ఉన్నదియు క్రింది భాగము జలములోనూ పైభాగము ఆకాశములోనూ వ్యాపించి ఉన్నందున దివ్య శక్తి సమన్వితులైనప్పటికి వారు ఆశ్చర్యమును పొందిరి.

మలయాచలఖండే । వరాహరూపీ హరిస్సుచిరం తన్మూలమన్విష్యాప్య లభ్యమాన పదస్తూష్ణీ వాస । విధిః హంసరూపీ పక్షౌ వితత్య చతురశీతిసహస్ర వర్షపర్యంతాన్వేషణే నాపి కిమప్యవసానలింగ మనుపలభ్య దూయ మానమనామధ్యే మార్గ మాగతకైతకదళసహాయేనాగతః । తతో మృషావాదినం విధిం కైతకం చ శప్త్వా పునరనుజగ్రాహేతి కథా । అత ఏవా త్ర కాళహస్తీశ్వర గర్భాలయ పూర్వభిత్తౌ తచ్చరితమద్యాఽపి సంధృశ్యతే శ్రు । అథః కస్మాదుచ్యతేఽనంతః యస్మాదుచ్చార్యమాణ ఏవాద్యంత నోపలభ్యతే తిర్య గూర్ధ్వ మధస్తస్మాదుచ్యతేఽ నంత ఇతి । తదుపబృహ్మణం । పాద్మే ।

మలయాచలఖండమున ఈ విధముగా కలదు. వరాహ రూపమును ధరించిన శ్రీహరి చాలాకాలము ఆదివ్యతేజో లింగముయొక్క మూలము వెతికి అది దొరకక ఊరక ఉండెను. బ్రహ్మ హంసరూపమును ధరించి తనరెక్కలను చాపి ఎనభై నాలుగువేల సంవత్సరములు ఆకాశమున వెతికిననూ ఆ దివ్యతేజో లింగము యొక్క చివరను కనుక్కొనలేక తపింపచేయబడుచున్న మనస్సుకలిగినవాడై వెనుదిరిగి వచ్చే మార్గమున మొగిలిపూవు దళమును తోడుగా తెచ్చుకొని వచ్చెను. అటు తర్వాత అసత్యము లాడిన బ్రహ్మదేవుని మొగలిపువ్వును శివుడు శపించెను. పశ్చాత్తాపముతో వారు ఆసదాశివుని శరణు వేడగా ఆయన వారిని అనుగ్రహించెను.

అందువల్ల శ్రీకాళహస్తీశ్వర క్షేత్ర గర్భాలయ పూర్వభిత్తియందు అసత్యమాడినందున బ్రహ్మ శాప వృత్తాంతము ఇప్పటికి కనబడుచున్నది. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరుడు అనంతుడు. అనంతుడనగా ఆది- అంతము అడ్డము పైన క్రింద వ్యాపించి ఉన్నవాడని శ్రుతి చెప్పుచున్నది. దివ్య తేజోలింగముయొక్క సంవృద్ధి, చక్కగా పెరుగుటను పద్మపురాణము చక్కగా వివరించెను.

**హరిః బ్రహ్మ చ భగవాన్ అద్యంతం నోపలబ్ధవాన్ ।**
**తథాఽన్యేచ సురాస్సర్వే తదనంతో హమీరితః ఇతి ॥**

శ్రీమద్భగవత్పాదాశ్చ। ఇదం తే యుక్తం వా పరమశివకారుణ్య జలధే
గతౌ తిర్యగ్రూపం తవ పదశిరోదర్శన ధియా ।
హరిబ్రహ్మాణౌ తౌ భువి దివి చరంతౌ శ్రమయుతౌ
కథం శంభో స్వామిన్ కథయ మమ వేద్యోఽ సి పురతః
తస్మాత్ శ్రీకాళహస్తీశ్వరో హరిబ్రహ్మాదిభిరపి సాహంకారైర్న దృశ్యత ఇతి భావః।

శ్రీఆదిశంకరాచార్యస్వామి పరమ శివుణ్ణి ఇలా ప్రార్థిస్తున్నారు. ఓ పరమశివా! నీవు కారుణ్య సముద్రుడివి గదా! ఇది నీకు తగునా? నీవు దివ్య తేజస్సుతో లింగాకారముగా అవతరించగా నీపాదములను ఒకరు నీ శిరస్సును ఒకరు పక్షిగా మారి ఒకరు వరాహముగా మారి ఇంకొకరు చూడవలెనని మిక్కిలి శ్రమించి భూమి ఆకాశములలో తిరిగిననూ ఓ శంభో మహాదేవా ! వారికే నీదివ్య దర్శనమును చూపలేదు. కనీసం నాకైనా నీ దివ్య సందర్శన సౌభాగ్యము కలుగచేయుదువా? నిజముగా చెప్పవయ్యా! అని ప్రార్థించారు. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరుడుకూడా శ్రీహరి బ్రహ్మాదులను కోపముగా చూడబడలేదు అని భావము. కనుక శ్రీహరి బ్రహ్మాదులు శ్రీకాళహస్తీశ్వరుని పాదశిరస్సులను భక్తితో సేవించినవారే అని అర్థము.

## స్వభూః 46

స్వయం స్వస్మాదేవ భవత్యాఽఽవిర్భవతీతి స్వభూః శ్రు॥ సకారణం కరణాధిపాధిపో న చాస్య కశ్చిజ్జనితా న చాధిపః। ఇతి సోమః పవతే జనితా మతీనాం జనితా దివో జనితా పృథివ్యాః। జనితాఽగ్నేః జనితా సూర్యస్య జనితేంద్రస్య జనితోత విష్ణోరితి॥ సోమస్య సాంబమూర్తేః సర్వజనయితృత్వశ్రుతేః। తజ్జనక శ్రుత్యభావాచ్చ యస్త్వీశ్వరం శాస్త్రాచార్యతో విజ్ఞాయ సముపాస్తే। తస్య హృదయే స్వయం స్వస్మాదావిర్భవతీతి స్వభూరిత్యర్థః। అథవా శ్రీశివ ఏవ సదాత్మకః సన్నపి స్వేచ్ఛయా కల్పాదౌ సర్వరూపేణాభూదితి శ్రుతయః ఆత్మా వా ఇదమేక ఏవాగ్ర ఆసీన్నాన్యత్కించనామిషత్, స ఈక్షత లోకాన్నుసృజా ఇతి. తదేవానుప్రావిశత్ సచ్చత్యచ్చాభవత్ సదేవ సోమ్యేద మగ్ర ఆసీదేక మేవాద్వితీయం. తదైక్షత బహుస్యాం ప్రజాయేయేతి। సద్వితీయ మైచ్ఛత్। సహైతావానాస యథా స్త్రీ పుమాంసౌ సంపరిష్వక్తౌ। స ఇమమేవాత్మానం ద్వేధా పాతయత్తతః పతిశ్చ పత్నీచాభవతామిత్యుపక్రమ్యాంతే తతో మనుష్యా అజాయంత ఇతి వచనైశ్శివ ఏవ నిర్వికల్ప స్సర్వకారణసాంబమూర్తిః భూత్వా పునః సంకల్పేన సర్వాకారోఽభూదిత్యర్థః

శ్రీసదాశివుడు ఆదిదేవుడు. మొదలు తనే ఒంటరిగా ఉండెను. ఆ తర్వాత తన నుండే ఒక శక్తిని పుట్టించెను. ఆ శక్తి పరమేశ్వరుని ఆరాధించి ఆయన అనుగ్రహంతో ఆయన శరీరంలోనే అర్ధభాగమున వెలసినది. తనను ఆరాధించినవార్కి శ్రీసదాశివుడు ఏదైనా ఇవ్వగలడు అనే దాన్కి ఇది ఒక ఉదాహరణము. భగవంతుడు భక్తులకోర్కెలను తీర్చుటకే భూమిపైన వెలెసెను. భక్తులకు తమ మహిమలను చూపవలెననే భావనతో దివ్య దేశములయందు దివ్య తీర్థముల యందును నదీ పరీవాహక తీరములయందును భగవంతుడు వివిధ ఆకారములతో ఆవిర్భావము చెంది భక్తులను అనుగ్రహించు చున్నాడు. మానవుడు పరమాత్మ స్వయముగా వచ్చి నిలిచిననూ నేడు నమ్మడు. కాల ప్రభావము చేత అతీత శక్తులయందు నమ్మకము లేకపోవుటచేత, మూఢమైన అజ్ఞానము మానవుని ఆవరించి ఉన్నందున భగవంతుడు స్వయముగా విగ్రహములుగా భూమిపైన వెలసి మహిమలను చూపి మనిషిని మంచి మార్గమున నడిపించ వలెనని ప్రయత్నించు చున్నాడు. స్వయముగా ఆవిర్భవించి ఉన్నందున అతని స్వభూః అని అందురు. ఒకానొక కారణమును ఉద్దేశించే భగవంతుడు ఆవిర్భవించుచున్నాడు. ఆయన ఆవిర్భావమునకు మరి ఒకరు కారకులు కారు. ఒకరి ఆదేశముపై కూడా భగవంతుడు ఆవిర్భవించడు. సోముడనగా శివుడు అని అర్థము. సోమరూపుడైన శివునిద్వారా బుద్ధి వికాసమును పొందును. ఆయనద్వారా ఆకాశము, స్వర్గము, పగలు, రాత్రి, భూమితో పంచభూతములు సూర్య చంద్రులు గ్రహములు నక్షత్రములు. ఇంద్రాది దేవతలు బ్రహ్మ విష్ణువు అవతరించి ఆయన ఆజ్ఞానుసారముగా తమ పనులను భయభక్తులతో చేయుచున్నారు. అనేక శ్రుతులుకూడా సాంబమూర్తినే అన్నిటికీ ఆధారముగా చెప్పుచున్నవి. శ్రీసదాశివుడు ఎవరివల్ల పుట్టెనో ఆవిషయములను చెప్పే శ్రుతి వాక్యము లేనందున ఆయనే అన్నిటికీ ప్రభువు. ఈశ్వరుని మహత్తును వేదశాస్త్ర పురాణేతిహాస కావ్య ఆగమములు చెప్పుచున్నవి. ఆచార్యుడు గూడా వాటిని శ్రవణ, మనన, నిదిధ్యాసనములను చేసి తను శిష్యులను ఉపదేశించుచున్నాడు. వేదశాస్త్ర పురాణేతిహాసముల మర్మములను ఆచార్యుడు తెలుసుకొని పరమేశ్వరుడు స్వయంభువుడు అని తన శిష్యులకు చెప్పుచున్నాడు. శ్రుతులుకూడా శ్రీసదాశివుడు స్వేచ్ఛగా స్వచ్ఛందముగా సృష్టికి మొదలు ఆయనే అని అన్నీ తానై మారుచున్నాడు అని చెప్పుచున్నవి.

ఆత్మ స్వరూపుడైన పరమేశ్వరుడు సర్వజ్ఞుడు సర్వశక్తి సమన్వితుడు ఆశనాయాది సర్వసంసారధర్మ వర్జితుడు, నిత్య శుద్ధ బుద్ధ ముక్త స్వభావుడు, జరత్వము, మరణము లేనివాడు, భయరహితుడు అద్వితీయుడు, నామరూపకర్మభేదముచేత భిన్నమైన జగత్తు ఆత్మే. జగత్సృష్టికిముందు ఆయన ఒక్కడే ఉండెను. నీటినుండి వచ్చిన నురుగు నీటికన్నా వేరుకాదు కదా. మొదలు నీటిలోనే ఉండి ఆతర్వాత బయటకు వచ్చినది. సృష్టికి పూర్వము నామరూపములు లేని పరమాత్మ సృష్టి అనంతరము అనేక రూపములతో కనపడుచుండెను.

ఆపరమాత్మ ఈ ప్రపంచమును సృష్టిచేసి అందులో తనే ప్రవేశించి ఉండెను. మనముందు కనుపించే ప్రతివస్తువూ పరమాత్మ స్వరూపమే. అది అద్వితీయము. పరమాత్మ చూపు చేతనే అనేక మంది జీవులు ఉద్భవించిరి. అప్పుడు ఒంటరిగాఉన్న ఆపరమాత్మ రెండవదానినికోరెను. తద్వారా సృష్టి ప్రారంభించెను. ఇటువంటి ఉపనిషద్వాక్యముల ద్వారా పరమశివుని నిర్వికల్పత్వము సర్వకారణత్వము. తన సంకల్పముచేతనే సమస్త ప్రపంచమును సృజించెను అని చెప్పెను.

### మృడః 47

**మృడయతి సుఖయతి స్వజనానిత్యర్థః**

మరణములేని వాడని సంతోష పెట్టువాడని, ఆనందస్వరూపుడని అర్థము. ఆయన భక్తులను ఆనందింప చేయువాడని అర్థము.

### పంచాక్షరాకారః 48

పంచ అక్షరాణి యస్య స పంచాక్షరః । మంత్రరాజః సకలనిగమాగమసారభూతమంత్రః ఏవ ఆకారః మూర్తిః యస్య సః పంచాక్షరాకారః । స్కాందే –

**పంచాక్షరస్య మహాత్మ్యం వర్షకోటి శతైరపి ।**
**న శక్యం కథితుం దేవి! తస్మాత్సంక్షేపతః శ్రుణు ॥ 1-85-6 (లింగపురాణము)**

**పంచాక్షర ప్రభావేణ లోకాః దేవాః మహర్షయః ।**
**తిష్ఠంతి శాశ్వతాఃధర్మాః జగదేతచ్చరాచరం ॥ 1-85-27 ('')**

**అల్పాక్షరం మహాసారం మహార్థం తద్వియుక్తిదం ।**
**వేదసిద్ధ మసందిగ్ధ వాక్యమేతచ్ఛివాత్మకం ॥**
**మంత్రం సుఖముఖోచ్చార్యమశేషార్థ ప్రదాయకం ।**
**తద్బీజం సర్వ విద్యానామాద్యం దేవి! షడక్షరం ॥**
**జ్ఞేయో మంత్రాద్గుణాతీతః సర్వజ్ఞః సర్వకృత్ప్రభుః ॥**
**సూక్ష్మ పంచాక్షరే మంత్రే పంచాక్షర తనుః శివః ।**
**వాచ్య వాచక భావేన స్థితః సాక్షాన్మహేశ్వరః ॥**
**ఇమం మంత్రం జపన్ దేవి జీవన్ముక్తో న సంశయః ।**

ఇతి. వచనాత్ పరమేశ్వరస్య పంచాక్షరాకారత్వం లోకశాస్త్రప్రసిద్ధమేవేతి భావః

పంచ అక్షరములు కలిగిన మహామంత్రము శివపంచాక్షరి. అకార, ఉకార, మకార, నాద, బిందువులతో కూడినది. పంచతత్త్వములకు ప్రతీకగా పంచాక్షరములు కలవు. తదాకారస్వరూపుడు శ్రీకాళహస్తీశ్వరుడు.

**జపాదేవ న సందేహః వ్రతానాం వై విశేషతః ।**
**పంచక్షరాత్పరం నాస్తి పరిత్రాణం కలౌ యుగే ॥**

కలియుగమున మానవులు ముక్తిని పొందుటకు శివపంచాక్షరీ జపము, శివారాధన కాక మరి ఒక సాధనము మార్గము లేదు.

సర్వవ్రతేషు సంపూజ్యం దేవదేవము మాపతిం ।
జపేత్పంచాక్షరీ విద్యాం విధినైవ ద్విజోత్తమాః ॥
తస్మిన్ వేదాశ్చ శాస్త్రాణి మంత్రే పంచాక్షరే స్థితాః ॥
వాచ్యః పంచాక్షరైః దేవి శివః త్రైలోక్య పూజితః ।
వాచకః పరమో మంత్రః తస్య పంచాక్షర స్థితః ।
సర్వశ్రేష్ఠతమోఽయం తు మంత్రః పంచాక్షరం శంభోః
విధినా విధినా జప్తః స్యాచ్ఛివసాయుజ్యదోఽస్మాకం ॥

అన్ని వ్రతముల కన్నా ఉమాపతి వ్రతమే చాలాగొప్పది. పంచాక్షరీ విద్యను బ్రహ్మచేత అనుష్ఠింపబడినది, ఆమంత్రములో వేదములు శాస్త్రములు, ఆగమ రహస్యములు కలవు. పంచాక్షరీ మహామంత్రము చేత పరమ శివుణ్ణే త్రైలోక్యవాసులు పూజించుచున్నారు. శివపంచాక్షరీ జపము చేతనే శ్రీసదాశివుడు మనకు ముక్తిని ఇచ్చుచున్నాడని లింగపురాణమున పూర్వభాగము 85 అధ్యాయమున చెప్పెను.

ఈ పంచక్షరీ మహామంత్రముయొక్క మహిమను ఒకకోటి సంవత్సరములు చెప్పిననూ తరగని మహిమ కలిగినది. అందువల్ల ఆమంత్ర ప్రభావమును సంగ్రహముగా చెప్పెదనని పరమశివుడు పార్వతీ దేవితో చెప్పెను. పంచాక్షరప్రభావముచేత సర్వలోకవాసులు దేవతలు మహర్షులు ముక్తిని పొందు చున్నారు. చరా చర ప్రపంచమున ధర్మము శాశ్వతముగా నిలుచుటకు ఆమంత్ర ప్రభావమే కారణము. ఆమంత్ర రాజము సారవంతమైనది. గొప్పదైన అర్థమును ఇచ్చునదియు, విశేషమైన ఫలము ఇచ్చునదియు, అల్పాక్షరములతో శాశ్వతమైన ముక్తిని ఇచ్చునదియు, ఈ మంత్రానుష్ఠానము చేత వేదాధ్యయనఫలము లభించును. ఈ మంత్రము పరమశివుని తత్త్వమును ఉపదేశించును. ఈ పంచాక్షరీ మంత్రమును స్పష్టముగా ఉచ్చరించిన విశేషార్థములు, విశిష్టమైన ఫలములను ఇచ్చును. ముందుగా ఉచ్చరించే ప్రణవము ఈ మంత్రమునకు బీజ భూతమైనది. పంచాక్షరిలో పరమ శివుడే గోచరమగును. భక్తి శ్రద్ధలతో ఈమంత్రమును జపించినచో జీవన్ముక్తుడగుటలో సందేహము లేదని సాక్షాత్ పరమశివుడే పార్వతితో చెప్పినందున ఫలము విషయమున సందేహించుటకు అవకాశమే లేదు. కనుక శ్రీకాళహస్తీశ్వరుడు పంచాక్షరీ మంత్రస్వరూపుడు. ప్రత్యక్షసాక్షియైన శ్రీకాళహస్తీశ్వరుని పంచాక్షరీ మహామంత్రముతో ధ్యానించి మనము జీవన్ముక్తులగుదుము.

## దుర్గాహిమ రుచి ప్రదః 49

శ్రీదుర్గాదేవిని - ఉమేతి కేచిదాహుస్తాం శక్తిం లక్ష్మీం తథాపరే ।
భారతీత్యపరే చైనాం గిరిజేత్యంబికేతి చ ॥
దుర్గేతి భద్రకాలీతి చండీ మాహేశ్వరీతి చ ।
కౌమారీ వైష్ణవీ చేతి వారాహీ చ తథాపరే ॥
బ్రాహ్మీతి విద్యాఽవిద్యేతి మాయేతి చ తథా పరే ।
ప్రకృతిశ్చ పరాచేతి వదంతి పరమర్షయః ॥
ఈవిధముగా చెప్పుచున్నారు. ఐననూ ఈ దుర్గాదేవి :-
మాహైకా భిన్నరూపేణ కమలాఖ్యా సరస్వతీ ।
సావిత్రీ సాచ సంధ్యా చ భూతకార్యస్య భేదతః ॥
నశివేన వినా దేవీ దేవ్యా చ న వినా శివః ।
నైతయోరంతరం నాస్తి చంద్ర చంద్రికయోరివ ॥
ప్రళయే జలదుర్గాఽపి సర్గాదౌ గిరి విస్తృతిః ।
ఇదానీం స్థల దుర్గాఽపి దుర్గా! త్వం సద్గుణార్ణవే ॥

## దుర్గాహేమ రుచి ప్రదః

వివిధ దేవీ స్వరూపములలో శ్రీదుర్గాదేవికి ప్రముఖ స్థానము కలదు. "దుఃఖేన గంతుం శక్యతే ఇతి దుర్గ" సంసార విషవలయమును త్రుంచి మోక్షతరుణోపాయము కూర్చునది దుర్గాదేవి. 'దుర్గం, వన, గిరి, రూపమావాసో యస్యాః సా దుర్గా' వనాదులు దుర్గమే నివాసముగా కలిగినది దుర్గ. ఆమె నివాసమున ఉండే దుష్టశిక్షణ, శిష్టరక్షణ చేసి సకల లోకకళ్యాణము చేకూర్చునదియు సకల దుఃఖోప శమనమును చేయునది మహాశక్తి దుర్గ. శత్రువుల మధ్యన విషమమైన రణ, సంకటములను అశుభములను దుఃఖములను భయమును పోగొట్టి రక్షించుశక్తి శ్రీదుర్గాదేవికి మాత్రమే ఉన్నది.

**అగ్నినా దహ్యమానస్తు శత్రుమధ్యే గతో రణే ।**
**విషమే దుర్గమే చైవ భయార్తాః శరణం గతాః ॥**
**న తేషాం జాయతే కించిత్ అశుభం రణ సంకటే ।**
**నాపదం తస్య పశ్యామి శోకదుఃఖ భయం నహి ।**
**దుర్గమడు లేక దుర్గమాసురుని సంహారము చేసిన స్వాధిష్ఠాన మహాశక్తి శ్రీదుర్గాదేవి.**
**ప్రథమం శైల పుత్రీతి ద్వితీయం బ్రహ్మచారిణీ ।**
**తృతీయం ఛన్దఘంటేతి కూష్మాండేతి చతుర్థకం ॥**
**పంచమం స్కంద మాతేతి షష్ఠం కాత్యాయనీతి చ ।**
**సప్తమం కాలరాత్రిశ్చ మహాగౌరీతి చాష్టకం ॥**
**నవమం సిద్ధిదా ప్రోక్తా నవదుర్గాః ప్రకీర్తితాః ।**
**గణేశజననీ దుర్గా తథా లక్ష్మీ సరస్వతీ ।**
**సావిత్రీ చ సృష్టి విధౌ ప్రకృతిః పంచధా స్మృతః ॥**
**శ్రీదుర్గాదేవి సకల జీవరాశి మనోగత దుఃఖ విషవలయ విచ్ఛేదనమును చేయును.**

దుఃఖేనాఽపి గంతు మశక్యా దుర్గా । కాళీత్యర్థః । యద్యపి దుర్గా కాళ్యోర్లక్షణభేదోఽస్త్యేవ। "సింహ స్థితాం ససురసిద్ధనతాం చ దుర్గాం దూర్వానిభాం ధురితవర్గ హరాన్న మామీతి" । దుర్గాయాశ్శ్యామల వర్ణత్వం కాళ్యాః కృష్ణ వర్ణత్వం చ ప్రసిద్ధం । తథాపి శూలినీదుర్గాయాః కృష్ణవర్ణత్వం దృశ్యతే । బిభ్రాణాశూలబాణాన్యరిసదరగదాచాప పాశ్యాకరాబ్జై ర్మేఘశ్యామా కిరీటోల్లసితశశికలాభీషణా భూషణాఢ్యేతి ।

శూలినీదుర్గాయాః కృష్ణవర్ణత్వేన కాళీతి నామాంతరం భవేత్ । తస్యాదుర్గాయాః హేమ్నః తప్తజాంబూనదస్య రుచిమివ రుచిం కాంతిం ప్రకర్షేణ దదాతీతి తథోక్తః । అత్ర గిరిజా దేవీ దేవముద్దిశ్య తపస్యంతీ సముద్రోన్మీలనం దృష్ట్వాబిభ్యతీ సతీ దుర్గాం సస్మార । సాప్యాగత్య సముద్రజలం హస్తే నియమ్య హస్తాత్త సాగరేతి శంభుదత్తవరం ప్రాప్య అద్యాఽపి కనకాచలే విరాజమానా స్వకాళీత్వ లోకభీషణం సంత్యజ్య శివవరదానేన హేమరుచిం అవాపేతి కథా ।

అతి కష్టములచేతనైనను పొందుటకు (వెళ్ళుటకు) వీలులేని వాటిని, సంపాదించినదియు, ఆ స్థలములకు వెళ్ళగలిగినది దుర్గాదేవి మాత్రమే. దుర్గకు కాళికకు కొద్ది తేడా మాత్రమే కలదు. స్వరూప స్వభావములలో కొంచెము భేదము కలదు. శ్రీదుర్గాదేవి సింహాసనాసీనురాలైనదియు సకలదేవతలచేత సిద్ధులచేత, యోగులచేత, స్తోత్రములు చేయబడుచున్నదై, భక్తుల సకలపాపములను హరించివేయునదియు గరిక వంటి లేతనైన

శరీరము కలిగినదైన శ్రీదుర్గాదేవికి అనేక నమస్కారములు. శ్రీదుర్గాదేవి నలుపురంగుతోను శ్రీకాళికాదేవి నీలి రంగుతోను ఉండుట జగత్ప్రసిద్ధము. ఐనప్పటికి శ్రీశూలినీదేవి నీలిరంగుతోనూ శ్రీదుర్గాదేవికి కృష్ణవర్ణత్వము (నీలిరంగు) కనబడుచున్నది. ఐతే ఒక శ్లోకమున శ్రీదుర్గాదేవిని ప్రార్థిస్తూ ఆమె శూలమును బాణమును అందమైన ముఖముతో గదను చాపమును పాశమును, కమలములను చేతులతో ధరించినదై నల్లని మేఘముల వలె అందమైన ముఖము కలిగినదై అనేకాలంకారములతో ఆభరణములతో అనేక రత్నములచేత ప్రకాశించే కిరీటము కలిగినదై శిరస్సున చంద్రుని రేఖను ధరించి ఉన్నట్లున్నది. శ్రీశూలినీదేవి శ్రీదుర్గా దేవి కృష్ణ వర్ణముతో కలిగి ఉన్నందున ఆమెనే శ్రీకాళికాదేవి అని కొందరు పిలిచెదరు. ఆ దుర్గాదేవియొక్క శరీరకాంతి మెరుగు పెట్టిన బంగారపు కిరణములవంటి కిరణములతో మిక్కిలి ప్రకాశించుచున్నది అని అర్థము. ఇచట హిమవంతుని కుమార్తె ఐన శ్రీగిరిజాదేవి దేవదేవుడైన పరమేశ్వరుని ధ్యానించుచూ సముద్రములో తను వికసించుట చూచి భయుడినవై శ్రీదుర్గాదేవిని స్మరించెను. అంతట ఆమె అచటికివచ్చి ఆ సముద్ర జలములను చేతిలో నియమించి ఆసాగర జలములనుండి శ్రీదుర్గాదేవిని రక్షించెను. శ్రీసదాశివుని చేత వరములను పొందినదై ఇప్పటికి కూడా కనకాచలమునందు ప్రకాశించుచూ, ముల్లోకములను భయపెట్టే తన స్వభావమును విడిచిపెట్టి శ్రీసదాశివుని వరప్రభావముచేత బంగారు రంగును పొందెను. అనేకథ ఒకటి కలదు.

శ్రీకాళహస్తీశ్వరుని అనుగ్రహంతో తనను కొలిచి వెళ్లే భక్తులకు స్వర్గముఖీనదీ తీరమున బంగారము లభించునని ఒక కథకూడా ప్రచారమున కలదు. శ్రీస్వామి అనుగ్రహంతో ఆరోజుకు సరిపోయే ఆహారము వారికి లభించేదని కథ ఒకటి కూడా కలదు. మోక్ష ప్రదాత ఐన శ్రీకాళహస్తీశ్వరుడు తన భక్తులకు బంగరు జీవనమును కూడా ఇవ్వగలడు.

## అనంతకల్యాణ గుణః 50

న విద్యతే అంతో యేషాంతాన్యనంతాని । కల్యాణాని శోభనాని చ । అనంతకల్యాణ రూపాః గుణాః అస్యైవ సంతీతి అనంత కల్యాణ గుణః । నను గుణాతీతస్య శివస్య అపరిచ్ఛిన్నాః కల్యాణగుణాః కేతే ఇత్యత ఆహ పరమార్థతో నిర్గుణోపీశ్వరస్సర్గసమయే లోకానుగ్రహార్థం స్వీకృతమాయ స్సన్నివ పంచకృత్యం కురుతే ఇతి శాస్త్రం । తథా చాభియుక్తాః । గుణాతీతోఽపి త్వం సగుణ ఇవ మాయాశబలితః పరిష్కుర్వన్ సాంబం వపురసితకంఠం త్రినయనమితి నిర్గుణమేవ వస్తువ్యవహారే సగుణమివ భవతీత్యర్థః ॥

అంతము దేనికైతే లేదో అది అనంతము. అనంతమనగా విశ్వమంతటా వ్యాపించి ఉన్నదని భావము. వస్త్ర భూషణాదుల చేత సుందరమైన కాంతికలిగినది శోభనత్వము. కల్యాణ మనగా మంగళరూపాభిప్రేరితార్థ సిద్ధి. అనంతమైన కల్యాణ రూప గుణములు కలిగినవాడు. శ్రీకాళహస్తీశ్వరుడు కనుక ఆయన అనంత కల్యాణ గుణరూపుడు.

గుణములకు అతీతుడైన శ్రీసదాశివునకు ఆ గుణములు కప్పబడినదియు, చుట్టుకొనబడినదియు కాని కల్యాణ గుణములు ఏవి అని ప్రశ్నించినచో అవి అనంతరూపములు. కానీ నిజముగా శ్రీసదాశివుడు నిర్గుణుడు. సృష్టి సమయమునందు సర్వ లోకవాసులను శ్రీ సదాశివుడు అనుగ్రహించుటకు పాంచభౌతికమైన సృష్టిని చేయు చున్నాడని శాస్త్రము చెప్పుచున్నది. హే! కాళహస్తీశ్వరా! నీవు సకల గుణములకు అతీతుడవు. కానీ మమ్ములను

అను గ్రహించుటకై వరాయుతో గూడి నీవు సగుణుడవైతివి. తెల్లనైన కంఠము కాక (నీలకంఠుడు) మూడు నేత్రములతో సాంబశివుడవై భక్తులను అనుగ్రహించుచున్నావు. పారమార్థికముగా నీవు నిర్గుణుడవైననూ వ్యావహారికముగా సగుణరూపమును ధరించితివి.

తస్య గుణాస్తు అంగావ్యయాదయః అంగాని ।
సర్వజ్ఞతా తృప్తి రనాదిబోధస్స్వతంత్రతా నిత్యమలుప్తశక్తిః ।
అనంతశక్తిశ్చ విభోర్విధిజ్ఞాష్షడాహు రంగాని మహేశ్వరస్యేతి ।
ఏతేషామంగానాం శైవషడక్షరస్య న్యాసే వినియోగః కథ్యతే ।

ఓం హ్రాం । సర్వజ్ఞశక్తిధామ్నే అంగుష్ఠాభ్యాన్నమఇత్యాది ఆగమే । ఐశ్వర్యస్య సమగ్రస్య వీర్యస్య యశసశ్శ్రియః । జ్ఞాన వైరాగ్యయోశ్చైవ షణ్ణాం భగఇతీ రణాదితి । వాచస్పతిమిశ్రాశ్చ ।

**షడ్భిరం గైరుపేతాయ వివిధైరవ్యయైరపి ।**
**శాశ్వతాయ నమస్కుర్మో వేదాయ చ భవాయ చేతి ॥**
**తథా । అవ్యయగుణాశ్చ దశపూర్వోక్త గుణచ్ఛాయా అపి పార్థక్యేనో దాహ్రి యంతే । ఆగమే ।**
**జ్ఞానం విరాగితైశ్వర్యం తపస్సత్యం క్షమా ధృతిః ।**
**స్రష్టృత్వమాత్మసంబోధో హ్యధిష్ఠాతృత్వమేవచ ।**
**అవ్యయాని దశైతాని నిత్యం తిష్ఠంతి శంకర ఇతి ।**
**తస్మాదనంతకల్యాణ గుణః శ్రీమద్దక్షిణ కైలాసవాసీ నః కల్యాణం కలయత్విత్యర్థః**

శ్రీకాళహస్తీశ్వరుని గుణములే అంగములు. ఆ అంగములు తరిగిపోనివి. ఆయనకున్న సర్వజ్ఞత్వము. అనాదికాలమునుండి బోధకుడుగా అనేక తంత్ర మంత్ర రహస్యముల చెప్తూ సర్వతంత్రస్వతంత్రుడై తరగని మహిమలు, లోపించని శక్తి కలవాడుగా విరాజిల్లు చుండెను. శ్రీకాళహస్తీశ్వరా! నీవు అనంతశక్తి సమన్వితుడవు, సర్వవ్యాపకుడవు, కాలతత్త్వము తెలిసిన వాడవు నీవే. మహేశ్వరునికి ఆరు అంగములు కలవు. ఈ అంగములు శైవషడక్షరీ మహామంత్రమునకు న్యాసముగా చెప్పుచున్నారు. అంగన్యాసమును ఓం హ్రాం సర్వజ్ఞ శక్తిధామ్నే అంగుష్ఠాభ్యాంనమః అని ప్రారంభించి ఆగమమున చేయుచున్నారు. వాచస్పతి మిశ్రులు సమగ్రమైన ఐశ్వర్యమునకు, వీర్యమునకు సంపత్తుకు, యశస్సుకు, జ్ఞాన వైరాగ్యములకు, శైవషడక్షరీ జపమే మూలము అని చెప్పిరి. ఆరు అంగములతో గూడినదియు, భవుడుగా శాశ్వతుడుగా వేదవేద్యుడుగా ఉన్న ఆ శ్రీకాళహస్తీశ్వరునికి అనేక నమస్కారములు. శంకరునియందు జ్ఞానము, విరాగిత్వము, ఐశ్వర్యము తపస్సు, సత్యము క్షమా ధృతి, స్రష్టృత్వం ఆత్మ సంబంధము అధిష్ఠాతృత్వము అవ్యయత్వము మొదలగునవి పది గుణములు నిత్యముగా ఉండును. అందువల్ల అనంతకోటి కల్యాణ గుణములుకల కైలాస నివాసుడై ఇచట వెలసిన శ్రీకాళహస్తీశ్వరుడు మాకు అనేక మంగళ పరంపరలను ఇచ్చుగాక.

## నీలా కైవల్యకారణం 51

మునిశాపహతాయా అగస్త్యానుగ్రహప్రాప్త శ్రీసమ్మోహ భైరవమంత్ర జపధ్యాన సక్త మానసాయాః కస్యాశ్చిత్ నీలానామ్న్యాః ద్విజస్త్రీయాః కైవల్యస్య కైవలీభావస్య స్వాత్మైకత్వస్య బోధస్య కారణం హేతుర్భవతీతి నీలా కైవల్యకారణం । మూలపురాణే । శ్రీభైరవవచనం ।

**త్వయా సహ వసామ్యత్ర మంత్రస్యాస్య ప్రభావతః**
**అనుభూయ ద్విఘటికా మాత్రాం మత్కృతయాతనాం ।**
**శివస్తోత్రజపాదంతే ముక్తిస్తవ భవిష్యతీతి ।**

కథమస్యాః ద్విఘటికామాత్రేణ కర్మ క్షీయతే । ఇత్యాదిప్రశ్నోత్తరం మణికర్ణ మంత్ర ప్రస్తావ ఏవోక్తత్వాన్నాత్రావసరః । నీలావృత్తాంత కథనేనైవ సర్వేషాం కాశ్యాది క్షేత్రేషు మనుష్యాణాం మరిష్యతాముక్తన్యాయః స్వీకర్తవ్యః ॥

నీలాదేవి వృత్తాంతము శివః (100 పేజీలో) అనే నామములో నారదమహర్షి స్త్రీగా మారిన వృత్తాంతము తర్వాత వచ్చినది. నీలా అనే స్త్రీ వందమంది బ్రహ్మ నిష్ఠులను అవమాన పరిచినది. ఆ ఫలితముగా పిశాచముగా తిరుగు చున్నంతలో కుంభసంభవుడై మహామహిమాన్వితుడై సప్త ఋషులలో అగ్రగణ్యుడైన శ్రీ అగస్త్య మహాముని చేత అనుగ్రహింపబడినదై భైరవుణ్ణి ఉపాసించి ముక్తిని పొందినది అని పై నామములో ఉన్నది.

ముని శాపములచేత తప్పురాలై స్వేచ్ఛా విహారిణియై ఉండగా శ్రీ అగస్త్యమహామునిచే అనుగ్రహింపబడి సమ్మోహన భైరవ మంత్ర జపధ్యానాసక్తమైన మనస్సుచేత ఆమెకు పరిణామము కలిగినది. నీలాదేవి బ్రాహ్మణస్త్రీ. ఆమె తన పూర్వపు క్రౌర్యమును వదలి సాత్విక స్వభావమును అలవరుచుకొని శ్రీఅగస్త్య మహామునిచేత అనుగ్రహింపబడి శ్రీసదాశివునియందు పరమభక్తిని అలవరచుకొనుటే ఆమె కైవల్యమునకు కారణము. మూల పురాణమున శ్రీభైరవుని మాటలు ఇట్లు ఉన్నవి. నీతో ఈ మంత్ర ప్రభావము చేత ఇచట నేను ఉండగలను. రెండు ఘడియలు నేను పెట్టే తీవ్ర వేదనను అనుభవించి, శివస్తోత్రములు శివ ధ్యానజపములు చేయుగా, శివానుగ్రహంతో నీకు ముక్తి లభించును అని భైరవుడు చెప్పెను. ఐతే ఇచట రెండు ఘడియలలో అనేక జన్మ సంచితమైన కర్మ క్షయమును పొందునా? ఇటువంటి ప్రశ్నలకు సమాధానము మణికర్ణికా మంత్ర ప్రస్తావనచేత అచటనే విపులముగా చెప్పబడినది కనుక మరలా ఇచట చెప్పుట అనవసరము. ఈ నీలా వృత్తాంతముచేత అందరికి వారణాశి క్షేత్రమున మరణించిన వారికి విశ్వనాథుడు తారక మంత్రమును ఉపదేశము చేసి ముక్తిని ఇచ్చుచున్నాడను విషయము సర్వ జనవిదితము. అట్లాగే పరమభక్తులైన వారు శివసాన్నిధ్యములో మరణించినను పుణ్యమే గదా! వారికికూడా మోక్షము వచ్చునని ఇచట గమనించవలెను. వారణాశి మరణ న్యాయము ఇచటకూడా అనుసరించును.

## లింగోద్భవః 52

లింగం చేతనాచేతనరూపాస్సర్వే పదార్థాః తస్మాదేవోద్భవంతి అస్మిన్నేవ లయం గచ్ఛంతీతి లింగం సర్వాధారత్వాత్ । సర్వ కారణత్వాచ్చ లింగమిత్యర్థః । తథాచ । శివధర్మే శ్రీనందికేశ్వరః

ఆకాశం లింగమిత్యాహుః పృథివీ తస్య పీఠికా ।
ఆలయస్సర్వభూతానాం లయనాల్లింగముచ్యతే ॥
కల్పాంతే లీయతే బ్రహ్మన్ జగదేతచ్చరాచరం ।
దక్షిణే లీయ తే బ్రహ్మా వామతశ్చ జనార్దనః ।
హృదయే చైవ గాయత్రీ లీయతేఽఖిల వేదభూః ।
పునరుత్పద్యతే యస్మా ద్బ్రహ్మాద్యం స చరాచరం ॥
లింగమిత్థం ప్రతిష్ఠాప్య సర్వం స్యాత్సుప్రతిష్ఠితమితి ।

ఏవంభూతాల్లింగాత్ ఉత్ ఊర్ధ్వం భవతి ఆవిర్భవతీతి లింగోద్భవః బహుష్వవసరేషు దేవో మహాలింగాదావిర్భూయ స్వజనాననుగృహ్ణాతీతి దృశ్యతే హి అత్రాఽపి శ్రీకాళహస్తి స్థలే విజయభీమమయూరాదీన్ స్వేష్ట లింగాదావిర్భూయ రరక్షేతి కథా విజ్ఞేయా అథవా । అష్టమూర్తేశ్శివస్యాతి సన్నిహితాః పంచ వింశతి మూర్తయస్సంతి । తాసు ప్రాథమ్యేన లింగోద్భవ మూర్తేర్గణనాత్ । సా లింగోద్భవా మూర్తిర్నః పాత్విత్యర్థః । యద్వా లింగ చిత్రీకరణే ఇతి ధాతోః సృష్ట్యాది పంచకృత్యైః చిత్రీ కరోతీతి పారమేశ్వరం తేజ ఏవాభిధీయతే తదభివ్యక్తి స్థానశిలాదిద్రవ్యం ఉపచారాల్లింగముచ్యతే । తథాచాగమే ।

లింగితం చిత్రితం యేన జగత్కృత్యైస్తు పంచభిః ।
తత్తేజశ్శాంభవం లింగం భాక్తం తద్వ్యక్తి భూమికమితి ।
తస్మాత్ శాంభవం తత్తేజోలింగం మద్హృది సదా భాత్విత్యర్థః ॥

చేతనము అచేతనములుగా లోకమున కనిపించే అన్ని వస్తువులు లింగాకారుడైన శ్రీ పరమేశ్వరుని నుండి పుట్టి పరమేశ్వరునిలో అంతరించి ఉన్నవి. కావున లింగాకారుడైన పరమేశ్వరుడే అన్నిటికీ, అందరికి ఆధార భూతుడు. అన్నిటికి ఆయనే కారణ భూతుడైనందున భూమిమీద శ్రీపరమేశ్వరుడు లింగాకారుడుగా వెలసెను. శివధర్మమనే గ్రంథమున శ్రీనందికేశ్వరుడు ఈవిధముగా చెప్పెను. లింగాకారుడైన శ్రీపరమేశ్వరుడు ఆకాశమువరకు వ్యాప్తిచెంది ఉండెను. భూమి ఆయనకు కూర్చునే ఆసనము. సర్వ భూతములు ఆయనలో నివాసముండును. సర్వభూతములను సమస్త ప్రపంచమును తనలో లయముచేసుకొనువాడు గనుక పరమేశ్వరుడు లింగాకారుడుగా అవతరించెను. లింగా కారుడైన పరమేశ్వరునకు దక్షిణ భాగమున బ్రహ్మదేవుడు వామ భాగమున శ్రీహరి వెలిసి ఉండెను. హృదయమున గాయత్రీదేవి, షడంగోపేతమైన వేదవిద్య ఆయనలో కలదు. శ్రీపరమేశ్వరాజ్ఞతో బ్రహ్మదేవుడు పరమేశ్వరుడు లయముచేసిన దానినే మరలా సృష్టి చేయుచున్నాడు. కనుక లింగ ప్రతిష్ఠాపనలో అన్నీ అచట ఉండగలవు.

చాలా సందర్భములలో శ్రీసదాశివుడు లింగమునుండే ఆవిర్భవించి తనభక్తులను అనుగ్రహించు చున్నాడు. శ్రీకాళహస్తీశ్వరుడుకూడా లింగాకారుడుగా ఉండి అనేక భక్తులను రక్షించెను. విజయుడు, భీముడు, మయూరుడు మొదలగు వారు శ్రీకాళహస్తీశ్వరుని

సేవించి తమకోర్కెలను తీర్చుకొనిరి. శ్రీపరమశివుడు అష్టమూర్తిగా వెలసెను. (అష్టమూర్తులనగా పంచభూతములు సూర్యచంద్రులు పురుషుడు అని అర్థము) పరమశివుడు పంచవిధ శక్తులతో కూడుకొని విశేషముగా గోచరించుచున్నాడు. ఆ శక్తులు - చిచ్ఛక్తి, ఆనంద శక్తి, ఇచ్ఛా శక్తి, జ్ఞాన శక్తి, క్రియా శక్తి అని, తత్త్వములుగా. శివతత్త్వము, విద్యాతత్త్వము, ఆత్మ తత్త్వము అని తత్త్వములు మూడు, ఇందులో శివతత్త్వము రెండు విధములు. విద్యాతత్త్వము మూడు విధములు ఆత్మ తత్త్వము 31 విధములు పరమశివునకు సృష్టి సంకల్పము కలుగగానే శివరూపము, శక్తి రూపము సిద్ధమైనవి. శివుడు ప్రకాశ రూపుడు. శక్తి విమర్శ స్వభావమును కలిగినది. అది పరిపూర్ణము అప్రతిమము ఐనది. శాక్త తంత్రములో శైవ తంత్రములో గూడా తత్త్వములు 36. అవి, శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధవిద్య, మాయ, కల, విద్య, రాగ, కాల, నియతి, పురుష, ప్రకృతి, బుద్ధి, అహంకారమును, మనస్సు, శ్రోత్రము, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణ, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, ఆకాశ, వాయు, అగ్ని, జల, భూమి మొదలగునవి కలవు. లింగోద్భవ మూర్తిః నన్ను రక్షించుగాక. అన్నిటికన్నా లింగోద్భవమూర్తే ప్రథముడు. లింగమును చిత్రీకరించుటలో అచల మునకు పరమేశ్వరుని తేజస్సే కనబడును. ఆరాధన సాకారముగా కావల్సి ఉన్నందున లింగమూర్తికే అనేక ఉపచారములు చేయుచున్నారు. ఆగమములలో కూడా తేజస్వరూపుడై అర్చామూర్తికే అనేక ఉపచారములు ఉత్సవములు చెప్పబడినవి. శంభువు అనగా అమితమైన సుఖములను కలిగించేవాడు. అటువంటి శ్రీశివమూర్తి నా హృదయమునందు ఎల్ల వేళలా ప్రకాశించుగాక.

## విద్యారాశిః 53

విద్యా అపరవిద్యా ఋుగాద్యాః । తత్ర। శ్రు। తత్రా పరా ఋుగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వవేద శ్శిక్షాకల్పోవ్యాకరణం నిరుక్తం ఛందోజ్యోతిషమితి । తాసాం రాశిస్సమూహో యత ఏవావిర్భావో యత్ర పునర్లీయతే । స విద్యారాశిః । అథవా । వాత్సాయనతంత్రాద్యాః ఉపనిషత్పర్యం తాస్సర్వా విద్యాః ప్రలయేష్వత్యేత్రభావాత్ । అస్మిన్నేవ రాశీ భవంతీతి విద్యారాశిః । తథాచ శివధర్మే ।

**యదాద్యమైశ్వరం జ్యోతిర్లింగం తద్బ్రహ్మసంజ్ఞితం ।**
**కల్పాంతే తస్య మూలే తు లీయంతే సర్వదేవతాః ॥**
**లీయంతే మూర్ధ్ని వై వేదా స్సషడంగపదక్రమాః ।**
**జఠరే లీయతే సర్వం జగత్స్థావరజంగమం ।**
**ఉత్పద్యతే జగత్తస్మా ద్బ్రహ్మాద్యం స చరాచరమితి ॥**

యథా ఘటాద్యుద్భవస్య యయోర్మృదేవ కారణం । తథా వేద దేవలోకాది కారణం శివ ఏవేతి । శ్రు । అస్య మహతో భూతస్య నిశ్వసిత మేతద్యదృగ్వేదో యజుర్వేద స్సామవేదోఽథర్వవేద శ్శిక్షాకల్పోవ్యాకరణం నిరుక్తం ఛందోజ్యోతిష మితి । తథాచ వేదభాష్యకారాః ।

**యస్య నిశ్వసితం వేదా యో వేదేభ్యోఽ ఖిలం జగత్ ।**
**నిర్మమే తమహం వందే విద్యాతీర్థం మహేశ్వరిమితి ।**
**స విద్యారాశిరీశ్వరః మహ్యం మేధాం దిశతు ॥**

విద్య అనగా చదువు, జ్ఞానము, తత్త్వసాక్షాత్కారము. జ్ఞానమునకు హేతువగు వేదాది గ్రంథములు అని అర్థము. ఇవి నాలుగు రకములు. 1. ఆన్వీక్షకీ, త్రయీ, వార్త, దండనీతి. 2. ఆరువిధములైన విద్యలు కలవు. అవి ఆకర్షణము, స్తంభనము, మారణము, విద్వేషణము ఉచ్చాటనము, మోహనము. 3. చతుర్దశవిద్యలు: ఋగ్వేదము, యజుర్వేదము, సామవేదము, అథర్వణవేదము, శిక్ష, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము, జ్యోతిషము, కల్పము, న్యాయము (తర్క శాస్త్రము) మీమాంస, పురాణము, ధర్మ శాస్త్రము. 4. అష్టాదశ విద్యలు. పై పదునాలుగు విద్యలతో పాటుగా ఆయుర్వేదము, ధనుర్వేదము, నీతి శాస్త్రము, అర్థ శాస్త్రము కలిపి 18 విద్యలు కలవు. ఆన్వీక్షకిలో విజ్ఞానమును, త్రయిలో ధర్మాధర్మములను, వార్తలో అర్థానర్థములను, దండనీతిలో కామందకాద్యర్థ శాస్త్రము, దండనలో విధిని చెప్పబడును.

విద్య రెండు రకములు. ఒకటి భౌతికసుఖమును ఇచ్చునది. రెండవది అఖండానందమును ఇచ్చునది అని, ఇందులో ప్రధానముగా కర్మకాండ, జ్ఞానకాండను బోధించే విద్యలు కలవు. పరవిద్య అని అపరవిద్య అని విద్యలు రెండు విధములు. పరవిద్య అనగా వేదాంత విద్య. వేదాంత విద్య ఆత్మ స్వరూపమును తెలుపును. అపరవిద్యలు ఋగ్వేదము మొదలగునవి. ఋగ్వేద, యజుర్వేద అధర్వణ, సామవేదములు వేదాంగములైన శిక్షా వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తము జ్యోతిషములు మొదలగునవి. ఈ వేదాంగము ఒక్కొక్కటి చాలారకములుగా ఉన్నవి. ఈవిద్యలు శ్రీపరమేశ్వరుని తత్త్వమును తెలుపుటకు ఆవిర్భవించినవి. ప్రళయ కాలమున మరలా ఆ పరమేశ్వరునియందు లయమును పొందుచున్నవి. న్యాయ శాస్త్ర సూత్రములను అక్షపాదుడు (గౌతముడు) వ్రాయగా వాత్స్యాయనుడు ఆసూత్రములకు వ్యాఖ్యానమును రచించెను. దర్శనములు రెండురకములు. ఆస్తికము, నాస్తికములని రెండు రకములు. నాస్తికదర్శనములు బౌద్ధ, జైన, చార్వాకాది మతములు. (వేద, ధర్మ నిందకుడు నాస్తికుడు) ఆస్తిక దర్శనములు న్యాయ వైశేషికములు, సాంఖ్యయోగములు. పూర్వోత్తర మీమాంసలు అని ఆరువిధములు. పురాణములు, ఉప పురాణములు, కావ్యములు, నాటకములు, ఉపనిషత్తులు మొదలగు విద్యలన్నియూ ప్రళయకాలమున అధ్యయన అధ్యాపనలు చేసేవారు లేనందున శ్రీసదాశివునియందే రాశిగా అంతర్లీనమై ఉండును. అంటే శ్రీకాళహస్తీశ్వరునియందే రాశిగా అంతర్లీనమై ఉండును అని అర్థము. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరుడు సర్వ విద్యారాశిమంతుడు. సంస్కృత వాఙ్మయమున అనేక ఉపాసనలు, స్తోత్రములు, విద్యలు, స్థలపురాణములు మొదలగునవి కలవు. కైలాసమున శ్రీపరమేశ్వరుని శ్రీపార్వతీదేవి అడుగగా శ్రీపరమేశ్వరుడు ఆమెకు చెప్పుటవలన ఆరహస్యములన్నియు భూలోకమునకు వచ్చెను. శివధర్మమనే గ్రంథమునందు మొదట బ్రహ్మదేవుని చేత చూడబడినదియు ఈశ్వరుని దివ్యతేజో లింగము. ప్రళయకాలములో సర్వదేవతలు ఆయన మూలమున ఉందురు. ఈశ్వరుని శిరస్సున వేదములు, షడంగములు, షడ్దర్శనములు అనేక విద్యలు లయమును పొంది ఉండును. స్థావర, జంగమ, అండజ స్వేదజ, ఉద్భిజరూప ప్రపంచమంతయు ఉదరమున లయమును పొంది ఉండును. చరాచరప్రపంచమంతయు ఆయననుండే పుట్టుచున్నది. కుండను తయారుచేయవలె నంటే మట్టి ఎట్లు కారణమో అట్లే చరాచరమైన ఈ ప్రపంచము సకల విద్యలు పరమేశ్వరుని నుండే పుట్టి అతనియందే లయమగుచున్నవి. కనుక పరమ శివుడే సృష్టికి లయమునకు కారణభూతుడు. వేదములో కూడా శ్రీపరమేశ్వరుని మహత్తునుండే సకలవేదములు శాస్త్రములు పురాణేతిహాస షడంగ

షడ్దర్శన కావ్య నాటకములు పుట్టినవి అని కలదు. సంస్కృత వాఙ్మయమంతయు పరమేశ్వరుని నిట్టూర్పు వల్లనే పుట్టినవి. కనుక శ్రీకాళహస్తీశ్వరుడు సకల విద్యా రాశి సమన్వితుడు. ఆ విద్యారాశి పతి నాకు మేధను ప్రజ్ఞను ప్రసాదించుగాక.

## విద్యాపతిః 54

శ్రు। ఈశానస్సర్వ విద్యానా మీశ్వరస్సర్వభూతానా మితి సర్వ విద్యాధిపతిత్వం పరమేశ్వరస్య శ్రూయతే । తస్మాద్విద్యాపతిః । యద్వా । దేవః పరవిద్యాయా తత్త్వోపదేశ జనిత శివజ్ఞానేన ముముక్షూన్ పాతీతి విద్యాపతిః । జన్మాంతర శతవిరచిత శివధ్యానారాధనేన గురువీక్షణ దీక్షయా మహావాక్యార్థతాత్పర్యవిచారసమయే రవి మణిపతిత భాను భానురేవాగ్ని రూపేణా విర్భూయ సర్వం. దహతి ప్రకాశతేచ యథా తద్వదేకాంతవిచారసమయే శివజ్యోతిర్మనోవృత్తా పతిత్వాసంసార దుఃఖ బంధం దహతిః ప్రకాశతే చ । తథా సూతశ్చ ।

**ఆత్మనః పరమా ముక్తి ర్జ్ఞానాదేవ న కర్మణా ।**
**జ్ఞానం వేదాంతవాక్యానాం మహాతాత్పర్యనిర్ణయాత్ ॥**
**ఉత్పన్నాయాం మనోవృత్తౌ మహత్యామంబుజేక్షణ ।**
**అభివ్యక్తం భవేదేత ద్బ్రహ్మైవాత్ర నసంశయః ॥**
**అనేనైవాత్మనో జ్ఞాన మాత్మన్యేవ విలీయతే ॥**
**తస్మాదజ్ఞాన మూలస్య సంసారస్య క్షయో భవేదితి ।**

ఇతశ్చ । విద్యయా ముముక్షుం సాధనసంపన్నం జనం । శివస్థానమ్మృతం మూర్ఖం వాఽపి విద్యయా తత్త్వజ్ఞానోపదేశేన పాతీతి విద్యాపతిరిత్యర్థః

త్రినేత్రుడే సర్వ విద్యలకు అధిపతి. సకల భూతములకు కూడా ఈశ్వరుడే ప్రభువు. పరమేశ్వరుని అనుగ్రహముతోనే సృష్టిస్థితి సంహారములు జరుగుచున్నవి. పరమేశ్వరుడు సకల విద్యాపతి. పరమేశ్వరుడు పరవిద్య ఐన వేదాంత తత్త్వమును ఉపదేశించును. శివజ్ఞానముచేత ముముక్షువులు శ్రీపరమేశ్వరానుగ్రహమునకు పాత్రులై ముక్తిని పొందు చున్నారు. అందువల్ల శ్రీసదాశివుడు విద్యాపతి ఐనాడు. అనేక జన్మల నుండి అనుష్ఠించిన శివధ్యాన, ఆరాధ్య సద్గురువీక్షణ దీక్ష, ఉపనిషత్తుల మహావాక్యార్థతాత్పర్యములను చర్చించుట, ఆ తాత్పర్య విచారసమయమునందు సూర్యమణియందు ప్రతిబింబించిన సూర్యుడు, సూర్యుడే అగ్నిరూపముగా అవతరించి లోకములను చైతన్యవంతులుగా ప్రకాశవంతులుగా చేయు చున్నాడు. అగ్ని స్వరూపుడు ఆయనే కనుక దహన క్రియను (లయము) కూడా ఆయనే చేయుచున్నాడు. ఏకాంతముగా శివతత్త్వమును మననము చేయుచుండగా శివజ్యోతి మనస్సున కనపడి సంసార దుఃఖమును, సంసార బంధమును పోగొట్టి ఆత్మను దర్శింప చేయును. గొప్పదైన ముక్తి ఆత్మజ్ఞానముద్వారానే లభించును. కర్మాచరణము ద్వారా కాదు. ఆత్మ జ్ఞానము ఉపనిషత్తుల మహా వాక్య తాత్పర్య నిర్ణయము మననము ద్వారా జరుగును. ఆ ఆత్మ జ్ఞానము మనస్సున ఉదయించగానే ఈ ప్రపంచము నీటిలోని బుడగ వలె కనిపించి జీవుడు ఆత్మలో లీనమగును. తద్ద్వారా అజ్ఞానమూలకముగా వచ్చిన సంసారము క్షయమగును. విద్యచేత ముక్తి కొరకు సాధనసంపన్నుడైన జీవునికి పరమేశ్వరుడు ముక్తిని ప్రసాదించును. మూర్ఖుడైనవాడు శివసన్నిధిలో మరణించినమా వానికి విద్యచేత తత్త్వోపదేశముచేసి శ్రీపరమేశ్వరుడు రక్షించును. పాతీతి పతిః విద్యయా పాతీతి విద్యాపతిః రక్షించేవాడుగనుక ఈశ్వరుడు రక్షకుడు, విద్యచేత అజ్ఞానమును పోగొట్టి మోక్షమును ఇచ్చువాడుగనుక ఆయన

విద్యాపతి. సకల విద్యలకు ఆయనే పతి. పతి శబ్దమునకు యజమాని, స్వామి, పాలకుడు,కాపాడువాడు, ఏలిక, రక్షకుడు, ప్రభువు అనే అర్థములు కలవు. శ్రీకాళహస్తీశ్వరుడు సకల విద్యారాశియేకాక ఆ విద్యారాశికి ఆయనే ప్రభువు. ఒక శాస్త్రమును ఆపాదమస్తకము తెలుసుకొనుట సామాన్యుడికి అసాధ్యము. అటువంటి శ్రీకాళహస్తీశ్వరుడు ఎన్నో విద్యలకు, శాస్త్రములకు అనంతమైన విజ్ఞాన సంపదకు ఆయనే పతి. అటువంటి విద్యాపతియైన శ్రీకాళహస్తీశ్వరుడు నన్ను రక్షించుగాక.

## అనామయః 55

న విద్యతే ఆమయో రోగో యస్యేత్యనామయః। రోగవ్యాధిగదామయా। అనామయం స్యాదారోగ్యమితి చ । ని । శ్రు । అధ్యవోచదధివక్తా ప్రథమో దైవ్యో భిషక్ । ఉన్నోవీరాం అర్పయ భేషజేభిర్భిషక్తమం త్వాం భిషజాం శృణోమీతి । యో వామపాదేన జఘాన కాలం ఘోరం పపౌ హాలాహలం దహంతం । తస్మై రుద్రాయ నమో అస్త్వితి చ శ్రుతిభ్యశ్శివస్య భిషక్తమత్వేన కాలధ్వంసకత్వేన కాలకూట విషభక్షకత్వేన చ కైముతికన్యాయేనానామయత్వం సిద్ధం । అతస్సోనామయోఽ స్మద్గదానపాకరోత్విత్యర్థః ॥

ఆమము అనగా పక్వము కానిది, వండనిది, పండనిది, కాలనిది, పరిపాక దశకు రానిది, జీర్ణించనిది, రోగ విశేషము అని అర్థము. ఆమవాతము అజీర్ణరోగము. జీర్ణించని పదార్థము కడుపులో ఉన్నప్పుడు అది ఆమముగా మారి అనేక రోగములను కలిగించును. అటువంటి ఆమము ఎవరికి లేదో వారు అనామయులు. శివుడు దైవ్యుడు. దైవ్యుడనగా వ్యవహారమున వివిక్త రూపుడు. వివిక్త రూపుడనగా రహస్యరూపుడని అర్థము. అనగా శివుని నిజస్వరూపము సామాన్యులకు దృగ్గోచరము కాదు. సువర్ణతేజో రూపునకే దృగ్గోచరమగును. దైవ్యుడనగా ద్యోతనమున ప్రకాశరూపుడని తెలియుచున్నది. శివుని అష్టమూర్తులలో ఆదిత్యుడు ఒకడు కనుక ఆ ఆదిత్యుడు దైవ్యుడు. ఆ శివుడు ''తేజసామపి తేజస్వీ'' గా ప్రకాశించు చున్నాడు. దైవ్యుడనగా స్తుతిలో స్తుత్యరూపుడు. ''స్తవ్యః స్తవ ప్రియః స్తోత్రం స్తుతి స్తోతా రణప్రియః'' అని శ్రీసదాశివుని నిజస్వరూపము. ''భిషక్తమం త్వాం భిషజాం శ్రుణోమి' శ్రీసదాశివుడు వైద్యులలో కెల్ల గొప్ప వైద్యుడు. దివ్య జ్ఞాన సంపన్నులలో రుద్రుడు ముఖ్యుడు. భిషక్ అనగా వైద్యుడు. లోకమున జీవులందరికి అనేకరకములైన వ్యాధులు కలవు. సంసారమున ఆధ్యాత్మికాధి భౌతికాధిదైవిన మనెడి తాపములు మిక్కిలి బాధాకరములు. సాంసారిక బాధలు సప్తవ్యసనములవలె జీవులను కష్టముల పాలుచేయును. వాటినన్నిటిని తొలగించే వైద్యుడు రుద్రుడు. కావున ఆయన జీవుల పాలిట భిషక్కు ఆయెను. ''భీతా సజ్జతే – ప్రాప్యతే'' భీతి కలిగినప్పుడు భగవంతుని ధ్యానించి భీతిని పోగొట్టు కొనెదము. ''దేహభేదమైః సీదతి – సజ్జతి గృహ్ణాతి వా భిషక్'' దేహములను భేదించి అనుగ్రహించు వాడు పరమేశ్వరుడు. భిషక్ అనగా రోగభయమును నాశనమును చేయువాడు. వ్యాధి తాప సంసారాది వ్యసనములకు చికిత్సకుడు, భీతి కలిగినప్పుడు మనసా ధ్యానించిన ప్రత్యక్షమగువాడు, దేహమును భేదించి అనుగ్రహించువాడు పరమశివుడు భక్తులకు కలుగు సంసార రోగములను నివర్తించి సుఖ శాంతులను కలుగజేయును. నటరాజుగా నాట్యము చేసే శివుడు కాలుడు అనే రాక్షసుని తన ఎడమ కాలిక్రింద తొక్కి అణచి వేసెను. అటువంటి రుద్రునకు అనేక నమస్కారులు శ్రీసదాశివుని గూర్చిన అనేక వేదవాక్యములు వైద్యునిగా కాలాసురధ్వంసకునిగా హాలాహల విషభక్షకునిగా వర్ణించినవి. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరునకు అనామయత్వము సిద్ధము. శత్రువులచే మొర పెట్టించువాడు శ్రీకాళహస్తీశ్వరుడు. అటువంటి ఆస్వామి నన్ను రక్షించుగాక.

## పంచాక్షరాభిధేయః 56

పరమేశ్వరుని తత్త్వము ఐదు అక్షరములలో కూడా నిమిడి ఉన్నది. ఆ ఐదు అక్షరములు ఆకాశము, వాయువు, అగ్ని, జలము, పృథ్వి రూపములైన పంచభూతములకు అవి ప్రతీక. పరమ శివుడు పంచాక్షర ప్రియుడు. ఆ పంచాక్షరములు పంచప్రాణములకు, పంచ జ్ఞానేంద్రియములకు, పంచ విషయేంద్రియములకు ప్రతీకలు. ఈ ఐదు అక్షరముల ఉపాసనద్వారా పరమేశ్వరుని సాక్షాత్కారము కలుగును. ఐదు అక్షరములలో మొదటిదైన న కారము నయన తేజమును ఇచ్చును. ("నీయతే అనేన ఇతి నయనం, లోచనం నేత్రం నయనం ఈక్షణం చక్షురక్షిణీ") అని వీటిద్వారా వస్తుస్వరూపమును తెలుసుకొనవచ్చును. కళ్ళద్వారా బాహ్య ప్రపంచమును చూచుటే కాక ఈ ప్రపంచమున అంతటా నిండి ఉన్న పరమేశ్వరుడు తనలో కూడా ఉన్నాడని గుర్తించి ఆయనను చూచేందుకు ప్రయత్నించుట. న కారము అంటే నాదము. నదతీతి నాదః నాదప్రియుడు పరమేశ్వరుడు. వ్యాకరణ శాస్త్రమునకు ప్రధానములైన "అ ఇ ఉ ణ్" అనేవి మహేశ్వరునినుండి వచ్చినవి కనుక వాటిని మాహేశ్వర సూత్రములని పిలిచెదరు. ఆ నాదము అవ్యక్తమైన ప్రణవ స్వరూపము, రెండవ అక్షరమైన మ కారము మనోనిశ్చయమును ఇచ్చును. ఇంద్రియములకు మనస్సుతో సంబంధము లేనప్పుడు అవి పనిచేయవు.. "మన్యతే అనేన ఇతి మనః" కనుక మనస్సుతోనే పరమశివుణ్ణి నిరంతరము స్మరించుట ఉత్తమము. ఆర్తితో భగవంతుని పిలిస్తే తనను అయిన తప్పక వచ్చి రక్షిస్తాడు అనే ధృఢమైన, అచంచలమైన మనోనిశ్చయము కలిగి ఉండవలెను. "మంత్రాధీనం తు దైవతం" అన్నట్లు దేవతలు వేదోక్త మంత్రములకు అధీనులై ఉంటారు. కావున ఆ మంత్రానుష్ఠానముచేత వారు ప్రసన్నులై మనము కోరిన కోరికలను మనకు ఇవ్వగలరు. మ కారము మంత్రములకు ప్రతీక. "మన్యత ఇతి మంత్రః, మంత్రః దేవాది సాధన విశేషః, మనజ్ఞానే" అనే ధాతువు నుండి మంత్ర శబ్దము వచ్చినది. 'నితరాం మతేః అంతరం నయతి, నిశ్చినోతీతి నిశ్చయః' నిశ్చయము మనస్సును చెదరకుండా ఉంచును. ఏపనికైనా మనోనిశ్చయము చాలా అవసరము. మరి పరమేశ్వర ఆరాధనకు ఇంకా అవసరము. శి కారము శ్వాస చలనమునకు ప్రతీక. 'చలతి తాచ్ఛీల్యేన ఇతి చలనం, చల కంపనే' స్వభావముగా వాయువు చలన స్వభావము ఉచ్ఛ్వాస నిశ్వాసలతో పరమేశ్వరుని నామస్మరణ, అప్రయత్నముగా చేయుటద్వారా శరీరములోని ప్రతి అణువు పరమాత్మ దర్శనమునకై స్పందించును. ఉచ్ఛ్వాస, నిశ్వాసలలో కూడా పరమశివునికి మనస్సును అంకితము చేయవలెను. శి కారము శ్రోత్రమునకు ప్రతీక. "శృణోతి అనేన ఇతి శ్రోత్రం, శ్రు శ్రవణే" ఇతర శబ్దములను వినకుండగా నిరంతరము భగవన్నామమునే వినవలెను. భగవంతుడు శ్రుతిగోచరుడు. కనుక పరమేశ్వర ప్రాప్తికి భగవన్నామ శ్రవణము కలికాలమున అతి ముఖ్యము. వ కారము వాంఛితార్థమునకు ప్రతీక. వాంఛితమైన ప్రయోజనము ఈశ్వర దర్శనము. కనుక పరమేశ్వరుని అనుగ్రహం తప్ప మనస్సున మరే వాంఛలను రానివ్వకూడదు. వ కారము వేదమునకు ప్రతీక. వేదమున అనేక మంత్రములు పరమేశ్వరుని విరాట్స్వరూపమును ఎన్నో విధములుగా వర్ణించినందున అదే మనకు ప్రమాణము. పరమేశ్వరుడు వేదవేద్యుడు. "విదంతి అనేన ధర్మాధర్మావితివేదః విదజ్ఞానే" వేదములచేతనే మానవుడు తనుచేయవలసిన ధర్మములను, తను చేయకూడని అధర్మములను తెలుసుకొనుచున్నాడు. పరమేశ్వరతత్త్వమును వేదములే విపులముగా చెప్పినవి. వేదముల వాంఛకూడా పరమేశ్వరుని స్వరూప ప్రతిపాదనమే. కనుక మన వాంఛకూడా పరమేశ్వర తత్త్వ జిజ్ఞాసపై ఉండాలి. య కారము యోచన సకలమునకు ప్రతీక. యోచన అనగా ఆలోచన. ఆలోచన మానసిక ప్రవృత్తి. కనుక అంతరింద్రియములైన మనో బుద్ధి చిత్తాఽహంకారములు, బహిరింద్రియములైన వాక్, శ్రోత్ర, చక్షు, రసన, ఘ్రాణములద్వారా పరమేశ్వరుని యాచించుట. య కారము యజ్ఞములకు ప్రతీక. "యజతే ఇతి యజ్ఞః, యజః నామ

దేవ పూజా సంగతి కరణదానేషు.'' ఇట్లు ఐదు అక్షరములకు ప్రతీకలుగా పరమేశ్వరుడు విరాజిల్లుచున్నాడు.

ముక్కోటి దేవతలలో ఐదు ముఖములు కలిగిన వాడు పరమేశ్వరుడు ఒక్కడే. ఐదు అక్షరములకు ఐదు ముఖములు ప్రతీకలు. న కారమున ప్రకాశించే ముఖము మహాపాపములను మహాపాతకములను హరించును. మ కారమున ప్రకాశించే ముఖము అనేక కోరికలను మోక్షమును ఇచ్చును. శి కారమున ప్రకాశించే ముఖము అనేక మంగళములను (శివములను) ప్రశాంతిని భక్తులకు ఇచ్చి సర్వలోకవాసులను అనుగ్రహించును. వ కారమున ప్రకాశించే ముఖము శక్తి అనే ఆయుధమును ధరించి, వాసుకిని కంఠమున భూషణముగా కలిగి భక్తులను అనుగ్రహించును. య కారము చేత ప్రకాశించే ముఖము పరమేశ్వరుని ఏనామముతో, ఏ ఆకారముతో పూజించిననూ ఆయన అనుగ్రహించును.

న కారమున ప్రకాశించే ముఖము తూర్పుదిక్కును చూస్తూ సిద్ధ, సురాసులచేత స్తోత్రము చేయ బడుచున్నది. మ కారముచేత ప్రకాశించే ముఖము దక్షిణ దిక్కును చూస్తూ, సర్వలోకములను దహించి వేసే తేజస్సుతో ప్రకాశించుచున్నది. శి కారముతో ప్రకాశించే ముఖము ఆవు పాలపైన ఉండే నురుగువలె తెల్లనైనది. ఎర్రని కళ్ళుకలిగి బ్రహ్మేంద్రాది మరుద్గణములచేత స్తోత్రము చేయబడుచూ కళంక రహితమైనదిగా పశ్చిమ దిక్కును చూచుచున్నది. వ కారము చేత ప్రకాశించే ముఖము, గౌరవర్ణము కలిగి కుంకుమ తిలకముచే ప్రకాశించుచూ, స్నిగ్ధమై, బింబ ఫలాధరములచేత చిరునవ్వు కలిగి, నల్లనైన జడలతో ప్రకాశించుచూ, పూర్ణ శశాంకమండలములోని కాంతిని మించిన కాంతితో ఎక్కువగా ప్రకాశించే ముఖము ఉత్తర దిక్కును చూచుచున్నది. య కారముచే ప్రకాశించే ముఖము ఊర్ధ్వముఖము. ఈ ముఖము వ్యక్తావ్యక్త గుణములకన్నా వేరైనది. 36 తత్త్వములతో కూడుకున్నది. ఓంకారాది సమస్త మంత్రములకు, జనకమైనది. సూక్ష్మాతి సూక్ష్మముకన్నా వేరైనది, ప్రశాంతమైన దివ్య తేజస్సులో ఆకాశమంతా వ్యాపించి ఉన్నదీ పరమేశ్వరుని ఐదవ ముఖము. ఐదుముఖములు ఐదు దిక్కులను వ్యాపించి ఉన్నట్లు ఆయన శరీరమున సమస్తదేవతలు నివాసమున్నారు. అందులో ప్రధానముగా లలాటమున ఇంద్రుడు, నేత్రములయందు అగ్ని, చెవులలో యముడు, ముఖమున నిబురుతుడు, బాహువులయందు వరుణుడు, నాసికమున వాయుదేవుడు, జఠరమున కుబేరుడు, నాభిలో ఈశానుడు, పాదములలో పృథ్వి కలరు. ఇది పరమేశ్వరుని సూక్ష్మమైన విరాట్ స్వరూపము. అంతటి పరమేశ్వరుని అల్పజ్ఞులైన మానవులు కొలవలేరని ఆపరమాత్మే ఐదు అక్షరములలో నిమిడి ఉండెను.

న-మ-శి-వా-య- ఇతి పంచభిరక్షరైః వర్ణైః అభిధాతుం యోగ్య ఇతి తథోక్తః। పంచాక్షర మంత్రేణో పాసితు యోగ్య ఇతివా । యద్వా । సూక్ష్మ పంచాక్షరమంత్రః ప్రణవ ఇత్యగస్త్య సంహితాయామృక్తం । తస్య పంచాక్షరత్వ మప్యస్తి హి। అకారోకార మకారబిందు నాదాత్మక త్వాత్ప్రణవ ఏవ పంచాక్షరస్తేన వాచ్యః తథాచ యోగసూత్రమీశ్వరం ప్రస్తుత్యాహ । తస్య వాచకః ప్రణవ ఇతి । వాచ్యవాచక యోరభేదోపచారేణ శ్రుతిశ్చ బ్రూతే । తథ్యథా । శాశ్వతం శివమద్వైతం నివృత్తైస్సర్వదుఃఖానా మీశానః ప్రభురవ్యయః ।

అమాత్రశ్చర్థో వ్యవహార్యః। ప్రపంచోపశమశ్శివోఽద్వైత ఏవమోంకారః । ప్రణవం హీశ్వరం విద్యాత్ । ద్వైత స్యోపశమశ్శివ ఇతి । శివాదిశబ్దానాం ప్రణవస్య చైకార్థత్వేన పంచాక్షరాత్మక ప్రణవాభిధేయ ఇత్యర్థః। అథవా । నక్షరతీత్యక్షరం । సర్వమశ్నుతే ఇతివాక్షరం । అశేః। సరప్రత్యయె కృతే। అక్షరం పరంబ్రహ్మ పంచ పంచధా వివర్తతే। జగద్రూపేణాస్తే ఇతిపంచాక్షరం పరబ్రహ్మ । తేనాభిధాతుం యోగ్యం । ఉక్తంచ వాక్యపదీయే ।

**అనాదినిధనం బ్రహ్మ శబ్దతత్త్వం యదక్షరం ।**
**వివర్తతేఽర్థభావేన ప్రక్రియా జగతో యత ఇతి ।**
**తస్మాత్ పంచాక్షరాభిధేయః పాతు మామిత్యర్థః**

ఐదు అక్షరములతో, ఐదు వర్ణములతో పలుకుటకు యోగ్యమైనది కనుక అది పంచాక్షరీ మంత్రము. శ్రీసదాశివుని సంపూర్ణ తత్త్వమును ఐదు అక్షరములతో కూర్చి మంత్రముగా అంగన్యాసకరన్యాసములతో ఉపాసన చేయునప్పుడు దిగ్బంధమును జపము ముగిసే ముందు బంధవిమోచనమున్నూ చేయుట ఆచారము. దీనిని అగస్త్య సంహితలో చెప్పెను. అందులో పంచాక్షరీ మంత్ర మహిమగూడా కలదు. అకార ఓకార మకార బిందు నాదాత్మక రూపమైన పంచవర్ణములే పంచాక్షరములు. పంచాక్షరస్వరూపుడు యోగేశ్వరుడు. పంచాక్షర పదవాచ్యుడు శ్రీకాళహస్తీశ్వరుడు. వాచ్యుడు, వాచకుడు శ్రీపరమేశ్వరుడే, వాచ్య వాచకాభేదము చేత వేదముకూడా శ్రీపరమేశ్వరున్నే చెప్పినది. శాశ్వతుడు, సుఖకరుడు, శుభకరుడు, మోక్ష ప్రదాత, శివంకరుడు, అద్వైతుడు, ఓంకార స్వరూపుడు. ఆయనే ప్రణవములోనే ఈశ్వరుని తెలుసుకొనవలెను. రెండవ వస్తువును ఉపశమింపచేయువాడు శ్రీసదాశివుడు. శివశంకర రుద్రాది శబ్దములకు ప్రణవముకు ఒకే అర్థమును చెప్పిరి. పంచాక్షరాత్మకముగా ప్రణవ స్వరూపమును చెప్పుచున్నారు. అక్షరుడైన పరబ్రహ్మ ఐదైదు విధములుగా పరిణామము చెందు చున్నాడు. జగద్రూపుడుగా ఆయనే అంతటా నిండి ఉన్నాడు.

## సుభగాశోక భంజనః 57

అత్ర శ్రీకాళహస్తి స్థలే కాంచిద్ద్విజకన్యాం సుభగా నామ్నీం రూపలావణ్యనిలయాం సాధ్వీం కశ్చిద్ద్విజస్సముద్వాహ్య కాలేన ఋతుమత్యా తయా యోజితోఽపి విరాగస్తా మస్పృశన్ శివమేవ సస్మార । కదాచిత్తయా ప్రసభమాశ్లిష్టస్సన్ తాం విధూయ నిర్విఘ్నతపస్సిద్ధ్యర్థం పాశ విచ్ఛేదక్షేత్రం జగామ । తదా సా యౌవనారంభసంభ్రమ మదనవిశిఖదలితా సదా చిరం శుశోచ। తతస్తస్యాం అంతర్యామి బోధితాయాం సత్యాం భూతిరుద్రాక్ష పంచాక్షరమంత్రపాశుపతాదిశైవ వ్రతనిష్ఠాయాం పరమేశ్వర ఆవిర్భూయ సుభగాయాస్సంసార శోకం బభంజ । ముక్తిం చ దదావితి సుష్ఠు భగో భాగ్యం కాంతి సౌందర్యవిద్యాది శివసాయుజ్యపర్యంత మస్యాః అస్తీతి సుభగా తస్యాశ్శోకం బభంజేతి సుభగాశోకభంజన ఇత్యర్థః ।

ఈ నామములో సుభగ అనే స్త్రీ యొక్క శోకమును శివుడు పోగొట్టెను. శ్రీకాళహస్తిదివ్యక్షేత్రమున ఒక సుభగ అనే ఒక బ్రాహ్మణస్త్రీ కలదు. ఆమె అతిలోకసుందరి. భాగ్యవంతురాలు మనోహరురాలు. సుభగ అనగా భర్త వలపును మిక్కిలిగా చూరగొన్న ఇల్లాలు. పతిప్రియ, కడుపు పండిన ముత్తైదువ, తపః ప్రభావము కలిగినది. రూపలావణ్యములలో ఆమెకు ఆమే సాటి ఆమె పరమసాధ్వి. సాధ్వి అనగా పతివ్రత, ఈలువుగల మహిళ. భర్త సంతోషించిన తానూ సంతోషించునది తన భర్త దుఃఖించినచో తాను దుఃఖించును. తన భర్త ప్రవాసమునకు వెళ్ళినపుడు తాను స్నానానులేపన గంధ పుష్పాదులను వీడి కృశించునది, భర్త మరణించినచో అతని వియోగమును సహించలేక స్వయముగా తను మరణించునది. శీలవతి యగు స్త్రీ, ఇటువంటి సద్గుణములు కలిగిన సుభగ ఒక మంచి ముహూర్తమున సుందరుడైన ఒక యువకుని వివాహమాడెను. కానీ సుభగభర్త పరమశివభక్తుడు. అతనికి శివధ్యానము

తప్ప మరే ప్రపంచము తెలియుదు. సుభగకు తనభర్త తప్ప మరే ప్రపంచమును చూచుటకు కూడా ఇచ్చలేదు. భర్తయందు తన అనురాగమును పండించుకొనుటకు వీలు కుదరలేదు. ఒక నాడు తన కోర్కెలను తన భర్తయందు బలాత్కారముగా తీర్చుకొనవలెనని ప్రయత్నించగా అతను సుభగను విదిలించుకొని నిర్విఘ్నుగా సాగేతన తపస్సిద్ధికై ఆమెతో తన బంధమును తెంచుకొని శివక్షేత్రమునకై వెళ్ళెను. అప్పుడు ఆమె తన యౌవ్వనారంభ సంభ్రమముచేత, పదునైన మన్మథ బాణములకు తట్టుకొనలేక ఎగసిపడే తనకోరికలను చంపుకొనలేక వాటిని ఖండించలేక చాలాకాలము దుఃఖించుచునే ఉండెను. కొంతకాలము తర్వాత తెప్పరిల్లి ఆ దుఃఖములను దిగమ్రింగుకొని అంతరాత్మ ప్రబోధముచేత సాత్వికురాలై తనభర్త మార్గమునే తనూ అనుసరించవలెనని సాధకురాలిగా మారెను. అంతట విభూతిని ధరించి రుద్రాక్షమాలలనే ఆభరణముగా శివపంచాక్షరినే ఊపిరిగా నిరంతరము జపిస్తూ పాశుపతమును స్వీకరించి శైవ వ్రతముతో శివానుగ్రహమునకై పరమశివుని చాలాకాలము ప్రార్థించెను. శైవ వ్రత దీక్షలో ఉన్న సుభగకు పరమేశ్వరుడు ప్రత్యక్షమై ఆమె సంసార శోకమును పోగొట్టి ముక్తిని ప్రసాదించెను. సుష్టు భగః అనగా భాగ్యమును కాంతిని, సౌందర్యము, విద్యలను కలిగినదై అవి తనకు సంతోషమును కలిగించనందున తన మనస్సును శివధ్యానమునకు ఉపయోగించెను. సుభగలాంటి స్త్రీలు అరుదుగా మనకు తారసపడుదురు. సుభగ తన మనస్సును భోగములవైపు మరల్చలేదు. ఆమె అందు తృప్తిలేదని తలచివేరే దృష్టివైపు మనస్సును మరల్చక ముక్తికై శివుని ధ్యానించెను. శ్రీకాళహస్తీశ్వరుడు సుభగా శోఖ భంజనుడు. కనుక పరమభక్తితో శ్రీకాళహస్తీశ్వరుని సేవించి ఆయన అనుగ్రహమునకు పాత్రులమై ముక్తిని పొందెదము.

## చంద్రక్షయ ప్రహర్తాః 58

చంద్రస్య క్షయశ్చంద్రక్షయ స్తం ప్రకర్షేణాపాహరదితి । చంద్రక్షయప్రహర్తా । దక్షేణ చంద్రాయ వివాహ విధినా దత్తాసు సప్తవింశతి కన్యాసు రోహిణ్యామేవ రమమాణో తస్మిన్ దక్షేణ క్షయపీడితో భవేతి శప్తః పరమేశ్వర మారాధ్య తేన రక్షితోఽ భవదితి కథా । అతశ్చంద్రక్షయస్య ప్రకర్షేణా పహర్తా కాళహస్తీశ్వర ఇత్యర్థః తదనుగ్రహకాలః చైత్ర శుద్ధ తృతీయా తిథి స్తస్యాం చంద్రపుష్కరణీస్నానే విశేషః ॥

అత్రి మహర్షిని సృష్టి చేయుమని బ్రహ్మ ఆజ్ఞాపించెను. అత్రి తపస్సుచేయగా అతని నేత్రములనుండి తేజస్సు వెడలెను. అవి అనేక దిక్కులకు వ్యాపించెను. వాటిని బ్రహ్మ ఒక చోటకు చేర్చి పురుష రూపునిగా చేసెను. దేవతల ప్రార్థనలలో ఆయనకు బ్రహ్మ సోముడని పేరు పెట్టెను అని మత్స్య పురాణమున కలదు. చంద్రుణ్ణి విష్ణువుకు ఎడమ కన్నుగా వర్ణించెదరు. దక్షుని శాపముచేత చంద్రుడు అదృశ్యుడయ్యెను. అతను లేకుండుట చేత భూమిపై పంటలు లేవు. వర్షములు లేవు. ఓషధులు వృక్షములు పెరుగుటలేదు. యజ్ఞములు చేయుట తగ్గెను. తద్వారా దేవతలకు ఆహారము తరిగెను. అందువల్ల దేవతలందరూ బ్రహ్మ వద్దకు వెళ్ళి చంద్రుడు మరలా వచ్చునట్లు ప్రసాదింపుమని వేడిరి. చంద్రుడు ఓషధులయందు దాగి ఉన్నాడు. కావున ఓషధులను సముద్రములోవేసి మథించిన చంద్రుడు రాగలడని చెప్పగా దేవతలు ఓషధులను క్షీరసాగరమున వేసి మథించగా చంద్రుడు వచ్చెను అని వరాహపురాణమున కలదు. దక్షుని యజ్ఞము చూచుటకు చంద్రుడుగూడా వెళ్ళెను. ఆ యజ్ఞమును ధ్వంసము చేయుటకై శివుడు తన గణములతోవచ్చి చిందులు వేయుచుండగా చంద్రుడు శివుని కాలుక్రిందపడి నలిగెను. అంతట చంద్రుడు శివుని ప్రార్థించగా శివుడు వానిపై జాలి చూపి

తన శిరస్సున అలంకరించుకొనెను అని మార్కండేయ పురాణమున కలదు. ప్రసేతసులు భూలోకమున వృక్షములను దహించు చుండగా వృక్షసముద్భవ అగు మారిష అను కన్యను వారికిచ్చి వృక్షదహనమును నిలిపివేయుమని వారిని చంద్రుడు వేడుకొనెను. దక్షుడు చంద్రునకు తన అశ్వినీ మొదలగు కుమార్తెలను 27 మందిని ఇచ్చి వైభవముగా వివాహము చేసెను. చంద్రుడు రోహిణియందు మిక్కిలి అనురక్తుడగుట చూచి మిగతా వారిని ఆదరింపకుండుటచే వారు తమ తండ్రియగు దక్షునికి నివేదించగా చంద్రుని దక్షుడు క్షయగ్రస్తుడవు కమ్మని శపించెను. చంద్రుడీ శాపమునకు భయపడి శ్రీసదాశివుని చెంతకు వెళ్ళెను. శ్రీసదాశివుని భక్తిలో ప్రార్థింపగా చంద్రుని తన శిరమున ధరించెను. అప్పుడు అశ్వినీ తారలకు చంద్రుడు మరింత దూరమైనందున మరలా దక్షుని వద్దకు వెళ్ళి తమ భాధను తండ్రికి నివేదించగా దక్షుడు శివుని వద్దకు వచ్చి చంద్రునిని విడవమనెను. శరణాగతుడై వచ్చిన వారిని విడవనని శ్రీశివుడు అతని మాటను తిరస్కరించెను. చంద్రుని శపించిన దక్షుడు చంద్రునకు ఆశ్రయమిచ్చిన శివుని గూడా శపించ వలెని నిశ్చయించగా ఆ ఉపద్రవము రాకుండగా శ్రీమహావిష్ణువు వారివద్దకు వచ్చి సంధిచేసెను. బ్రహ్మ చంద్రుని రెండు భాగములుగా మార్చి వృద్ధి, క్షయములు లేని వానిని శివునకు వృద్ధి క్షయములు కలదానిని దక్షుని పుత్రికలకు ఇచ్చెను. తన దగ్గర ఉన్న చంద్రునికి క్షయమును నిశ్శేషముగా హరింపజేసినవాడు శ్రీసదాశివుడు. ఎట్లాగైతే శ్రీసదాశివుడు చంద్రుని క్షయమును పోగొట్టెనో అట్లాగే శ్రీకాళహస్తీశ్వరుడు తన భక్తుల పాపములను విశేషముగా నిశ్శేషముగా పోగొట్టగలడు శ్రీసదాశివుడు చంద్రుని అనుగ్రహించినది. చైత్ర శుద్ధ తదియ ఆరోజున చంద్రా పుష్కరిణీ స్నానము విశేషఫలమును ఇచ్చును.

## అర్కవంహో పాపాబ్ధి శోషకః 59

సూర్యుడు అధితి కశ్యపుల కుమారుడు. ఇతను రథమున మేరు పర్వతమును ప్రదక్షిణము చేయును. ఇతని వద్ద హనుమంతుడు, యాజ్ఞవల్క్యుడు వేద శాస్త్రములను నేర్చుకొనిరి. విశ్వకర్మకు ప్రతీక ఐన సంజ్ఞ ఇతని భార్య. వీరువురకు పుట్టిన వాడు శ్రాద్ధ దేవుడు (వైవస్వతుడు) మనవు ఆయెను. సూర్యుని తేజస్సుని తన భార్య ఐన సంజ్ఞ భరింపలేకుండెను. సూర్యుని వలన సంజ్ఞకు ఇంద్రియ నిగ్రహములు కల యముడు, చంచల దృష్టికల యమున పుట్టిరి. సూర్యుని తేజస్సుకు భయపడి సంజ్ఞ తన అంశ ఐన ఛాయను అతని వద్ద వదిలి ఉత్తర కురుదేశములయందు ఆడ గుర్రముగా (బడబ) ఉండెను. సూర్యుడు ఛాయయందు శనైశ్చరుని సావర్ణి అను పుత్రులను, తపతి అనే కూతురును కనెను. సవతితల్లి తనను ఆదరించుట లేదని యముడు చెప్పగా ఛాయా వృత్తాంతమును తెలుసుకొని సంజ్ఞ వద్దకు అశ్వరూపమున వెళ్ళి ఆమెద్వారా అశ్వినీకుమారులను కనెను. కొంతకాలముతర్వాత ఆమెను తనవద్దకు తెచ్చుకొనెను. తన తేజస్సును తగ్గించమని బ్రహ్మకు సూర్యుడు విన్నవించగా విశ్వకర్మ సూర్యుని సాన పెట్టగా రాలిన చూర్ణముతో విష్ణువునకు చక్రమును, శివునకు శూలమును, అష్టవసువులకు శంఖములను చేసెను. జమదగ్ని శాపమువలన సూర్యుని రాహువు అప్పుడప్పుడు కబళించు చుండెను. సూర్యుడు, వరుణుడు కలిసి వచ్చుచుండగా మార్గమధ్యమున వారికి ఊర్వశి కనపడెను. ఆమె అందముకు ఇరువురు ముగ్ధులైరి. మొదట సూర్యునకు రేతః పతనము కాగా దానిని కుండలో ఆమె దాచెను. అంతట వశిష్టుడు ఉద్భవించెను. వరుణుని రేతస్సును కూడా కుండయందు ఆమె దాచగా అందులోనుంచి అగస్త్యుడు పుట్టెను.

ఈవిషయము తెలుసుకొన్న సూర్యుడు ఊర్వశిని భూలోకమున పురూరవునకు భార్యవు కమ్మని శపించెను. దూర్వాసుని మంత్రమును కుంతి దేవి జపించగా సూర్యుడు ప్రత్యక్షమై ఆమెకు కర్ణుని అనుగ్రహించెను. వనవాసమున ఉన్న ధర్మ రాజు సూర్యుని ప్రార్థించగా సూర్యుడు ధర్మ రాజునకు అక్షయ పాత్రను ఇచ్చెను. శ్రీసదాశివుని ఆజ్ఞచే దివోదాసుని కాశీనగరమునుండి వెళ్ళగొట్టమని సూర్యుని ఆదేశింపగా ఆపనిని చేయలేక శ్రీసదాశివుని చెంతకు వెళ్ళలేక వారణాశి యందే లోలార్కుడు ఉదయార్కుడు మొదలగు 12 నామములలో వారణాశిలోనే ఉండెను. సూర్యుని ఉపాసించుటవల్ల కుష్టువ్యాధి గ్రస్తుడైన మయూరకవి తనరోగమును పోగొట్టుకొనెను. శ్రీరాముడు రావణ సంహారమున శ్రీఅగస్త్యుడు శ్రీరాముని వద్దకువచ్చి ఆదిత్య హృదయమును ఉపదేశమును చేసెను. ఆ స్తోత్రపారాయణచేత శ్రీరాముడు రావణాసురుని తేలికగా సంహరించగలిగెను. అర్కుడు అనగా సూర్యుడు. అర్చించువాడు గనుక అర్కుడు. సూర్యుని మహా పాపములనుండి రక్షించెను. కనుక శ్రీసదాశివుడు అర్కమహాపాపాబ్ధి శోషకుడు.

అర్చ్యత ఇత్యర్కః । అర్కస్య మహాత్పాపం పాతి రక్షత్యాత్మానం అస్మాదితి పాపం । పా రక్షణే అథ పిబతి పాపిష్టమితి వా పాపం । పా పానే । తస్య మహాపాపమేవాబ్ధిరివాబ్ధిః పాపరాశిరిత్యర్థః అత్రోదాహృతస్య యథా లౌకికజనైః పారం నదృతే । ఏవ మేతత్పాపస్యాంతో నదృశ్యత ఇతి ప్రాయశ్చిత్తాభావసూచితః అస్యార్కస్య మహాపాపాబ్ధిం యశ్శోషయతి నిరవ శేషయతి వ్యపోహతీతి స తథోక్తః । కిం తత్ప్రాయశ్చిత్తానంతరితం మహాపాపం సూర్యేణాచరితమితి చేత్ కిమితః పరమస్తి । మహాఘకులం । యచ్ఛివనిందక సాంగత్యాదేః । దక్షో నామ బ్రహ్మకుమారో విధిచోదిత ఉచ్చాస్త్రేణ యజనాయ సంకల్ప్య స్వపుత్ర్యా దాక్షాయణ్యా ఆగమన సమయేన హరం నిందితవాన్ తదానసీమర్యాదయస్తత్ర నిర్భయం తచ్ఛుశ్రువుః । కౌర్మే । దేవతాంతరనిందా ప్రాయశ్చిత్త విధానానంతరం శివనిందాశ్రవణ ప్రాయశ్చిత్తాభావమాహ ।

యస్సర్వభూతవినుతం విశ్వేశం తు వినిందతి ।
న తస్య నిష్కృతిశ్శక్యా కర్తుం కల్పశతైరపీతి ॥
పాద్మేచాష్టమూర్తిపర్వణి
శివనిందాగిరం మూర్ఖం యది శాపితుమక్షమః ।
స్వకర్ణౌ తోదయేత్తత్రైరితి శాస్త్ర వినిర్ణయ ఇతి ।

శ్రీభాగవతేఽపి

కర్ణౌ పిధాయ నిరగాద్యదకల్పఈశే స్వాత్మావితర్య స్రుణిభిః వృభిరస్యమావె ।
ఛింద్యాత్ప్ర సహ్య రుశతీ మసతాం ప్రభుశ్చేజ్జిహ్వామసూనపి తతో విస్రుజేత్స ధర్మః ఇతి । శివపురాణే
శివనిందా వచశ్శ్రుత్వా యస్తు న వ్యాకులో భవేత్ ।
స చండాలత్వమాసాద్య నరకేషు పతిష్యతీతి ॥

శివనిందావచశ్శ్రవణస్య సద్యో దేహపాతాదిశ్రవణాత్ తత్సాంగత్య తచ్ఛ్రవణ తద్యజన హవిరశ నాశావతోఽర్కస్య న కథం మహాపాతకం భవేదిత్యర్థః ।

స పునస్తత్కాలే వీరేణా మర్దితో౽పి భోగాన్ విశిష్ట పాపస్సన్నత్రాగత్య తప్త్వా శ్రీకాళహస్తీశ్వరానుగ్రహాత్ పూతస్సర్వలోక పూజ్యశ్చాభవత్ । అతశ్శంభురర్క మహాపాపాబ్ధి శోషక ఇత్యర్థః ॥

పా అనే ధాతువుకు రక్షణమని అర్థము. పాపము అనగా దుష్కృతము. పాపిష్టుడు అనగా మిక్కిలి పాపము చేసినవాడు. పా అనే ధాతువునకు రక్షణ అని అర్థము కూడా కలదు. అనేక పాపములను ఆచరించేవాడు. మహా పాపములనే సాగరమువంటివాడు అని అర్థము. సాగరమున జలబిందువులు ఎన్ని ఉండునో అన్ని పాపములను చేసినవాడని, అటువంటి పాప మహా సముద్రములో మునిగి తేలువాడని అర్థము. లౌకికులైన నాగరీకులు. గ్రామీణులు చేసే పాపములకు హద్దే లేదు. తన ఉనికిని నిలపెట్టుకొనవలెనని లెక్కలేని పాపములు మానవుడు చేయుచున్నాడు. పాపరాశికి అంతములేదని ఆ రాశిని నివారించుటకై మానవుని మనస్సును మంచి మార్గమున ప్రవేశ పెట్టుటకై మునమహర్షులు ప్రాయశ్చిత్తకాండను ప్రవేశ పెట్టిరి. సూర్యునియొక్క మహా పాపాబ్ధిని మరిగించుటకై, నిశ్శేషముగా పోగొట్టుటకై శ్రీసదాశివుడు అవతరించెను. సూర్యుడు చేసిన ప్రాయశ్చిత్తము ఏమి? ప్రాయశ్చిత్తమువలన పోయిన పాపములు ఏవి? అసలు సూర్యుడు ఆచరించిన మహాపాపములు ఏవి? మహాపాపముల రాశి అతని వద్దకు ఎందుకు చేరినవి? అని ప్రశ్నించినచో శ్రీసదాశివుని నిందించే వాడితో అతను కలిసి ఉండటం, శ్రీశివనిందను ఎదిరించలేక పోవుట, మొదలగు మహా శివాపచారములను సూర్యుడు చేసెను. దక్షుడు ఒక ప్రజాపతి. ఇతను బ్రహ్మదేవుని కుడిబొటను వ్రేలు నుండి పుట్టెను. ఎడమచేతి బొటనవ్రేలున పుట్టిన ధరణిని దక్షుడు వివాహము చేసుకొనెను. వీరికి 50 మంది కుమార్తెలు ఐదుగురు కుమారులు కలిగిరి. ఒకనాడు దురదృష్టము చేత ప్రేరింపబడినవాడై శ్రీసదాశివునకు ప్రాధాన్యతలేని ఒక మహా యజ్ఞమును చేయసంకల్పించెను. తన పుత్రిక ముందు తన పుత్రిక భర్తయైన శ్రీపరమేశ్వరుని అనేక విధములుగా నిందించెను. ఆ శివనిందను ఆ యజ్ఞమును చూడవచ్చిన అనేకులు వినిరి. సూర్యుడు కూడా ఈ శివనిందను నిర్భీతిలో వినెను. కూర్మపురాణమున దేవతలనిందకు చేసుకొనవలసిన ప్రాయశ్చిత్తమును చెప్పి శివనిందను శ్రవణము చేసినందువల్ల వచ్చే ప్రాయశ్చిత్తమును కూడా చెప్పెను. సమస్త ప్రాణికోటి చేత స్తుతించే విశ్వేశ్వరుని ఎవరు నిందించెదరో వార్కి వందకల్పముల (కల్పమనగా బ్రహ్మదేవునకు ఒకరోజు) వరకు పాప పరిహారము చేసిననూ తరగదు. అట్లాగే పద్మ పురాణమున అష్టమూర్తి పర్వమునందు తెలిసో తెలియకో శివనిందను చేసినచో వాడు మూర్ఖుడు శివనిందకుడు ఏమీ సాధించలేని అప్రయోజకుడు. శివపురాణమున ఇట్లు కలదు. శివనిందా పూర్వకమైన మాటలను విని ఎవడు వ్యాకులత చెందడో వాడు. నీచమైన జన్మను ఎత్తి నరకలోకమున నివాసమేర్పరుచుకొనును. శివ నిందను విన్న వెంటనే మరణించును అని శాస్త్ర ప్రమాణముచేత శివనిందకుని సాంగత్యము వలన, శివనిందను వినుటద్వారా శ్రీశివునికి ప్రాధాన్యతలేని యజ్ఞమును వ్రతములను మొదలగునవి వాటిలో ఉన్ననూ, వాటిలో భాగము వహించిననూ మహా పాతకములు వచ్చును. కనుక దక్షుని యజ్ఞమున ఉండుటవలన ఆ యజ్ఞ హవిర్భాగములను స్వీకరించుటవలన సూర్యుడు మహాపాతకుడాయెను. ఆ యజ్ఞమున వీరభద్రుని చేత పిసుకబడి మారబడినవాడై, పళ్ళులేని వాడై, పారిపోయెను. కొంతకాలము తర్వాత పశ్చాత్తాపమును పొంది శ్రీకాళహస్తీశ్వరుని పరమ భక్తితో సేవించి,

ఆయన అను గ్రహముతో పరిశుద్ధుడై సర్వలోక పూజ్యుడు సూర్యుడు ఐనాడు. అందువల్ల శ్రీ కాళహస్తీశ్వరుడు సర్వ మహా పాపాద్రి శోషకుడు.

## ఆనంద తాండవ కరః 60

నాట్యము రెండు రకములు లాస్యము తాండవము. ఈ నాట్యము ధర్మ ప్రతిపాదకమైనదియు, చతుర్విధపురుషార్థ సాధకమై యశస్కరమై ఉపదేశ్య సహితమై సమ్యక్ జ్ఞాన ప్రదమై ముందు తరముల వారికి సత్కర్మ మార్గ ప్రదర్శకమై సర్వ శాస్త్రార్థ సంపన్నమై సర్వ శిల్ప ప్రవర్తకమై ఇతిహాస సహితమైనది.

**సర్వశాస్త్రార్థ సంపన్నం సర్వ శిల్ప ప్రవర్తకం ।**
**నాట్యాఖ్యం పంచమం వేదం సేతిహాస సమన్వితం**
**జగ్రాహ పాఠ్యం ఋగ్వేదా త్సామభ్యో గీతమేవ చ**
**యజుర్వేదాదభినయాన్ రసానాథర్వ ణాదపి ॥**

నాట్యవేదము పంచమవేదముతో సమానము. ఋగ్వేదమునుండి సాహిత్యమును యజుర్వేదమునుండి అభినయమును సామవేదమునుండి సంగీతమును అథర్వణవేదమునుండి రసములను గ్రహించి ఈశ్వరానుగ్రహముతో బ్రహ్మదేవుడు భరతమునికి నాట్యవేదమును ఇచ్చెను. ఇందు కుశలులు (గ్రహణధారణయోగ్యులు) విదగ్ధులు (ఊహాపోహసమర్థులు) ప్రగల్భులు (సభాకంపము లేనివారు) జితశ్రములు (వ్యాయామాభ్యాసాదులచేత అలసటలేని సముచితదేహము కలిగినవారు) గ్రహణము (గురుముఖతః గ్రహించుట) ధారణ (గ్రహించిన దానిని మరచిపోకుండుట) జ్ఞాన (ఊహాపోహవిచారము) ప్రయోగము (సభలో చేసే ప్రదర్శనము) సంశితవ్రతులు (అభ్యాసదక్షులు) అగు తన 104 పుత్రులను శిక్షితులుగా చేసి భరతుడు ప్రచారము చేసెను.

**ఆంగికం భువనం యస్య, వాచికం సర్వవాఙ్మయం ।**
**ఆహార్యం చంద్ర తారాదిః తం వందే సాత్త్వికం శివం ॥ (అభినయ దర్పణం)**
**యస్య సంకల్పమాత్రేణ విశ్వమాహార్య ముద్భృతం ।**
**తం మానసమహామూర్తిం వందే గిరి సుతామపి ॥**
**శివే శృంగారార్ద్రా తదితర జనే కుత్సన పరా**
**సరోషా గంగాయాం గిరిశ చరితే విస్మయవతీ ।**
**హరాహిభ్యో భీతా సరసిరుహ సౌభాగ్య జయినీ**
**సఖీషు స్మేరా తే మయి జనని దృష్టిః సకరుణా ॥**
**యోఽయం స్వభావో లోకస్య సుఖ దుఃఖ సమన్వితం ।**
**సోంగాద్యభినయోపేతో నాట్యమిత్యభిధీయతే ॥**
**వయోఽనురూపః ప్రథమస్తు వేషః వేషానురూపేణ గతిప్రచారః ।**
**గతిప్రచారానుగతం చ పాఠ్యం పాఠ్యానురూపోఽభినయశ్చకార్యః ।**
**సంధ్యారంభ విజృంభితం శ్రుతి శిరః స్థానాంతరాధిష్ఠితం**
**సప్రేమ భ్రమరాభిరామ మసకృత్సద్వాసనా శోభితం ।**
**భోగీంద్రాభరణం సమస్త సుమనః పూజ్యం గుణావిష్కృతం**
**సేవే శ్రీగిరి మల్లికార్జున మహా లింగం శివాలింగితం ॥**

నాట్య శాస్త్రములో నృత్తం తాండవం అనేవి పర్యాయ పదములుగా ఉపయోగించిరి. శ్రీసదాశివుడు తన భక్తుడైన తండువునకు నృత్యం నేర్పగా ఆయనతన ఆజ్ఞతో భరతునకు ఉద్ధతనృత్యం నేర్పాడు. శ్రీసదాశివుడు ప్రీతితో పార్వతికి లాస్యం నేర్పెను. లాస్యము సుకుమారనృత్యం. ఇందు ముఖ్యంగా శృంగారసంబంధి సంలాపము ఉండును. తండువుడు పరమేశ్వరాజ్ఞతో మునులకు నృత్యం నేర్పగా అది తాండవమైనది. ఆ తాండవమును మునులు మానవులకు నేర్పిరి. పార్వతి బాణాసురుని కుమార్తె ఐన ఉషకు లాస్యమును నేర్పెను. ఆమెనుండి మానవకాంతలు లాస్యము నేర్చుకొనిరి. కనుక ఆదిదంపతులైన శ్రీపార్వతీ పరమేశ్వరుల ద్వారానే ఈ నాట్య సంప్రదాయము భూలోకమున ఆవిర్భవించినది. శ్రీకాళహస్తీశ్వరుని పరమానుగ్రహమును పొందుటకు చతుర్వేదుల వెంకట శ్రీశివసుబ్రహ్మణ్యశర్మ నాట్య శాస్త్ర ఉపోద్ఘాతమును, నందికేశ్వరుని అభినయ దర్పణమును చూచి నాట్యమును గూర్చిన కొద్ది వివరములను ఇచ్చెను.

ఆనందదేవ సంజాతం తాండవ మానంద తాండవం తత్సదా కురుతే ఇత్యానందతాండవకరః శివస్సదాఽనందోఽపి సర్వప్రపంచ తిరోధానానంతరం నిత్యసిద్ధస్వాత్మైకత్వనిరవధి సుఖరూపత్వం వ్యంజయన్నృత్యతి। తథాచసూత్రః।

స్వస్వరూపాపను సంధాన ప్రమోదాత్తాండవ ప్రియః।
బ్రహ్మవిష్ణు మహేశానైరుపాస్యో గుణమూర్తిభిః।
దేవదేవో మహాదేవస్సాంబ స్సంసారమోచకః।
ననర్త పరమం భావమైశ్వరం సంప్రదర్శయన్నితి।

నను శివస్స్వస్యైశ్వర్య పరమభావం కిమర్థం కథం వా ప్రదర్శయతీతి చేదుచ్యతే। యథా రత్యాదిస్థాయి భావ కార్యస్య వర్ణనేనాభినయేన వా ప్రదర్శనే స రత్యాది రభివ్యక్తః సన్ శృంగారాది రసరూపతామాపద్యతే। ఉక్తంహి। వ్యక్తస్సతై ర్విభావాద్యైస్స్థాయీభావో రసస్స్మృత ఇతి। ఏవం పరతత్త్వస్వరూపవిషయేఽ భావేఽపి తత్కారణాభినయేన విశదీకరణాత్సం తస్తముపాస్య ముచ్యంత ఇతిభావః అభినయేనైవ ఆనంద సాక్షాత్కారోపదేశో హి తాండవాభిప్రాయః। తథాచ బ్రహ్మగీతా వచనం।

యథా నర్తన మీశస్య స్వభావాల్లోక రక్షణాత్।
తథా విద్యా వినోదాఖ్యా గీతిర్లోకోపకారిణీ ఇతి ॥

సర్గప్రవర్తనే స్వస్యోపాసనార్థం పారమైశ్వర్య బోధకం తాండవం। ప్రళయే తు స్వ నిత్యతానంద ప్రదర్శనార్థం చేతి తాండవద్వయంకురుతే। అత ఇదం సర్వం దృశ్య ప్రపంచ జాతం తన్నటన సభాత్వేన మహాశ్మశానమాసీదితి శ్రీకంఠమాతాచార్యాః।

దగ్ధే తవాక్షిశిఖినా చరాచరేస్మిన్ మత్వాఽఖిలం భువనమేవ మహాశ్మశానం।
తత్ర స్థితిం విబుధనాథ! తవాసహాయాం సంతః శ్మశానవసతిం సముదాహరంతీతి ॥

క్షుద్రపురగ్రామ పితృవనేషు విభూతి రుద్రో లోకహితాయ నృత్య తీత్యామశాసనికే।
పురా బ్రహ్మాఽ సృజద్ఘోరాన్ భూతసంఘాన్బలోద్ధతాన్।
తే భూతసంఘాః ఘ్నంతి స్మ సృష్టాస్తేనాఖిలాః ప్రజాః ॥
ఉగ్రాణాం నిగ్రహే తేషాం సో శక్తో మాం వ్యయోజయత్।
ఘోరాః హతా మయా తత్ర రక్షితాశ్చాఖిలాః ప్రజాః ఇతి।

రుద్రాణ్యై రుద్రవచనం । భాగవతే తు । నిరతిశయస్వాత్మానందరసాస్వాదనిత్యతృప్తస్య తుచ్ఛీకృత సర్వవిషయ భోగస్య సర్వత్ర స్నానానులేపనాది విషయేష్వ తుల్యదృష్టే శ్శివస్య కైలాసవత్ శ్మశానే పి వాసతౌల్య ప్రదర్శనాయేతి కాశ్యపేనోచ్యతే । తత్ర

**ఏతస్యాం సాధ్వీః సంధ్యాయాం భగవాన్ భూత భావనః ।**
**పరితో భూతపార్షద్భిః వృతో నృత్యతి భూతరాట్ ॥**
**శ్మశానచక్రానిలధూళి ధూసరో వికీర్ణ విద్యోతిజటాకలాపః ।**
**భస్మావకుంఠామలరుక్మదేహో దేవస్త్రి భిః పశ్యతి దేవరస్తే ॥**
**నయస్య లోకే స్వజనః పరోఽథవా నాత్యాదృతో నోతకశ్చిద్వి గర్హ్యవ్ః ।**
**వయంవ్రతైస్తచ్చరణాపవిద్ధామాశాస్మహే తాం బత భుక్త భోగామితి ।**
**కాశ్యపేన దితిం ప్రత్యుక్తం । తస్మాద్యస్తు లోక సుఖార్థమానంద తాండవం కరోతి। సమర్ధ్రృదయే ముదం కుర్యాదిత్యర్థః ॥**

అమితమైన ఆనందముచేత పుట్టిన తాండవము కనుక దాన్కి ఆనంద తాండవమని పేరు. పరమేశ్వరుడు ఆనంద స్వరూపుడు కనుక ఆయన చేసే తాండవము ఆనందప్రదమైనది. సమస్త ప్రపంచము తన యందు లయమగుట నిత్య సిద్ధము అవధిలేని స్వాత్మికత్వ సుఖరూపమును తెలియచేయుచూ ఆయన నృత్యము చేయును. శ్రీసూతమహర్షి ఇట్లు చెప్పెను. స్వస్వరూపాను సంధానము చేత తాండవ ప్రియుడైన పరమశివుడు ఆనందమున బ్రహ్మాదిదేవతలచేత అనేక విధములుగా స్తుతింపబడిన వాడై కైలాసమున నివసించు చున్నాడు. దేవదేవుడు, మహాదేవుడు, సాంబశివుడు, సంసారవిమోచకుడు అని మహాదేవుని స్తుతిస్తూ ఉండగా తన మహిమలను తెలిపే అనేక భావములతో అనేక సన్నివేశములను తెలుపుచూ ఆయన నర్తించెను. పరమశివుడు నృత్య రూపమున తన మహిమలను, భావములను సన్నివేశములను ఎందుకు ప్రదర్శించెను? వాటిని నోటితో చెప్పవచ్చును గదా! అని ప్రశ్నించినచో నవరసములైన శృంగారము, హాస్యము, కరుణ, రౌద్రము, వీరము, భయానకము, భీభత్సము, అద్భుతము, శాంతము అనే తొమ్మిది రసములను నోటితో చెప్పుట కష్టము అవి అభినయముద్వారానే తెలియును కావున వాటి ఉత్పత్తి స్థానములు స్థాయీ భావములు కూడా తొమ్మిదే. శృంగారమునకు రతి, హాస్యముకు హాసము, కరుణకు శోకము, రౌద్రమునకు క్రోధము వీర్యమునకు ఉత్సాహము భీభత్సమునకు జుగుప్స, అద్భుతమునకు విస్మయము శాంతమునకు శమము స్థాయీ భావములు. రసములన్నియు ధర్మార్థకామమోక్షములలో ఏదో ఒక దానిని ఆశ్రయించి ఉండును. సంభోగమునకు సంబంధించిన మిక్కిలి కోరిక కలిగి ఉండుట రతి, స్వభావవిరుద్ధములగు వేషభాషా చేష్టాదుల చేత పొందేవికారము హాసము. ఆప్త జన వియోగమువలన కలుగు దుఃఖాతిశయము శోకము, ఆసాధారణమైన పనులకు చేయు సంకల్పమునకు ఉత్సాహమను పేరుగలదు. రౌద్రాకారమును చూచి కీడును శంకించుట భయము అని అందురు. నెత్తురు చిమ్ముట, వాంతి ఐన పదార్థములను చూచుట, శవములనుండి మాంసములు నరములు బయటకు వచ్చుట చూచినచో జుగుప్స కలుగును. వైరాగ్యముచే వైషయిక భోగముల యందు కోరిక లేకుండుట శమము అని అందురు. ఈనవ రసములను తెలిపే సూత్రమున ''వ్యక్తః, సతైః విభావాద్యైః స్థాయీ భావోరస స్మృతః'' అని చెప్పిరి. విభావానుభావ వ్యభిచారి సంయోగాద్రస నిష్పత్తిః ''అని నాట్య శాస్త్రమున భరతముని చెప్పెను. భరతముని చెప్పిన రస సూత్రమును భట్టలోల్లటుడు, శ్రీశంకుకుడు, భట్టనాయకుడు

అభినవగుప్తుడు అనేక విధములుగా వ్యాఖ్యానించిరి. వీరే కాక అలంకార శాస్త్ర ప్రవర్తకులందరూ ఈ సూత్రమును వ్యాఖ్యానము చేసిరి. రసోత్పత్తికి కారణమైనది విభావము. ఇది ఆలంబనమని, ఉద్దీపనమని రెండు విధములు. లౌకికములగు రత్యాదుల కార్యములగు క్రీగంటి చూపులు మొదలగునవి అను భావములు. పరుల కష్ట సుఖములను అనేక పర్యాయములు భావించుట ద్వారా వచ్చిన తన్మయత్వమునకే సాత్త్విక భావములని పేరు. ఇవి స్తంభము ప్రళయము రోమాంచము స్వేదము, వైవర్ణ్యము వేపథువు, వైస్వర్యము అశ్రువులని ఎనిమిది రకములు. ఇవి విశేషముగా అంతటనూ రత్యాదులకు సహకారములగుచూ ఉన్నవి వ్యభిచార భావములు. ఇవి 33 రకములు అవి. నిర్వేదము, గ్లాని, శంక, అసూయ, మదము, శ్రమము, ఆలస్యము, దైన్యము, చింత వ్యామోహము స్మృతి, ధృతి వ్రీడా చాపల్యము, హర్షము, ఆవేగము, జాడ్యము, గర్వము, విషాదము, ఔత్సుక్యము, నిద్ర, అపస్మారము, సుషుప్తి, విరోధము, అమర్షము, అవహిత్థ, ఉగ్రతమతి, వ్యాధి, ఉన్మాదము, మరణము, తాపము, వితర్కము మొదలగునవి. ఈ నిర్వేదాది చిత్త ప్రవృత్తులు కావ్యనాట్యములలలో వ్యభిచారులని వ్యవహరింపబడును. ఒకే భావమునకు ఉదయము శాంతి, సంధి, శబలిత అను నాలుగు అవస్థలు కలవు. శృంగారమున నాయిక ఆలంబన విభావము, నాయిక రూపసంపద ఉద్దీపన విభావము కటాక్షాదులు అను భావములు ప్రియలాభజనిత హర్షాదులు వ్యభిచార భావములు ఆనందాశ్రువులు సాత్త్విక భావములగుచున్నవి.

హాస్యరసము కొంటె విటులు ఆలంబనవిభావములు వారి చేష్టలు ఉద్దీపనములు నవ్వుట అనుభవము, ఎక్కువగా నవ్వుటవలన కలుగు అశ్రువులు సాత్త్వికములు హర్షాదులు వ్యభిచారి భావములు వీని సంయోగమువలన హాస్యరసమగుచున్నది. శోకమున ఆప్తజన వియోగము వలన వచ్చును. అదే ఆలంబన విభావము దైన్యముగా ఉండే వారి ముఖము ఉద్దీపవిభావము గుండెలను తలను బాదుకొనుట నేలపై పొర్లుట మొదలగునవి అనుభవములు. దుఃఖాశ్రువులు సాత్త్విక భావములు చింతా, మోహ, విషాదాదులు వ్యభిచారిభావములు వీని యోగమున శోకము రస భావమును పొంది కరుణ అగు చున్నది.

క్రోధమున పరాక్రమమున ఆరితేరిన సైనికులు ఆలంబన విభావములు శత్రుదర్శనము ఉద్దీపనము గర్జించుట పళ్ళు కొరుకుట మొదలగునవి అనుభవములు రోమాంచాదులు, సాత్త్విక భావములు, గర్వ అమర్షాదులు, వ్యభిచార భావములు. వీని సంయోగమున క్రోధము చర్వణమై రౌద్రరస మగుచున్నవి. సర్వదిగ్విజయ రూపమగు అసాధారణ కార్యసాధనమునకు ఉత్సాహమని పేరు. ధీరోద్ధతులగు భటులే ఆలంబన విభావములు, శత్రుసైన్య సందర్శనము ఉద్దీపనము తత్ప్రౌఢోక్తి భుజస్ఫాలనాదులు అనుభావములు గర్వాదులు వ్యభిచారి భావములు వీని సంయోగమున ఉత్సాహము వీర రసమైనది. ఇది దానవీరము, దయావీరము, యుద్ధవీరము, ధర్మ వీరము అని నాలుగు విధములు.

భయమునగా ప్రళయమేఘ గర్జిత మగు ఆ ధ్వనిని విని శత్రువులు పారిపోవుట, ఇచట శత్రురాజులు ఆలంబన విభావములు విజయభేరీ నినాద శ్రవణము, ఉద్దీపనము, బెదురు చూపులు అనుభవములు కంపము స్వేదము మొదలగునవి. సాత్త్వికములు దైన్య సంభ్రమాదులు వ్యభిచార భావములు వీని సంయోగముచే భయము భయానక రసమగుచున్నది. జుగుప్సలో మరణించిన జీవులు మొదలగు వారు ఆలంబన విభావములు శరీరమునుండి విడిపోయిన భాగములు దుర్గంధము మొదలగునవి ఉద్దీపన విభావములు ఆ దృశ్యములను చూడకుండా

కళ్ళు మూసుకొనుట దుర్గంథమును పీల్చకుండగా ముక్కును మూసుకొనుట మొదలగునవి అనుభావములు. మోహము అపస్మారము ఆవేగము వ్యాధి మొదలగునవి వ్యభిచారి భావములు వీని సంయోగముచే జుగుప్స భీభత్సమగుచున్నది. విస్మయమునకు లోకోత్తర సుందర రూప సృష్టి ఆలంబన విభావము. తత్ప్రభావము, మహిమ ఉద్దీపనము కళ్ళు పెద్దవి చేయుట, కనుబొమ్మలు త్రిప్పుట మొదలగునవి అను భావములు రోమాంచాదులు సాత్వికములు వితర్కవేగ హర్షములు. వ్యభిచారములు వీని సంయోగమువలన విస్మయము రస భావమును పొంది అద్భుతరసమగును. వైరాగ్యముచే లౌకిక అలౌకిక సుఖ భోగములయందు కోరికలు లేకుండుట, ప్రాపంచిక వైభవాదులన్నియు నిస్సారములే అనే వేదాంత జ్ఞాన సంపన్నులైన సూరివర్యులు ఆలంబనము పుణ్యాశ్రమములయందు నివాసము ఉద్దీపనము. కన్నులు అరమోడ్పుట పెదవి విరచుట మున్నగునవి అనుభావములు, రోమాంచాదులు సాత్వికములు నిర్వేదహర్షాదులు వ్యభిచారి భావములు వీని సంయోగముచే శమము శాంత రసమగుచున్నది. రసములు, భావములు, అభినయములు, ధర్మలు వృత్తులు ప్రవృత్తులు సిద్ధులు స్వరములు ఆలోద్యములు, గానములు రంగముల విషయ స్వరూపమే నాట్య వేద సంగ్రహము, నాట్య మందలి అభినయములు నాలుగు విధములు. అవి ఆంగికము (శారీరాభినయము) వాచికము (వాగభినయము) ఆహార్యము (అంగరచన, వస్త్ర భూషణాది ధారణము) సాత్వికము (సత్త్వ సంబంధమైన అభినయము) లు. ప్రయోగము సర్వమును ఆహార్యభినయమందే నిశ్చితమై ఉన్నది.

నాట్యము పరతత్త్వ స్వరూప విషయము కానప్పటికి ఉపాసన చేసి పరతత్త్వమును అభినయించి దానిని విశదీకరించుట ద్వారా దాని విషయమును తేలికగా తెలిసే అవకాశము కలదు. అభినయము చేత ఆనందమును ఉపదేశమును కూడా పొందవచ్చును. ఆనంద పారవశ్యము చేత తాండవమును శ్రీసదాశివుడు చేయును.

బ్రహ్మగీతలో ఇట్లు ఉండెను. శ్రీసదాశివుడు లోకరక్షణము కొరకు లోకోపకారము కొరకు విద్యా వినోదముల కొరకు గీతములను పాడుచూ నాట్యమును చేయుచుండెను. సృష్టికి ముందు తన స్వరూప జ్ఞానమును బోధించుటకై పరమేశ్వరుడు తాండవమును, ప్రళయ కాలమందు తన నిత్యమైన ఉనికిని ఆనంద స్వరూపమును తెలుపుటకై రెండు రకముల తాండవములను శ్రీపరమేశ్వరుడు చేయును. కావున ఈ కనిపించే ప్రపంచమంతయు ఆయన నాట్యమందిరమాయెను. శ్రీకంఠాచార్యులు శ్మశానమే శ్రీసదాశివుని నాట్యమందిరము అని చెప్పిరి. చరాచరము ఐన ఈ ప్రపంచము ఒక మహాభువనమందిరము అందులో శ్మశానమనే సభామందిరము ఆ శ్మశానమున శ్రీసదాశివుని మూడవకంటి చూపులచేత తగుల బడిన ప్రదేశము. క్షుద్ర పుర, గ్రామ శ్మశాన, వన, విభూతులయందు శ్రీసదాశివుడు నృత్యము చేయును అని అనుశాసనిక పర్వములో (మహాభారతము) కలదు. పూర్వము బ్రహ్మదేవుడు మిక్కిలి బలవంతులు భయంకరులు ఐన భూత ప్రేత సంఘములను సృజించెను. ఆ భూత సంఘములు ప్రజలను పీడించుచుండగా వాటిని శ్రీసదాశివుడు సంహరించెను. ఆ సంఘములు చాలా ఉగ్రమైనవి. వాటిని అదుపుచేయుటకు సామాన్యులకు సాధ్యము కాదు. అది శ్రీకాళహస్తీశ్వరునికే సాధ్యము. నిరతిశయమైన స్వాత్మానంద రసాస్వాదము చేత నిత్య తృప్తుడైన వానికి దుఃఖము కలిగించేది శూన్యమైనది అగు ప్రాపంచిక భోగములకు స్థానముగా అలంకారములు మొదలగు విషయములయందు సమానమైన దృష్టికల శ్రీశివునకు

కైలాసమైననూ శ్మశాన మైననూ సమానమైన భావము కలిగిఉండునని కశ్యప మహర్షి అభిప్రాయము.

సర్వభూతములకు అధిపతియు అన్ని జీవులయందు సమానమైన ప్రీతి కలిగిన వాడును సాయంసంధ్య వేళ సర్వభూతములను సంతోషపరుచుటకై నృత్యమును ఎన్నుకొని శ్రీసదాశివుడు నృత్యమును చేసెను. శ్మశాన ధూళి చేత అలంకరింపబడిన దేహము చెదరిననూ మిక్కిలి ప్రకాశముగల ఆయన జడలు భస్మము చేత కప్పబడిన మలినముచే బంగారు కాంతులు కల శ్రీసదాశివుని దేహమును మూడు లోకములలోని జీవులు భక్తి ప్రపత్తులతో సేవించుచున్నారు. కశ్యప మహర్షి తన భార్య ఐన అధితికి పరమేశ్వరుని మహిమలను చెప్పుచూ లోకసుఖముల కొరకు ఆనంద తాండవమును శ్రీసదాశివుడు చేయును. ఆయన తాండవము చేయుటలో జీవులకు ఆనందమును కలిగించుటే పరమతాత్పర్యము. శ్రీకైలాస నివాసమును విరక్తి చెంది శ్రీకాళహస్తీశ్వరునిగా వెలసిన శ్రీసదాశివుడు మాకు దుఃఖములు లేని ఆనందమును చేకూర్చుగాక అని ప్రార్థించు చున్నాను.

## సకలామర నాయకః 61

ప్రాణాదిషోడశకలాభిస్సహ వర్తంత ఇతి సకలాః । న మ్రియంతే కల్పాంతమిత్యమరాః । సకలాశ్చతే అమరాశ్చ సకలామరాః తేషాం నాయకః ప్రభుస్సకలామరనాయకః। శ్రీమద్దక్షిణ కైలాసస్థాన దేశాద్దక్షిణతః శ్రీశివానంద శిఖరాగ్రే పశ్చిమ భాగే విరాజమానో అగస్త్యేశ్వర శ్శంభుః పాయాదిత్యర్థః । అథవా సకల శబ్దస్య వాజసనేయకోక్తా స్త్రయస్త్రింశత్సంఖ్యాకా ఏవ సకలామరాః తేషాం నాయక ఇత్యర్థః । తథాహి । శ్రు । తే దేవాః కతమ ఇతి త్రయస్త్రింశదితి । అష్టౌవసవః ఏకాదశరుద్రాః ద్వాదశాదిత్యాస్త ఏకత్రింశదింద్రశ్చ ప్రజాపతిశ్చ త్రయ స్త్రింశా ఇతి। అగ్నిశ్చ పృథివీ వాయు, రంతరిక్ష మాదిత్యశ్చ ద్యౌశ్చంద్రమా నక్షత్రాణి చైతేవసవః । ఏతెషు హివసుసర్వం హిదం ాహితమితి । తస్మాద్వసవ ఇతి । కతమే రుద్రా ఇతి । వశేమే పురుషే ప్రాణా ఆత్మైకాదశః । తే యదాస్మాచ్ఛరీరాన్మర్త్యాః దుత్క్రామంత్యథ రోదయంతీతి । తస్మాద్రుద్రా ఇతి । కతమః ఆదిత్యా ఇతి । ద్వాదశ వై మాసాస్సంవత్సరస్య ఏత ఆదిత్యా ఏతే హీదం సర్వమాదదానాయంతి తస్మాదాదిత్యాఇతి । కతమః ఇంద్రః కతమః ప్రజాపతి రితిస్తనంయిత్ను రేవేంద్రో యజ్ఞః ప్రజాపతి రితిశ్రుతేః ఏతేషాం త్రయస్త్రింశత్సంఖ్యాకానామమరాణామపినాయకో నః పాయాదిత్యర్థః ఏత ఏవ పృథక్ కోటిశో భవంతి ॥

అనేక కళలలో కూడిన వాడు సకలుడు. అతడు గీత వాద్యాది చతుష్షష్టి కళలతో నిష్ణాతుడు. ప్రాణాది షోడశ కళలు అనగా ఐదు జ్ఞానేంద్రియములు, ఐదు కర్మేంద్రియములు ఐదు విషయేంద్రియములు సత్త్వ గుణవ్యష్టి సమష్టుల చేతనూ రజోగుణ వ్యష్టి సమష్టుల చేతను అంతః కరణ చతుష్టయము ఏర్పడగా బుద్ధి మనస్సులోనూ చిత్తము అహంకారములోనూ అంతర్భవించి చిత్తము మనస్సులో లయము చెందగా షోడశ పదార్థములే కళలుగా ఉన్నవి. కల్పమునకు చివరన వచ్చే ప్రళయమున నశింపని వారు. అమరులు. సమస్త దేవగణమునకు నాయకుడు శ్రీకాళహస్తీశ్వరుడు. దక్షిణ కైలాస క్షేత్రమునకు దక్షిణ దిక్కులో ఉండే శ్రీశివానంద శిఖరాగ్రమునకు పశ్చిమ భాగమున వెలసిన శ్రీఅగస్త్యేశ్వర స్వరూపుడైన పరమేశ్వరుడు మనలను రక్షించుగాక అని ప్రార్థించుచున్నాను.

మరి ఒక అర్థమును వాజసనేయ వేద శాఖలో చెప్పినట్లుగా సకల శబ్దమునకు ముప్పై మూడు కోట్ల సంఖ్యగల దేవతలకు శ్రీకాళహస్తీశ్వరుడే నాయకుడు. వేదమున ఇంకొక శాఖలో అసలు దేవతలు ఎంతమంది అని ప్రశ్నించినచో ముప్పై మూడు అని అర్థము కలదు. అందులో అష్టవసువులు, ఏకాదశరుద్రులు ద్వాదశ ఆదిత్యులు ఇరవై తొమ్మిదిమంది ఇంద్రుడు ప్రజాపతులు ముప్పై ముగ్గురు. ఇందులో అగ్నిదేవుడు, పృథివీ, వాయువు, ఆకాశము, సూర్యుడు, పగలు, చంద్రుడు, నక్షత్రములు మొదలగునవి వస్తువులు. వీరిద్వారానే జీవులకు సంపదలు చేకూరును. ఐతే రుద్రులు ఎంతమంది అనే ప్రశ్నకు పురుషునిలో పది ప్రాణములలో ఆత్మను కూడా కలిపినచో పదకొండు అగును. సూర్యులు ఎంతమంది అని ప్రశ్నించినచో సంవత్సరమునకు మాసములు పన్నెండు, దేవేంద్రునకు యజ్ఞపతిగా దేవగణమునకు కైలాస పతి ఐన ఈశ్వరుడే. ఆయనే వీరందరికి నాయకుడు. ఆయన ఆజ్ఞానుసారముగా దేవతలు మూడు లోకములను పాలించుచున్నారు. ముఖ్యముగా కైలాసవాసి ఐన శ్రీ పరమేశ్వరుడు అందరికి ప్రభువు. ఆయన కృపను పొందుటే మానవుల ముఖ్య కర్తవ్యము. ఆయన భక్త సులభుడు కనుక శ్రీకాళహస్తిలో వెలసెను. సకలామరనాయకుడైన ఆయన నాకు అమరత్వము ప్రసాదించుగాక.

## భర్గః 62

భర్జ్యంతే దహ్యంతే పాపాన్యస్య భజనాదితి భర్గః । అథ భర్జ్యంతే కామకాల త్రిపురాణ్యనేనేతి వా భర్గః । భృస్ - జో - పా - కే - గాయత్రీమంత్ర ప్రతి పాద్య ఇత్యర్థః । గాయత్రీమంత్ర పదాన్వయః ఏవం దృశ్యతే । దేవస్య దీప్యమానస్య సవితుస్సూర్యస్య మధ్యే యో భర్గః పరమేశ్వరః । హరస్స్మరహరో భర్గ ఇత్యభిధాన కోశాత్ । స చ నో స్మాకం ధియోబుద్ధివృత్తీః ధర్మాదిగోచరాః ప్రచోదయాత్ప్రేరయేత్ తద్వరేణ్యం భర్గాఖ్యం బ్రహ్మ ధీమహి ధ్యాయామః । లింగాది వ్యత్యయశ్ఛాందసః । య ఏషోంతరాదిత్యే హిరణ్మయః పురుష ఇతి । నమో హిరణ్యబాహవే హిరణ్యవర్ణాయేత్యాది శ్రుత్యనుగమాత్ । గాయత్రీమధ్యగత భర్గ శబ్దలక్షితః పరమేశ్వరో నః పాయాదిత్యర్థః ॥

భక్తుల పాపములను దహించు వాడు భర్గుడు, పాపులను వేధించు వాడు గూడా భర్గుడే. భజ్యము అనగా దహనశక్తి కలిగినది. భక్తుల పాపములను పరమేశ్వరుడు నశింప చేయును గనుక ఆయన భర్గుడు. గాయత్రీ మంత్ర పదముల అన్వయము ఈ విధముగా కనపడుచున్నది. వెలుగులతో ప్రకాశించే దేవుడు. వెలుగుల రేడు. ఐన సూర్యునికి సవిత్రునికి మధ్యలో ఉండేవాడు పరమేశ్వరుడైన భర్గుడు. హరుడు అనగా తీసుకొనువాడు, విభాగించువాడు పట్టుకొనువాడు అని అర్థము. స్మర హరుడు అనగా కామారి, భర్గుడు అనగా పాపులను వేధించు వాడు, ఏవంగుణవిశిష్టుడైన పరమేశ్వరుడు నాకు ధీః = తెలివి.మతి, ఊహ, భావన, ఆలోచన ఏ జ్ఞానేంద్రియముచేత కలిగించునో ఆ బుద్ధిని నాకు ప్రసాదించుము. మానవ ప్రవృత్తి ఎప్పుడు ధార్మికముగానే ఉండవలెను. మనస్సును గూడా ఆ మార్గముననే ప్రచోదనను చేయువలెను. వరేణ్యమనగా ముఖ్యమైన దానినే ఎన్నుకొనుట, కోరవలసినదే కోరుట అని అర్థము. జగత్తులో బ్రహ్మ కలిసి ఉన్నందున 'నేతి నేతి' అనే ఉపనిషద్వాక్యములచే బ్రహ్మలో కలిసిన జగత్తును విడదీసి బ్రహ్మను దర్శించుట. ధ్యానించుట మొదలగునవి చేయువలెను. వేదమున శ్రీసదాశివుని బంగారు రంగు కల పురుషునిగా హిరణ్మయకేశునిగా పశుపతినిగా, ఉమాపతినిగా వర్ణించెను.

గాయత్రీ మంత్ర భాగమున భర్గునిగా ధ్యానమున్న పరమేశ్వరుడు నన్ను రక్షించుగాక అని శ్రీకాళహస్తీశ్వరుని నేను ప్రార్థించుచున్నాను. శ్రీగాయత్రీ మంత్రార్థమును శ్రీఆదిశంకరులు పరబ్రహ్మకే సమన్వయమగునట్లు చెప్పిరి.

## దుర్గా సమారాధ్యః 63

దుఃఖేనాపి పరైర్గంతుమశక్యా దుర్గా శక్తిః సాగిరిజా పరిచారికా జ్ఞానాంబికా తపసి అధికసాహాయ్యం కృతవతీపరమేశ్వరమభ్యర్చ్య తద్దత్త విగ్రహశోభాం ప్రేతి కథా తతశ్చ తయా దుర్గయా సమారాద్ధుం యోగ్య ఇత్యర్థః యద్వా దుర్గం నరకం తద్వంతో దుర్గాః పాపినః తైస్సమ్యగారాద్ధుం యోగ్యో న భవతీతి దుర్గా సమారాధ్యః ఉక్తంచ భగవతా ।

**న మాం దుష్కృతినో మూఢాః ప్రపద్యంతే నరాధమాః ।**
**మాయయాపహృతజ్ఞానాః అసురం భావమాశ్రితాః ఇతి ॥**

దుర్గను చండిక అని కూడా పిలిచెదరు. దుర్గాదేవి దుర్గముడు అను రాక్షసుని సంహరించుటచేత ఆమెకు దుర్గ అనే పేరు వచ్చెను. కష్టము చేత పొంద దగినది. సర్వ దుఃఖములను ఆమె అంతము చేయును. ఇతరులచేత పొందుటకు శక్యముగానిదీ దుర్గాదేవియొక్క శక్తి. ( గిరేః గిరౌ వా జాయతే ఇతి గిరిజా) కొండయందు పుట్టినది కనక పార్వతికే గిరిజా అని మరి ఒక పేరు కలదు. ఆమే శంకరునకు ఆత్మీయ పరిచారికగా కొంతకాలము గడిపినది. జ్ఞానము అనగా పరమాత్మ విషయమైన వివేచనము, బ్రహ్మోపాసన, ఆత్మసాక్షాత్కారము, ఆత్మ స్వరూప ప్రకాశనము, మోక్ష ఫలకమైన బుద్ధి బ్రహ్మ ప్రాప్తికి సాధనమైన నిష్ఠను ఫలప్రదముగా ఇచ్చే తల్లిని శ్రీజ్ఞాన ప్రసూనాంబికా అని పిలిచెదరు. ఆ అమ్మ పరమేశ్వరుని కోసం ఘోరమైన తపస్సు చేసి ఆయన మెప్పును పొంది ఆయన అందమునకు లోబడి ఆయనను భర్తగా పొందినది. తీవ్రతపస్సుచేత శ్రీపరమేశ్వరుని అర్ధ శరీరమే ఆమె పొందినది. దుర్గం అనగా నరకమని అర్థము. పాపాచరణ వల్లనే నరకము సిద్ధించును కనుక పాపములన్నియు ఆమె అనుగ్రహంతో నశించును. పాపులైన జీవులు జ్ఞాన ప్రసూనాంబికను కొలుచుటకు కూడా అనర్హులు. మాయచేత ఆవహించిన జీవులు రాక్షస ప్రవత్తిని చేపట్టి మూఢులు అగుచున్నారు. వారు నరాధములు. అటువంటి అధములు కూడా శ్రీజ్ఞాన ప్రసూనాంబికను భక్తి ప్రపత్తులతో సేవించినచో ఆమె అనుగ్రహించి తరింప చేయును. అఘటనాఘటన సమర్థురాలైన ఆమె శ్రీపరమేశ్వరుని సేవించి ఆయన అర్ధాంగి ఐనది.

## శక్రప్రస్తుతః వైభవః 64

**శక్రేణ ప్రకర్షేణ స్తుతో వైభవోస్యాస్తీతి శక్రప్రస్తుతవైభవః ।**

అత్ర జాతు చిదింద్రస్సభాయామప్సరో లాస్య మవలోకయన్నంతరా సమాయాతం గురుమనభ్యర్చ్య తస్మిన్నంతర్హితే పశ్చాత్తప్తాన్నే త్వష్టారం ప్రతినిధాయ తస్మిన్న పి విహితదైత్యాభిమానే సతి తం వజ్రేణాహనత్ ఆచార్యావమానతద్ధననాఘద్వితయే నసుతరాందూయమానమనాశ్శ్రీకాళహస్తీ క్షేత్రే తపస్తప్త్వా దేవస్య సాక్షాత్కారసమయే విషహరణ కాపు రధ్వంస నాద్యపదానస్తుతిభిస్తోషయామాసేతి కథా । అతశ్శక్రప్రస్తుత వైభవ ఇత్యర్థః ॥

దేవేంద్రునిచేత మిక్కిలి స్తుతింపబడిన వాడు శ్రీకాళహస్తీశ్వరుడు. శ్రీకాళహస్తీశ్వరుడు తన వైభవమును స్తుతి మాత్రముననే పరమానంద భరితుడగువాడు. ఒకానొకప్పుడు దేవేంద్ర

సభలో దేవేంద్రుడు అప్సరసల నాట్యమునకు సమ్మోహితుడై పరవశుడై తనవారిని పలుకరించుటను మరచి వారి నాట్యమును చూచుచూ ఆనందించుచుండెను. అంతలో ఆ సభకు బృహస్పతి వచ్చెను. దేవగురువు రాకను కూడా గమనింపక ఆయనను గౌరవించక ఆ నాట్యానందమున దేవేంద్రుడు ఉండెను. అంతట బృహస్పతి బ్రహ్మ వద్దకు వెళ్లి దేవేంద్రుని విషయమును నివేదించెను. ఈ విషయమును తెలుసుకొన్న దేవేంద్రుడు గర్విష్ఠుడై అహంకారముతో తన వజ్రాయుధముతో బృహస్పతిని సంహరించెను. కొంతకాలము తర్వాత పశ్చాత్తప్తుడై శ్రీకాళహస్తీశ్వరుని గూర్చి ఆక్షేత్రమునకు వచ్చి గొప్ప తపస్సుచేసి శ్రీకాళహస్తీశ్వరుని దర్శించి తన పాపములను పోగొట్టుకొనెను.

ఒకనాడు బృహస్పతి ఇంద్రుడు కైలాసమున ఉన్న శ్రీశివుని చూచుటకై ముని రూపములను ధరించి బయలుదేరిరి. శ్రీసదాశివుడు వీరిని పరీక్షింపగోరి ఉగ్రరూపుడై దిగంబరుడై వీరి మార్గమునకు అడ్డుగా వచ్చెను. మొదట ఇంద్రుడు అతనిని శ్రీసదాశివునిగా ఎరుగక అతనిని సంహరించుటకై ఎదురుగా వచ్చిన వజ్రాయుధమును ప్రయోగించెను. ఆ దిగంబరుడు ఇంద్రుని తన మూడవ కంటిచేత భస్మము చేసెను. అప్పుడు బృహస్పతి ఆ దిగంబరుడే శివుడని గ్రహించి అనేకవిధములుగా స్తోత్రము చేసి దేవేంద్రుని బ్రతికింపమని ప్రార్థించెను. అంతట శివుడు ఆయన కోర్కెను అనుగ్రహించెను. అందువల్ల ఈశ్వరానుగ్రహముతో శక్రుడు తన పూర్వ వైభవమును పొందెను. అహంకారముచేత పదవీభ్రష్టులైనవారు శ్రీకాళహస్తీశ్వరుని ప్రార్థించగా వార్కి ఆయన వారి పూర్వవైభవమును ఇచ్చును.

## నేతా 65

వాయుసూర్యాదిదైవతకులం స్వస్వకృత్యేషు నియమేన శాసయన్నయతి ప్రేరయతీతి నేతా । శ్రు । భయాదస్యాగ్నిస్తపతి భయాత్తపతి సూర్యః భయాదింద్రశ్చ వాయుశ్చ మృత్యుర్ధావతి పంచమ ఇతి తథాచ వాజసనేయకం యస్సర్వేషు భూతేషు తిష్ఠన్ సర్వేభ్యోఽంతరోఽయం సర్వాణి భూతాని న విదుః యస్య సర్వాణి భూతాని శరీరం యస్సర్వాణి భూతాన్యంతరోఽయమయ త్యేష త ఆత్మాఽంతర్యా మ్యమృత ఇతి తస్మాచ్చరాచర సర్వజగన్నేతాఽయం శ్రీకాళహస్తీశ్వరోనః సన్మార్గేణ నయత్విత్యర్థః ॥

వాయువు, సూర్యుడు, దేవ గంధర్వ, యక్ష, కిన్నర కింపురుషాది గణములు వారి పనులయందు నియమించి, శాసించి, ప్రేరేపించి వారిని తీసుకొని వెళ్ళువాడు నేత. నేత అనగా ప్రభువు, ఏలిక అని అర్థము. అగ్నిదేవుడు పరమేశ్వరునియొక్క భయమువలన (భీతిచే) తపింప చేయును. దహించును, సూర్యుడు భయపడి వెలుతురు వెదజల్లినవి కలుగచేయుచున్నాడు. ఇంద్రుడు కూడా భయపడి కాలానుగుణమైన వర్షములు మొదలగునవి చేయుచున్నాడు. వాయువు యముడు మొదలగు వారు తమ కార్య భారములను క్రమము తప్పక చేయుచున్నారు. ఇంద్రాదిలోకపాలకులు ప్రభువులు, పరమేశ్వరునియందు భయముచేత క్రమబద్ధమైన పాలనను అందించు చున్నారు.

వాజసనేయ శాఖయందు ఏ సర్వేశ్వరుడు సర్వభూతములయందు ఉండువాడు. ఎవరు ఆయన గూర్చి తెలుసుకోలేరో వారు మూర్ఖులు ఆయనే సర్వమునకు నేత ప్రభువు. చరాచరమైన ప్రపంచమునందు ఆయన నిండి ఉన్ననూ ఆయన గూర్చి చరాచర ప్రపంచములోని జీవులకు తెలియదు. జగత్ప్రభువైన వాడు శ్రీ కాళహస్తీశ్వరుడు. ఆయనే జగన్నేత. భక్తులకు సన్మార్గమును చూపు వాడు కూడా ఆ పరమేశ్వరుడే. ప్రపంచనేత ఐన శ్రీకాళహస్తీశ్వరుడు నన్ను సన్మార్గమున నడిపించి నాకు ముక్తిని ప్రసాదించమని ప్రార్థించు చున్నాను.

## హరహరోద్ధర్తా 66

హరహరస్యోద్ధర్తా హరహరోద్ధర్తా కశ్చిచ్ఛివద్విజః శ్రీమద్దక్షిణ కైలాసస్థం వాయులింగమభ్యర్చయన్ శివసంస్కార వానపి విషయభోగేచ్ఛయా శివద్రవ్యాణ్యపహృత్య మ్తాలో నరకయాతనాం సుచిరమనుబభూవ తథాచ కూర్మ వచనం

**శివద్రవ్యాపహరణం శివనిందా చ కుత్రచిత్ ।**
**శివభక్తాపరాధశ్చ ప్రాయశ్చిత్తే న వక్ష్యతీతి ॥**

వచనే సత్యపి సమయవిశేషాదిశైవసంస్కారాత్ భూతిరుద్రాక్షధారణపంచాక్షరీ జపాత్ చిరనిరయయాతనానుభవాచ్చ తస్మిన్నీశ్వర దయోదయాత్ సానందమునిర్దిష్టా ్యగత్యాయుం విలోక్య కరుణయా హరహరేతి జగర్జ తత్ క్షణేనాయం యమసన్నిధానమభ్యేత్య హరహరేతి నామ ప్రాప్య తదుపదిష్ట మార్గేణ పశ్చాద్భువే శివమారాధ్య ముక్తోఽభూత్ తతో హరరహోద్ధర్తాఽయం దేవో మామపి భవాదుద్ధరేత్ ॥

పరమేశ్వరుని శక్తి అనేక విధములుగా వాఙ్మయమున తెలియ బడుచున్నది. ("పరాఽస్య శక్తిః వివిధైవఽశ్రూయతే." శ్వేత 6-8) పరమేశ్వరుడు ఒక్కడే ఐననూ శివకేశవ హిరణ్యగర్భరూపములగు అనేక అవతారములచే ప్రళయ స్థితి సృష్టికి హేతువగు శక్తిని ప్రదర్శించుచున్నాడు. ఒకే పారమేశ్వర తత్త్వము అనేక రూపములలో జీవులకు ప్రత్యక్షమగుచున్నది. ఇచట హరి హరులకు అభేదము. విష్ణురూపాయ నమశ్శివాయ, శ్రీం హ్రీం విష్ణురూపాయ నమశ్శివాయ, విష్ణు రూపాయ శివాయనమః, శివాయ విష్ణు రూపాయ ఇటువంటి నామములు హరిహరా భేదమును సూచించు చున్నది.

**కిమస్థిమాలాం కిము కౌస్తుభం వా**
**పరిష్క్రియాయామ్ బహు మన్యసే త్వం ।**
**కిం కాలకూటః కిముదా యశోదా**
**స్తన్యం తవ స్వాదు వద ప్రభో! మే ॥**

ఈ శ్లోకమున సర్వేశ్వర రూపము శివకేశవ సమష్టి రూపము. పరమేశ్వరుడు దేహాలంకరణ సమయమున అస్థిమాలను (కపాలముల మాలికను) ఉత్తమాలంకారముగా స్వీకరించునా లేక కౌస్తుభమణిని (క్షీర సాగరమథనమున శ్రీలక్ష్మితో పుట్టినది.) గ్రహించెదవా? (ఉత్తమాలంకరముగా భావించెదవా) ఆకలి వేసినప్పుడు నీకు కాలకూట మహావిషము రుచించునా లేక యశోదాస్తన్యము రుచించునా? అని శివకేశవ రూపములకు కూడా అభేదమును చెప్పెను. పిపీలికాది బ్రహ్మ పర్యంతము ఉన్నది ఒకే ఆత్మ. అనేక జీవులుగా మారినట్లు పరమాత్మే శివకేశవాది రూపభేదములతో భక్తులను అనుగ్రహించుచున్నాడు.

**శ్రీకర భక్తాం భోధి సుధాకర! చక్రత్రిశూల ధారణరక్షో ।**
**భీకర నిర్భరతకరుణాకర దృగ్దీప్తివికర! హరిహరనాథ! ॥**
**అని హరిహరులకు అభేదమును చెప్పెను.**

హరిహరులను ఉద్ధరించువాడు పరమేశ్వరుడు. ఒకానొక శివద్విజుడనే బ్రాహ్మణుడు శ్రీ మద్దక్షిణకైలాసమున వెలసినవాడును, వాయులింగాకారములోనున్న శ్రీకాళహస్తీశ్వరుని సేవించి, శైవ సంస్కార విశిష్టుడైనప్పటికిన్నీ ప్రాపంచిక సుఖములను మరిగి, విషయభోగములకు

శివ ద్రవ్యములను అపహరించి సుఖములను అనుభవించుచుండెను. కాలక్రమమున అతను మరణించగా నరకమునకు వెళ్ళి చాలా కాలము నరక యాతనను అనుభవించెను. కూర్మపురాణమున ఇట్లు ఉన్నది. ఎప్పుడైననూ ఎక్కడైననూ ఎవడైననూ శివ ద్రవ్యమును అపహరించుటగాని శివుని నిందించుటగాని శివభక్తులయందు అమర్యాదగా అసభ్యతగా ప్రవర్తించినచో ఆ అపరాధ నివృత్తికి ప్రాయశ్చిత్తము కూడాలేదు అని ఇటువంటి వచనములు ఉన్నప్పటికినీ విశేషమైన శైవ సంస్కారమువలన విభూతి రుద్రాక్ష ధారణ పంచాక్షరీ జపముచేత ఈశ్వరుననుగ్రహమును పొంది ముక్తుడగును. నరకమునకు వెళ్ళిన శివద్విజుని మీద పరమేశ్వరునికి దయ ఉదయించగా అదృష్టవిశేషమున అచటికి ఆనందయతి అనే ఒక మహర్షి అతనిని చూచి జాలిపడి అతనికి వినిపించేలాగా గట్టిగా 'హరహర' అని అరచెను. ఆ నామము విన్న నరక వాసి ఐన శివద్విజుడు దానినే నిరంతరము జపించుచుండెను. అంతట అతని భక్తికి మెచ్చి శ్రీపరమేశ్వరుడు ప్రత్యక్షమై అతనికి ముక్తిని ప్రసాదించెను. 'హరహర' అనే నామ స్మరణచేత ముక్తిని ప్రసాదించిన శ్రీకాళహస్తీశ్వరుడు ఈ సంసార సముద్రమునుండి నన్ను ఉద్ధరించమని ప్రార్థించుచున్నాను.

## చక్రకిల్బిషమార్జకః 67

చక్రస్య కిల్బిషం చక్రకిల్బిషం స్వామిద్రోహ పాపమిత్యర్థః । తన్మార్జనం వ్యపోహనమయమకరోదితి తథోక్తః । పురా । రుద్రకోపసంజాతః జలంధరాసుర మాయుధాద్యప్రధర్షం హంతుమీశ్వరశ్చరణాంగుష్ఠేన భూమౌ లిఖిత్వా తదుత్థితేన ప్రహరణేన తం సంహృత్య తచ్చక్రమసుర వధార్థం హరో విష్ణవే దదౌ । పునస్తయోః కదాచిదసురానహ మేవాఽహనం అహ మేతాన రీనమారయమితి వాశ్యాతక్ష్ణోరివ చక్రవిష్ణ్వోః కలహే జాతే త్వం నిస్తేజస్కోఽభవేతి హరిణాశప్తేన తేన స్వామిద్రోహిణా చక్రేణాగత్య శ్రీకాళహస్తీశ్వర స్సమారాధితః । తతశ్చక్రేశ్వర లింగాఽవిర్భూతో దేవః తత్కిల్బిషం మమృజే ఇతి కథా : అత్ర దుర్గాశైలస్య రాత్ప్రాచ్యాం దిశి చక్రేశ్వరలింగం విరాజతే । తస్మాదావిర్భూయ స్వామిద్రోహిణోఽపి చక్రస్య పాపం శ్రీకాళహస్తీశ్వరో యో వ్యనాశయత్ స దేవో మత్పాపం విమోచయేత్ । చక్ర ప్రసాదకాలః చైత్రశుద్ధ పంచమీ॥

కిల్బిషము అనగా పాపము, తప్పు, రోగము, చెడ్డ విషయము అని అర్థము. చక్రి యొక్క కిల్బిషము చక్రకిల్బిషము. స్వామికి ద్రోహమును తలపెట్టినంత పాపము అని కిల్బిషమునకు అర్థము. ఆపాపములను పోగొట్టుకొనే ప్రయత్నము చేయువానిని చక్ర కిల్బిషమార్జకః అని అర్థము. పూర్వము జలంధరుని సంహరించుటకు ఏ ఆయుధములు పని చేయనందున, రుద్రుడు కోపగించెను. అంతట తన కుడికాలి బొటనవ్రేలును భూమికి రాయగా అచట అగ్ని పుట్టెను. ఆ అగ్నినుండి సుదర్శనమను చక్రము పుట్టెను. దానిని శ్రీమహావిష్ణువునకిచ్చి రాక్షససంహారము చేయమని శివుడు చెప్పెను. ఆ చక్రాయుధముతో శ్రీహరి రాక్షసంహారమును చేసెను. కొంతకాలము తర్వాత చక్రరూపుడైన సుదర్శనునకు శ్రీహరికి రాక్షస వధలో భేదాభిప్రాయము వచ్చినది. రాక్షస సంహారమునకు నేనే కారకుడను అని శ్రీసుదర్శనుడు కాదని శ్రీహరి పోట్లాడుకొనిరి. అంతట కోపగించిన శ్రీహరి శ్రీసుదర్శనుని తేజోహీనుడవు కమ్మని శపించెను. అంతట శ్రీహరిచేత తిరస్కరించబడిన సుదర్శనుడు శ్రీకాళహస్తీశ్వరుని భక్తి ప్రపత్తులతో ధ్యానించెను. అంతట శ్రీకాళహస్తీశ్వరుడు లింగమునుండి ఉద్భవించి చక్రి ఐన సుదర్శనుడు చేసిన తప్పును తెల్పి అతని పాపములను, స్వామి ద్రోహమును పోగొట్టి,

అతనిని రక్షించెను అని ఒక కథ కలదు. ఇప్పటికి శ్రీకాళహస్తిలోని శ్రీదుర్గాకొండ (శైలము)కు తూర్పున చక్రేశ్వరుడు లింగాకారమున వెలసి ఉన్నాడు. అట్లా అచట ఆవిర్భవించి శ్రీకాళహస్తీశ్వరుని అనుగ్రహంద్వారా తన పాపములను స్వామి ద్రోహమనే నేరమును పోగొట్టుకొనెను. అతనిని అనుగ్రహించిన సమయము చైత్ర శుద్ధ పంచమి అని అచటి స్థానికులు చెప్పెదరు. ఎందరెందరో పాపములను నిశ్శేషముగా పోగొట్టే శ్రీకాళహస్తీశ్వరుడు నా పాపములను పోగొట్టి నన్ను అనుగ్రహింప ప్రార్థన.

## స్కంద సర్వజ్ఞతా హేతవః 68

స్కందయత్యసురా న్విద్రావయతీతి । అరాతీన్నిశ్శేషం శోషయతీతి లోకహితాయ గార్యవలోకాత్పాలలోచ నాచ్చివతేజో నిర్గత్య పరితస్స్కందతీతి వా స్కంద ఇత్యర్థః స్కందిర్ గతిశోషణయోః । తస్య స్కందస్య సర్వజ్ఞతాయా అయమేవ హేతురభూదితి తథోక్తః । నను । స్కందస్య స్వయమేవ సర్వజ్ఞత్వే కథం తస్యాన్యో హేతురితి చేత్ । స్వయమేవ సర్వజ్ఞః పరమేశ్వర ఏక ఏవ । అన్యే కుమారహరివిధిముఖాః తత్ప్రసాదేనేతి శాస్త్రాదవగమ్యతే । అయం గిరిజాంకే స్థిత్వా స్తన్యామృతం నిపీయ దేవేన దేవ్యై సముపదిశ్యమాన సర్వార్థ మవగమ్య అగస్త్య సనత్కుమారాదిభ్యః ఉపదేష్టుమారేభే। తదా శంభుర్వైదికమర్యాదాది దర్శయిషయా తపః కుర్వితేత్యాజ్ఞాపయామాస । మర్యాదా నామ శ్రుతిః తేహ సమిత్పాణయో భగవంతం పిప్పలాదముపసన్నాః శౌనకో హ వై మహాశాలోంగిరసం విధి వదుపసన్నః పప్రచ్ఛ । అధీహి భగవో బ్రహ్మేతి । ఏవమాదిశ్రుతి విహిత సంప్రదాయ, తదతిక్రమదోషపరిహారాయ గుహం తపసి సంయోజ్య తస్మై సర్వజ్ఞతాం దత్వా శ్రీవిద్యాశైల మారోప్య సర్వోపదేష్టృత్వసామ్రాజ్యేభ్యషించదితికథా ॥

స్కందుడనగా కుమారస్వామి. ఇతని తల్లి తండ్రి శివపార్వతులు. ఇంద్రుడు కుమార సంభవమునకు భయపడి శివపార్వతుల మన్మథ క్రీడకు భంగమును చేయమని అగ్నిని బ్రతిమిలాడగా అగ్ని శివపార్వతుల ఏకాంతస్థలమునకు వెళ్ళెను. అగ్ని రాకను చూచిన పార్వతి అగ్నిని కోపములో శివవీర్యమును ధరించమని ఆదేశించెను. అంతట అగ్ని శివవీర్యమును ధరించి అచట నుండి వెళ్ళెను. శివ వీర్య గర్భ భారమును మోయలేక, అగ్ని గంగను ధరించమని ప్రార్థింపగా, ఆ గర్భమును గంగ ధరించెను. కొంతకాలము తర్వాత ఆ గర్భమును ఆమెకు కూడా మోయుట దుర్భర మాయెను. అంతట ఆ గంగ ఆ గర్భమును రెల్లుగడ్డిమీద విడువగా సూర్యరశ్మికి పెరిగి బాలుడయ్యెను. ఆ బాలుని కృత్తిక (నక్షత్రములు) పెంచినందున అతను కార్తికేయుడాయెను. (బ్రహ్మపురాణము) మునిపత్నులను అగ్ని మోహింపగా అరుంధతికాక మిగతా ముని పత్నుల రూపమున ఆ స్వాహా దేవి వచ్చి అతనిని సంతోషపెట్టెను. ఈ విషయము తెలిసిన మునులు వారి పత్నులను విడువగా స్వాహాదేవి వలన జరిగిన వృత్తాంతము తెలుసుకొని శాంతించిరి. ఆరుగురు కృత్తికలు ఒకేసారి పిల్లవానికి పాలు ఇవ్వటానికి రాగా ఆ పిల్లవాడు ఆరుముఖములుగా మారి ఆ ఆరుగురి స్తన్యమును ఒకేసారి పానము చేసెను. ఇంద్రుడు కుమారస్వామిని వధించుటకు రాగా అతని గర్వమును హరించెను. శూర పద్ముడనే రాక్షసుని స్కందుడు అవలీలగా సంహరించినందున దేవేంద్రుడు తనకుమార్తె అగు దేవసేనను ఇచ్చి వివాహము చేసెను. ఒకనాడు కుమారస్వామిని చూచుటకు బ్రహ్మరాగా అతనిని ప్రణవమునకు అర్థము అడిగెను. నేనే ప్రణవ స్వరూపిని అని బ్రహ్మ చెప్పగా అసత్యమును చెప్పినందుకు కుమార స్వామి బ్రహ్మను బంధించెను. ఇంద్రాది దేవతలు శివుని వద్దకు వెళ్ళి స్కందుని

బ్రహ్మ బంధవిముక్త కోసం ప్రార్థించిరి. అప్పుడు శివాజ్ఞానుసారముగా స్కందుడు బ్రహ్మను వదలెను. శివభక్తి వ్యాప్తికై భూలోకమున అవతరించుమని శ్రీ శివుడు స్కందుని ఆదేశించగా కన్నడదేశమున చెన్న బసవనిగా అవతరించి శివభక్తిని ప్రచారము చేసెను. శ్రీ ఆదిశంకరుల అవతారమునకు ముందే కుమారస్వామి కుమారిల భట్టుగా అవతరించి బౌద్ధమత మర్మములను తెలుసుకొని వారితో వాదించి వారిని ఓడించి వారు భారత దేశమును వదిలి వెళ్ళుటకు పరోక్షముగా కారకుడయ్యెను. కుమారస్వామి విషయాసక్తుడై దేవతా స్త్రీలను మోహింపగా తన తల్లియైన పార్వతీదేవి వారి రూపమున వచ్చినట్లు తెలుసుకొని స్త్రీలందరిని అప్పటినుండి తల్లితో సమానంలుగా గ్రహించి తన వాంఛలను పోగొట్టుకొనెను. మహిషాసురుడు అంధకాసురుడు మొదలగు రాక్షసుల దేవతలను బాధించి క్రౌంచ పర్వత గుహలలో దాగి ఉండిరి. కుమారస్వామి దేవతల ప్రార్థనపై అచటకు వెళ్ళి వారిని సంహరించిరి. తారకాసురుని గూడా కుమారస్వామి సంహరించెను.

స్కందుడు యుద్ధమున రాక్షసులను తరిమికొట్టేవాడు అందువలన ఆయన దేవ సేనాధ్యక్షుడు. అరాతి అనగా శత్రువు. శత్రుశేషములేకుండగా అనగా శత్రువులనేవారు లేకుండగా శత్రుక్షయమును చేయువాడు. కుమారస్వామి లోకహితమును కోరి శత్రుసంహారమును చేయును. ఫాలలోచనుడైన శ్రీసదాశివుడు గౌరీదేవిని చూడగానే శివతేజస్సు బయుటకు వచ్చి చుట్టు పక్కల వ్యాపించగా ఆ తేజస్సే కుమారస్వామిగా ఆవిర్భవించెను. స్కందిర్ అనే ధాతువుకు గతి, శోషణము అని అర్థము కనుక స్కందుడు సర్వజ్ఞుడు అని లోకమున ప్రసిద్ధి కలదు. ఐతే స్వయముగా సర్వజ్ఞుడైన వానికి అతను సర్వజ్ఞుడు అని చెప్పుటకు వేరే కారణములు ఉండకూడదు కదా? ఐతే సర్వజ్ఞుడు పరమేశ్వరుడు స్వయం సిద్ధముగా ఒక్కడైనప్పుడు ఇతరులు సర్వజ్ఞులుగా ఉండవచ్చునా? పరమేశ్వరాను గ్రహముచేత అల్పజ్ఞులైన బ్రహ్మాది దేవతలు లోకరక్షణ జగత్సృష్టి చేయు చున్నారు గదా! కుమారస్వామి శ్రీపార్వతీదేవి లొడమీద ఉండి ఆమె స్తన్యమును సేవించి శివపార్వతుల ఉపదేశములచేత సమస్త ప్రపంచతత్త్వమును తెలుసుకొనెను. అగస్త్య సనత్కుమారాది మహర్షులు ఉపదేశములను కూడా పొందిరి. పరమేశ్వరాజ్ఞచేత తపస్సుచేసి సిద్ధికూడా పొందెను. వేదాంత జ్ఞానమునకు ఉపనిషద్వాక్య శ్రవణము గురుశుశ్రూషా చాలా అవవసరము. బ్రహ్మ చర్యాశ్రమమునందే అనేక విద్యలను నేర్వవలెను. వైదిక సాహిత్యమున పిప్పిలాదులు ఇద్దరు కలరు. ఒకడు దధీచి లోపాముద్రలకుమారుడు. మరొకడు సువర్చ దధీచుల కుమారుడు. పిప్పలాదుడు రావి ఫలములను మాత్రమే ఆహారముగా తీసుకొని ఒకచోట స్థిరముగా లేకుండగా తిరుగుచూ తన జీవనమును గడుపు చుండెను. కానీ ఇతడు మహాపండితుడు. ఇతనికథ ప్రశ్నోపనిషత్తులో కలదు. ఇతను భృగు గోత్రీకుడు. అథర్వణ వేదమునందు ముండకోపనిషత్తు కలదు. అందు పరవిద్యగూర్చి అపరవిద్య గూర్చిన చర్చ జరిగెను. శౌనకుడు పాంచాల దేశీయుడు. త్రిగర్త గ్రామ నివాసి. పాండిత్యపకర్షతో పాటుగా ఐశ్వర్య వంతుడుకూడా. అంతటి పండితుడుగూడా అంగీరసమహర్షి దగ్గరకు వెళ్ళి 'ఓ ! పూజ్యుడా ! బ్రహ్మగూర్చి తెలుపుమని' ప్రార్థించెను. (అధీహి భగవో బ్రహ్మేతి) ఇటువంటి వేదవాక్యములవలన విద్యను నేర్చుకొనేవారు ఎట్లు ప్రవర్తించవలెనో విహితమైన సంప్రదాయము ఏది. దానిని అతిక్రమించినచో ఆ దోషముల పరిహారముకూడా సంప్రదాయమున చెప్పిరి. కనుక పరమేశ్వరుడు కుమారస్వామిని తపస్సు

చేయమని చెప్పి అతనికి సర్వజ్ఞత్వమును ఇచ్చి శ్రీవిద్యాశైలమునందుంచి, సర్వోత్కృష్టమైన సామ్రాజ్యమున అభిషేకించెను అని కథ ప్రచారమున కలదు. కనుక స్కందునికి సర్వజ్ఞత్వము శ్రీపరమేశ్వరుని అనుగ్రహమువల్లనే లభించెను అని పురాణ గాథ కలదు.

## పంచధా భిన్న మస్తకః 69

పంచధా పంచప్రకారేణ ఖండశః। భిన్నోమస్తకోఽస్యాస్తీతి తథోక్తః మస్యతి కఠినత్వేన పరిణమతీతి మస్త । మస్త ఏవ మస్తకః। మస । పరిణామే । నందిశైలవాసిన్యాః వీర శైవపల్న్యాశ్శివభక్తాన్నదాత్ర్యాః కస్యాశ్చిన్మందిర ద్వారే తద్భక్తిజిజ్ఞాసయాత్యంత వృద్ధోతివర్ణాశ్రమసన్న్యపేత్యక్షుధితోస్మ్యహం త్వరయాన్నం దిశేతి। సోత్కంపం సగద్గదం దేవశ్చుక్రోశ । సపది సా శైవీ ససంరంభం అర్ధపక్వ పాయసమాదాయ ముఖే నాధ్మాయ దర్వ్యావృద్ధహస్తేఽక్షిపత్ తదుష్ణతాఽసహిష్ణుర్నారాయణేతి వదన్ సద్యస్తద్దర్వ్యా ప్రహతః పంచధాభిన్న మస్తకోఽభూదితి యద్యప్యయం నారాయణశబ్దస్సర్వాధిష్ఠానపరబ్రహ్మవాచక ఏవ హి। న్ర నయనే। పచాద్యచ్ నరో నేతా సర్వస్వామీ। తస్యాపత్యాని నారాస్సర్వే చేతనా చేతనాశ్చ తేషామయనమధిష్ఠానతయా ఆశ్రయభూతః జలచంద్రాణాం బింబచంద్రవత్కాళ ధౌతానాం శుక్తివచ్చ నారాయణః పూర్వపదాత్సంజ్ఞా యామితి ణత్వం । ఏవంభూతం శ్రీమన్నారాయణనామోచ్చారణం అత్యంతశ్రేయః ప్రదమేవ । తథాపి సా స్వభర్తృవచనం స్వమతం చాశ్రిత్య కుపితా సతీ వృద్ధం దర్వ్యా ప్రజహార తస్య దేవస్య తత్ర సంతుష్టిరేవాసీత్ । సన్విదముత్తారకేశ్వరచరితం పంచధాభిన్న మస్తక ఇతి తల్లక్ష్మాద్యాఽపి దృశ్యతే శ్రీకాళహస్తీశ్వరస్య కిమునేనాయాతం అత్ర వాయులింగదృశ్యమానశిరోవిభాగస్తు లూతాగజయోశ్ఛిన్నధారణవత్ కృష్ణసర్పస్యాపి శిరః పంచకం ధత్తే ఇతిచెన్న । పురాణే శ్రీకాళహస్తీశ్వరస్యైవ సన్యాస వేషగ్రహణ తత్కరదర్వీ ప్రహారాది వర్ణనాత్ । పంచధాభిన్న మస్తక ఇతి మూలపురాణేన భేదస్య కంఠత ఉక్తత్వాత్ । పంచశీర్ష సర్ప శీర్షాణాం పంక్త్యావర్తితవ్యత్వే సతి దన్యథాభావేన దర్శనాచ్చ తద్దర్వీ భిన్న మస్తకత్వం శ్రీకాళహస్తీశ్వరస్యైవ సేద్ధుమర్హతి। నహ్యుత్తారకేశ్వరోఽపి విభిన్నః । త్వత్ప్రహారేణేత్థం జాతోస్మీతి తస్యాః ప్రత్యాయనార్థమావిర్భూతం లింగముత్తారకేశ్వర సంజ్ఞమభవత్ । తస్మాద్భక్తవశంవదో దేవ ఇత్యర్థః అథవా । పంచ ప్రకారేణ వర్ణలక్షణాదిభిర్విభిన్నా ఈశాన తత్పురుషాఘోరవామదేవ సద్యోజాతాత్మకాః మస్తకాశ్శిరాంస్యస్య సంతీతి తథోక్తః తథాచోక్తం। ముండభంగిన్యాసే। ఓం హ్రౌమీశానమూర్ధ్నే నమ ఇత్యాది పంచవిధమస్తకత్వం సదాశివస్య స్వభావసిద్ధమేవ। అయమే వార్థో యథార్థః। అన్యథా। త్రిపురవిజయినః కాలకాలస్య సాంబమూర్తేః పరప్రహరణ ప్రహార ఇత్యేతన్న కథముపహాసాస్పదం భవేదితి భావః । తస్మాత్ శివస్య ధనుర్ముసలాశ్మకుసుమ వేత్రదర్వ్యాదిప్రహారాఖ్యానస్య భక్తవశంవదత్వవిజ్ఞాపనద్వారా సాధకస్య భక్తి ప్రచోదనార్థత్వం । అతశ్చ వ్యావహారికమేవ । పారమార్థికం తు పరస్పరవిభిన్న పంచ బ్రహ్మాకార శిరస్కత్వమేవ సిద్ధం। స పంచ బ్రహ్మవదనః పాతు మామిత్యర్థః।

ఐదురకములుగా ముక్కలైన శిరస్సు కలిగినది పంచధా భిన్న మస్తకము. సామాన్యముగా శిరస్సు పగులుట అసాధ్యము. తల మిక్కిలి కాఠిన్యము కలిగి ఉండుటవలన ముక్కలు ముక్కలుగా పగులుట కొంచము కష్టము. శిరస్సు ఐదు విధములుగా పగులుటకు కారణము ఏమి? అనే ప్రశ్నకు ఒక చిన్న కథే సమాధానము. నంది శైలమున నివాసము ఉంటున్న ఒక

వీర శైవుని భార్య రోజూ తన ఇంటికి వచ్చిన శివభక్తులకు అన్నమును దానము చేయుచూ ఉండెను. ఒకరోజు శివాలయమున శివమహిమను గూర్చి ఆమె జిజ్ఞాసతో వినుచూ ఉండెను. అంతలో ఒక వృద్ధుడు. సంన్యాసము స్వీకరించినవాడు, ఆకలిలో బాధపడుచూ ఆమెవద్దకు వచ్చి తన దైన్యమును నివేదించెను. ఆలయములోని పౌరాణికుడు తన ప్రవచనమునకు, శ్రోతల శ్రవణమునకు భంగము ఏర్పడెనని ఆ సన్యాసిని బయటకు వెళ్ళమని అరచెను. ఆ సన్యాసిపై జాలిపడి ఆమె వెంటనే తన ఇంటికి వచ్చి సహ భాగము ఉడికినదియు, బాగా వేడిగా ఉన్నదియు ''పాయసమును గరిటతో వృద్ధునిచేతిలో వేసెను''. ఆ వేడిని ఆ వృద్ధుడు తట్టుకొనలేక ''నారాయణా'' అని గట్టిగా అరచెను. నారాయణా అని గట్టిగా అరచినందున ఆమె కోపగించి ఆవృద్ధుని తలపై వేడిగా ఉన్న పాయసపు గరిటతో బాదెను. అంతట ఆ వృద్ధుని తల ఐదుగా చెక్కలయ్యెను. అంతట అతను మరణించెను. కానీ నారాయణ శబ్దము సర్వాధిష్ఠానమైన పరబ్రహ్మ వాచకము. నృ నయనే అనే ధాతువు నుండి నారాయణ శబ్దము పుట్టినది. మానవులకు ఆయనే నేత, సర్వమునకు ఆయనే నేతా. నారాయణ నుండి చరాచరమైన ప్రపంచము ఆవిర్భవించెను. కనుక ప్రపంచమునకు ఆయనే అధిష్టాతా. ఆయన ఆశ్రయము చేతనే ప్రపంచము నిలబడుచున్నది. నీటిలో ప్రతి బింబించే చంద్రుని కళ, తెలుపు తనము అన్నియు నారాయణుని ప్రతిరూపములే కనుక నారాయణుని నామోచ్చారణ మిక్కిలి మోక్షకారకమే గదా! ఐనప్పటికి ఇచట తన మలాచారముగా తన భర్తమాటలను ఆశ్రయించినందున దానికి విరుద్ధముగా ఆ వృద్ధుడు తన బాధలో నారాయణ స్మరణచేసెను. అందువల్ల ఆమె దర్వితో (గరిటే) ఆ వృద్ధుని శిరస్సుపై కొట్టెను. అంతట వాడు మరణించెను. నారాయణస్మరణచేత వృద్ధుడు మరణించినందున శ్రీమన్నారాయణునకు సంతృప్తి జరిగెను. ఐతే ఉత్తారకేశ్వర చరిత్రలో ఐదురకములుగా ముక్కలైన తలగూర్చిన వివరము కలవు. ఐతే శ్రీకాళహస్తీశ్వరునికి ఈనామమునకు సంబంధమేమి అని? ప్రశ్నించినపుడు ఇచట వాయులింగా కారముగా కనబడే స్వామి శిరోభాగమున సాలెపురుగు, ఏనుగు చిహ్నములు ఉన్నట్లుగా కృష్ణ సర్పముయొక్క ఐదుతలల చిహ్నముకూడా ఉన్నదా అన్నచో లేదు అని సమాధానము. ఐతే ఒక పురాణమున శ్రీకాళహస్తీశ్వరుడే ఆ వీరశైవుని భార్యను పరీక్షింపగోరి సంన్యాసవేషమును ధరించి వచ్చినచో ఆమె ఆయనను గరిటతో కొట్టుట వర్ణించుటచే తల ఐదు విధములుగా పగిలెను అని ఉండెను. ఐతే మూలపురాణమున వేరే విధముగా ఉండెను. ఉత్తారకేశ్వరుడు కూడా వేరు. ఐతే మూల పురాణమున గరిటతో కొట్టుటవలన ఇట్లు ఐతిని. అందువల్ల ఉత్తారకేశ్వర అనే సంజ్ఞను కలిగినవాడనైతిని. ఇది అంతయు సర్వేశ్వరుని అనుగ్రహము వలననే జరిగెను.

ఐదురకములుగా పంచలక్షణ విలక్షునిగా ఐదుముఖములుగా శివున్ని వర్ణించుటచేత సర్వేశ్వరుని ఈశానుడని, తత్పురుషుడని అఘోరుడని వామదేవుడని సద్యోజాతుడని ఐదుముఖములుగా వర్ణించి స్తోత్రము చేయుచున్నారు. ముండ భంగి న్యాసమున ఓం హ్రీం ఈశానమూర్ధ్నే నమః అని పంచవిధ శిరములు శ్రీసదాశివునకు స్వభావసిద్ధములే. పైన వర్ణించిన ఐదు ముఖముల ఉపాసనా ఫలములు వేరు వేరుగా కలవు. ఘోరః అనగా భయంకరమైన విక్రమము కలిగినవాడునూ అని నాశశూన్యుడూ అఘోరుడు. అఘోర రూప మంత్రానుష్ఠానముచేతను ఆరూపము అర్చించుట చేతనే సకలపాతకములనుండి వచ్చిన దుఃఖములు పోవును. కలికాలమున ఆచరించిన పాతకముల నుండి రక్షణను కలిగించును. ఈశానుడనగా విశ్వరూపుడు. మాయచేత ఆడుకొనువాడు. ఆయన ఐశ్వర్య విశిష్టుడు. సర్వస్వామి. సర్వేశుడు సర్వవ్యాపకుడు సాంఖ్య

దార్శనికులు చెప్పిన 32 తత్త్వములు. ఈ సర్వేశ్వరుని స్వరూపములే. ''న జాయతి ఇత్యజః'' ఈశానుడు షడ్గుణైశ్వర్యవంతుడు. వేదాభయేష్టాంకుశ పాశటంక కపాల ఢక్కాక్ష త్రిశూల పాణిం। అజాముఖం పంచముఖం సితాభమీశానరూపం శివమానతోస్మి' అని ఈశానుని ప్రార్థించెదరు. సద్యోజాతుడు అనగా మహాఋషులు సూతమహర్షిని బ్రహ్మదేవుడు మహేశ్వరుని ఐదు ముఖములను ఎట్లు చూచిరి అని ప్రశ్నించగా తెలుపు రంగులో ప్రకాశించే ఈశ్వరుని మొదటగా చూచితిని అని కుందేందు శంఖస్ఫటికావభాసం, వేదాక్షమాలా వరదాభయాంకం।సునందనంద ప్రముఖైః స్తుతం తం సద్యోఽధిజాతం శరణం ప్రపద్యే॥ అని బ్రహ్మ సద్యోజాత స్వరూపమును ప్రార్థించెను. శ్రీసూతమహర్షి మునులకు 33 వ కల్పమహిమను చెప్తూ అందు వామదేవుని గొప్పతనముగూడా చెప్పెను. సాంఖ్యదార్శనికులచేత గొప్పగా చెప్పబడిన తత్త్వములతో కూడుకొని ఉన్నాడని. లోకాధార భూతుడున్నూ వామమనగా సుందరమైన రూపును, ఈశ్వర సమాధిలో ధ్యానించి, ప్రభువును తెలుసుకొనుట వామదేవుని దర్శించిన వానికి దుర్లభములు లేక పుట్టుకలేని రుద్ర లోకమును చేరును. వరాక్షమాలాఽభయ టంక హస్తం సరోజ కింజల్క సమాన వర్ణం।రక్తాంబరం రక్తవిభూషణం చ తం వామదేవం హృదయే యుజ్మి। అని శివలోషిణిగా బ్రహ్మ ప్రార్థించెను. తత్పురుషస్వరూపము వర్ణించుచూ పరమమోక్షరూపమైన అర్థమును చెప్పునది రుద్రాణీ. ఆమే గాయత్రీ. ఈ తత్త్వమును లోకగురువైన మహేశ్వరునినుండి రుద్రుడే చెప్పెను. దేవతగా గల తత్త్వము వైదికమైనదియు, జ్ఞానమును ఇచ్చునదియు, భవము, సంసారము, ఏ తత్త్వమును తెలిసికొని నందున సంసారము లేదో అటువంటి కైవల్య మోక్షము తత్పురుష విజ్ఞానము ( గాయత్రీ విజ్ఞానము) ద్వారానే లభించును. ''ప్రదీప్త విద్యుత్కనకావభాసం చతుర్ముఖం తత్పురుషం త్రినేత్రం।పీతాంబరం పీత విభూషణం తం గాయత్ర్యుపేతం సతతం ప్రసన్నః'' అని బ్రహ్మ తత్పురుషస్వరూపమును ప్రార్థించెను.

త్రిపురాసురులను జయించిన సాంబమూర్తికి ఇతరుల ఆయుధములచేత జయించేంతటి అవసరము కలగదు గదా అలా చెప్పుటకూడా హాస్యాస్పదమే. పరమేశ్వరుడు ధరించిన ఆయుధములు ఇతరులు ధరించినంత మాత్రమున ఆయనకు తక్కువ తనము రాదు గదా। పరమేశ్వరుడు ఏది చేసిననూ భక్తులకోసమే. ఒకప్పుడు పరమ శివుడే బ్రహ్మకు ఐదు ముఖములను ఇచ్చి వేరే కారణమున ఒక ముఖమును ఆయనే తీసుకొనెను. భక్తి ప్రచారమునకే. వస్తుతః ఆ ఐదు వదనములు విజ్ఞానమును ఇచ్చునవి. అటువంటి ఐదు ముఖములు నన్ను రక్షించుగాక అని ప్రార్థించు చున్నాను.

## లక్ష్మీవినత వామాంఘ్రిః 70

లక్ష్మ్యాః శ్రియా వినతో వామాంఘ్రిర్యస్య స లక్ష్మీవినతవామాంఘ్రిః।వామశబ్దశ్చాత్ర రమ్యార్థః। స్వ వామపార్శ్వస్థితాయాః గిరిజాయాః అంఘ్రిరితి వా। అర్థనారీశ్వరస్య శివస్య వామాంఘ్రిరేవ దేవ్యంఘ్రిరితి। తయోశ్శివశక్త్యోరవినాభావః ఉక్తో భోజేన శక్త్యా యయా స్వయం శంభుః భుక్త్వా ముక్త్వా చ పశుగణస్యాస్య। తామేతాం చిద్రూపామాద్యాం సర్వాత్మనాస్మి నత ఇతి। ఆగమేఽపి।

పావకస్యోష్ణతేవేయముష్ణాంశోరివ దీధితిః। చంద్రస్య చంద్రికేవేయం శివస్య సహజా ధ్రువేతి। అత్ర వామాంఘ్రిత్వవిశేషణం పరాశక్తేస్సద్యః ప్రసాదకారణత్వ సూచకం భవతి।

సంపత్తుకు నిలయమైన లక్ష్మీదేవి చేత నమస్కరింపబడిన వాడు ఈశ్వరుడు. ఇచట వామ శబ్దము రమ్యమైన అర్థమున వాడబడెను. ఇచట వామ పాదమునకే నమస్కారమని అర్థము. పరమేశ్వరుని వామ భాగము గిరిజకు అంకితము. కనుక ఆ వామాంఘ్రికి నమస్కారము అనగా పార్వతిదేవి పాదమునకు నమస్కారము అని అర్థము. అర్థనారీశ్వరుడైన పరమేశ్వరుని వామాఘ్రియే పార్వతీదేవి దక్షిణాంఘ్రి. కనుక శివునకు శక్తికి అవినాభావము అనగా అభేదము అని అర్థము. పశుగణమునకు పతియైన ఈశ్వరుడు అర్థనారీశ్వరునిగా భుక్తిని, ముక్తిని స్వయముగా ఇవ్వ గలడు. చిద్రూపిణీ, సర్వాంతర్యామినీ ఆద్యురాలు ఐన శక్తికి అనేకనమస్కారములు. ఆగమములయందు కూడా శక్తికి ప్రాధాన్యత కలదు. అగ్నికి ఉష్ణత్వము ఉన్నందువల్ల ఆయన ఉష్ణాంశవు సూర్యుడు కూడా వేడి కిరణములను ప్రసరింపచేయుచున్నాడు. చంద్రుని కిరణములు కూడా చల్లనిది. పరమేశ్వరుని నేత్రములలో ఒకటి సూర్యకాంతిని, మరొకటి చంద్రకాంతిని సహజముగా ప్రసరింపజేయును. ఇచట లక్ష్మీ శబ్దము ఐశ్వర్య పర్యాయపద వాచకము. శ్రీహరి భార్య అని కాదు. ఇచట విశేషముగా, విలక్షణముగా వామాఘ్రిని స్మరించుటచేత పరాశక్తి జగన్మాత. ఆమే భక్తుల విన్నపములను త్వరగా విని పరిష్కరించును. కనుక పరాశక్తి స్మరణము సద్యః ప్రసాద కారణత్వమును సూచించును. కనుక జగన్మాత ఐన శ్రీజ్ఞాన ప్రసూనాంబిక నన్ను అనుగ్రహించమని ప్రార్థించుచున్నాను. ఇచట శ్రీసూతుడు పరాశక్తి యొక్క దివ్య లీలలను వర్ణించు చున్నాడు. సర్వలోకములకు తల్లియైన ఆమెను ఎవరు ఉపాసించెదరో వారు విద్యను ముక్తితో పాటు సకల అభీష్టములను గూడా పొందెదరు. ఆమె మంగళ ప్రదాత పరమేశ్వరుని కన్నా వేరుగాని అర్థనారీశ్వరీ. అనేక శుభములను ఇచ్చునది. జగన్నిర్మాణమునకు మాయగా ఆమే కారణము జగత్సృష్టికి శక్తి నిచ్చునది ఆమే. ఆమె అనుగ్రహము లేనివాడు నిరర్థకుడు, నిష్ప్రయోజకుడు అగును. శివుడు లేని యెడల అచట శక్తికూడా ఉండదు. శక్తిలేనిచోట అచట శివుడు కూడా ఉండడు. ఉమాశంకరులను ఐక్యముగా ఎవడు చూచునో వాడే ధన్యుడు ఉమాశంకరుల మధ్యన ఎవడు భేదమును చూచునో వాడు నరాధముడు. ముఖమును కిందకు పెట్టి కాళ్ళను పైకి తేల్చి సముద్రమువంటి అగాధము వైశాల్యము కలిగిన నరక లోకములకు ఉమాశంకలభేదమును చూచినవాడు వెళ్ళును.

ఇచట ప్రాచీనులు ఇట్లు అభిప్రాయపడుచున్నారు. మానవుని సుకృత దుష్కృతములను నిర్ణయించి నిర్ధారించే బ్రహ్మదేవుని మనస్సు మనకు తెలియదు. భవ్యము అనగా శుభమైనది, సత్యమైనది యోగ్యమైనది అని, అభవ్యమైనది కాని నాకు అనుగ్రహించకుము. అట్లాగే అనవ్యమైనదిగాని, ప్రతికూలమైనది గాని, సవ్యమైనదిగానిది ప్రసాదించకుము. మహేశ్వరుని చరణములు ఆశ్రయించినప్పుడు ఆయన అనుగ్రహంతో ఏది ఇచ్చిననూ సంతోషముగా స్వీకరించవలెను. శివపార్వతులకు అభేదమును చెప్పుట శివునకు పార్వతి సపర్యా సిద్ధులారు అనే అభిప్రాయము, వామాఘ్రి శబ్దము చేత గూడా తెలియుచున్నది.

ఇచట ఒక చిన్న కథ కలదు. అమృత భాండమునకై దేవాసురులు క్షీరసాగరమథనము చేయుచుండిరి. అందులోంచి కామధేనువు, కల్పవృక్షము మొదలగునవి పుట్టెను. అవి అన్నియు దేవతలను చేరెను. శ్రీమహా విష్ణువు వక్షస్థలమును అలంకరించిన శ్రీలక్ష్మికి కొన్ని కారణములచేత శ్రీహరి వక్షస్థలమును వదిలి ఉండవలసి వచ్చెను. ఆ వియోగమును భరింపలేక శివశక్తి శరీరాకారమైన శ్రీచక్రమును ఆరాధించుటచేత పరమేశ్వరుడు ప్రత్యక్షమై ఆమె మనోరథమును తీర్చి ఆమెకు మరలా శ్రీహరి వక్షస్థల నివాసమేర్పరచెను.

తథాచ సూతః

**ఉపాసతే యే పరమాం సర్వలోకైక మాతరం ।**
**తేఽ భీష్టం సకలం యాంతి విద్యాం ముక్తిప్రదామపి ॥**
**సా శివా పరమా దేవీ శివాఽ భిన్నా శివంకరీ ।**
**జగత్కారణతాపన్న శ్శివో యో మునిసత్తమాః ॥**
**సా తస్యాఽపి భవేచ్ఛక్తి స్తయా హీనో నిరర్థకః ।**
**న శివేన వినాశక్తిః న శక్తిరహిత శ్శివః ॥**
**ఉమాశంకరయోరైక్యం యః పశ్యతి స పశ్యతి ।**
**ఉమాశంకరయోర్భేదం యే పశ్యంతి నరాధమాః ॥**
**అధో ముఖోర్ధ్వ పాదాస్తే యాస్యంతి నరకార్ణవమితి ।**

ప్రాచీనైశ్చ । భవ్యమభవ్యం వా నః ప్రలిఖతు వేధాస్సుదుర్మేధాః। నవ్యమనవ్యం వా నశ్శరణం శరణం మహేశస్యేతి । అభేదతయోక్తత్వాత్ శివస్య నామాంఘ్రి శబ్దేనైవ దేవీ సమర్యాసిద్ధేత్యభిప్రాయః శ్రియానితో నామాంఘ్రిర్యస్య స తథోక్తః । అత్ర ఆఖ్యాయికా । జలధి మథన సముయోత్పన్న కామధేన్వాదయ వేషు పవిత్రతయా సర్వసురైస్స్నానం సంపాదితం । విష్ణువక్షస్థ్సలారాధా యాశ్రియః కాలేన తత్ర పదమలభమానాయాశ్శివశక్తి శరీరాకార శ్రీచక్రారాధనేన శ్రీసాంబమూర్తిః ప్రత్యక్షమభ్యేత్య। తస్యా ః మనోరథం పూరయామాసేతికథా ॥

## జపాలాభక్తి గోచరః 71

శ్రీకాళహస్తిస్థాన పశ్చాద్భాగే యోజనాంతరాలే శ్రీనందిశైలే నందినాథ ఇతి కశ్చిద్విపశ్చిద్వీరశైవః స్వమరణ సమయే సహతను త్యాగమభ్యర్థయంతీం జాయాన్నిరుధ్య శివభక్తేభ్యస్సర్వస్వదానధర్మముపదిదేశ. తత్ప్రభృతి తథాభూతాంతతాం పరీక్ష్య అనుగ్రహీతుంఽ వృద్ధో తివర్ణాశ్రమరూపః క్షధిత ఇవ దేవస్తస్యాః జపాలాయాః పురతః ఆవిర్భూయ భిక్షామటాటీత్ తస్మాజ్జపాలాభక్తి గోచరః ఇత్యర్థః జపాలేతి లింగధారివీర శైవమతే స్వకంఠస్థలింగం బహిష్ఠమపి స్థావరమితి లింగధారిణ స్స్వియాస్సర్వేఽపి జంగమా ఇతి ధైర్వ్య వ్రహీయంతే । తాన్ జంగమానన్నపానవసనాదిభిః పాలయతీతి జపాలా నామ్నీ పురోక్తవీరశైవ పత్నీ తస్యాః భక్తేర్గోచరః । తన్నయ నేంద్రియవిషయోఽ భవదిత్యర్థః ।

జాపాలా అనగా గొల్లజాతిస్త్రీ. గొర్రెలను మేపుకొనుచూ జీవించునది. గొర్రె బొచ్చుతో కుంబళినేయునది. ఈమె ఒక వీరశైవుని వివాహమాడి పరమ శివభక్తురాలై పాతివ్రత్యముతో జీవించు చుండెను. శ్రీకాళహస్తి క్షేత్రమునకు పశ్చిమముగా ఒకయోజన దూరమున నంది శైలమున నంది నాథుడు అను మహా పండితుడు కలడు. అతను వీరమైన శివభక్తి కలిగినవాడు. తన మరణ సమయమున తన భార్య తనతో తన దేహము త్యాగమును చేయుటకు భర్తను అనుమతిని కోరగా పుత్రులు లేనందున తన సర్వస్వమును శివభక్తులకు దానము చేయుచూ శివభక్తుల సేవతో కాలము గడుపమని ఉపదేశమును ఆమెకు చేసి అతను మరణించెను. భర్త ఆదేశాను సారముగా ఆమె శివభక్తుల సేవతో కాలము గడుపు చుండెను. పరమేశ్వరుడు ఆమెను పరీక్షించి అనుగ్రహించుటకై సన్యాసి వేషమున వచ్చి మిక్కిలి ఆకలి కలిగిన వానివలె భిక్షను అడిగెను. అంతట ఆమె భక్తికి, సేవకు పరవశము చెంది ఆమెకు ముక్తిని ప్రసాదించెను. శైవమతమున

కంఠమున ఎవడు లింగమును ధరించునో వారందరూ జంగమదేవరలు. అటువంటి జంగమదేవరలకు, లింగధారులకు ఎవరు అన్నదానమును, నివాసవస్త్రాదులను ఇచ్చెదరో వారిని జాపాలులు అని అందురు. వీరశైవుడైన నందినాథుని భార్య భక్తికి ఆమె సేవా నిరతికి పరమేశ్వరుడు మెచ్చెను. ఆమెకు గొల్లజాతి స్త్రీకి కూడా ఆయన ముక్తిని ప్రసాదించెను.

## మూకమృత్యుంజయార్తిఘ్నః 72

మూకశ్చ మృత్యుంజయశ్చ మూకమృత్యుంజయౌ తయోరార్తిం పీడాం హంతీతి తథోక్తః॥ వృద్ధాచలస్థ నాథశర్మమునేశ్శిష్యః కశ్చిద్భీమనామా తత్ గ్రంథానచూచురత్ తేన శప్తో మూకో భూత్వాఽత్ర దేవస్యదక్షిణద్వారి గవ్యూతిమితదేశే లింగప్రతిష్ఠాపురస్సరం తపస్తప్త్వా ముక్తో భూత్ మృత్యుంజయాఖ్యః కశ్చిద్రాజా ప్రమత్తో దివాసుష్వాప తదానీం రైక్వమునిరభ్యేత్య ద్వారి ముహూర్తం లిష్టన్ కోపేన సద్యో మదక్షయకరో రాష్ట్రభ్రంశోస్త్వితి శప్త్వా యథాగతం జగామ తేన హేతునా సరాజా రాజ్యభ్రష్టః పరితో ధావంధావం ద్వాదశ వత్సరాంతే శ్రీమార్కండేయమునిం నత్వా తదుపదిష్ట **శ్రీకాళహస్తీశ్వరశతనామాబ్జమాలికాం** శివవిద్యారభ్య గోవిందనయనార్చితఇత్యం తామిమాం శివవిద్యాముపలభ్య దేవమారాధ్య సర్వార్తిభ్యోముక్తోభూదితిఽకథా। మృత్యుంజయార్తిఘ్నశ్శివో మామవ్యాత్ శ్రీదక్షిణామూర్తి వామభాగే మృత్యుంజయనరపాల ప్రతిష్ఠిత మహాలింగం పశ్చిమాభిముఖమద్యాఽపి విరాజతే ॥

మాట్లాడలేని మూగవాని ఆర్తిని పోగొట్టిన వాడు శ్రీకాళహస్తీశ్వరుడు. భీముడు మూగవాడు అతని ఆర్తిని శ్రీకాళహస్తీశ్వరుడు పోగొట్టెను వృద్ధాచలమునందు నాథశర్మ అనే ఒక ముని శిష్యుడు భీముడు అనేవాడు. అతను ఆయన వద్ద అనేక విద్యలను నేర్చెను. కానీ వశీకరణ విద్యలను ఆ ముని అతనికి ఉపదేశింపలేదు. ఒక రోజున గురువునకు తెలియకుండగా వశీకరణ తంత్రవిద్యా గ్రంథమును భీముడు దొంగిలించెను. ఆ విషయమును గ్రహించిన నాథశర్మ భీముని మూగవానినిగా శపించి తన ఆశ్రమమునుండి వెళ్ళగొట్టెను. అంతట భీముడు శ్రీకాళహస్తి క్షేత్ర దక్షిణ ద్వారమునకు రెండు కోసుల దూరమున ఒక లింగమును ప్రతిష్ఠించి దానిని అర్చించి, అచటనే ఘోరమైన తపస్సుచేసి శ్రీకాళహస్తీశ్వరుని అనుగ్రహంతో ముక్తిని పొందెను.

మృత్యుంజయుడనే ఒక మహారాజు ప్రమత్తుడై పగలు నిద్రించెను. అప్పుడు రైక్వుడనే మహర్షి అతనిని చూచుటకై వచ్చెను. చాలాకాలము వరకు ఆమహర్షిని చూచుటకు మృత్యుంజయుడనే మహారాజు రాలేదు. కోపగించిన ఆ మహర్షి రాజ్యభ్రష్టుడవై తిరగమని ఆరాజుని శపించి కోపముతో తిరిగి వెళ్ళెను. కొంత కాలము తర్వాత ముని శాప కారణమున ఆరాజు రాజ్య భ్రష్టుడై అడవుల పాలై తిరుగు చుండెను. అట్లు పన్నెండు సంవత్సరములు తిరిగి అదృష్ట విశేషముచే శ్రీమార్కండేయ మహర్షి ప్రత్యక్షము కాగా ఆయనను ప్రార్థించి తన దైన్యస్థితిని ఆయనకు నివేదించెను. అంతట ఆ మార్కండేయ మహర్షి **శ్రీకాళహస్తీశ్వర శతనామాబ్జమాలికను** అతనికి ఉపదేశించి అందుకు అంగముగా శివ విద్యను ఉపదేశించెను. అంతట మృత్యుంజయుడు పరమభక్తితో శ్రీకాళహస్తీశ్వరుని ఆరాధించి ముక్తిని పొందెను. మృత్యుంజయార్తిని మూగవాడైన భీముని ఆర్తినిగూడా శ్రీకాళహస్తీశ్వరుడు పోగొట్టెను. అటువంటి దయాళువైన ఆస్వామి నన్ను రక్షించుగాక. శ్రీహరి ఆలయమున ఎడమవైపు ఉన్న శ్రీదక్షిణామూర్తి స్వామితో మృత్యుంజయ మహారాజు చేత ప్రతిష్ఠించిన లింగము పశ్చిమాభిముఖముగా నేటికిని శ్రీకాళహస్తిలో కలదు.

## వృద్ధ బ్రాహ్మణ వేషధృత్ 73

వృద్ధశ్చాసౌ బ్రాహ్మణశ్చ వృద్ధబ్రాహ్మణః తస్య వేషమివ వేషం వళీ పలితశిరః కంపగద్గదస్రవల్లాలాసలిలాదిలక్షణయుక్తం ధర తీతి వృద్ధబ్రాహ్మణవేషధృత్ శ్రీజ్ఞానదేవ్యై తపస్స్థలం విజ్ఞానక్షేత్రం నిర్దేష్టుం పరమేశ్వరస్సోమవాసరే త్వాం పరిణేష్య తీత్యుపదేష్టుం చ వృద్ధ వేష్యమీశ్వరో దధారేతి మూల పురాణం ప్రమాణం ॥

ఎనభై ఏళ్ళకు పైన ఉన్న మనిషిని వృద్ధుడు అని అందురు. అంతటి వయస్సులో అనుభవము లోకజ్ఞానము మొదలగు వాటిని ఆకళింపు చేసుకొని భగవత్సాన్నిధ్యమును కోరువాడు. ఇచట పరమేశ్వరుడు భక్తులను అనుగ్రహించుటకై వృద్ధ బ్రాహ్మణవేషమును ధరించెను. భక్తాను గ్రహమునకు వేషధారణ అవసరమా? అని ప్రశ్నించినచో అవసరమే అని తోచును. ఎందువలననగా పరమేశ్వరుడు నిజస్వరూపముతో భూమిపైకి వచ్చిననూ సామాన్యులు నమ్మరు. ఆయనను విశ్వసించరు. శ్రీకృష్ణుడు అద్భుతములను సృష్టించి నేనే పరమాత్మను అని చెప్పిననూ జరాసంధ శిశుపాల కంసాదులు నమ్మక, దూషణ గూడా చేసారు. కావున దేశకాల సమయాను సారముగా పరమేశ్వరుడు ఏదో ఒక రూపములో వచ్చి భక్తులను నేటికిని కాపాడుచున్నాడు. ఇచట శ్రీకాళహస్తీశ్వరుడు కూడా భక్తులను అనుగ్రహించుటకై వృద్ధ బ్రాహ్మణ వేషమును ధరించి వచ్చెను. ఆవేషము బాగాపండిన తలవెంట్రుకలు కలిగినదియు, తలతో మిగతాశరీర భాగములు వణకుట కలిగినదియు గద్గదము అనగా వాక్ స్ఖలనము అని అర్థము. హర్ష శోకాదుల చేత వయోధర్మము చేత, గొంతులో కఫము అడ్డగించుట చేత అస్పష్టముగా వెలువడు కంఠధ్వని కలిగినది. అటువంటి వేషమును ధరించి వచ్చి శ్రీజ్ఞాన ప్రసూనాంబకు తపస్సు చేసుకొనుటకు విజ్ఞాన క్షేత్రమును నిర్దేశించుటకు, సోమవారమున శ్రీకాళహస్తీశ్వరుడు నిన్ను వివాహమాడునని ఉపదేశించుటకు ఆవేషమున వచ్చెను. ఈ విషయమును మూల పురాణము స్పష్టీకరించెను. కావున పరమశివుడు శ్రీజ్ఞాన ప్రసూనాంబికకు శ్రీకాళహస్తీశ్వరునితో వివాహమును నిశ్చయించుటకై అఖండ బిల్వకాననమున తపస్సు చేయుచున్న శ్రీజ్ఞాన ప్రసూనాంబిక సన్నిధికు వృద్ధుని వేషమున వచ్చెను.

## మాయయా శివ ద్విజాకారః 74

మాయయా శివద్విజస్య ఆకార ఇవాకారోఽస్యాస్తీతి మాయాశివద్విజాకారః మాయయేతి విశేషణాత్ శివద్విజస్యాన్యస్య వా సమానాకారో దేవస్య పరమార్థతో నాస్తీత్యుక్తం భవతి శివద్విజః సమయవిశేషనిర్వాణ దీక్షాభిర్గురుణా కర్తరీశక్త్యా పాశవిచ్ఛేదానంతరం ఆగమికానా మాచార్యత్వే భిషిక్తస్సన్ నిత్యనైమిత్తికాది సమయాచారం యోఽనుతిష్ఠతి తస్యైవ పరార్థలింగపూజాయామప్యధికారః నాన్యేషాం తజ్జాతీయానామితి తథాహి ।

**అదీక్షితశ్చతుర్వేదీ గర్భాగారం విశేద్యది ।**
**వృద్ధ్యంతాని పరిత్యజ్య పద్యః పుణ్యాహమాచరేత్ ॥**

ఇత్యాగమవచనాత్ వైదికానామపి పంచాక్షరీదీక్షానంతరమేవ గర్భాలయప్రవేశపరార్థ పూజాద్యధికారః అత్ర శివద్విజాకారం పరమేశ్వరః కథమను గ్రహీదిత్యత్ర మూలపురాణం ।

మయూరః-

**మహాదేవ ప్రేరితోஉయమిభః స్వయమిహాஉ గతః।**
**ఇతి నిశ్చిత్య మనసా త్యక్తమాయేవ తాదృశం ॥**
**భక్తి స్థైర్యం మనస్థైర్యం తస్య విజ్ఞాయ శంకరః**
**గజాకృతిం పరిత్యజ్య మాయయా సముపాగతాం ॥**
**మాయా శివద్విజాకారో భూత్వా తన్నికటం యయౌ**
**తం దృష్ట్వా రవిసంకాశం కరుణా వరుణాలయం॥**
**భూతిరుద్రాక్షాభరణ మక్షమాలాలసత్కరం।**
**భస్మోద్ధూలిత సర్వాంగం మందస్మిత లసన్ముఖం ॥**
**వృద్ధ వేషధరం శాంతం ప్రేక్షణీయం మహాద్యుతిం**
**దధానం వైణవం దండం భృంగారకర శోభితం ॥।**
**ప్రణమ్య పరయా భక్త్యా మయూరో వాక్యమబ్రవీత్**
**ఇతి ఏవం భూతాః మాయా శివద్విజాకారో మాం పాయాత్ ॥**

మాయచేత శివద్విజుని ఆకారము కలిగినవాడు. మాయా అనే విశేషణముచేత శివద్విజునికి శివద్విజుడు కాని అన్యునకు సమానమైన ఆకారమును కలిగి ఉండుట. ఈ సమానాకారము కేవలము శివద్విజునికే వర్తించును. నిజముగా, పరమేశ్వరునిగా, మరి ఒకరు ఉండుట అసంభవము. పరమేశ్వరుడు సర్వజ్ఞుడు, సర్వశక్తి సమన్వితుడు. శివుని కాని ప్రపంచమే మిథ్య ఐనప్పుడు పరమేశ్వరుని పోలినవాడు ఇంకొకడు ఉండుట అసంభవము కదా! ఐతే శివానుగ్రహమును పొందినవాడు సారూప్యముక్తిని పొందుటకు అర్హుడు.

శైవమతాను సారముగా శివద్విజుడు శాంభవీ (పాశుపతం) దీక్షను స్వీకరించి గురువుల ఆదేశాను సారముగా శివారాధన చేసి పాశచ్ఛేదనమును పొందెను. కొంతకాలము పిదప శివద్విజుడు నైమిత్తిక కర్మలను చేయుచూ ఉండెను. శివ దీక్షితుడు కాని వాడు చతుర్వేదములను అభ్యసించినసూ గర్భాలయమును ప్రవేశించినచో ఆస్థలమును పరి శుభ్రముచేసి పుణ్యాహవాచనమును చేయించవలెను. నిష్ఠాగరిష్టుడైనప్పటికిన్నీ శివపంచాక్షరీ మహామంత్రోపదేశము ఐన తర్వాతనే గర్భాలయ ప్రవేశము శివలింగమునకు పూజాధికారము కలదు. ఇచట శివద్విజుని ఆకారమును పరమేశ్వరుడు ఎందువల్ల గ్రహించెను అనే ప్రశ్నకు మూలపురాణమున **మయూరుడు** ఇట్లు పలికెను. మహాదేవుని చేత ప్రేరితుడైన ఒక ఏనుగు ఒక శివక్షేత్రమునకు వచ్చెను. అది పరమేశ్వరుని చూచిన తోడనే స్థిరమైన భక్తి నిశ్చలమైన శివార్పణ బుద్ధి ఆ ఏనుగులో కలిగెను. ఆవిషయమును తెలిసిన శంకరుడు ఆ ఏనుగును పరీక్షింపగోరి తను గజాకారముగా మారి ఏనుగున్న చోటికి వచ్చెను. గజాకారమున శివుడు ఏనుగుకు మాయాశివద్విజునిగా దర్శన మిచ్చెను. మామూలు శివద్విజునికన్నా మాయాశివద్విజుడు సూర్యునితో సమానమైన ప్రకాశము కలిగిన వానిగాను, కరుణా సముద్రుడుగాను, విభూతిని రుద్రాక్షలను ధరించి స్ఫటికమాలను జపమాలగా, కలిగిన వాడును భస్మ ధూళిచేత అలంకరింపబడిన సర్వ శరీరము కలిగిన వాడును. చిరునవ్వుచేత ప్రకాశించే అందమైన ముఖము కలిగినవాడును. అమిత తేజస్సుచేత అందము గొలుపువాడును సన్నని మెడ కల కలశము వంటి చేతితో అభయమును ఇచ్చువాడును, వెదురు కర్రను దండముగా ధరించినవాడును, ప్రశాంతమై అతిగంభీరమైన ముఖము కలిగిన వాడిని ఒకరికి మరి ఒకరుగా

కనిపించే వృద్ధవేషమును ధరించిన శ్రీసదాశివుని మయూరుడు భక్తి ప్రపత్తులతో నమస్కరించి ధ్యానించెను. ఈ ప్రకారముగా మాయ ధూతుడైన శివుడు మాయా శివద్విజాకారుడైన హరుడు నన్ను రక్షించుగాక అని ప్రార్థించు చున్నాను.

## నారదామోదదాయకః 75

శ్రీనారదాయ నమః । ఆద్ । కల్పాంతం మోదం బ్రహ్మానందం దదాతీతి । నారదామోదదాయకః । నారదమునిస్స్వస్య సందేహనివృత్యై పరమేశ్వరాజ్ఞయా దేవస్య వాహనవసనభూషణ లేపన నటనాశనాది లోకనిందిత వస్తుపరిగ్రహః కుత ఇతి విధిం పృష్ట్వా తదుక్త సమాధానవచన శ్రవణాత్పరమానందం లేభే ఇతి తథోక్తః । అథవా । ఆమోదస్సోతినిర్హారీత్యభిధానకోశాత్ యోగ క్రియా ప్రవీణస్య నారదస్య ఆమోదం అతిదూరవ్యాపినం పరిమళం నిశ్వాస శరీరోత్తసౌగంధ్యం దదాతీతి తథోక్తః యోగినాం దేహాదా సౌగంధ్యాది సిద్ధిశ్శాస్త్రప్రసిద్ధాః హి । శ్రు । ఏతాని రూపాణి పురస్సరాణి। బ్రహ్మణ్యాభివ్యక్తికరాణి యోగే । పృథివ్యప్ తేజోనిలఖే సముత్థితే పంచాత్మకే యోగగుణే ప్రవృత్తేః

న తస్య రోగో న జరా న మృత్యుః ప్రాప్తస్య యోగాగ్నిమయం శరీరం ।
లఘుత్వమారోగ్యమలోలుపత్వం వర్ణప్రసాదం స్వరసౌష్ఠవం చ ॥
గంధశ్శుభోమూత్ర పురీషమల్పం యోగప్రవృత్తిం ప్రథమాం వదంతీతి ।
తస్మాదామోద శబ్దత ఏవ రోగజరామృత్యుపీడాది నివృత్తిసౌగంధ్యసుస్వరత్వాది యోగచిహ్నాని సర్వాణి లక్ష్యంతే తాని । శ్రీదక్షిణ కైలాసపతి ర్దదాతీత్యర్థః ॥

నారదుడు బ్రహ్మ మానస పుత్రుడు. ఇతనికి సంసారము సంతానము లేదు. దక్షుని శాపముచే ఇతను ఒకచోట నిలకడగా ఉండలేడు. మహతి అను వీణపై సదా విష్ణు గానమును చేయుచూ ముల్లోకములు తిరుగుచూ, ఆపదలో ఉన్న వార్కి భగవద్విలాసమును తెల్పి వారి ఆపన్నును శాంతింప చేయును. దక్షుడు తన పుత్రిక ప్రియను బ్రహ్మకు భార్యగా ఇవ్వగా ఆమెయందు పుట్టినవాడు నారదుడు. నారదుడు పూర్వ జన్మలో సారస్వతుడు అను బ్రాహ్మణుడు. సారస్వతుడు విష్ణువుగూర్చి తపస్సుచేసెను. విష్ణువు ప్రసన్నుడై వరమును కోరుకొనమనగా సాయుజ్యముక్తిని ప్రసాదింపమని సారస్వతుడు ప్రార్థించెను. అంతట శ్రీహరి నీవు బ్రహ్మకు జన్మించిన పిదప నా సాయుజ్యమును పొందగలవు అని చెప్పి అంతర్ధానమయ్యెను. నారదుడు స్త్రీగా మారి సంసారము చేయుట నారద పర్వతులు ఒకరినొకరు శపించుకొనుట. జగత్సృష్టి చేయుమని నారదుని బ్రహ్మ కోరగా నారదుడు అందుకు తిరస్కరించెను. అంతట బ్రహ్మ నారదుని కాముకుడవై స్త్రీలోలుడవు కమ్మని శపించెను. ఇటువంటి పురాణ గాథలు నారదుని గూర్చి చాలాకలవు. నరస్య ధర్మం = నారం (జ్ఞానం) నారం దదాతీ నారదః నరాత్ పరమాత్మనః జాతః నారః = జలం నారం దదాతి నారదః నారదుడు బ్రహ్మ మానస పుత్రుడు, ఆయన మహాభక్తుడు, లోక కల్యాణ కారకుడు, జ్ఞానోపదేష్ట, ఒకానొక ప్రజాపతి, ఒకానొక గంధర్వుడు, విశ్వామిత్రుని కొడుకులలో ఒకడు. కనుక నారదుడు జ్ఞానమును ఇచ్చువాడు. నారదుడు మహాముని. అటువంటి ఆ మహామునికి కల్పము చివరన బ్రహ్మానందమును ఇచ్చువాడు పరమేశ్వరుడు. కనుక ఆయన నారదామోదదాయకుడు. నారదుడు ఒకనాడు బ్రహ్మ వద్దకు తన సందేహనివృత్తికై వెళ్ళెను. అచట బ్రహ్మను శ్రీపరమేశ్వరుడు భక్తులకొరకు వారిని అనుగ్రహించుటకై వాహనముగా, వసనముగా, భూషణముగా, లేపనముగా, నటనముగా, అశనముగా, కొన్ని లోక నిందిత వస్తువులను గూడా పరిగ్రహించెను. దీని తాత్పర్యమేమి

అని ప్రశ్నించెను. ఆ ప్రశ్నలకు బ్రహ్మ చెప్పిన సమాధానమునకు పరమానందమును పొందెను. ఆమోదమనగా దూరముగా వ్యాపించెడు పరిమళము వాసన సంతోషము తెలుసుకొనువాడు అని అర్థము. యోగక్రియలో ప్రవీణుడైన నారదునకు ముల్లోకములలో మంచి చెడు వృత్తాంతములు తెలిసినవాడు నారదుడు. శారీర నిట్టూర్పులు శారీరిక గుణములను శారీరిక సౌగంధ్యమును ఇచ్చువాడు. ఇటువంటి సురూపములను ముందుంచుకున్నవాడున్నూ యోగముచేత బ్రహ్మ స్వరూపమును పంచభూతములైన పృథివి అప్, తేజస్సు, వాయువు, ఆకాశ రూపములనుండి పుట్టినదియు, పంచ యోగగుణముల యందు ప్రవృత్తి, నివృత్తులను తెలిసినవాడును. ఆ నారద మహర్షిని రోగములు, ముసలి తనము మృత్యువు చేరవు. అతను యోగమయమైన శరీరము కలిగినవాడు. వేటియందును మిక్కిలి ఇచ్ఛ లేకుండుట లఘువుగా ఉండుట, ఆరోగ్యము వరములను అనుగ్రహించుట స్వరముల సౌష్టవము ఇవి అన్నియు యోగసాధకుడైన నారదునికే లభించును. అందువల్ల ఆమోద శబ్దము వల్లనే శ్రీమద్దక్షిణ కైలాసపతి ఐన శ్రీకాళహస్తీశ్వరుడు సకల సౌభాగ్యములను ఇవ్వగలడు.

## మార్కండేయ హృదంతస్థ మహాసంశయ భేదకః 76

మృగాః కండూయంతే అస్మిన్సమాధిస్థే ఇతి మృకండుః। తస్యాపత్యం మార్కండేయః తస్య హృదంతో హృదయాంతరాళం తత్ర స్థితో మహాన్ సంశయః మార్కండేయ హృదంతస్థ మహా సంశయః। తద్భేదం తస్య ఖండనం కరోతీతి తథోక్తః తస్య సంశయస్తు అన్నదజనక విద్యాప్రదాపద్రక్షకతత్వ జ్ఞానదాః పంచగురవశ్శాస్త్రేషు ప్రసిద్ధాః। తేషు సర్వక్లేశహా నాయక ఉపాస్యఇతి। శ్రు । అన్నం బ్రహ్మేతి వ్యజానాదితి । మాతేవ పుత్రాన్రక్షస్వ । పితేవ పుత్ర మభిరక్షతాదిమం పితృదేవో భవేతి య ఆతృణత్యవితథేన కర్ణా సుఖం కుర్వన్నమృతం సంప్రయచ్ఛన్ ।తం వై విద్యా త్పితరం మాతరం చ తస్మై నద్రుహ్యేత్కృత మస్య జానన్నితి । సర్వత్ర ప్రశంసాస్తేకం గురు మాశ్రిత్యాత్యంతిక్లేశహానిర్భవేదితి యస్సందేహస్తం । శ్రు । సయో హ వై తత్పరమం బ్రహ్మ వేద । బ్రహ్మైవ భవతి । నాస్యాబ్రహ్మవిత్కులే భవతి । తరతి శోకం తరతి పాప్మానం గుహా గ్రంథిభ్యో విముక్తోఽమృతో భవతీత్యర్థ ముపదిశ్య బ్రహ్మజ్ఞానం గురురేవోపాస్యః ఇత్యుపదిశ్య తత్సంశయం బిభేదేత్యర్థః॥

మృకండు మహర్షి సమాధిలో ఉన్నప్పుడు అడవి జంతువులు తమ కండూతిని (తీటను) ఇతని సమాధిద్వారా తీర్చు కొన్నవి కనుక ఆయన మృకండుడైనాడు. అతని పుత్రుడే మార్కండేయుడు. ఆ మార్కండేయుని హృదయాంతరాళములో ఒక సందేహ ముదయించెను. ఆ సందేహమును ఆ సంశయమును అంతరింప చేసినవాడే మహాదేవుడు. అన్నమును ఇచ్చువాడు, కన్నతండ్రి, విద్యను, విజ్ఞానమును ఇచ్చువాడు, రక్షించేవాడు, మోక్ష విద్యను ఇచ్చేవాడు, ఈ ఐదుగురు గురువులలో సమానమని శాస్త్రములో చెప్పబడినది.

**జనితోచోపనేతా చ యశ్చ విద్యాం ప్రయచ్ఛతి ।**
**అన్నదాతా భయత్రాతా పంచైతే పితరః స్మృతాః ॥**

వారిలో సర్వక్లేశములను హరించే నాయకుని ఉపాసించవలెను. వేదమున తైత్తిరీయోపనిషత్తునందు ఇట్లు చెప్పబడినది. మాతల్లివలె పుత్రులను రక్షించవలెను. అన్నమును పరబ్రహ్మ స్వరూపముగా, పవిత్రమైనదిగా తెలుసుకొనవలెను. "అన్నం న నింద్యాత్, తద్వ్రతం, అన్నం న పరిచక్షీత తద్వ్రతం" జన్మను ఇచ్చిన తల్లిని తండ్రిని ఎట్లు రక్షించవలెనో అట్లాగా పుత్రులను కూడా రక్షించవలెను. తండ్రి అమృతమయమైన మాటలతో దివ్యోపదేశమును

చేయగలడు. అట్లాగే తక్షికూడా. ఒకే గురువును ఆశ్రయించి సంసార క్లేశమును పోగొట్టుకొనవలెను. పరబ్రహ్మను గూర్చి తెలిసినవాడు బ్రహ్మ కాగలడు. సామాన్యుడు బ్రహ్మవేత్తల కులములో జన్మించడు. బ్రహ్మను గూర్చి తెలిసిన వాడు అన్ని శోకములనుండి విముక్తిని పొందును. అన్ని పాపములనుండి విముక్తిని పొందును. కొండయందు తొలుపబడిన గొప్ప బిలములో పడిననూ ఆత్మ జ్ఞానముచేత బయటపడును. సాంసారిక చిక్కులనుండి విముక్తుడగును. కనుక బ్రహ్మజ్ఞానమునకు సద్గురువునే ఆశ్రయించవలెను అని మార్కండేయుని సంశయములను సందేహములను పోగొట్టినవాడు శ్రీసదాశివుడు. శ్రీకాళహస్తీశ్వరుడు మమ్ములను అనుగ్రహించుగాక.

## సనత్కుమారక శుక పరాశర సుపూజిత: 77

సనత్కుమారకశ్చ శుకశ్చ పరాశరశ్చ తే సనత్కుమారక శుక పరాశరాః। తైస్సుష్ఠు పూజిత ఇతి తథోక్తః। నను హరిబ్రహ్మాది దేవైర్మునిభిశ్చ సదా దేవే పూజ్యమానే సతి కిమర్థం మునిత్రయగ్రహణమిత్యత్రోచ్యతే శాండిల్యో మునిర్వైదిక ద్విజోఽపిప్రాగ్జన్మానుష్ఠిత పాపబాహుళ్యాచ్చతుర్వేదేష్వపి బ్రహ్మోఽన్విష్యాలభమానః పాంచరాత్రతంత్రం ప్రవిశామీతి బుద్ధిపూర్వం దీక్షిత్వా వైదికం నిందిత్వాఽహరిమారాధ్య సాక్షాత్కృత్యాపి దేవేన ధిక్కృత శ్శాండిల్యసంహితాం నిర్మాయ మృతస్సతు నరకేష్వయుతత్రయసంవత్సరావధికం దుఃఖమనుభూయ పశ్చాద్ధరిపదం ప్రాప్య హరిణోపదిష్టమార్గేణ భూమౌ జనిత్వా వేదేనైవ హరిమభ్యర్చ్య తత్పదమయాసీదితి వాసిష్ఠలైంగ్యాది పురాణాని సంతి సశాండిల్యస్స్వసంహితాం వైదిక గోష్ఠీమధ్యే పపాఠ శ్రుత్వాఽపీమే త్రయోఽపి మునయశ్చద్మనా ప్రశశంసుః తద్దోషాద్గతబోధాః భ్రాంతా ఇవ పరితోటిఽత్వా సర్వైస్తు చ్చీకృతాశ్శ్రీదక్షిణకైలాసముపేత్య దేవమారాధ్య తత్ప్రసాదాత్ పూర్ణ బోధమాపురితి కథా తస్మాత్తైర్మునిభిరఘశోధనార్థం సుష్ఠుపూజిత ఇత్యర్థః తథా చ భగనాన్।

**ధిక్ ధిక్ శాండిల్యదుర్బుద్ధే సాహసం కిం కృతం త్వయా।**
**కో వా వర్ణాశ్రమాచారం శ్రౌతం త్యక్త్వా త్వయా వినా॥**
**శక్తః పాపబలాదన్యో నాస్తి తే నిష్కృతిశ్శ్రుతౌ।**
**కుమార్గేణాపి శాండిల్య మమ పూజా త్వయా కృతా।**
**తతః కాలేన మహతా వేదమార్గం గమిష్యసీత్యాది**

వేదదూషణ శ్రవణాత్తన్మతం నిందితమితి।వేదార్థస్యైవ ప్రామాణ్యం న పౌరుషతర్కస్యేతి। ఉచ్యతే హి యత్నేనానుమితోప్యర్థః కుశలైరనుమాతృభిః అభియుక్తతరై రన్యై రన్యథైవో పపద్యత ఇతి। తథా। బ్రహ్మసూత్రం। తర్కా ప్రతిష్ఠానాదప్యన్యథాను మేయమితి చేదేవమప్య విమోక్ష ప్రసంగ ఇతి। తస్మాత్తన్మతానువాదదోషేణ భ్రాంతాః భూత్వా దేవమారాధ్య ముక్తాః బభూవుః సర్వపూజితోఽపి శ్రీకాళహస్తీశ్వరః ఏతైర్మునిభిరధికం పూజిత ఇత్యర్థః।

సనత్కుమారులు బ్రహ్మమానస పుత్రులు. బ్రహ్మదేవుడు సృష్టిచేయుటకు తపస్సుచేసి 'సన' అని పల్కుటచే వీరు పుట్టిరి. వీరు ఎల్లప్పుడును పదిసంవత్సరముల వయస్సు కలవారుగా ఉందురు. (కౌమార) శుకుడు వ్యాసుని కుమారుడు. వ్యాసుడు మేరు పర్వతముపై తపస్సు చేయుచుండగా శివుడు ప్రత్యక్షమై వ్యాసుడు కోరిన పంచభూతములతో సమాన ప్రతిభ కల కుమారుని వరముగా ఇచ్చెను. బ్రహ్మదేవుడు ఇతనికి ఉపనయనము చేసి శుకుడు అని పేరు పెట్టెను. ఉపనయన సందర్భమున శుకునికి ఆకాశాధిదేవత దండ కమండలములను

ఇచ్చెను. శుకుడు వ్యాసుని వద్దనే వేదశాస్త్రములను నేర్చెను. ఆత్మజ్ఞానమును మిథిలలోని జనక మహారాజు వద్ద నేర్చెను. శుకుని భార్య పేరు పీవరి. గౌరి ప్రభుడు, కృష్ణుడు, భూరి, దేవ శ్రవుడు అను కుమారులు కీర్తి అను కుమార్తె శుకునకు కలరు. ఆవు పాలు పితుకుకాలముకంటే ఎక్కువ కాలము ఎచటను శుకుడు నిలవడు. ఎవరైన ప్రశ్నలను అడిగినచో సమాధానము చెప్పిన తర్వాతే వెళ్ళగలడు. ప్రాయోపవిష్టుడైన పరీక్షిత్తుకు శుకుడే ఏడురోజులలో భాగవతమును ఉపదేశించెను. నారదుని వద్ద ఆత్మ విద్యను గూడా నేర్చెను. శుకుడు ముక్తుడై కైలాసమునకు పోవుచూ మృగములను పక్షులను వనములను ప్రార్థించి మాతండ్రి నన్ను పిలవగా ''ఓ'' అని సమాధానము ఇవ్వమని చెప్పెను. శుకుడు నిర్వికారుడు నిశ్చల తపోధనుడు, పరమార్థమును పొందినవాడు.

పరాశరుడు వసిష్ఠుని పౌత్రుడు, శక్తి పుత్రుడు, పరాశరుని తల్లి అదృశ్యంతి. పరాశరుడు తల్లి గర్భమున ఉండగానే ఒక రాక్షసుడు తన తండ్రి ఐన శక్తిని సంహరించెను. కొంతకాలము పిదప తన తల్లి అమంగళకరముగా ఉండుట చూచి దాని కారణమును తెలుసుకొని పితామహుడైన వసిష్టుని ఆదేశముపై శివుని ఆరాధించి శివానుగ్రహముతో స్వర్గమున ఉన్న తన తండ్రిని చూచి రాక్షస వినాశార్థమై యజ్ఞము చేయుచుండెను. అందులో చాలా రాక్షస కులములు నశింపగా పులస్త్యాది మహామునుల ప్రార్థనపై కృతువును మాని తండ్రి ఆశీస్సులు పొందెను. సనత్కుమార శుకపరాశరుల చేత సదాశివుడు పూజింపబడెను.

శ్రీహరి బ్రహ్మదేవాది మునులచేతనే ఎల్లప్పుడు శ్రీసదాశివుడు పూజింప బడుచుండగా ప్రత్యేకముగా మునిత్రయము చేత గూడా పూజింపబడుచున్నాడనుట ఎందుకు అని ప్రశ్నింపగా ఇచట మునిత్రయ ప్రత్యేక గ్రహణమునకు కారణము కలదు. శాండిల్యుడు అను ఒక మహర్షి కలడు. అతను సకలవేద శాస్త్రములను చక్కగా అధ్యయనము చేసెను. జన్మాంతర పాపవిశేషముచేత అతనికి బ్రహ్మజ్ఞానము లభించలేదు. పర బ్రహ్మాన్వేషణలో పాంచరాత్రాది తంత్రముల మర్మములను తెలుసుకొని భక్తితో శ్రీహరిని ధ్యానించి, ఆయనను దర్శించి ఆయన అనుగ్రహంతో శాండిల్య సంహితను రచించి పరబ్రహ్మను తెలుసుకొనలేక మరణించెను. పాపము పరిపక్వమైనందున మూడువేల సంవత్సరము నరకవాసము చేసి వైకుంఠమునకు చేరి శ్రీహరి ఆదేశాను సారముగా భూలోకమున మరలా జన్మించి శ్రీహరిని అర్చించి మోక్షమును పొందెను. ఈ విషయము వాసిష్ఠ లింగపురాణాదులలో ఉన్నది. ఐతే శాండిల్యుడు తను రచించిన సంహితను వైదిక గోష్ఠిలో పండితుల సమక్షమున వినిపించెను. అందు సనత్కుమార శుక పరాశరులు మోసములో ప్రశంసించవలెనన్న నెపముతో ప్రశంసించిరి. అనంతరము తాము చేసిన పొరపాటును గుర్తించి, వైదిక గోష్ఠిలోని పండితులతో పరాభవింపబడి తమ పాప పరిహారమునకై శ్రీమద్దక్షిణ కైలాసవాసియైన శ్రీకాళహస్తీశ్వరుని సేవించి ఆయన అనుగ్రహంతో తమ పాపములను పోగొట్టుకొనిరి. కనుక ఆ మునిత్రయము తమ పాపముల ప్రక్షాళనకు శ్రీకాళహస్తీశ్వరుని బాగా పూజించిరి అని అర్థము. భగవంతుని శాండిల్యముని దూషించెను. శాండిల్యముని తన సంహితలో వేదదూషణ, వేద నిందను కూడా చేసెను. భగవంతుని గూర్చి మొదలు చెప్పినవి వేదములే. తర్వాత పరమేశ్వరుని ఉనికిని తర్కముద్వారా తెలియచేసినవి.

బ్రహ్మ సూత్రము రెండవ అధ్యాయము మొదటి పాదము పదకొండవ సూత్రము 'తర్కాప్రతిష్ఠానాదప్యన్యథానుమేయమితి చేదేవమప్య విమోక్షప్రసంగః'' అని పరమేశ్వర

విషయము కేవలము వేదము చేత మాత్రమే నిరూపించబడినది. ఐనచో దీనియందు వేద విరుద్ధములగు కేవల తర్కములను ప్రయోగింపమూలమునకే మొదట విలువలేదు. మన బుద్ధికిని పరమేశ్వరుడు అనుగ్రహించిన వేదమునకు ఎంతో తారతమ్యము గలదు. కావున మానవకల్పితమగు తర్కము ఎక్కువకాలము నిలబడదు. తర్కము మానవుని బుద్ధివికాసమునకు సంబంధించినది. ఒక బుద్ధిమంతుడు ఒక దానిని ఒకవిధముగా నిర్ణయించిన పిదప అంతకంటే సూక్ష్మ శాలియగు మరి ఒక బుద్ధిమంతుడు తన మేథాశక్తితో వెనకటి నిర్ణయమును మరి ఒకవిధముగా మార్చుట మనము చూచుచునే ఉన్నాము కదా। అట్లాగే ప్రాభాకర కపిల సిద్ధాంతములైన మీమాంసా సాంఖ్య శాస్త్రముల తర్కమును అంగీకరించుటకు తృప్తిలేదు. తర్క విషయమున కణాదులు (వైశేషికదర్శనము) గౌతముడు (న్యాయదర్శనము) మొదలగు వారు ప్రసిద్ధులైనప్పటికిన్నీ వారి వారిమతములయందు పరస్పర విరోధములు శుష్క తర్కములు కన్పించు చున్నవి. కనుక శ్రుతికి అనుకూలమైన తర్కమునే అద్వైతులు అంగీకరించుచున్నారు. పరమేశ్వరుడు శ్రుతిగోచరుడు. ఆయన సత్య జ్ఞానానంద స్వరూప నిరూపణలో వివాదమే ఉండకూడదు. కేవల తర్క విజ్ఞానముతో సిద్ధాంతమును చేయుట అసంభవము. కావున శ్రుతికి అనుకూలంగా ఉన్న తార్కిక సిద్ధాంతము ఎప్పుడూ నిలిచి ఉండును. ఇది బ్రహ్మ సూత్ర సారాంశము. కనుక శాండిల్య సంహితను అన్యథా వ్యాఖ్యాన దోషము చేత పాపాత్ములై శ్రీకాళహస్తీశ్వరుని సేవించి వారి పాపములను పోగొట్టుకొనిరి. అంతటి దివ్య పురుషులచేత సేవింపబడిన వాడు శ్రీకాళహస్తీశ్వరుడు. మమ్ములనుకూడా రక్షించుగాక అని ప్రార్థించు చున్నాను.

## విజ్ఞాతదేవ లోకోరుశక్తిః 78

దీవ్యంతీతి దేవాస్తేషాం లోకో దేవలోకః । తస్య ఉర్వీ । అధికా శక్తిః దేవలోకోరుశక్తిః సా యేన విజ్ఞాతా స విజ్ఞాత దేవలోకోరుశక్తిః యదా దైత్యేషు మత్ప్రసాదదృష్టిస్తదా దేవానాం పరాజయః । యదా దేవేషు ప్రసాదస్తదా దైత్యానాం పరాజయ ఇతి బహువారం దేవలోక మహాశక్తి రేతావతీతి। శ్రీమద్దక్షిణ కైలాసపతి జానాతీత్యర్థః।

అమితమైన తేజస్సులో వెలుగొందు వారు దేవుళ్లు. వారి లోకములు అనేకములు. ఆ లోకములలో వారి అధికారములు పెరుగుచుండును. పరమేశ్వరుని తత్త్వము తెలుసుకొన్న తర్వాత ఆయన నిండి ఉన్న ప్రపంచ తత్త్వము తెలియును. తద్వారా అన్ని లోకములు ఆలోకవాసుల విషయము కూడా తెలియును. అది ఎట్లనిన మృత్తును గూర్చి తెలియుటద్వారా ఆ మృత్తుచేత చేయుబడే కుండ, మూకుడు, చట్టి, ప్రమిద మొదలగు వాటిగూర్చి కూలంకషముగా తెలియును గదా! పరమేశ్వరుని దివ్యదృష్టి రాక్షసుల మీద ఉన్నచో దేవతలకు పరాజయము. అప్పుడు దేవతలు పరమేశ్వరుని ప్రార్థించగా ఆయన దివ్య దృష్టి దేవతలపై పడగా దేవతలు మహాశక్తి మంతులై రాక్షసులను సంహరించుచున్నారు. కనుక శ్రీమద్దక్షిణ కైలాసపతియైన శ్రీకాళహస్తీశ్వరుడు నన్ను రక్షించుగాక.

## యక్షవపుర్ధరః 79

యక్షం యజనీయం సర్వైరారాధనీయం వపుర్విగ్రహం ధరతీతి యక్షవపుర్ధరః స్వభావతః పరమేశ్వరస్య నామరూపాద్య భవాత్ । శ్రు । యత్తదద్రేశ్యమగ్రాహ్యమగోత్రమ వర్ణమచ క్షుశ్శ్రోత్రం తదపాణిపాదమితి । పురాణం చ ।

న చ నామాని రూపాణి శివస్య పరమాత్మనః ।
తథాఽపి మాయయా తస్య నామరూపే ప్రకల్పితే ॥

ఇతి కల్పిత నామరూపవస్తుషు యక్షశబ్దవాచ్యం సర్వైరారాధితుం యోగ్యం చర్మదృష్టి గోచరం జ్యోతిర్లింగవపుర్ధరతీతి తథోక్తః సురా అసురాన్ జిత్వాఽగమనసమయే వయమేవ జేతార ఇత్యహం మానాంధానేవ బోధయితుం యక్షరూప మగ్రహీదితి । స । తేభ్యో హ ప్రాదుర్బభూవ తన్నవ్యజానత కిమిదం యక్షతి । తతో యక్షవపుర్ధర ఇత్యర్థః

యక్షుడనగా కుబేరుడు అని అర్థం. యక్షం అనగా యజనము అనగా యజ్ఞముచేయుట అని అర్థము. పంచమహాయజ్ఞములు ఐదు బ్రహ్మయజ్ఞము, పితృయజ్ఞము, దేవయజ్ఞము, భూతయజ్ఞము, మనుష్యయజ్ఞము అనునవి. యజ్ఞనము అనగా అర్చించుట అని అర్థము. అందరిచేత ఆరాధింపబడే శరీరము కలిగి ఉండుట. అసలు పరమేశ్వరునికి నామము, రూపములు మొదలగునవి లేవు. భక్తులను అనుగ్రహించుటకై ఆయన నామరూపాదులను ధరించెను. వేదము పరమేశ్వరతత్త్వమును చెప్పుచూ ఆయన సామాన్యులకు కనపడడు, సామాన్యులు తెలుసుకొనలేరు. ఆయనకు గోత్రము, బ్రాహ్మణాది వర్ణములు తెలుపు మొదలగు రంగులు వస్తుతః ఆయనకు లేవు. జ్ఞానేంద్రియములైన శ్రోత్ర, త్వక్, చక్షు, జిహ్వా, ఘ్రాణముల చేతగాని కర్మేంద్రియములైన వాక్, పాణి, పాద, పాయూపస్థలచేత గాని విషయేంద్రియములైన ప్రాణ, నాగ, అపాన, కూర్మ వ్యాన, కృకర, ఉదాన, దేవదత్త, సమానమ, ధనుంజయముల చేతగాని అంతఃకరణములైన మనస్సు, బుద్ధి, చిత్తము, అహంకార, తమస్సులచేతగాని ఆయనను తెలుసుకొనలేరు. ఆయనకు నామరూపములు మాయ చేతనే కల్పించబడినది. కనుక కల్పించిన నామరూపవస్తులవలె యక్షరూపము గూడా. పరమేశ్వరుని నామరూపములు లేనిచో ఆయన సామాన్యులకు దృష్టి గోచరుడు కాడు. కనుక ఆరాధనకై ఈశ్వరునికి నామరూపములు అవసరమైనవి. పరమేశ్వరుడు జ్యోతిర్లింగమును ధరించి భక్తులను రక్షించు చున్నాడు. పూర్వము దేవతలు రాక్షసులను ఓడించి స్వర్గముకు చేరుతూ మన బల పరాక్రమముల ద్వారానే రాక్షసులు ఓడిరి అని గర్విష్ఠులై పలుకుచుండగా పరమేశ్వరుడు వారిని పరీక్షింపగోరి యక్షరూపమును ధరించెను. ఆ యక్షుని వారు గుర్తించలేక పోయిరి. కనుక పరమేశ్వరుడు అనేక రూపములను ధరించి భక్తుల వద్దకు వచ్చి వారికి కావల్సిన ఫలములను ఇచ్చుచున్నాడు. అందువల్ల దైవము మానుషరూపముగానే ఉండును. అందువల్ల పరమేశ్వరుడు దేవతను పరీక్షింపగోరి యక్ష శరీరమును ధరించెను.

## సహస్రదేవ సంవంద్యః 80

సహస్రాణి చ తే దేవాశ్చ సహస్ర దేవాః తైస్సమ్యగ్వందితుం యోగ్యో భవతీతి తథోక్తః అత్ర సహస్ర శబ్ద స్తేషాం సాకల్యార్థ బోధకః । అసురవిజయాహంకారవంతస్తే యక్షరూపేణావిర్భూతం వహ్న్యాదిముఖేన విచార్యాపీదమిత్థమిత్య నిర్ధార్య పునర్దేవీప్రసాదేన విజ్ఞాయ సహస్రలింగ ప్రతిష్ఠాపురస్సరం తప్త్వా పునరావిర్భవంతం దేవం సాక్షాత్కృత్య పూజానతినుతిభి రారాధయామాసురితి కథా తస్మాత్సహస్ర దేవసంవంద్యం దేవం బహుశో వందే ॥

దేవతలు ముడుకోట్లమంది ఉన్నప్పటికి చాలా మందిని గూర్చి తెలుపుటకై సహస్ర సంఖ్యను ఇచట వాడిరి. వేలాది దేవతలచేత నమస్కరించుటకు యోగ్యుడైనవాడు శ్రీకాళహస్తీశ్వరుడు. సాకల్యము అనగా సకలత్వమును తెల్పే అర్థము. అటువంటి శబ్దమే

సహస్రవః. అసురసంహారముచే అహంకరించిన యక్షుడు. తనరూపముతో ఆవిర్భవించినవానిని, గుర్తించ లేదు. అగ్ని వంటి తేజస్సు కలిగిన ముఖముచేత ప్రకాశించుచున్నప్పటికి కూడా ఆయనను గుర్తు పట్టలేదు. జగన్మాత అనుగ్రహంతో వచ్చిన వాడు పరమేశ్వరుడు అని తెలుసుకొని ఆయనను ప్రార్థించెను. ఆయన అనుగ్రహంకోసం సహస్రలింగములను ప్రతిష్ఠించివెయ్యి సంవత్సరములు ధ్యానించగా ఆయన ప్రత్యక్షమాయెను. ఆ పరమేశ్వరుని అనేక విధములు స్తోత్రములు పూజలు చేసి ఆరాధించెను. అంతట ఆయన ఆ యక్షునికి ముక్తిని ప్రసాదించెను. అనే ఒక కథ కలదు. అందువల్ల సహస్రదేవ సంపద్యుడైన వాడు పరమేశ్వరుడే అటువంటి దేవదేవుణ్ణి అనేక విధములుగా నమస్కరించుచున్నాను.

## నీలకంఠమలాపనుత్ 81

కశ్చిద్ద్విజోఽన్తర్ముఖః కాళహస్తీశభక్తవరో నీలకంఠాభిధో దేవసన్నిధౌ క్రోశదూరే పశ్చాద్భాగే ఉవాస తస్య మలాని అపనుదత్యపాకరోతీతి నీలకంఠమలాపనుత్ కాని తానీతి చేత్ సర్వ ప్రాణిసాధారణాని ఆణవమాయిక కార్మికాఖ్యాని త్రీణితుమలాని శాస్త్ర సిద్ధాని సంతి తత్ర అసంగస్య విభోరాత్మనోఽణుత్వసంసారిత్వాదిజ్ఞానం యత్తదాణవం । శ్రు ।

**బుద్ధేర్గుణేనాత్మగుణేనచైవ హ్యారాగ్రమాత్రోహ్యవరో ఽపి దృష్టః ।**
**వాలాగ్రశత భాగస్య శతధా కల్పితస్యచ ॥**
**భాగో జీవస్సవిజ్ఞేయస్సచానంత్యాయ కల్పత ఇతి ।**

వచనాత్ ఆత్మనో బుద్ధ్యాదిదోషై రేవాణుత్వసంసారిత్వాదిమలం భవతి అథ దేహాదిజగన్మృషాభావం స్వతస్సిద్ధం పరశివరూపం శాస్త్రేణ బహుధా నిశ్చితవంతమపి పురుషమింద్రజాలవన్మోహయతి యత్తన్మాయికం మలం। కార్మికమలం నామ జన్మాంతరకృతేషు కానిచిత్సుకృతదుష్కృతాని స్వఫలదానాయామా ముపతిష్ఠంతే తాని విరాగిణమపి న జహతీతి గుత్ తత్కార్మికం ఏతన్మలత్రయమోచనార్థం దేవస్య నర్తనదర్శనం స నీలకంఠ ఇయేష। తదాఽయం శ్రీకాళహస్తీశస్స్వనృత్యం దర్శయిత్వా తన్మలాన్యపాకరోదితి యద్వా మూలాజ్ఞానసతో దేహాత్మ ధీరేవ ప్రబలం మలం ఉక్తం హి శ్రీగౌతమేన దుఃఖజన్మప్రవృత్తిదోషమిథ్యాజ్ఞానానాముత్తరోత్తరాపాయే తదనంతరాపాయాదపవర్గఇతి తద జ్ఞానమలం స్వతాండవ ప్రదర్శనేన విమోచయతీత్యర్థః ॥

ఒకానొక బ్రాహ్మణుడు శ్రీకాళహస్తీశ్వరుని యందు పరమభక్తి ప్రపత్తులు కలిగనవాడు. అతని పేరు నీలకంఠుడు. శ్రీకాళహస్తీశ్వరుని అనుగ్రహము కొరకు దేవాలయమునకు పశ్చిమ దిక్కున ఒక కోశెడు దూరమున నివాసమేర్పరచుకొనెను. కొంతకాలము తర్వాత అతని పాపములను శ్రీకాళహస్తీశ్వరుడు పోగొట్టెను. మలములు పన్నెండు. 1 వస, 2 శుక్లము, 3. రక్తము, 4. మజ్జము, 5. మూత్రము 6. విష్ఠ 7. పింజూషము, 8. నఖము, 9 శ్లేష్మము, 10. అశ్రువు, 11. దూషిక, 12. స్వేదము, 13. జిహ్వామలమును, కులుకమని దంతమలమును విప్పిక అని అందురు. ఇంకా పేడ, రెట్ట, మురికి మొదలగు శరీరమునుండి బయటకు వచ్చే అపరిశుద్ధ పదార్థము. సర్వప్రాణి సాధారణములైనవి శాస్త్ర సిద్ధములైనవి మూడురకముల మలములు ఉండును. అవి ఆణవము, మాయికము, కార్మికములు అని గలవు. అసంగుడు, సంసారి కాని వాడున్నూ, సర్వ వ్యాపకుడైన వాడున్నూ అన్నిటికి, అందరికి ప్రభువై అణువులో అణువై, విభువులో విభువైన వాడు సంసారియై, బద్ధుడై ఎట్లు ఉండగలడు?

ఏమీలేని వాడు. ఉన్నట్లుగా ఉంటున్నాడంటే అది కేవలం నటన మాత్రమే అని గ్రహించవలెను. ఆ నటన కూడా భక్తులను అనుగ్రహించుటకు మాత్రమే. ఆత్మకు బుద్ధ్యాదిదోషములచేత అణువుగా ఉన్న జీవునకు సంసారమలము అంటును. దేహాదులు జగత్తు మిథ్య అనే జ్ఞానముండుట అవసరము. అనేక శాస్త్రములు పరమేశ్వరుని పరశివరూపునిగా స్వయంగా అవతరించిన వానినిగా అనేక ప్రమాణ పురస్సరముగా వేద వాక్యములచేత కూడా ఉద్ఘోషింపగా ఇంద్రజాల పురుషుడు తనవిద్యలచే చిత్ర విచిత్రములైన వస్తువులను చేసినట్లుగా పరమేశ్వరుడు కూడా చేయునా? ఇది మాయతో కూడిన మలము. కార్మికుల మలమనగా పూర్వజన్మములో చేసిన కొన్ని పుణ్యపాపములు వాటి ఫలములు ప్రారబ్ధములుగా ఈ జన్మలో అనుభవమునకు వచ్చును. ఆ ఫలములు విరాగిని గూడా వదలవు. ఐతే ఈశ్వరానుగ్రహంతో ఆ ఫలములు త్వరగా ఎక్కువగా బాధించ కుండగా అనుభవమునకు వచ్చును. కావున కార్మికమైన ఫలమును అందరూ అనుభవించి తీరవలసినదే. కనుక ఆణవ కార్మక మాయిక మలములనుండి విమోచనమునకై నీలకంఠుడనే బ్రాహ్మణుడు పరమేశ్వరుని నాట్యమును దర్శింపగోరెను. భక్త సులభుడగు శ్రీకాళహస్తీశ్వరుడు ఆనీల కంఠునికి తన నాట్యమును చూపి అతని మలములను పోగొట్టెను. కనుక మూలాజ్ఞానమువల్లనే శుద్ధమైన ఆత్మయందు దేహమనే ఉపాధిని ఆరోపించి అనేక మలములను జీవులు చేయుచున్నారు. ఈ విషయమును గూర్చి శ్రీగౌతమమహర్షి ఇట్లు పలికెను. జన్మ ఎత్తినందువల్లనే జీవునకు సుఖ దుఃఖముల అనుభవము కలదు. ఈదోషము మిథ్యాజ్ఞానము వల్లనే వచ్చును. ఆత్మజ్ఞానమువలన మిథ్యాభూతమైన ప్రపంచ తత్త్వమును తెలుసుకొని పరమేశ్వరుని అనుగ్రహంతో ఆయన తాండవమును చూచిన వారలకు భ్రమ జ్ఞానమును నివృత్తిచేసి ముక్తిని ఆయన ప్రసాదించును. కనుక నీలకంఠుడు అనే బ్రాహ్మణుడు శ్రీకాళహస్తీశ్వరుని నాట్యమును చూచి మోక్షమును పొందెను. పరమేశ్వరుని నాట్యదర్శనము ద్వారా సర్వ పాపములు (మలములు) నశించును. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరుడు నీలకంఠమలాపనోదనుడు.

## పద్మసేనక రాజేంద్ర కన్యాయుగళ సేవితః 82

పద్మసేనకశ్చ రాజేంద్ర శ్చ కన్యయోర్యుగళం చ పద్మ సేనక రాజేంద్ర కన్యాయుగళాని తైరయం సేవిత ఉపాసిత ఇతి తథోక్తః పద్మసేనకః కశ్చిన్నృపతిసుతః పక్షపాతిని పితరి సపత్నీ స్నేహేన తత్పుత్రస్య కనీయస ఏవ రాజ్యాదిదిత్సయా స్వాత్మన్యనభిముఖే సతి ఝుడితి స్వరాష్ట్రాన్నిర్గత్య సువర్ణముఖరీతటస్థం శ్రీవాయులింగముపాస్య తదావిర్భూతేన పరమేశ్వరేణ దత్తాం బహుబలామనశ్వరాం పద్మశంఖాదిసంఖ్యాకాం రథాదిచతురంగవతీం సేనాసంపదముపలభ్య బహూనృపాన్విజిత్య స్వరాష్ట్రే చక్రవర్తీ నిస్సపత్నం విరరాజ । రాజేంద్రభూపతిః త్రిశిరః పురాధిపః కేనచిద్యోగినా నందనవనస్థజమంత్యోషధీం భూమింనీత్వా తత్ర దేవస్య మాతృభూతేశ్వరస్య పూజార్థం సా పుష్పలతా క్వచిద్దేవారామే ప్రతిష్ఠితా తత్రత్య భూపతిస్తత్కుసుమాని హఠాదపహృత్య దేవేన రక్తవృష్ట్యాదినాధికం బాధిలో ధావం ధావం శ్రీకాళహస్తీశం శరణం ప్రాప్య ముక్తోఽభూత్ । చక్రధరస్య నృపస్య కన్యే ద్వే అనూఢే అపి శ్రీమద్దక్షిణ కైలాస నాథం పాశుపత వ్రతేనారాధ్య తత్ప్రసాదేన ముక్తస్య పితురుదంతం చారముఖేన విదిత్వా సద్యః స్వధనైస్సహ దక్షిణ కైలాసమాగత్య కేనచిచ్చివయోగినోపదిష్టే

నియుత శాంభవ వ్రతే తపస్తప్త్వా జ్ఞానాంబికయా సహ దేవం దృష్ట్వా సన్నిధౌ సద్యాం స్నానమాత్రేణ జ్ఞానాంబికా విమానం జగ్మతుః జీవన్ముక్తౌ అభూతామిత్యర్థః ఏవమేభిస్స్తవిత శ్రీకాళహస్తీశ్వరః పాతు మాం ॥

పద్మసేనకుని రాజేంద్రుని దంపతులచేత సేవించబడిన వాడు శ్రీకాళహస్తీశ్వరుడు. కాశ్మీర దేశమునందు పడమరదిక్కున ఉన్న మనోభంగమనే కొండను ఆసరాగా చేసుకొని శ్రీనగరమును రాజధానిగా చేసుకొని ఒకరాజు రాజ్యమును పరిపాలించుచుండెను. ఆ రాజకుమారునిపేరు పద్మసేనుడు. తండ్రికి ఇద్దరు భార్యలు. సవితి ఐన రెండవ భార్య యందు రాజునకు మిక్కిలి ప్రేమకలదు. పెద్ద భార్యపేరు సత్యవతి. పద్మసేనుని తండ్రిపేరు. యమధ్వజుడు. రెండవ భార్యపేరు కాంతిమతి. రెండవ భార్య కొడుకు పేరు హేముడు. హేమునికి తదుపరి రాజ్యాధికారము ఇవ్వలెనని రెండవ భార్య ఐన కాంతిమతి అభిప్రాయమును రాజు అంగీకరించెను. అంతట పద్మసేనుడు తల్లి దగ్గర అనుజ్ఞను పొంది తన తండ్రికి తన ప్రతిభాపాటవములు చూపవలెనని తలంచి తనరాష్ట్రమునుండి వెంటనే బయటకు వచ్చి తక్కువ సమయమున మిక్కిలి ప్రయోజకుడై అమితమైన ప్రతిష్ఠను సంపాదించి తన తండ్రికి దీటుగా రాజ్యస్థాపన చేయవలెనని తలచెను. అంతట వారణాశికి వచ్చి అచట కొంతకాలము శివార్చన చేసిన పిదప నారదమహర్షి సూచనపై సువర్ణముఖీతీరమున ఉన్న శ్రీవాయులింగాకారమున ఉన్న శ్రీకాళహస్తీశ్వరుని అమితభక్తితో ధ్యానించెను. కొంతకాలము పిదప శ్రీకాళహస్తీశ్వరుడు పద్మసేనుని భక్తికి మెచ్చి అతను కోరిన అసంఖ్యాక చతురంగబలమును అనేక రథములను గుర్రములను, ఎన్నటికీ నాశములేని ఒక పద్మమును శంఖమును అనేక సేనాసంపదను ఇచ్చి అదృశ్యమాయెను. శ్రీకాళహస్తీశ్వరదత్తమైన సేనలతో చాలామంది రాజులను యుద్ధమున జయించి తను చక్రవర్తియై ఒక పెద్ద రాజ్యమును స్థాపించెను.

రాజేంద్రుడనే మహారాజు ధర్మపురిని రాజధానిగాచేసుకొని పరిపాలించుచుండెను. అతనికి ఇద్దరు భార్యలు కలరు. పెద్దభార్య పేరు చంద్రరేఖ. చిన్న భార్య పేరు కాంతిమతి. ధర్మమార్గమున పరిపాలన చేయుచూ ఉండెను. ఇతను చోళవంశమునకు చెందినవాడు. అందమైన ఇద్దరు భార్యలతో సర్వభోగములను అనుభవించుచుండెను. కొంతకాలము తర్వాత రాజేంద్రచోళునకు ఈశ్వరునిపై భక్తి చిగురించి క్రమక్రమముగా వృద్ధినొందెను. శివరాతుడనే మహాయోగి కాశ్మీరమునందు ఉన్న మాతృభూతేశ్వరుని సేవించుచూ ఉండెను. ఆ మహాయోగి సర్వజ్ఞుడగుటవలన హరుడు జన్వతికాప్రియుడని విని ( ఉజ్జయినీ నగర ప్రియుడు. మోక్ష దాయకములుగా ప్రసిద్ధినొందిన సప్తనగరములలో ఆయోధ్య, మధుర, మాయా, కాశీ, కాంచీ, అవంతిక, ద్వారకలు కలవు.) కాశ్మీరమునుండి త్రిశిరః పురమునకు వచ్చి ( కుబేరుని పట్టణమునకు) మిక్కిలి సువాసనలు కలిగినదియు, అద్భుతమైన రూపముకలిగిన ఒకపుష్పమును తన యోగదృష్టితో భూలోకమునకు తెప్పించి శ్రీకాళహస్తీశ్వరునకు సమర్పించెను. మరి ఒక పుష్పమును ధర్మపురిలోని రాజేంద్రచోళుడు అర్చించే శివునకు సమర్పించెను. మరుసటి దినమున భార్యలతో సమేతుడై శివాలయమునకు వచ్చి భక్తితో శివుని ప్రార్థించి అర్చనలు చేయించెను. శివార్చకుడు శివప్రసాదముగా శివరాతియోగి ఇచ్చిన పుష్పమును రాజేంద్రచోళునకు ఇచ్చెను. ఆ పుష్పసౌందర్యసౌరభ్యములకు చకితుడై మహాశ్చర్యమున మునిగెను. కొంతసేపటికి తనరాజ్యమున ఇంతటి మనోహర పుష్పములున్నట్లు మాడలేదని తెప్పరిల్లి దానిని సొంతము చేసుకొని తన భార్యల కిచ్చి వారిచే మహాభిమానమును పొందవలెనని తలచెను. అతని

అభిప్రాయమునకు చిన్నభార్య ఐన కాంతిమతి గూడా వంతపలికెను. అంతట రాజభటులను తన ప్రజలను పిలిచి, తన రాజ్యము చాటింపు వేసి ఆ పుష్పములను శివునకు బదులు తనకే సమర్పించ వలెనని ఆదేశించెను. శివార్చనకై వినియోగించే పుష్పములను ఇతర కార్యములకు వాడరాదని ఎందరు చెప్పిననూ వినక తన ఆజ్ఞను వినని వారికి మరణ దండనను విధింతునని ఆజ్ఞాపించెను. మహాయోగియైన శివరాతుడు మొదట రాజుపై కోపగించిననూ శివాజ్ఞకు అందరము బద్ధులమే అని శాంతించెను. ఆ దివ్యపుష్పములను రాజేంద్రచోళుడు చిన్న భార్యయైన కాంతిమతి విలాసముగా ధరించెను. రాజు పెద్ద భార్య చంద్రరేఖ తమ మందిరములో వెలసిన శివునకు భక్తితో ఆ పుష్పములను సమర్పించెను. ఇట్లు చాలాకాలముగ జరుగు చుండెను. ఇంతలో ఒక వింత వార్త గాలిలో యథేచ్ఛగా పురజనుల చెవిలో పడి దేశమంతా వ్యాపించెను. ఆది శివుని అనుగ్రహంతో పెద్ద భార్యయైన చంద్రరేఖ గర్భవతి ఐనదని కాంతిమతికి రాజేంద్ర చోళునకు మధ్య ద్వేషమంకురించెను అని దానితో రాజునకు శాంతిలేక రాజమందిరములో ఎక్కువ కాలము ఉండలేకుండెను. అని పరమేశ్వరునకు అర్పింపవలసిన ఆ దివ్యపుష్పములను అధికార మదములో తను తన రెండవ భార్య ధరించిన పాపఫలితముగా రాజు ఒకనాటి రాత్రి కుంభవృష్టిగా వర్షము పడుచుండగా మతిభ్రమించిన వానివలె గుర్రమునెక్కి దుర్భరమును, దురంతమైన వేదనతో పరితాపముతో చాలా దూరము వెళ్ళెను.

దారిలోని అనేక క్షేత్రములను దాటుకొనుచూ వచ్చుచుండెను. పరితప్తుడైన ఆరాజునకు ఎంత దూరము వెళ్ళినను రక్షణ ఆదరణ లభించలేదు. ఒక ఏటికి తూర్పు దిక్కునకు ఎగబడి కొంతదూరము వెళ్ళగా వాన అతనిని తరుముట మానెను. కొంత స్వస్థత చెంది ఎదురుగా ఉన్న ఒక పెద్ద శివాలయమున ప్రవేశించి కొంత తాపోపశమనమును పొందెను. పెద్ద రాణియైన చంద్రరేఖ రాజేంద్ర చోళుని విషయము చారులవల్ల తెలుసుకొని మంత్రుల సహాయముతో తనే రాజ్య పాలనము చేయనారంభించెను. చంద్రరేఖ కొంతకాలమునకు ఒక మొగ శిశువును ప్రసవించి ఆ పిల్లవానికి మాత్రుభూతేశ్వరుని పేరు పెట్టెను. యుక్త వయస్సురాగానే అతనికి రాజ్య భార మప్పగించెను. రాజేంద్ర చోళుడు శ్రీకాళహస్తి క్షేత్రములో పరమశివుని గూర్చి ఘోరతపస్సు చేసి ఆయనను ప్రసన్నుని చేసుకొనగా ఆ శ్రీకాళహస్తీశ్వరుడు స్వప్నమున దర్శనమిచ్చి ఈ ఆలయమును తూర్పు దిశగా ఎత్తుగా ఉన్న కొండయందు ఒక లింగమును ప్రతిష్ఠించి నారూపముగా పూజించిన నీకు ముక్తి లభించును అని చెప్పి అంతర్ధానమాయెను. రాజేంద్ర చోళుడు శివాజ్ఞ మేరకు అచట శివలింగమును ప్రతిష్ఠించి శివార్చనను చేయుచుండెను. చంద్రరేఖ తన సుతుడైన మాత్రు భూతేశ్వరుడు తండ్రిని వెతుకుచూ శ్రీకాళహస్తికి వచ్చి తండ్రిని గుర్తించి రాజ్య వ్యవహారములన్నియు చెప్పి ధర్మపురికి రమ్మని కోరగా స్వామిని అర్చించుకొనుచూ ఇచటనే నుందునని ధర్మమార్గమున రాజ్యమును ఏలుమని పుత్రునకు హితవు చెప్పి పుత్రుని పంపెను. రాజేంద్ర చోళుని కర్మ పరిపక్వమైనందు తను ప్రతిష్ఠించిన శివలింగమునందే పరమేశ్వరుడు ప్రత్యక్షమాయెను. భక్తితో శివుని ప్రార్థింపగా రాజేంద్ర చోళునకు ముక్తిని ప్రసాదించెను. ఇది స్థలపురాణములోని కథ.

చక్రధరుడు అనే ఒక మహారాజు కలడు. వంశాచారముగా వచ్చుచున్న శివపూజను మాని రాజ్యవిస్తరణయందే మక్కువతో జైత్ర యాత్ర సాగించుచుండెను. అంతట ఒకనాడు అగస్త్య మహాముని అతని ఎదుట నిలిచి నీ తాత ముత్తాతలందరూ పరమ శివ భక్తులై నేతలైరి. నీవు పాషండమతిని వీడి '(శ్రీకాళహస్తీశ్వర చరణౌ శరణం మహం ప్రపద్యే'' అని ఆయనను

శరణు వేడుమని హితబోధ చేయగా ఆమహాముని చెప్పినట్లే స్వర్ణముఖిలో స్నానమాడి నిరాహారుడై శ్రీకాళహస్తీశ్వరుడు ప్రత్యక్షం కాకున్ననూ ఇచటనే తన శరీరమును అర్పింతునని ప్రతిజ్ఞ చేసి ధ్యానములో నిమగ్నుడాయెను. ఎంత చిత్రమో! చక్రధరుని వింతముక్తి మరునాటి ఉదయమునకే శ్రీకాళహస్తీశ్వరుడు చక్రధరుని తనలో లీనము చేసుకొనెను. శ్రీకాళహస్తీశ్వరుని అనుగ్రహము చక్రధరునిలో ఆగక అతని కుమార్తెలైన అమృత లతికలపై కూడా ప్రసరించెను. రాజశేఖరుడు చక్రధరుని కుమారుడు తన తండ్రి శ్రీకాళహస్తీశ్వరునిలో లయమును పొందినారని విని. తన అక్కలతో రాజశేఖరుడు శ్రీకాళహస్తీశ్వరుని దర్శించుటకై వచ్చెను. చక్రధరుని కుమార్తెలైన అమృత లతికలకు శ్రీకాళహస్తీశ్వరుడు స్వప్నమున పంచాక్షరీ దీక్షను ఇచ్చెను. అంతట వారు స్వర్ణముఖిలో స్నానము చేసి శ్రీకాళహస్తీశ్వరుని శ్రీజ్ఞానప్రసూనాంబికను దర్శించి సుధామతి అనే యోగిచెప్పిన నియమ నిష్ఠలుగల శాంభవీ వ్రతమును ఆచరించుచూ శ్రీజ్ఞానప్రసూనాంబికా అనుగ్రహంతో విమానమును ఎక్కి కైలాసమును చేరిరి. కనుక ఆది దంపతులైన శ్రీకాళహస్తీశ్వర శ్రీజ్ఞాన ప్రసూనాంబికల అనుగ్రహంతో అమృత లతికలు జీవన్ముక్తులైరి. సశరీరముతోనే కైలాసమును చేరిరి. ఆ ఆది దంపతులు నన్ను రక్షించుగాక అని నేను వారిని ప్రార్థించు చున్నాను. చక్రధరుని కుమార్తెల వలెనే పద్మ సేనకుని కుమార్తెలు కూడా శ్రీకాళహస్తీశ్వరుని సేవించి తరించిరట. ధూర్జటిమహాకవి కూడా వనకన్యలు ఇద్దరు శ్రీకాళహస్తీశ్వరుని సేవించి తరించిరని తన కావ్యమున వర్ణించెను. శ్రీకాళహస్తీశ్వర మహాత్మ్యమున. స్వామిని ఐశ్వర్యమును కోరిననూ ఇవ్వగలడు. రాజ్యమును ఇవ్వగలడు. మోక్షమును ఇవ్వగలడు అందువల్ల వీటన్నిటికీ మూలము భక్తే. భగవంతుడు భక్తి సులభుడు.

## తుంగః 83

తుంగస్సర్వసురకులేభ్యోప్యుత్తుంగః అతఏవ । శ్రు । ఉగ్రోస్యుగ్రోహగ్ సంజాతేషు భూయాసమితి వా ఓజీ యో రుద్ర త్వదస్తి శివ ఏకో ధ్యేయశ్శివంకరస్సర్వమన్యత్పరిత్యాజ్య సమాప్తాథర్వశిఖేతి శ్రుతిభిస్సర్వోత్తరత్వదర్శనాదయమీశ్వరస్తుంగ ఇత్యర్థః అథవా ఇదం వాయుపూజిత మహాలింగం లూతా సర్పేభచిహ్నైః పంచధా భిన్న శిరః ఖండలాంఛనేన చ నిజభక్త పారతంత్ర్యం దిదర్శయిషుస్స్వజనాగమనం ప్రతీక్షమాణముద్గ్రీవ మివోత్తుంగం సకలసాధారణం దృశ్యత ఇతి తుంగ ఇతి వా అర్థః ॥

తుంగడు సమస్త దేవకులములలోని వారికన్నా అత్యున్నతుడు. ''శాంతం శివమచ్యుతం, దాంతంహర మద్భుతం, భజేఽహం నిరీహం, భజేఽహం దురూహం, స్వయం స్వాత్మరూపం'' అని పరమశివుని ధ్యానించగా భక్తుల ఎదుట ప్రత్యక్షమై కోరిన వరములనిచ్చును. కనుక ఆయన ఒక్కడే గతి. ధ్యేయమైన వస్తువు. ఆయన మంగళ ప్రదాత. సర్వ వ్యాపకములను వదిలి ఆయనను శరణు వేడినచో ఆయనే రక్షించును. శివతత్త్వమును విపులముగా అథర్వ శిఖోపనిషత్తునందు కలదు. తుంగ అనగా ఒక జాతి గడ్డి. వాటిలో తోమరికతుంగ, గలిబితుంగ, కట్టుతుంగ, గోదుతుంగ, తెగడతుంగ, సాలితుంగ, శాకతుంగ, కుసితుంగ, గురపశాకతుంగ, బద్దతుంగ, కొండతుంగ, బిల్లితుంగ, చెక్క తుంగ, ఇసుక తుంగ, కసువు తుంగ, గడ్డతుంగ, గబ్బుతుంగ, గొడ్డు తుంగ, చలి తుంగ, కదురు తుంగ, ఏడాకుల తుంగ, జీబతుంగ, దబ్బతుంగ, జల్లెడ తుంగ, పూరితుంగ మొదలగునవి కలవు. తుజ హిం సాయాం అను

ధాతువునుండి ఘఞ్ అనే కృత్యప్రత్యయముచేయగా తుంగ శబ్దము వచ్చెను. రోగనివారకము అని అర్థము అనగా భవరోగనివారకమగును. శ్రీకాళహస్తీశ్వరుడు వాయులింగాకారుడు. ఈ మహాలింగమున సాలెపురుగు, సర్పము, ఏనుగు చిహ్నములే కాక ఐదు శిరస్సులుగా ఉన్నట్లుగా కూడా కనపడును. తన భక్తులను రక్షించేందుకు ఇది ఒక ప్రమాణము. నీటిలోని తుంగ నీటినుండి పైకిలేచి పరిసరములను సునిశితముగా ఎట్లు వీక్షించునో అట్లే భక్తుల రాకను శ్రీకాళహస్తీశ్వరుడు తలను పైకెత్తి తుంగలత వలె ఎదురు చూచును. అందువల్ల ప్రతీక్షకు తుంగలత సాధారణమైన దృశ్యము. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరుడు భక్తవశంకరుడు అనుటకు ఇది చక్కని ఉదాహరణ, ఆర్తిని పోగొట్టు కొనుటకు జీవుడు ఎట్లు ప్రయత్నించునో అంతకన్నా ఎన్నోరెట్లు శ్రీకాళహస్తీశ్వరుడు గూడా భక్తులను పాలించుటకు అట్లే తాపత్రయ పడును. మహాప్రవాహమున తుంగ నీటివరద ఉరవడికి అనుకూలముగా నీటిలో మునుగునో భక్తులను రక్షించుటకు పరమేశ్వరుడు గూడా కైలాసమునుండి భువికి దిగి వచ్చి భక్తులలో కలిసి మెలసి ఉండి వారి కష్టములను తీర్చును.

## రక్షిత సారంగః 84

రక్షితస్సారంగోఽనేనేతి రక్షిత సారంగః కశ్చిద్ధనమదాంధో బ్రాహ్మణ హతకః శ్రీకాళహస్తి మభ్యేత్య వారనారీవశగః కించిత్కాలేన సర్వస్వం తస్యై దత్వా పునస్తాయా నిరస్త ఉరుదుఃఖమనుభవన్ తామేవ బహుధా నత్వా స్తుత్వా తదుపదిష్ట వైరాగ్య సంపన్న శ్శివమారాధ్య ముక్తోఽభూత్ ॥

సారంగమనగా జింక, హరిణము, ఇఱ్ఱి, ఏనుగు, తుమ్మెద, వానకోయిల, చిత్రవర్ణముకలిగినది. మొదలగు అర్థములు కలవు. శ్రీసదాశివుని చేతిలో జింక ఒక ఆభరణముగా గలదు. సారంగుడు ఒక బ్రాహ్మణుడు గోదావరీతీరము విప్రకూటమనే బ్రాహ్మణ అగ్రహారము ఇతనిది. ఇతను అగ్రహారీకుడు. విధివశమున వైదికకర్మలు మాని సారంగుడు వేశ్యాలోలుడయ్యెను. అడవి జంతువులలో జింక ఒక అందమైన ప్రాణి. వాల్మీకి రామాయణమున సీత కూడా బంగరుజింక అందముగా కనిపించి శ్రీరాముని తెమ్మని కోరెను. కనుక అది అంతటి అందమైనదని భావన. ''మనసు కంటె మాయ ఏది మలహార శివ! నా మనసు నిలిపి దారి చూపు మహిమల శివా! క్షణము నిలకడ లేని దానిని అరికట్టుము శివా! దేవర హస్త భూషణత దేజరిలున్ పరమోజ్వలంబుగా!''. జింక వాయుదేవుని ప్రియ వాహనము. అడవి జంతువులలో నిలకడలేనిది జింక. అతి చంచల స్వభావము గలిగిన జింక నిలకడగా తనయందు ఉంచుకొనుట పరమేశ్వరునికే దగినది.

ఒక ధనమదాంధుడు పాపాత్ముడైనవాడు. శ్రీకాళహస్తికి వచ్చి శ్రీస్వామిని సేవించి తరించవలెనని భావించెను. కానీ పూర్వ జీవన విశేషములతో అతను ఒక వారకాంతకు దాసుడయ్యెను. కొంతకాలము తర్వాత తన సర్వస్వమును ఆమెకు సమర్పించెను. ఆమే తన సర్వస్వమని అతను భావించెను. కొంతకాలము తర్వాత ఆమెకు ఆమె పరివారమునకు దాసుడై సేవచేయుచుండెను. కానీ అతని ధనము, అతను తమ సేవకు పనికి రాడని తెలుసుకొని ఆమె తన ఇంటినుండి అతనిని వెళ్ళగొట్టగా శ్రీకాళహస్తీశ్వరుని సేవించి విరాగుడై ముక్తిని పొందెను. ఆ వారకాంతే అతనికి వేదాంతమును బోధించి శ్రీకాళహస్తీశ్వరునికి భక్తునిగా చేసెనని ఒక కథ మూల పురాణమున కలదు.

## భృతచక్రధర ప్రభుః 85

స్వవిషయస్థిత జన నిగ్రహానుగ్రహయోః ప్రభవతీతి ప్రభుః చక్రం బహుసైన్యం రాష్ట్రం చ ధరతి రక్షతీతి చక్రధరోఽన్వర్థనామా స చాసౌ ప్రభుశ్చ చక్రధర ప్రభుః భృతస్సంరక్షితశ్చక్రధర ప్రభుర్యేన స భృత చక్రధర ప్రభురిత్యర్థః।

చక్రం కోకే వ్రజే పుంసి క్లీబం సైన్యరథాంగయోరితి ప్రతాపః। అయం చక్రధరః పురోక్తకన్యాద్వయస్య పితా పరమశైవః శ్రీకాళహస్తి స్థలం బుద్ధిపూర్వం సమాగమ్యారాధ్య శివప్రసాదాన్ముక్తిమగమత్ అత్ర విభురితి మంత్ర భేదేన కేచనాహుః తర్హ్యేకోత్తరశతనామాని భవంతి శతనామాబ్జమాలికేతి వృత్యుమృకండుజ రోమశభరద్వాజముఖసూక్తి ప్రసిద్ధేః భృత చక్రధర ప్రభురితి పాఠఏవ గ్రాహ్య ఇత్యనుసంధేయం।

రాజు తన రాజ్యమున తన పరివారమును తన ప్రజలను నిగ్రహానుగ్ర సమర్థులుగా ఉంచే సమర్థుడు. ఆయనకు ఎవరిమీద ఎప్పుడు, అనుగ్రహము వచ్చునో ఆగ్రహము వచ్చునో తెల్పుట కష్టము. చక్రము అనగా ఆయుధ విశేషము బండికల్లు, గుంపు, దండు, రాష్ట్రము, గ్రామపు వళుకు, కుమ్మరిసారె నీటిసుడి, జక్కవ మొదలగు అర్థములు కలవు. చక్రము అనగా బహుసైన్యము కలిగిన దేశము అని అర్థము. అటువంటి సైన్యమును పరివారమును ప్రజలను కాపాడేవాడే చక్రధరుడు. అతను చక్రవర్తిగూడా. ఈ చక్రధరునికి ఇద్దరు కుమార్తెలు కలరు. చక్రధరుని తాతముత్తాతలు శ్రీకాళహస్తీశ్వరుని సేవించి, తరించినవారే. శ్రీకాళహస్తీశ్వరునియందు చక్రధరుని పూర్వీకులు పరమభక్తి తత్పరులు. ఇచట భృత చక్రధర ప్రభుః అనే నామము తర్వాత విభుః అనేనామము ఉండవలెనని కొందరు అభిప్రాయము. అట్లైతే నూరు నామములకు బదులు నూటొక్కనామములు ఉండవలసి వచ్చును. శ్రీకాళహస్తీశ్వర శతనామాబ్జమాలిక అని వృత్యు, మృకండుజ, రోమశ, భరద్వాజ మహర్షులచేత చెప్పబడి, ప్రసిద్ధమైనదిగూడా. కనుక ఇచట భృత చక్రధర ప్రభుః లనే నామమే సమంజసమైనది. అదే ఇచట గ్రహించవలెను. శ్రీకాళహస్తీశ్వరుడు చక్రధర ప్రభువు.

## ధర్మాసనః 86

**ధర్మః పుణ్యమేవాసనం యస్య స ధర్మాసనః।**
**ధర్మః పుణ్యః యమః న్యాయః స్వభావాచారః సోమపాః ఇతి। నానార్థః అథవా।**
**శుక్రలే మూషికే శ్రేష్ఠే సుకృతే వృషభే వృష ఇతి।**
**ధర్మవృషభశబ్దయోరైకార్థ్యావగమాద్ధర్మో వృషో వాహనం యస్యాస ధర్మాసన ఇత్యర్థః॥**

ధర్మము అనగా పుణ్యము, న్యాయము, సామ్యము, స్వభావము, సత్సంగము, శృతిస్మృత్యాది విహిత కృత్యము, వేదాంతము, దానాదికములు, ఆచారము, అహింస, వేదోక్తవిధి, ఉపనిషత్తు, యజ్ఞము, విల్లు అనే అర్థములు కలవు. ''వేదోఽఖిలో ధర్మమూలం' అనేక ధర్మములకు వేదమే మూలము. '' ధర్మేణ పాపమపనుదతి, ధర్మే సర్వం ప్రతిష్ఠిత,'' తస్మాత్ ధర్మం పరమం వదంతి. మానవులు స్వధర్మమును ఎట్లు చేయవలెనో వేదము చెప్పినది. వేదమున అనేక కర్మ ధర్మములు కలవు. ధర్మమును ఆచరించుట ద్వారా ఈ లోకమున సుఖమును దేహము నశించిన పిదప కీర్తిని యశస్సును పొందుదురు. వైదికమైన ధర్మమును ఆధారము

చేసుకొనే బ్రహ్మ సృష్టి చేయుచున్నాడు. సూర్య చంద్రులు, నక్షత్రము, గ్రహములు ధర్మదృష్టితోనే నడుచు చున్నారు. లోకమున ధర్మాత్మునినే అందరూ ఆదరించెదరు. ధర్మమే అన్నిటికీ ఆధారము. దయా, ఓర్పు, శాంతి ప్రేమ సహకారము సహవాసము సహజీవనము. శుచి, శుభ్రత ధర్మము వల్లనే లభించును. స్వధర్మమే మానవునికి బంధువు స్నేహితుడు, గురువు, అధర్మము మానవుని అశాంతికి గురిచేయును. స్వధర్మాచరణమే పశువులతో మనుష్యుని వేరు చేయుచున్నది. ధార్మిక సంపాదన ఎక్కువ కాలమునిలిచి మానవునికి శాంతి సుఖము ప్రేమలను అందించును. మానవుడు మరణించిననూ ఇతర లోకములకు తనతో ధర్మము మాత్రమే అనుసరించి వచ్చును. అటువంటి ధర్మమునే ఆసనముగా కలిగినవాడు శ్రీకాళహస్తీశ్వరుడు. ధర్మమునకు వృషశబ్దమునకు ఏకార్థము కావున వృషభమే పరమేశ్వరుని వాహనము ఇచట వాహన శబ్దమునకు ఏకార్థము కావున వృషభమే పరమేశ్వరుని వాహనము ఇచట వాహన శబ్దము, ఆసన పర్యాయ పదముగాడా వాడబడినది. వృషభవాహనుడే ధర్మాసనాసీనుడు. అటువంటి ధర్మ స్వరూపుడైన శ్రీకాళహస్తీశ్వరుడు నన్ను రక్షించుగాక అని ఆయనను ప్రార్థించుచున్నాను.

## వరగుణాభీప్సితార్థ ప్రదాయకః 87

వరగుణ నామా పాండ్య దేశాధిపః కశ్చిత్ స్వేష్టదైవతం సుందరేశం విస్మృత్య విధిచోదితః పిప్పలాదమునిం నత్వా కిం దైవతమిష్ట సిద్ధయే సముపాస్యమితి పృష్ట్వా తదుపదిష్టనామ పంచదశాక్షర మంత్రం ప్రజపన్నపి కాలేన ప్రక్షీణ ధనధాన్యసైన్యః ఖిన్న హృదయః శ్రీకాళహస్తిస్థలమభ్యేత్య శంభుమారాధ్య స్వాభీప్సితమాపేతి కథా కథమన్య మంత్ర జపాదభీష్టసిద్ధిర్నాభూదితి చేత్ స్వేష్టదేవతా విస్మరణం నామసాంకర్యం చేతి హేతుద్వయమస్తి। శ్రు। యో వై స్వాం దేవతామతియజతే ప్రస్వాయై దేవతాయై చ్యవతే నపరాం ప్రాప్నోతి పాపీయాన్భవతీతి మాత్వా రుద్రచుక్రుధామానమోభిర్మాదుష్టుతీ వృషభమానహూతీతి।

**మాత్వా రుద్రేతి మంత్రేణ సహ పూజా నిషిధ్యతే ।**
**తస్మాదన్యేన దేవేన సహ శంభుం న పూజయేదితి ॥**

శ్రుతిస్మృతిభిః నామ సాంకర్యం నిషిధ్యతే।నను।వాయుసంహితాదౌ తత్తత్కల్పాంతవృత్తాంత మధికృత్య మహర్షిభిః। తాని తాని ప్రణీతాని విద్వాంస్తత్ర న ముహ్యతి।

**అయం పరస్త్వయమన్నేతి సంరంభాభినివేశినః**
**యాతుధానా భవంత్యేవ పిశాచాశ్చ న సంశయ ఇతి ॥**

**కర్మవిపాకే।యో బ్రహ్మవిష్ణురుద్రాణా ముత్తమాధమభావతః సాధయేదుదరవ్యాధి యుక్తో భవతి మానవ ఇతి । వచనేషు సత్సు శివస్యాధిక్యహేతోః అన్యానామాది సాంకర్యం నిషిద్ధమితి । కథముపపద్యే తేతి చేత్ ।**

ఆదిత్యపురాణే ।
**యో మహాదేవమన్యేన హీనదేవేన దుర్మతిః ।**
**సకృత్సాధారణం బ్రూయాత్సోంత్యజోనాంత్యజోంత్యజః ॥**

ఇత్యాదీని సంతి। త్వదుక్తకర్మవిపాకవచనం త్వద్బాధకమేవ భవతి। కథం। త్రిమూర్తిషు సామ్యబుద్ధిః తవ చాన్యస్యవా నాస్త్యేవ । విష్ణోరేవాధిక్యం మన్వానస్సమబుద్ధిరితి వాచా వదసి

వ్యవహారేన కస్యాఽపి సామ్యబుద్ధిః ఘటపటాదౌ సామ్యబుద్ధ్యదర్శనాత్ శాస్త్రతః మనుష్యసురశక్రగురు బ్రహ్మవిష్ణు రుద్రేషు బోధానందైశ్వర్యాదీనాం ఉత్తరోత్కర్ష ప్రసిద్ధేస్తారతమ్య మస్త్యేవ। తత్తిష్ఠతః। వేదేషు యాజ్ఞవల్క్యాదిస్మృతిషు పురాణేషు చ త్రిమూర్తిభ్యోఽన్యా సర్వకారణ రూపా సాంబమూర్తిః కాప్యస్తి। తస్యా ఏవాధిక్యం శాస్త్రేషు శ్రూయతే। రుద్రవిష్ణువిధ్యాధికం సర్వం తదభేదేన పశ్యేత్ న సామ్యేనేత్యర్థః। తథాహి। బృహన్నారదీయే।

**హరిశంకరయోర్మధ్యే బ్రహ్మణశ్చాపి యో నరః**
**భేదకృన్నరకాన్భుంక్తే యావదా చంద్ర తారకం ॥**
**హరం హరిం విధాతారం యః పశ్యేదేక రూపిణం।**
**స యాతి పరమానందం శాస్త్రేమేష నిర్ణయం ॥ ఇతి విష్ణుపురాణే –:**

**త్వయా యదభవద్దత్తం తద్దత్తమఖిలం మయా।**
**మత్తో విభిన్నమాత్మానం ద్రష్టుమర్హసి శంకర! ॥**
**యోఽహం సత్వం జగచ్చేదం స సురాసుర మానుషం।**
**అవిద్యా మోహితాత్మా నః పురుషాభిన్నదర్శనాః ॥ ఇతి**

సర్వస్య వస్తునః చిద్రూపేణైకాత్మ్యం ఖలు సంపాదనీయం. తన్మతం వైదికమేవ. అన్యథోపాధి ప్రాధాన్యేన బేధ బుద్ధౌ సత్యాం సమబుద్ధిరితి యదుచ్యతే తదసత్ తస్మాత్ వరగుణ పాండ్యః కృచ్ఛ్రేణ దేవమారాధ్య నానాత్వధియం విహాయ ముక్తోఽభూత్.

వరగుణుడు అనే సుందర పాండ్య దేశమునకు చెందినరాజు. తన వంశమునకు ఇలవేల్పు ఐన సుందరేశ్వరుని మరచి విధిచోదితుడై పుప్పలాదమహర్షిని నమస్కరించి ఇష్టకామ్య సిద్ధికి ఏ దేవతను పూజింపవలెను అని అడిగెను ఆయన వరగుణునకు పంచదశాక్షరములు కల ఒక మంత్రమును ఉపదేశించెను. జగత్తున శక్తికి శక్తిమత్తులకు భేదము మోక్షమును పొందుట యందే కలదు. పార్వతికి పరమేశ్వరునకు అర్ధనారీశ్వరముగా అభేదము. కావున వారికి భేదము ఎట్లు వచ్చెను? పార్వతీపుడు రమేశుడు ఒకరే (పార్వతీం పాతీతి పార్వతీపః రమాయాః ఈశః రమేశ) హరిహరులకు అభేదముని అనేక పురాణములు చెప్పినవి. శ్రీకాళహస్తి క్షేత్రమున ఈశ్వరునకు ఎదురుగా శ్రీజ్ఞానప్రసూనాంబిక కలదు. ఇంకా కొంచము దూరమున ఏడుకొండలలో వెలసిన శ్రీవెంకటేశ్వరుడే ఇదివరకు బాలాత్రిపురసుందరిగా కలదు. పేరైతే మారినది తత్త్వము మారలేదు. దానికి నిదర్శనము శుక్రవారము శ్రీవెంకటేశ్వరునకు క్షీరాభిషేకము చేయుటయే. శుక్రవారమునాడు అన్నీ అలంకారములు తీసినను శంఖ చక్రములు తీయకపోవుట, శక్తి ఆలయముగా ఉన్న దానిని శ్రీరామానుజులు వైష్ణవమత ప్రచారమునకై దీనిని వైష్ణవాలయముగా మార్చిరని చరిత్రకారులు చెప్పుచున్నారు. **ఉత్తరాదివారు నేటికి ఈక్షేత్రమును బాలాజీ క్షేత్రముగానే చెప్పుకొనుచున్నారు.** ఉత్తరాదివారు నేటికి ఈక్షేత్రమును బాలాజీ క్షేత్రముగానే చెప్పుకొనుచున్నారు. నిండిన చెరువులో కప్పలు చేరినట్లు డబ్బు కలవాని దగ్గరకు అందరూ చేరినట్లు వరగుణ పాండ్యుని వద్దకు బౌద్ధులు చేరి అతని బౌద్ధునిగా మార్చిరి. అంతటితో పిప్పలాద మహర్షి చెప్పిన మంత్ర అనుష్ఠానమును వరగుణ పాండ్యుడు విడిచివైచెను. అంతటితో అతని రాజ్యముతో సంపదలు కూడా అన్యాక్రాంతమైనవి. అంతటితో వరగుణ పాండ్యుని బౌద్ధులు గూడా విడిచివెళ్ళిరి. అంతట ఆరాజు ఉభయతః

భ్రష్టుడయ్యెను. కొంతకాలము తర్వాత నారద మహర్షి ప్రత్యక్షమయ్యి గురూపదేశమును వ్యతిరేకించిన దోషమే నిన్ను ఈస్థితికి తెచ్చినది కనుక మనస్సును కుదుట పరచుకొని శ్రీకాళహస్తీశ్వరుని భక్తితో సేవించినచో నీకు మిక్కిలి శ్రేయస్సు లభించును. నీ చిక్కులను సమస్యలను తొలగించి రక్షించుటే. శ్రీకాళహస్తీశ్వరుని స్వభావము. పిప్పలాద మహర్షి ఇచ్చిన మంత్ర విచారణ చేయక నిష్ఠతో శివధ్యానము చేయుము అని ఉపదేశించి వెళ్లెను. జరిగిన దానికి వరగుణ పాండ్యుడు పశ్చాత్తాప పడి శ్రీకాళహస్తీశ్వరుని సేవించుటకు నిశ్చయించెను.

ఐతే ఇచట పిప్పలాద మహర్షి ఇచ్చిన మంత్రము వెంటనే సఫలము ఎందుకు కాలేదు? అని ప్రశ్నించినచో ఇచట రెండు కారణములు కనపడును. ఒకటి తనకుల దైవమును విస్మరించుట రెండవది నాస్తికులైన బౌద్ధులకు ఆశ్రయమిచ్చి తను నాస్తికుడగుట. ప్రతివాడు శివారాధనచేయవలెను. శివదీక్షితుడైన వాడు ఆదీక్ష పరిసమాప్తి వరకు మరే దేవతారాధనను శాస్త్రములను స్మరించరాదు. నామసాంకర్యమును చేయరాదు అని శివదీక్ష నిషేధించుచున్నది. ఆగమము. వాయు సంహిత మొదలగు శైవాగమములయందు. దేశకాల, పాత్ర వైలక్ష్యమును బట్టి ఆరాధనలలో కొద్ది మార్పులను మహర్షులు చేయుచుందురు. ఐతే దీక్షను ఇచ్చిన గురువు ఏమార్గమును చూపితే అదే మార్గములోనే ప్రయాణించుట మంచిది. కొన్ని విషయములలో విద్వాంసులు కూడా భ్రమ పడుదురు. చేసే పనియందు శ్రద్ధ జిజ్ఞాసా లేనిచో రాక్షసుల బదులు పిశాచములు వచ్చి బాధించును. కర్మ విపాకమనే గ్రంథమున బ్రహ్మ విష్ణురుద్రులకు ఉత్తమమధ్యమాధమ బేధములు చెప్పిన వో మానవులు ఉదరవ్యాధితో బాధపడుదురు అని ఉన్నది. ఉపాసకుడు ఏ ఉపాసనకు ఇష్ట పడినచో దానిని ఉపాసించి, సిద్ధి పొందవచ్చును. అందువల్ల ఒకనికి శివోపాసనయందు మక్కువ కలిగినచో ఇతరులను ద్వేషించకుండా శివోపాసనను చేయవచ్చును. ఐతే త్రిమూర్తులయందు అందరికి సమానమైన ఆదరణలేదు. ఎట్లా ఎల్లప్పుడూ ఘటము పటముకాదో (వస్త్రము కుండ కాదో) అట్లగే బ్రహ్మవిష్ణుమహేశ్వరుల తత్త్వములు వేరు. వారి ప్రవృత్తులువేరు. మనుష్యులకు దేవతలకు శుక్రునికి బృహస్పతికి బ్రహ్మ విష్ణుమహేశ్వరుల వలె వారి ప్రవృత్తులు, అభీష్టములు, నిగ్రహానుగ్రహములు, ఐశ్వర్యములు వేరుగా ఉన్నట్లు లోకప్రసిద్ధి కలదు. ఐతే వేదమందు యాజ్ఞవల్క్య స్మృతియందు పురాణములయందునూ సాంబమూర్తికే ప్రాధాన్యత కలదని కొందరి అభిప్రాయము. బృహన్నారదీయములో త్రిమూర్తిలలో భేదమును హెచ్చుతగ్గులగూర్చి చెప్పితే వారు చంద్ర తారకలున్నంత కాలము నరక దుఃఖములను అనుభవింతురు. త్రిమూర్తులను ఏకరూపముగా చూచినచో వారికి స్వర్గమున పరమానందము లభించును అని ఉన్నది. విష్ణుపురాణమున శ్రీహరితో శంకరుని విభిన్నముగా చూచినచో వారికి నరకము సిద్ధించును. నాకన్నా వేరుగా శంకరుడు లేడు. అజ్ఞానముతో ఉన్న మానవులు మాత్రమే శంకరనారాయణులలో బేధమును చూపించెదరు. సమస్తమైన ప్రపంచము ఉపాధిబేధముతోనే బేధ బుద్ధి సిద్ధించును. కనుక వరగుణ పాండ్యుడు శివకేశవ బేధ బుద్ధిని విడనాడి ముక్తిని పొందెను. పురాణములు సత్త్వ,రజస్తమో గుణ ప్రధానముగా అవతరించినవి. కాలానుగుణముగా దేవతలకు ప్రాధాన్యత ఏర్పడెను. అందువల్ల అందరూ భక్తికి వశ్యులే. కావున దేవతలలో తర తమ భేదమును చూపుట మహా పాపము. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరుడు వరగుణుని కోరికను తీర్చి అతనికి ముక్తిని ప్రసాదించెను.

## నిత్యః 88

అజో నిత్యశ్శాశ్వతోఽయం పురాణో న హన్యతే హన్యమానే శరీరే ఇతి । కాలకాలస్య కాలాంతరాభావాత్ శివస్య నిత్యత్వం సిద్ధమిత్యర్థః ॥

ఈ నామమునందు ఈశ్వరుని అసలు తత్త్వము నిరూపించుచున్నాడు. ఈశ్వరుడు అజుడు, నిత్యుడు, శాశ్వతుడు, పురాణుడు (అజుడు అనగా జన్మలేని వాడు, నిత్యుడనగా సర్వకాల సర్వావస్థలయందు ప్రకాశించే వాడు, శాశ్వతుడు అనగా నాశములేనివాడు, స్థిరమైన వాడు, పురాణుడు అనగా సృష్టికంటే ముందు ఉండువాడు (ప్రాచీనుడు). కాలపురుషునికి కాల నిర్ణయము అసంభవము గనుక లయకారుడైన శంకరునికి సాటి మరి ఒకరు లేరు కనుక ఆయనే నిత్యుడు, పరిశుద్ధుడు, ఎల్ల వేళలా ప్రకాశించేవాడు శాశ్వతుడు, ప్రాచీనుడు, సత్, చిత్, ఆనందస్వరూపుడు ఆయనే. కావున పరమేశ్వరుడు నిత్యుడు అని వేద పురాణములు చెప్పుచున్నవి.

## బ్రహ్మపురావాసీ 89

బ్రహ్మణః పురమివ పురం శరీరం బ్రహ్మపురం । తత్రావసతీతి బ్రహ్మపురావాసీ । శ్రు ''అథ యదిదమస్మిన్ బ్రహ్మపురే దహరం పుండరీకం వేశ్మ దహరోస్మిన్నంత రాకాశ స్తస్మిన్ యదంత స్తదన్వేష్టవ్యం తద్వావ జిజ్ఞాసితవ్య'' మితి ।

పురమేకాదశద్వార మజస్యావక్రచేతసః ।అనుష్ఠాయ న శోచతి విముక్తశ్చ విముచ్యత ఏతద్వైతత్ । బ్రహ్మపురమధ్యాత్మే అనాహత స్థానం । అధిదైవతం బ్రహ్మపురం చిదంబరం । ఏతత్స్థాన ద్వయేఽపి భక్తానాం స్వరూప మభివ్యంజయన్నిత్యమాస్తే । అతోఽస్మద్హృదయేషు చిదంబరే శ్రీకాళహస్తిస్థలే వాన్యత్ర దేవ ఏక ఏవాస్తే । న భిద్యతే హి । ఏకో దేవస్సర్వభూతేషు గూఢస్సర్వవ్యాపీ సర్వభూతాంతరాత్మా । ఈశ్వరస్సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతీతి స్మృతేశ్చ । సర్వహృదయవాసీ శ్రీకాళహస్తీశ్వరః పాయాదిత్యర్థః ॥

బ్రహ్మకు పట్టణము వంటి పట్టణము ఈ దేహము. దేహములన్నియు బ్రహ్మదేవుని నిర్మితములే గదా । కనుక శరీరము బ్రహ్మపురము. అచట నివసించుట చేత పరమేశ్వరునకు బ్రహ్మపురవాసీ అనేపేరు వచ్చెను. ఛాందోగ్యోపనిషత్తునందు (8-1-1) ఉత్తమాధికారులకు నిర్విశేషబ్రహ్మోపదేశమును చేసి మంధమాధికారులకు సవిశేష బ్రహ్మను ఉపదేశము చేసెను. దహరమనే పుండరీకమునకు వేశ్మ (గృహము)మునకు ద్వారపాలకులవలె ఉందురు. బ్రహ్మ పురమునందు అనేక పుర జనులు ఉందురు. ఒక శరీరము సక్రమముగా పనిచేయుటకు కరచరణాది ఇంద్రియములు మనస్సునకు ఎట్లు సహాయకులో అట్లే ఉపాధిని ఆశ్రయించి నామరూపములచేత జీవుడు అని, రాజు అని బ్రహ్మ అని ఆత్మనే పిలుచుచున్నారు. కనుక ఇటువంటి బాహ్య విషయ విరక్తులైన వారు బ్రహ్మచర్య, సత్య సాధనములతో నిర్గుణ పర బ్రహ్మను తెలుసుకొన గలరు. ఉపాధి ఆవరణము చిన్నది. అందులోని హృదయ పుండరీకము ఇంకా అతి చిన్నది. ఆ చిన్న అవకాశము గల ఆకాశములో బ్రహ్మ నివసించి ఉన్నాడు. అతనిని తెలుసుకొనవలయును. మన లోపల ఉన్న పరమాత్మను తెలుసుకొనుట కూడా చాలా కష్టమే అందువల్ల సద్గురువుని ఆశ్రయించి శ్రవణ మనన నిదిధ్యాసనముల ద్వారా అన్వేషించి ఆయనను దర్శించవలెను. ఆది భౌతిక అధ్యాత్మిక ఆది దైవికములలో శివస్థానమును నిర్ణయించునప్పుడు

బ్రహ్మ పురవమును ఆది దైవితవముగా చిదంబరమును వర్ణించిరి. శ్రీకాళహస్తిలోనూ, చిదంబరములోనూ, తనమహిమలను భక్తులకు తెలియజేస్తూ, పరమేశ్వరుడు వెలసెను. ఈ రెండు క్షేత్రాది దేవుళ్ళు వేరైననూ వారి మూల ప్రకృతి ఒకటే. ఒకేపరమాత్మ అన్ని భూతములయందు, ఉపాధులయందు శరీరమునందు అంతర్లీనుడై సర్వాంతర్యామియై, సర్వ వ్యాపకుడై పరమేశ్వరుడు ఉన్నాడు. ప్రకృతికి అధీనుడైన వానికి స్వతంత్రత లేనందున స్వాభావికమైన కర్మలను విడువ శక్యము కాదు. కావున కర్మలను చేయవలసినదే ఐతే స్వాభావిక కర్మనే కాదు. ఈశ్వరునకు అధీనుడైనవాడును కర్మను చేయవలసినదే అందువల్ల కర్మయొక్క అవశ్యకర్తవ్యతను వేదము బోధించుచున్నది. ఈశ్వరుడు అన్ని భూతములను నియమించున్నాడు, ఆయన వ్యక్తుడు గాక అన్నీ దేహాలయొక్క హృదయ ప్రదేశమున అధిష్టించి యుండి తన మహాశక్తి చేత మానవుడు యంత్రమును త్రిప్పిన విధముగా ఈ ప్రాణులందర్నీ ఆయన త్రిప్పుచున్నాడు అని భగవద్గీతలో 18 అధ్యాయము 61 శ్లోకమున చెప్పెను. కనుక అందరి హృదయ వాసుడైన శ్రీకాళహస్తీశ్వరుడు నన్ను రక్షించుగాక అని ప్రార్థించుచున్నాను. అధికారికమైన గృహమున ద్వారపాలకులు పరిచారికలు భృత్యులు. సేవకులు ఉందురు. బ్రహ్మపురమున చతుర్ముఖ బ్రహ్మ ఉన్నప్పటి సర్వాంతర్యామియైన పరమేశ్వరుడు అధిపతిగా ఉండును.

## దేవర్షినగరాసికః 90

దీవ్యంతి ప్రకాశంతే ఇతి దేవాః। ఋషంతి గచ్ఛంతి స్వస్వవిషయం ప్రతీతి ఋషయః। దేవాశ్చ తే ఋషయశ్చ దేవర్షయః ఇంద్రియాణి శ్రోత్రాదీని తేషాం నగరమివ నగరం। అంతః కరణం। తత్రాసికాస్థితి రస్యాస్తీతి దేవర్షినగరాసికః। శ్రు।మనోమయః ప్రాణ శరీరనేతా ప్రతిష్ఠితోన్నే హృదయం సన్నిధాయ। తద్విజ్ఞానేన పరిపశ్యంతి ధీరా ఆనంద రూపమమృతం యద్విభాతీతి।సయ ఏషోంతర్హృదయ ఆకాశః। తస్మిన్నయం పురుషో మనోమయః। అమృతో హిరణ్మయ ఇతి।సర్వేషాం ప్రాణానాం ప్రతినియత ప్రాణనాదివ్యాపార నియమనార్థం దేవర్షినగరాఖ్యాంతః కరణే తిష్ఠతీతి దేవర్షి నగరాసిక ఇత్యర్థః। అథవా।దేవానా మృషీణాంచ నగరయోరాసనమస్యాస్తీతి తథోక్తః। స్వయం మహాదేవోఽపి శక్రాది దేవేషు క్వచిత్క్వచి॥ న్మేరు కోణేషు తత్సామ్యేన ఈశాన కోణే భోగవతీ పురీ స్వాంశరూపీ తిష్ఠతీతి. దారుకావనమునిజన జ్ఞానదానాయ కురుకుందేన సాకం గత్వా తైరజ్ఞాత వృత్తోంఽతర్హితః పునః విధిబోధితైః త్రై లింగ ప్రతిష్ఠా పూర్వక ముపాసీనైః అభ్యర్థితః తత్రోవాస. మహాదేవః ఇతి స్కాందాది పురాణం ద్రష్టవ్యం. అత్ర శ్రీదక్షిణ కైలాసవాసీ దేవర్షి నగరాసికః పాత్విత్యర్థః

దివ్యమైన ప్రకాశమును కలిగినవారు దేవుళ్ళు. ఋషి అనగా విశిష్టాధికారి. శాస్త్రకారుడగు ఆచార్యుడు. మంత్రద్రష్ట, కిరణము, దివ్యజ్ఞానముచే సంసారమును చేరువాడు. శ్రేష్ఠుడు అని అర్థములు కలవు. ఋషి అనగా తమకు కావల్సిన విషయములను దివ్య జ్ఞానముతో తెలుసుకునేవాళ్ళు అని అర్థము. (సప్తఋషులు – మరీచి, అత్రి, అంగీరసుడు, పులస్త్యుడు, పులహుడు, క్రతువు, వశిష్టు అనే కశ్యపుడు, అత్రి, భరద్వాజుడు, విశ్వామిత్రుడు, గౌతముడు, జమదగ్ని వశిష్టుడు అని రెండు బేధములు కలవు.) శ్రోత్రాది ఇంద్రియములే వారికి మహానగరములు. అంతఃకరణచతుష్టయములే ఆ నగర పురవీధులు. అచటస్థితి, ఆశ్రయము కల్గి ఉండే వాడని అర్థము. 'మనోమయః ప్రాణశరీరనేతా' అనే మంత్రము ముండకోపనిషత్తులోనిది (2-2-8) ఆత్మ మనస్సును ఉపాధిగా కలవాడగుటచేత అందు

ఉండి మనోవృత్తులచేత తెలియబడుచుండును. కనుక ఇతను మనోమయుడు. ఇతడు ప్రాణములతో కలిసి లింగశరీరముతో ఈ స్థూల దేహము నుండి మరి ఒక స్థూల శరీరమునకు తీసుకొని పోవును. కనుక ఇతడు ప్రాణ శరీరములకు నాయకుడు, ఇతడే మనము తిను అన్నములో ఉండి వృద్ధిక్షీణములను శరీరమునకు కల్గించి సూక్ష్మరూపమున హృదయములో ఉండును. కనుక వివేక వంతులు అట్టి ఆత్మతత్త్వమును తెలుసుకొనుటకు సద్గురువుని సేవించి వారి ఉపదేశముచేత శమదమాది సాధన షట్కసంపత్తి అనుష్ఠానము చేత సర్వత్యాగమనెడి వైరాగ్యమున వచ్చే జ్ఞానముచేత సకల పరిపూర్ణునిగా సాక్షాత్కరించుచున్నారు. ఆ ఆత్మ ఆనందస్వరూపము, అమృతము, ఎల్లవేళల తన యందే భావించుచుండును. "కలావన్నమయాః ప్రాణాః" కలియుగమున ప్రాణులు అన్నాధారులు. దేహము శక్తివంతమగుటకు అన్నమే ఆధారము అని భావము. హృదయము నిలబడుటకు దేహము దోషరహితముగా శక్తివంతముగా ఉండవలెను. ఆహృదయ పద్మములో పరమేశ్వరుడు నిలిచి ఉన్నాడు. అని భావము. తైత్తరీయోపనిషత్తునందు (1-6-1) శిక్షావల్లి ఆరవ అనువాకమున బ్రహ్మ ఏ స్థానమునుండి ప్రత్యక్షమగుచున్నాడు. హృదయాది స్థానమును బ్రహ్మోపాసన ఎచట చెప్పబడుచున్నది. సాలగ్రామశిలయందు విష్ణువును, లింగమున శ్రీసదాశివుని ఎట్లు అర్చించి ధ్యానించుచున్నామో అట్లు హృదయస్థానమున బ్రహ్మను ఉపాసింపవలయును. అంతరహృదయమున ఆకాశము గలదు. పద్మాకారమై మాంసపిండము శరీరమున కలదు. హృదయము ప్రాణమునకు స్థానము. ఆ హృదయము అనేక నాడులతో కూడిన ద్వారముతో ఉన్నది. దాని నాళము ఊర్ధ్వముగా ఉన్నది. ముఖము దిగువన ఉన్నది. అంతరహృదయమందున్న ఆకాశమునందు మనోమయుడైన (విజ్ఞానమయుడైన) పురుషుడు ఉన్నాడు. ఆ పురుషునికి మరణము లేదు. అతను ఎల్లప్పుడునూ ప్రకాశము కలవాడు. ఇట్టి బ్రహ్మ స్వరూపమును తెలిసినవాడే విద్వాంసుడు. ఆ పరబ్రహ్మ బంగారు మయుడు. సర్వజీవుల ప్రాణములను సృష్టి - లయములు ద్వారా నియంత్రించుచుండును. ప్రాణము ఇంద్రియముల పనులను నియమించి నియంత్రించుటకే దేవర్షి నగరమనే మనోబుద్ధి చిత్తాహంకారములనే అంతః కరణములో ఉండును. లేనిచో వేరే విధముగా కూడా అర్థమును చెప్పుకొనవచ్చును.

దేవనగరసింహాసనమునందు ఋషి విజ్ఞాన నగర సింహాసనమునందు శ్రీపరమేశ్వరుడు ఆసీనుడై ఉన్నాడు అని అర్థము. శ్రీపరమేశ్వరుడు దేవదేవుడైనప్పటికి దేవేంద్రుడు మొదలగు దేవతలకు శ్రీపరమేశ్వరుని అంశ లేశముగా సంక్రమించినందున వారు మేరు పర్వతమువంటి కాంతిని కలిగిఉన్నారు. దారుకావనమున ఉన్న మునులకు, మహర్షులకు జ్ఞానమును శివతత్త్వమును ఉపదేశించుటకై కురుకుందునితో అచటకు వెళ్ళి శ్రీపరమేశ్వరుడు వారికి తత్త్వ బోధచేసెను. కాని ఆ మునులు భవబంధములలో ఉన్నవారు. అటువంటి ఆ మునులను ఉద్ధరింపగోరి అచటనే కొంతకాలము ఉన్నట్లు స్కాందపురాణమున కలదు. శ్రీమద్దక్షిణ కైలాసవాసుడైన శ్రీకాళహస్తీశ్వరుడు దేవర్షినగరాసికుడైనట్లుగా మమ్ములను రక్షించమని ప్రార్థన.

## శ్రీవిష్ణు నగరావాసీ 91

శ్రీవిష్ణోః నగరం కంఠస్థ షోడశ పత్రకమలం విశుద్ధ చక్రం జాలంధరపీఠమితి నామాంతరం యత్ తత్ స్థానం శ్రీకాళహస్తి సంజ్ఞమధి దైవత మావసతీతి. తథోక్తః ఉక్తం చాగస్త్య సంహితాయాం

మయాలాధారం విరించస్య ప్రదితం కమలాలయం ।
అహమేవ త్యాగరాజః తత్ర తిష్ఠామి సాదరం ॥

ఇత్యారభ్య స్వాధిష్ఠాన మణిపూరాఽనహత రూపాణి జంబుకేశ్వర శోణాచల చిదంబరాణి పఠిత్వా

హృత్పుండరీకం ధాతుశ్చ చిదంబరముదీరితం ।
సభాపతిరహం తత్ర ప్రయచ్ఛామి సదీప్సితం ॥
శ్రీమద్దక్షిణ కైలాసం విశుద్దిస్థానముద్భృతం ।
శ్రీకాళహస్తీశ్వరస్తత్ర తిష్ఠామ్యహమభీష్టదః ॥
ఇతి

విరాజః కంఠస్థ షోడశ పత్రకమలం శ్రీకాళహస్తి స్థానం ఇతి. వ్యక్తమాసీత్. అనేన విష్ణుస్థానం శ్రీకాళహస్తీతి వ్యజ్యతే. సూత గీతా సప్తమాధ్యాయేః- అధ్యాత్మాధి దైవత స్థాన వివరణే స్పష్టమేవ ఉచ్యతే. తత్రతు

త్రిమూర్తీనాం తు యో బ్రహ్మ తస్య ఘోరతనుర్ద్విజాః ।
దక్షిణేక్షిణి జంతూనామంతర్భాగే రవిర్బహిః ॥
త్రిమూర్తీనాం తు యో బ్రహ్మ తస్య శాంత తనుర్ద్విజాః ।
వర్తంతే వామనేత్రాంతః భాగే బాహ్యే నిశాకరః ।
త్రిమూర్తీనాం తు యో విష్ణుః స కంఠే వర్తతే సదా ॥
అంతశ్శాంత తనుః ఘోర తనుర్బాహ్యే ద్విజోత్తమాః ।
ఇతీరితత్వాత్ విరాట్ పురుషః కంఠస్థానీయః
శ్రీకాళహస్తిపురస్య విష్ణు నగరత్వాత్త త్రావసతీతి తథోక్తః ॥

మయాలపురాణే దక్షిణ కైలాస పురస్య శ్రీవిష్ణుపురం, బ్రహ్మ పురమిత్యాది నామాంతరముక్తం. న చ తత్కారణం వివృతం తస్మాదయమర్థః ఔచిత్యాదేవ సేత్స్యతి. అన్యథా శ్రీకాళహస్తినామ ప్రసిద్ధివత్. విష్ణ్వాదిభ్యోఽపి వరదానాత్ తన్నామాంకితమితి పక్షే పూర్వ పూర్వదత్త వరదాన ముచ్ఛిద్యేత. తదా వరదాన శ్రవణాభావాచ్ఛేదమేవ సమంజసమితి మనీషిణః ప్రీత్యానుగృహ్ణంతు.

ఈనామమున యోగదర్శనమును గూర్చి కొంత ప్రస్తావించినది. యోగమనగా ఈశ్వరునితో సంయోగమును పొందు ప్రక్రియ. యోగమనిన ఆధ్యాత్మిక సాక్షాత్కారమును పొందు ప్రక్రియ యోగములన్నియు మోక్షప్రాప్తికి సాధనములే. చిత్త వృత్తులను నిరోధించుటే యోగము. అని యోగపదనిర్వచనము. ఐదువిధములైన మానసికావస్థలు (చిత్త భూములు) 1. క్షిప్తావస్థ (అనేక విషయములపైకి చెల్లాచెదరుగా మనస్సు ప్రసరించు దశ) 2. మూఢావస్థ - (సుషుప్తిలో వలె మనస్సు పనిచేయ కుండు దశ) 3. విక్షిప్తావస్థ (క్షిప్తదశలో వలె కాక ఈదశలో చిత్తము కొంత శాంతస్థితిలో ఉండును.) 4. ఏకాగ్రావస్థ (ధ్యాన విషయముగా గ్రహించిన వస్తువుపై చిత్తమును నిశ్చలముగా నిలిపి ఉంచగల దశ) 5. నిరుద్ధావస్థ (ధ్యాన ప్రక్రియ కూడా ఈదశలో నిరుద్ధమగును) మొదటి మూడు అవస్థలతో యోగసాధన కుదరదు. చివరి రెండు అవస్థలే యోగానుకూలములు. యోగమున ఎనిమిది అంగములు కలవు. అవి యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధారణ, ధ్యాన సమాధులు అని కలవు. యమమనగా

అహింసా, సత్య, అస్తేయ (దొంగిలింపకుండుట) బ్రహ్మచర్యము. అపరిగ్రహము. ఇది ఐదు అంగములు శౌచము, (పరిశుభ్రత) సంతోషము (సంతృప్తి) తపస్సు, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము అని కలదు. నియమము, ఆసనము అనగా శరీర శిక్షణ, శరీరమును స్థిరముగా సుఖకరముగా అంగవిన్యాసములలో ఉంచుట. ప్రాణాయామమనగా ఉచ్ఛ్వాస నిశ్వాస నియంత్రణము, నియమనము. ప్రత్యాహారమనగా ఇంద్రియములను ఇంద్రియార్థనుండి ఉపసంహరించి చిత్తమును అధీనములో ఉంచుకొనుట. ధారణ అనగా నాసాగ్రమువంటి ఒక లక్ష్యమును ఎంచుకొని దృష్టిని ఆ లక్ష్యమునందే లగ్నము చేయుట. ధ్యానమనగా నిరంతరము ఒకే విషయమును భావించు చుండుట, సమాధి అనగా ధ్యాన క్రియ ఆగిపోయి ధ్యేయ వస్తువుతో ఆత్మకు ఏకత్వమును సిద్ధించు స్థితి. చిత్త వృత్తి నిరోధముగా చెప్పిన సమాధి కంటే ఇది వేరు. మొదటి ఐదు యోగములు బహిరంగ (బాహ్య) సాధనములనియు చివరిమూడు అంతరంగ సాధనములని చెప్పుదురు. క్రమ బద్ధమైన వీటి సాధన ద్వారా సంప్రజ్ఞాత, అసంప్రజ్ఞాత యోగము వశ్యములగును. యోగదర్శనమున ఈశ్వర దర్శనమే పరమలక్ష్యము. ఆ ఈశ్వరుడు సంపూర్ణుడు, శాశ్వతుడు, సర్వవ్యాపి, సర్వశక్తి సమనిత్యుడు, సర్వజ్ఞుడు, క్లేశ, కర్మ, విపాక (ఫలితములు) ఆశయము (వాసనలు) అన్నింట చేతను అంటని వాడు (అపరామృష్టుడు) ఈశ్వరాస్తిత్వప్రమాణము వేదములు ఉద్ఘోషించుచున్నవి. కావున ఈశ్వరుడు కలడు, సర్వజ్ఞత్వము కలమూర్తియే ఈశ్వరుడు, ప్రకృతి పురుష సంయోగము వలన జగత్తు పరిణమించుచున్నది. అంటే వారి విభాగమువలన జగత్తు లయమగుచున్నది. కానీ ఈ లయము స్వాభావికము, ప్రకృతి పురుషులకు కాదు. అందువల్ల వేర్వేరు ఆత్మల అదృష్టకర్మఫలములననుసరించి ఈ సంయోగ విభాగసంబంధములను కల్పింప గల ఒక పరతత్త్వము ఉండి తీరవలయును. ఆ పరతత్త్వమే ఈశ్వరుడు. జ్ఞానయోగము, భక్తియోగము, రాజయోగము, హఠయోగము, లయయోగము, క్రియాయోగములేకాక భగవద్గీతలో అనేక యోగముల గూర్చి కలదు. అన్నీ యోగములకు పుట్టుకను ఉపనిషత్తులు చెప్పివి.

శ్రీమహావిష్ణువు యొక్క నగరమునందు నివాసముండు వాడు పరమేశ్వరుడు. కంఠము ఉండే షోడశ పత్రకమలమే విశుద్ధ చక్రము. జాలంధర పీఠమనే నామాంతరము కల ఆ స్థానము శ్రీకాళహస్తి సంజ్ఞగా అధి దైవతముగా ఉన్నది. అగస్త్య సంహితలో కూడా బ్రహ్మకు మూలాధారము కమలముగా చెప్పెను. ఆయన కమలాసనుడు కదా! త్యాగరాజః అనే శబ్దమునకు త్యాగము అనగా విడుచుట, వదలుట, త్యజించుట, ఇచ్చుట, దానము, శూరుడు, ఫలాపేక్ష లేక కర్మములను అనుష్ఠించువాడు (త్యజహానా) అనే అర్థములు కలవు. అటువంటి త్యాగములో రాజువంటి నేనే అచట మన్ననతో ఆదరముతో నివసించగలను అని ప్రారంభించి స్వాధిష్ఠానము జంబుకేశ్వరమున మణిపూరము, శోణాచలమున అనాహతము, చిదంబరమున ఉన్నట్లుగా చెప్పి హృత్పుండరీకము ధాతువులు చిదంబరమున ఉన్నట్లుగాను చెప్పెను. కోరిన కోరికలను ఇచ్చే వాడ్నిగా సభాపతిగా ఉన్నాను. అద్భుతమైన విశుద్ధి స్థానము శ్రీమద్దక్షిణ కైలాసము. అచట శ్రీకాళహస్తీశ్వరునిగా ఉన్నాను. కంఠస్థానమైన షోడశ పత్ర కమలముగా విరాజిల్లుతూ శ్రీకాళహస్తిక్షేత్రము ప్రసిద్ధి నొందినది. అందువల్ల విష్ణుస్థానము శ్రీకాళహస్తి అని తేలినది. సూతగీతలో ఏడవ అధ్యాయమునందు ఆధ్యాత్మ, అధి దైవత స్థానము వివరణముగా సుస్పష్టముగా చెప్పబడెను. త్రిపుర్తులలో బ్రహ్మదేవుడు ఆ రుద్రునియొక్క

భయంకరమైనవాడుగా ఉన్నప్పుడు అతని ద్వారా ద్విజులు, కుడికంటిలో లోపల అనేకజీవులు బయట సూర్యుడు, పుట్టెను. త్రిమూర్తులలో బ్రహ్మదేవుడు రుద్రునియొక్క శాంతమైన దేహుడుగా ఉన్నప్పుడు ఎడమకంటిలో లోపల బయట చంద్రుడు పుట్టెను. త్రిమూర్తులలో విష్ణువు ఆ పరమేశ్వరుని కంఠములో ఎల్లపుడు ఉండును. శివుడు లోలోపల శాంతమూర్తిగా బయట ఘోర రూపమును కలిగిన వాడిగా చెప్పెను. విరాట్ పురుషుడు కంఠస్థానీయుడు. శ్రీకాళహస్తి విష్ణు నగరము గావున అచట పరమేశ్వరుడునివాసముండెను. మూలపురాణములో శ్రీకాళహస్తిని విష్ణుపురముగా బ్రహ్మ పురవముగా దక్షిణ కైలాసలముగా అనేక పేర్లతో ఉన్నది. వీటికి కారణములు మాత్రము మూల పురాణమున వర్ణించలేదు. కనుక ఇచట ఔచిత్యమే ప్రధానము. శ్రీకాళహస్తి క్షేత్రము అన్నిటికన్నా ప్రసిద్ధమైనది కదా ! పూర్వము బ్రహ్మ విష్ణువులకు శ్రీపరమేశ్వరుడు వరములు ఇచ్చినందున ఆ పురమునకు వారిపేర్లు వచ్చినవా అది కుదరదు. బ్రహ్మ విష్ణువులకే వరప్రదాత ఐన పరమేశ్వరుడు ప్రీతితో నన్ను రక్షించుగాక.

## శ్రీమత్పాండ్యపురస్థితః 92

**కావేరీ కన్యాకుమార్యోః అంతరాళే పాండ్యదేశః ఇతి సంజ్ఞా భవతి. తద్దేశాధిపతీనాం రాజ్ఞాం పాద్యానాం పురీ మధురా. తస్మిన్ పాండ్య పురే జీవన్ముక్తిపురే స్థితః సుందరేశోఽప్యయం శ్రీకాళహస్తీశ్వరః ఏవ. నాన్యః ఇతి. భావః అనేన మహోంత్యష్టషష్టిస్థానాని యాని తేషు శ్రీకంఠన్యాస, సూతసంహితాది ప్రయుక్త స్థానేషు అయమేవ వర్తత ఇత్యనుసంధేయం.**

కావేరీనది కన్యాకుమారి క్షేత్రమునకు మధ్యన ఉన్న స్థలమునకు పాండ్యదేశమనే సంజ్ఞకలదు. ఆదేశ రాజులకి మధురనగరము రాజధాని అటువంటి సుందరనగరములో జీవన్ముక్తి పురమున సుందరేశ్వరుడు వెలసెను. ఆయనగూడా శ్రీకాళహస్తీశ్వరుడే. ఇచట క్షేత్ర భేదమే గాని తత్త్వములో అంశలో భేదము లేదు. ప్రసిద్ధశైవ క్షేత్రములు 68గా ప్రసిద్ధికలదు. శ్రీకంఠన్యాస సూతసంహితాది గ్రంథముల యందు కూడా ఈ 68 క్షేత్ర ప్రసక్తి కలదు. ప్రసిద్ధశైవ క్షేత్రములలోని శ్రీపరమేశ్వరుడు లింగాకారుడుగానే ఉన్నాడు. నిష్కలము ఐన లింగము తత్త్వజ్ఞాన ప్రకారము ఆది భగవంతునికి సంకేతము శివునికి గుర్తుగా ఉంచబడేదే శివలింగము అని దాని భావము, లిం అనునది లయమును పొందుటకు, గం అనగా సృష్టి చేయుట అని అర్థము అది సృష్టికి మూలము శివలింగము కూడా త్రిమూర్త్యాకారమే. ఇది 1. సమకంఠ లింగము. 2. వర్ధమానలింగము 3. శైవాధిక లింగము 4. స్వస్తిక లింగము 5. సర్వతోభద్ర లింగము 6. సార్వదేశిక లింగము 7. త్రైరాశిక లింగము, 8. ధారాలింగము అనునవి కలవు.

## భీమార్చితః 93

పురోక్త మూక మృత్యుంజయార్తిఘ్న ఇత్యత్ర యో మూక ఇత్యుచ్యతే స ఏవ భీమా నామాపశ్చాత్తాపేన శివమభ్యర్చ్య నాథ శర్మముని శాపపాపలబ్ధమూకత్వాఘాన్మోచితోఽభూదితికథా ।

వృద్ధాచలమనే మహాక్షేత్రమున నాథశర్మ అనే బ్రహ్మ నిష్ఠునకు భీముడనే శిష్యుడు కలడు. కారణాంతరములచేత గురువుగారి గ్రంథమును శిష్యుడు అపహరించెను. అది తెలిసిన నాథశర్మ భీముని మూగవాడుగా శపించెను. అచట శ్రీకాళహస్తి క్షేత్రమునకు దగ్గర లోనిది ఆవులు మాత్రము మేసే బీడులోనిది ఆలయమునకు రెండు క్రోసుల దూరములోని స్థలము (గవ్యూతి) లో ఒక లింగమును స్థాపించి అచట అర్చనలు చేయుచూ భక్తితో తపస్సు చేసి

ముక్తి పొందెను. శ్రీకాళహస్తీశ్వరుడు మూగవాడైన భీముని మృత్యుంజయుని ఆర్తిని నశింపచేసెను. వారికి ముక్తిని కూడా ప్రసాదించెను.

## పితా 94

శ్రు । సోమా రౌద్రం చరుస్నిర్వపేత్ప్రజా కామ ఇతి । విధాయ పునరుపపత్తి మాహ । సోమో వై రేతోధాః అగ్నిః ప్రజాం ప్రజనయతీతి । మంత్ర ప్రశ్నే । శ్రాద్ధే । గర్భాధానార్థం । ఆధత్త పితరో గర్భం కుమారమితి రుద్రపిండ మేవ పత్న్యై ప్రయచ్ఛంతి । అతస్సర్వేషాం రుద్రః ఏవ పితా భవతి । ఏవం సత్యపి కేచిత్ ।

**రుద్రపిండ సముద్భూతా రుద్రక్రోధజమారితాః ।**
**తద్భూమిం యాంతి వారస్త్రీ సుతవత్తన్న జానతేః ॥**
**ఇతి న్యాయేన రుద్రం పితృవన్న పూజయంతి । తత్రపరాశరః ।**
**యస్య స్యాత్పితరి ద్వేష శ్శర్వే వా జగతాం గురౌ ।**
**తస్య వంశస్య సాంకర్య మనుమేయం విపశ్చితేత్యుక్తత్వాత్**
**క్షేత్రబీజ దోషేణ యథా వా ప్రలపంతు నామ।**
**సర్వప్రకారేణ శ్రీకాళహస్తీశ్వరో రుద్రస్సర్వపితేత్యర్థః ॥**

రుద్రుడే అందరికి తండ్రి. మహారేతస్సు కలిగిన వారిలో ఒకరు రుద్రుడు. మరి ఒకరు సోముడు. అగ్నిదేవుడు ఆ రేతస్సును జీవుడిగా మార్చును. మాతృగర్భములో కొంతకాలము నివాసముండి జీవన శక్తినిపొందిన తర్వాత ఈ లోకమునకు వచ్చును. గర్భాదాన సమయమున ''ఆదత్త పితరో గర్భం కుమారమితి'' అని రుద్ర పిండమనే శుక్రముద్వారా తనపత్నికి భర్త ఇచ్చును. సృష్టిలో అండజ, స్వేదజ, ఉద్భిజ రూపజీవులందరికి పరమేశ్వరుడే తండ్రి. ఇచట కొందరు రుద్ర పిండమునుండి పుట్టి, రుద్రక్రోధము చేత మరణించుచున్నారు. వారకాంత పుత్రునివలె తండ్రిని తెలుసుకొనలేక మరణించు చున్నారు. అందువల్ల రుద్రుని తండ్రివలె పూజించము అని కొందరు చెప్పు చున్నారు. ఇచట పరాశరుడు ఇట్లు చెప్పుచున్నాడు. ఎవనికి, తండ్రియందు ద్వేషము కలదో. ఆ తండ్రి అందరికి గురువైనప్పటికి అట్లు దోషముగా భావించినచో అతని వంశము ఎచటనో పద్దతిని తప్పినదని భావము. క్షేత్ర బీజ దోషములచేత అజ్ఞానులు ఎట్లాగైనా మాట్లాడగలరు. ఏది ఎట్లున్ననూ అన్ని విధములుగా రుద్రుడే శ్రీకాళహస్తీశ్వరుడు. ఆయనే అందరికి తండ్రి. కనుక అటువంటి ఆయన నన్ను రక్షించుగాక.

## భర్తా 95

భూత భౌతిక సురాసుర నరతిర్యగాది సర్వజగజ్జాలం నిజాజ్ఞయా అనతివేలం యథా భవతి తథా బిభర్తీతి భర్తా । శ్రు । ఏతస్యేవాఽక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యాచంద్రమసౌ విధృతౌ తిష్ఠత ఇత్యాది తతోఽయం భర్తా హరో మాం పాయాత్ ॥

భృఙ్ భరణే అనే ధాతువునుండి పుట్టినది ఈ రూపము. మగడు, ప్రభువు, మోయువాడు, భరించువాడు అని అర్థములు కలవు. పంచ భూతములు భౌతికమైన వస్తువులు, సురులు, అసురులు, నరులు, తిర్యక్కులు అనేకులైన జీవులు. సృష్టిలోని ప్రతివస్తువు పరమేశ్వరుని ఆజ్ఞతో నడచుచున్నందున ఆయన ఈ సృష్టికి ప్రభువు. ఆయన అక్షరుడు. ఆయన ఆజ్ఞ చేతనే సూర్యచంద్రులు గ్రహ నక్షత్రములు అష్టదిక్పాలకులు దేవేంద్రాది దేవతలు సక్రమమైన మార్గమున నడచుచున్నారు. కావున అటువంటి ప్రభువైన శ్రీకాళహస్తీశ్వరుడు నన్నురక్షించుగాక.

## భరద్వాజ ప్రపూజితః 96

వాజమన్నాదిభోజ్యసంపదం బిభర్తీతి భరద్వాజః తేన ప్రకర్షేణ పూజ్యత ఇతి తథోక్తః। శ్రీరోమశమహర్షిణా సముపదిష్టం శ్రీకాళహస్తీశ్వరదివ్యమంగళ చరిత వైభవం శ్రీభరద్వాజ శ్రుత్వా దేవస్య దక్షిణభాగే మణికర్ణికాతీర్థ తీరే మహాలింగం ప్రతిష్ఠాప్య ఆపాంస్రతం పూజయామాసేతి। తతో భరద్వాజ ప్రపూజితః॥

భరన్ వాజః అన్య అస్తీతి భరద్వాజః భరద్వాజుడు సప్తర్షులలో ఒకడు. ఇతడు జితేంద్రియుడు. భరద్వాజ గోత్రీకులు చాలామంది కలరు. ఇతని పుట్టుక అనేక పురాణములలో అనేకరకములుగా కలదు. భరద్వాజుని తండ్రి బృహస్పతి. బృహస్పతి మమతలకు ఇతను పుట్టాడని ఒక పురాణమున కలదు. మరి ఒక పురాణమున దుష్యంతుని పుత్రుడైన భరతుడు సంతానార్థియై యాగము చేయుచుండగా అడవిలో మరుత్తులకు ఒకబాలుడు దొరకగా భరద్వాజుడని వారే అతనికి పేరుపెట్టి భరతునకు ఇచ్చి పెంచుకొన మనెను. తర్వాత భరత వంశమునకితడు వంశకర్తయయ్యెను. ఆ తర్వాత భరతునిచే ఇతను పుత్రేష్టి చేయించెను. భరద్వాజుని పుత్రుడు మన్యువు. భరద్వాజుడు గంగానదిలో స్నానము చేయుచుండగా ఘృతాచి కపిల అను అప్సరసకుమార్తె. ఆమె తన సౌందర్యముచే విశ్వ కర్మను వ్యాసుని మోహింప చేసినది. ఆ ఘృతాచి కూడా స్నానము చేయుచుండగా భరద్వాజుడు చూచెను. అంత అతని రేతస్సు పతనము కాగా దానిని ఒక కుండలో ఆమె దాచగా దానినుండి ద్రోణుడు పుట్టెను. వనవాసము చేయుచున్న శ్రీరాముడు భరద్వాజుని ఆశ్రమమునకు కూడా వెళ్ళెను.

**వాజమనగా అన్నము. అన్నమే కాక అనేక భోజ్య పదార్థములు కలిగి, వాటిని ఆశ్రమమునకు వచ్చిన వారందరికి ఆర్తితో ఇచ్చేవాడు. అటువంటి మహర్షి శ్రీకాళహస్తీశ్వరుని సేవించెను. శ్రీరోమశమహర్షిచేత శ్రీకాళహస్తీశ్వర దివ్య మంగళ** చరిత్రను, ఆయనవైభవమును బాగా విని శ్రీస్వామివారి ఆలయ దక్షిణ భాగము మణికర్ణకేశ్వరుని సమీపమున ఒక తీర్థము కలదు. దాని తీరమున మహాలింగమును ప్రతిష్ఠించి చాలా కాలము పూజించెను. అందువల్ల శ్రీకాళహస్తీశ్వరుని భరద్వాజుడు సేవించినందున భరద్వాజ ప్రపూజితః అనే బిరుదు వచ్చెను. ఎచటెచ్చటివారో ఇచటికి వచ్చి శ్రీకాళహస్తీశ్వరుని సేవించుచుండిరి. వారందరిని శ్రీకాళహస్తీశ్వరుడు నేటికీ రక్షించుచునే ఉన్నాడు. ఓ కాళహస్తీశ్వరా! నీవు రక్షించే వారి పట్టికలో నన్నూ చేర్చుకొని నన్ను రక్షించమని ప్రార్థించు చున్నాను.

## ప్రసన్న కాళహస్తీశః 97

ప్రసన్న శ్చాసౌ కాళహస్తీశశ్చ ప్రసన్న కాళహస్తీశః। బహవః పాపినః స్వచ్ఛందమాజన్మ పాపమేవానుష్ఠాయ అంతతః కాళహస్తిస్థానం గత్వా భజంతి చేత్ తేభ్యోఽపి ప్రసీదతీతి ప్రసన్నకాళహస్తీశః।

జ్ఞానమును ప్రసాదించే ప్రసూనాంబికతో కూడినవాడు శ్రీ కాళహస్తీశ్వరుడు కావున ఆయన ప్రసన్న కాళహస్తీశ్వరుడు. ఆయన భయంకరుడు. భీకరుడు కాడు. ప్రసన్నమైన చూపులతో భక్తులకు ప్రసాదములను ఇచ్చే వాడు. నేటి మానవుని సహజ గుణం. పర పీడన పరాయణత్వము పరద్రవ్యాపహరణమునందే అధిక వ్యాపకము. కావున సహజ సిద్ధముగానే

మానవులు పాపాత్ములగుచున్నారు. పుణ్యార్జన సుఖమును ఇచ్చును. పాపార్జన దుఃఖమును ఇచ్చును. సుఖానుభవమున కాల గమనమే మనకు తెలియదు. కానీ దుఃఖము అనుభవమునకు వచ్చినపుడు క్షణము ఒక యుగముగా గడచును. మిక్కిలి ఎక్కువైన దుఃఖానుభవమును కూడా జీవుడు భరించలేక ఆత్మ హత్యలను చేసుకొనుచున్నారు. ఇది మానవ సహజనీతి. సంస్కారములచేత కష్టకాలము వచ్చిననూ దేవ ప్రార్థన ద్వారా దానిని నివృత్తి చేసుకొనవచ్చును. భక్తులను ఉద్ధరించుటలో శ్రీకాళహస్తీశ్వరుడు పరమదయాళువు. పాపాత్ములను కూడా కటాక్షించి వారిని అనుగ్రహించి వారి పాపముల ఆయన ప్రక్షాళన చేయును. అందువల్ల ఆయనను ప్రసన్న కాళహస్తీశ్వరుడు అని అందురు.

## ప్రభాద్యోతిత దిఙ్మఖః 98

స్వప్రభయా ద్యోతితం ప్రకాశితం దిశాముఖం యేన స తథోక్తః । శ్రు । తస్య భాసా సర్వమిదం విభాతీతి శ్రుతేః । స్వయంప్రభ ఇత్యర్థః ॥

కాళిదాస మహాకవి తన అభిజ్ఞాన శాకుంతల నాటకమున నాంది ప్రార్థనగా పరమేశ్వరుని అష్టమూర్తిగా స్తుతించెను. (ఆ అష్టమూర్తులు - జలము, హవిస్సు, అగ్ని, రాత్రి, సంవత్సరము, సూర్యుడు, ఆకాశము, భూమి "సూర్యో జలం మహీవాయుః వహ్నిరాకాశమేవచ, దీక్షితో బ్రాహ్మణః సోమ ఇత్యేతాః స్తవన క్రమాత్" అష్టదిక్కులకు ఎనిమిది ముఖకాంతిని ప్రసరింపచేసి ఆ దిక్కులలోని ప్రతి జీవిని తన ప్రకాశములో చైతన్య వంతుని చేసి ఉద్ధరించుచున్నాడు. శ్రీకాళహస్తీశ్వరుని దివ్య కాంతులు ఈ విశ్వమంతయు ప్రసరించుచున్నవి అని వేదములు చెప్పుచున్నవి. ఆయన సర్వజ్ఞుడైనందున ఆయన ప్రభాద్యోతిత దిఙ్మఖుడు. ప్రభా అనగా వెలుగు. చీకటిలో ఉన్న జీవులకు వెలుగును ప్రసరింపచేసి వారిని సుజ్ఞానులుగా చేయువాడు శ్రీకాళహస్తీశ్వరుడు.

## కుమార కాళహస్తీశః 99

కౌ భూమౌ మార ఇవ కుమారః స్కందస్స చాసౌ శ్రీకాళహస్తీశశ్చ కుమార శ్రీకాళహస్తీశః । అథవా । కుత్సితాన్ దుశ్శీలాన్మారయతీతి కుమారో గుహః । స కుమారః శ్రీకాళహస్తి పురేశో భూత్వా ఆత్మా వై పుత్ర నామాసీతి శ్రుతేః విద్యాశైలమధిరుహ్య శివతత్త్వముపదిశతీతి కుమార కాళహస్తీశః ఇత్యర్థః ॥

కుమారస్వామి మయూర వాహనుడు. శ్రీకాళహస్తికి తూర్పునకు వాలుగా కొండశిఖరము మీద ఉంటూ కోరినకోర్కెలను తీర్చే దేవుడిగా శ్రీజ్ఞానప్రసూనాంబకు ముద్దు బిడ్డగా శక్తి ఆయుధమును ధరించి తండ్రివలె భక్త రక్షకుడైనాడు. దేవసేనకు ప్రియుడై భక్తులకు కల్పవల్లియై ఉండెడివాడు శ్రీకుమారస్వామి. భూమియందు పుట్టినవాడున్నూ, మన్మథునితో సమానమైన అందమును కలిగినవాడు, కుమారుడు, కుత్సితులు, దుశ్శీలులను చంపేవాడు కుమారుడు. ఆయననే గుహ్యుడు అని అందురు. ఆయననే సుబ్రహ్మణ్యుడు అని కూడా అందురు. శ్రీరాముని దివ్య గాథను లవకుశులు దేశమంతా తిరిగి గానము చేసినట్లుగా కుమారస్వామి కూడా శ్రీకాళహస్తిలోని విద్యాశైలమును ఎక్కి భక్తులకు శివతత్త్వమును ఉపదేశించుచున్నాడు. క్షేత్ర మహిమ కుమారస్వామిద్వారా అన్ని లోకవాసులకు తెలిసినది గనుక ఆక్షేత్రమునకు కుమార కాళహస్తీశుడు అను పేరు వచ్చెను. కుమారస్వామికి సకల శాస్త్రములను మంత్ర రహస్యములను ఉపదేశించినవారు పరమేశ్వరుడు.

## గోవిందనయనార్చితః 100

గాం భూమిం విందతీతి గోవిందః। గాం ధేనుం విందతీతి గోవిందః। విద్లలాభే। గోష్వేధ్యక్షేఽపి గోవింద ఇతి। ని। నయనం నీయతే సర్వం రూపమనేనేతి నయనం। గోవిందస్య నయనం గోవిందనయనం తేనార్చితః పూజితో గోవిందనయనార్చితః పురా రుద్రకోపానల సంజాతస్య జలంధరా సురస్య ప్రహరణాద్య ప్రధర్ష హర దర్పితస్య త్రిభువన కంటకస్య సంహారార్థం రుద్రేణ చరణాంగుష్ఠేన విలిఖితభూమ్యంశ స్సుదర్శనాయుధమభవత్। తేన తన్నిహత్య సహస్రకమ లైస్స్వలింగారాధకాయ విష్ణవే తచ్చక్రం హరోఽ దిశత్। తత్కాలేన దక్షయాగే వీరభద్రేణ యుద్ధసమయే విస్పష్టం తత్కపాలమాలాకబలితమభూత్। పునస్తత్ప్రాప్త్యర్థం నియమ కమలార్చనం కుర్వతే। తత్సంఖ్యాపూరణాయ స్వనయనమపి శివార్పణం కృతవతే శ్రీహరయే తచ్చక్రం పునరదిశదితి।

**స్కాందే హరిః**

**వీరభద్ర మహాభాగ స్థానే తవ పరాక్రమం।**
**వజ్రాదపి మహా భీమం గిరికోటి ప్రభేదనం।**
**దుర్ధర్షమపి మచ్చక్రం యత్త్వయాలింగితం హఠాత్।**
**తస్మాదద్య శివద్రోహ కారిణం జహి దుర్ధియం।**
**కాలాంతరే మహేశస్య కృత్వా చ బహుధా తపః।**
**అహం ప్రాప్స్యామి మచ్చక్రం త్వద్గురోః పరమేశ్వరాదితి।**

శ్రు.। యో వామపాదార్చిత విష్ణు నేత్రస్తస్మై దదౌ చక్ర మతీవ హృష్టః తస్మై రుద్రాయ నమో అస్త్వితి। శరభోపనిషత్। అథవా। గోవిందస్య నయనాభ్యాం సమర్చిత ఇతి వా అన్యేషాం శివ దర్శనస్య ప్రమథ కృత ప్రతిబంధోస్త్యేవహి। యా తస్య పార్శ్వగా బాలా సా పార్వత్యంశ జో హరిరితి వచనాత్। సదా సన్నిహితత్వాత్। నిరతిశయ జ్ఞానైశ్వర్య సంపత్పరమకాష్ఠతయా సంతత నిష్ప్రత్యూహ శివదర్శనావశ్యం భావాచ్చ। తథా। ముక్తి ఖండే। కైలాస మూలే ముక్తి మోచకాది స్వరూప జిజ్ఞాసయా చిర విరచిత తపసో నారాయణస్యానుగ్రహాయ ఆవిర్భూతం హరం హరిస్సానందం దదర్శేత్యాహ।

**సూతః**

**ప్రదక్షిణ త్రయం కృత్వా దండ వత్పృథివీ తలే।**
**ప్రణమ్య బహుశః శ్రీమాన్ భక్త్యా పరవశో హరిః।**
**సాంబం చైవ మహానంద సముద్రం పురుషోత్తమః।**
**నేత్రాభ్యామా గళం పీత్వా కించిత్కాలం ద్విజర్షభాః॥**
**ప్రమత్తశ్శంక రాదన్య న్న కించి ద్వేద సువ్రతాః।**
**తతః ప్రబుద్ధో భగవాన్ ప్రసన్నః కమలేక్షణ ఇతి॥**

తస్మాద్ధి భగవతా గోవిందేన సూర్య చంద్రాత్మకాభ్యాం కమల లోచనాభ్యాం సాదరమర్చిత స్సమీక్షిత ఇత్యర్థః। అత్ర నయనార్చన శబ్దస్య గౌణీ వృత్తిర్వ్యాఖ్యానేన ముఖ్యైత్యవగమ్యతే। యథాస్య దృష్టి రస్యాం దివంణ్యాం పతతీత్యుక్తే। స్వస్థానా దుత్పత్య ఘటికేవ న పతేత్। కింతు ఘనో నిష్ఠరాగ ఏవ వీక్షణచ్ఛ లేన తత్పిండే ప్రసరతి। ఏవం శ్రీగోవిందస్య నయనయోః కమలాత్మక త్వాత్తదా లోకన మేవార్చనం మత్వా గోవింద నయనార్చిత ఇతి మృత్యుమార్కండేయాది భిర్గేయత ఇత్యభిప్రాయః। శ్రీభగవన్నయనయోః దృష్టక్తిమత్కృష్ణతా రోద్యద్భుర్భిబర్హ ఖండ సన్నిభ ప్రభాజాలై స్సతత మభ్యర్చితోఽలంకృత ఇతి వార్థః। అయం

భావః పురోక్తాదపి సమంజస ఏవహి । యదేకేన లోచనేన సకృదర్చన ముక్తం । ఇదంతు నిజ లోచనాభ్యాం స్వ పారమార్థిక పర శివ రూపస్య ప్రత్యగాత్మ న స్సంతత సాక్షాత్కార శ్శివారాధన మిత్యతి శేతే । అనేన సర్వ జగజ్జీవాత్మకస్య హరేః సర్వ ప్రత్యక్చైతన్యస్య శివస్యాప్యైకాత్మ భావాత్ । అద్వైతం సచ్చిదానందం శాంతం శివమేవావశిష్యతే । య ఏవం భూతః స కాళహస్తీశ్వరోఽస్మాన్ తదీయ శతనామమాలా మంత్ర పరాయణాన్ కృపయా పాయాత్ ॥

**ఏవం శ్రీకాళహస్తీశ శత నామాబ్జ మాలికా । వ్యా**
**కృతాత్మ సుఖాయైవ శివానందేన శాంభవీ ॥**

గోవిందుడనగా గాం = భూమిని, ఆవును రక్షించును, పొందును అర్థము విద్లులాభే అనే ధాతువునుండి పుట్టినది గోవింద శబ్దము. గోష్ఠము అనగా గోవుల మంద ఉన్న చోటు అని అర్థము. గోవుల మంద ఉండేది గోకులము. దానికి అధ్యక్షుడు గోవిందుడు. నయనమనగా ఎదురుగా ఉండే రూపమునూ, వస్తువు ఆకారమునూ రూపమును సంపూర్తిగా స్వీకరించుట వలన అది నయన మాయెను. నయన మనగా నేత్రము అని అర్థము. గోవిందుడు తన నేత్రములతో పూజించినందున ఆయన గోవింద నయనార్చితుడు. ఆ అర్చితుడు పరమేశ్వరుడు గోవిందుడు విష్ణు అంశ సంభూతుడు కావున విష్ణువే ఈశ్వరుని అర్చించినట్లాయెను. శ్రీకృష్ణుడు సంతానార్థియై పరమేశ్వరుని పూజించినట్లు ఒక పురాణ గాథ కూడా కలదు. రుద్రుని కోపముచేత అగ్నినుండి పుట్టినవాడు జలంధరుడు అనే రాక్షసుడు. అతడు ఈశ్వరానుగ్రహంచేత ప్రమత్తుడై త్రిభువనములకు మిక్కిలి కంటకుడాయెను. అతనిని సంహరించుటకై పరమశివుని దేవతలు ఉపాయమడుగగా రుద్రుడు కాలిగోటిని భూమి మీద వ్రాయగా ఆ భూమి నుండి సుదర్శనమనే ఒక చక్రము పుట్టెను. దానిచేత శ్రీమహావిష్ణువు ఆ జలంధరుని సంహరించగా ఆ పాప ప్రక్షాళనకై శ్రీహరి వెయ్యికమలములతో పరమేశ్వరుని లింగాకృతికి అర్చన చేయగా అందుకు సంతోషించిన శివుడు శ్రీసుదర్శన చక్రమును బహుమానముగా శ్రీహరికి ఇచ్చెను. దక్షుని యాగమును ధ్వంసము చేయుటకై వీరభద్రుడు అచటికి రాగా అచటి వారు పారిపోవుటకు ప్రయత్నించిరి. అంతట వీరభద్రుడు దొరికిన వారిని దొరికినట్లు కొట్టుచుండెను. అంతట శ్రీహరి చేతిలోని సుదర్శన చక్రమును నమిలి మ్రింగి వేసెను. ఈ ప్రకారముగా దక్షుని యాగశాల చాలాభాగము ధ్వంసము చేసి కైలాసమునకు వెళ్ళి జరిగిన దంతయు వీరభద్రుడు శ్రీహరునకు నివేదించెను. కానీ శ్రీమహావిష్ణువునకు సుదర్శన చక్రము మరలా లోపమాయెను. దానిని సాధించుకొనుటకై మరలా పరమేశ్వరుని గూర్చి సహస్రకమలములతో అర్చన చేయ సంకల్పించి చేయుచుండగా సహస్ర సంఖ్యకు రెండు కమలములు తక్కువగా ఉండెను. ఆసంఖ్యను పూరించుటకై తన కళ్ళను శివునికి అర్పించెను. అంతట ప్రసన్నత చెందిన పరమేశ్వరుడు శ్రీహరికి సుదర్శన చక్రమును మరలా ఇచ్చెను. స్కాందపురాణమున ఇట్లు కలదు. ఓ వీరభద్రుడా! నీ పరాక్రమము చాలాగొప్పది. వజ్రాయుధము కన్నా నీ శక్తి చాలాగొప్పది. అనేక పర్వతములను ఛేదింప శక్తి నీకు కలదు. సుదర్శన చక్రమును ధరించుటే చాలకష్టము. అటువంటి దానిని నీవు మ్రింగితివి. అది నాకు శివానుగ్రహముతో లభించినది. మరలానేను పరమశివుని ప్రార్థించి తపస్సుచేసి పొందవలయును. నీ గురు ప్రసాదమును నీవు ఇట్లుచేయుట ధర్మముకాదుగదా! అని శ్రీహరి వీరభద్రునితో చెప్పెను. శరభోపనిషత్తుతో పరమేశ్వరుడు ఇట్లు చెప్పెను. శ్రీహరి తననేత్రములను శివార్పణ చేసినందున అతనికి మిక్కిలి సంతోషమగునట్లు సుదర్శన చక్రమును నేను ఇచ్చితిని. అందువల్ల నన్ను శ్రీహరి తస్మై రుద్రాయ నమో అస్త్వితి ప్రార్థించెను అని చెప్పెను. గోవిందునియొక్క నయనములతో శివునకు అర్చించెను. కైలాసమున శివదర్శనమునకు

వెళ్ళిన అనేకులను నందికేశ్వరుడు ప్రతి ఘటించినప్పటికి శ్రీమహావిష్ణువును ఎప్పుడునూ అడ్డగించలేదు. శ్రీహరి తన భార్య ఐన పార్వతీదేవియొక్క ఒక అంశమందు ఉదయించెను అని ఒక పురాణములో చెప్పినందున శ్రీహరి పార్వతీదేవితో పాటు ఎప్పుడూ శివునకు సన్నిహితుడే నిరతిశయమైన జ్ఞానైశ్వర్య సంపత్తుచేత నిరంతరము విఘ్నములేని తప్పని సరైన శివ దర్శనము కలిగినవాడు శ్రీహరి. ముక్తికై, బంధవిమోచనకై, శివస్వరూప జిజ్ఞాసకై చాలా కాలము తపస్సుచేయగా శ్రీహరిని అనుగ్రహించుట కొరకు పరమేశ్వరుడు ఆవిర్భవించగా సానందపరిపూరితలోచనుడై వీక్షించెను. సూతమహర్షి ఇట్లు పలికెను. శ్రీహరి పరమేశ్వరుని ప్రదక్షిణ వ్రతమును చేసి కర్రవలె (దండమువలె) భూమిమీద సాష్టాంగనమస్కారము చేసి స్తోత్రము చేయగా ఆయన ప్రసన్నుడాయెను. ఇచట నయనార్చన శబ్దమును గౌణీ వృత్తి చేతనే గ్రహించవలెను. గోవిందుని యొక్క నయనములు కమలములవలె అతి సుందరముగా ఉండును అని తలచి మార్కండేయాది మహర్షులచేత కొనియాడ బడినది. భగవంతుని నయనముల శక్తి చాలా గొప్పవి. ఆ కళ్ళనుండి వచ్చే కాంతులు కూడా చాలా శక్తి కలవి. ఆ నేత్రముల ప్రభలతో ఆయన మిక్కిలి అందముగా ప్రకాశించు చున్నారు. కళ్ళలో ఒకేసారి అర్చన చేసిన విశేష ఫలము కలదు. ఇది తన కళ్ళతో తనదై నిజస్వరూపమైన శివరూపమును దర్శించినచో ముక్తి లభించును. శివారాధనలోనే శివసాక్షాత్కారము లభించును. సర్వ జగజ్జీవాత్మకుడైన శివుడూ సర్వప్రత్యక్ చైతన్యుడైన శివుడు ఒకడే. అతడు అద్వైతుడు సచ్చిదానందుడు, శాంతుడు కామక్రోధాదిరాహిత్యము కలిగినవాడు శమము కలిగినవాడు మంగళమును ఇచ్చువాడు ఆయనే శ్రీకాళహస్తీశ్వరుడు. ఈ ప్రకారముగా అనేక శుభకళ్యాణ గుణవిశిష్టుడైన శ్రీకాళహస్తీశ్వరుడు ఆయన శతనామ మాలికా మంత్రమును పారాయణ చేసే మనల్ని కృపతో దయతో పాలించుగాక.

ఈ ప్రకారము శ్రీశివానంద తీర్థ స్వామి వారు శ్రీకాళహస్తీశ్వర శతనామాబ్జమాలికను ఆత్మ సుఖము కొరకు శ్రీజ్ఞాన ప్రసూనాంబికా శ్రీకాళహస్తీశ్వరుల అనుగ్రహముకొరకు వ్రాసెను.

## ఉత్తరపీఠికా:

ఇమాం శ్రీకాళహస్తీశ శతనామాబ్జమాలికాం ।
పఠ త్వం సతతం భూప సర్వాపద్వినివృత్తయే ॥
యో వా కో వాఽస్తుపురుష శ్రద్ధయా పరయా సహ ।
ప్రాతః కాలే జపేన్నిత్యం నిశాదుష్కృత శాంతయే ॥
సాయంకాలే జపేదేతాం మహాపాపనుత్తయే ।
యస్య కంఠే మాలికేయం సదా భాతి మహాత్మనః ।
చరమం తద్వపుస్తస్య నాత్ర కార్యా విచారణా ।
స్నానకాలే హోమకాలే జపకాలే విశేషత।
శ్రాద్ధ కాలే దేవపూజాసమయే శాంతికర్మణి ।
తత్త త్కర్మాసంఖ్యఫలా వాప్తయే చ సకృత్సకృత్ ।
శ్రద్ధయేమాం పఠేద్భక్త్యా శాంకరీం నామమాలికాం ।
దుస్స్వప్నేర్దునిమిత్తే చ దురాలాపే చ దుర్గతౌ ।
దౌర్మనస్య గజవ్యాఘ్ర చోరయుద్ధాది సంకటే ।
దుర్భిక్షే వ్యసనే ఘోరే ప్రజపేన్నామమాలికాం ।
శ్రద్ధయా పరయా భక్త్యా ప్రదోషే శివసన్నిధౌ ।

ప్రజపేచ్ఛంకరప్రీత్యై తామశేషాఘనాశినీం ।
తయా సదా శివం లింగే త్వర్చ యేద్బిల్వపల్లవైః ।
త్వమపి శ్రద్ధయా భూప భుక్త్యై ముక్త్యై చ సాదరం ।
శ్రుతాం మద్వాత్సమ్యక్ జపే మాం నామమాలికాం ।
ఏవం మృకండుజస్తస్మై దదౌ విద్యాం శివంకరీం ॥
భుక్తిముక్తికరీం కాళహస్తీశప్రీతికారిణీం ।
ఏవం శ్రీ కాళహస్తీశ శతనామాబ్జమాలికాం ।
భక్త్యా పఠంతి యే లోకాస్తే యాంతి పరమాం గతిమితి ।

ఇతి శ్రీశివపురాణాంతర్గత శ్రీకాళహస్తిమాహాత్మ్యే ఏకసప్తతితమోధ్యాయః
। శివమస్తు ।

## ఓం తత్సత్
## ఫలశ్రుతి

శ్రీశివానంద తీర్థస్వామివారు తమ శ్రీకాళహస్తశ్వర శతనామాబ్జమాలికను సమాప్తి చేయుచూ ఫలశ్రుతిని చెప్పుచున్నారు. ఫలశ్రుతిని చెప్పనిదే ఈ నామమాలికగొప్పతనము చాలామందికి తెలియక పోవచ్చును. తెలిసిన వారు మరింత శ్రద్ధగాను తెలియని వారు భక్తితో పారాయణము చేసిన కోరిన కోరికలు నెరవేరును. ప్రతిస్తోత్రమునకుపూర్వపీఠిక ఉత్తరపీఠిక అని ఉండును. ఈ కాళహస్తీశ శతనామమాలికను ఎవడు నిరంతరము పఠించునో వాడు సర్వ ఆపదలనుండి విముక్తుడగును. శ్రద్ధతో ఎవరు పఠించిననూ సర్వదుఃఖములు వారికి నివృత్తిచెందును. పొద్దున పారాయణ చేయగా పగలు వచ్చే కష్టములు తొలుగును రాత్రి పారాయణ చేయగా రాత్రి వచ్చే కష్టములు నివృత్తి చెందును. ఎవరి కంఠమున ఈ మాలిక మననము చెందునో వారికి ముక్తి విషయము సందేహము లేదు. స్నానము చేసిన తర్వాతగాని హోమము చేసిన తర్వాత గాని విశేషముగా జపించినచో వాటి ఫలితములు కూడా విశేషముగా సిద్ధించును. శ్రాద్ధ కాలమందున్నూ దేవ పూజా సమయమందున్నూ, శాంతి కర్మ చేసేటప్పుడున్నూ, ఒకసారి చేస్తే అనేకసార్లు పారాయణ చేసిన ఫలము లభించును. శంకర సంబంధమైన ఈ నామమాలిక పారాయణతో దుస్స్వప్నఫలములను రాబోవు భయములను, శత్రు స్థావరములలో ఉన్నప్పుడు, ఘోరమైన ఆపదలు వచ్చినపుడు ప్రదోష సమయమున శివసన్నిధిలో పారాయణ చేసిననూ, చేయించినను అవన్నీ ఉపశమించును. పరమప్రీతితో పారాయణచేస్తే సమస్త పాపములు తొలగిపోవును. బిల్వపత్రములను ఈ నామములతో శివుని అర్చించినచో వారికి పరమశివుడు భుక్తిని ముక్తిని ప్రీతిగా ప్రసాదించగలడు.

ఈ ప్రకారముగా శ్రీమార్కండేయ మహర్షి శివంకరమైన శివ తత్త్వమును తెలిపే ఈ నామమాలికను యమధ్వజుని కుమారునికి ఉపదేశించెను. ఇది భుక్తిని ముక్తిని ఇచ్చే ఈ నామమాలిక పారాయణముచేత శ్రీకాళహస్తీశునికి ప్రీతికలిగించును. కనుక భక్తితో ఎవరు పఠించెదరోవారు ముక్తిని పొందెదరు. ఇది సత్యము.

హరహర హరహర శివశివ శివ శివ
భవ భవ భవ భవ భవభయ సంహార
హరోంహరా! శివోం హరా! భవోం హరా
శ్రీశివపురాణాంతర్గతమైన శ్రీకాళహస్తి మాహాత్మ్యమునందు డెబ్బై ఒకటవ సర్గసమాప్తము.

# అనుబంధము - 1

## శ్రీకాళహస్తి స్థలమాహాత్మ్యే

రైక్వశాపస్థిత మృత్యుంజయ మార్కండే
యదర్శన కథనం నామ సప్తతితమోధ్యాయః

**భరద్వాజః**

మార్కండేయ ప్రదత్తాసా కీదృశీనామ మాలికా ॥
స్థలేకుత్ర మహాపుణ్యే ప్రదేశే కుత్రవాగురో ॥ 1 ॥

లింగ ప్రతిష్ఠామకరో త్వన్నామ్నాన్నపసత్తమః ।
కథం ప్రసన్నోభగవాంస్తస్మై కతివరాన్దదౌ ॥ 2 ॥

విముక్తోరైక్వశాపేన రాజ్యంకథ మవాప్తవాన్ ।
ప్రారబ్ధాంతే కథం శైవం సాయుజ్యమగమన్నృపః ॥ 3 ॥

ఏతత్సర్వంనువిస్తార్య బ్రూహిమహ్యం కృపావశాత్ ।

రోమశః

మార్కండేయ పదేనత్వా రాజామృత్యుంజయాహ్వయః ॥ 4 ॥
వినయేనసమావిష్టః ప్రోవాచవచనం మృదు ।
సర్వజ్ఞ మునిశార్దూల శరణాగతవత్సల ॥ 5 ॥

యమేనలోక రక్షార్థం యాదత్తాభవతేపురా ।
శుభా శ్రీకాళహస్తీశ ప్రీతిదానామ మాలికా ॥ 6 ॥

మహ్యం ప్రయచ్ఛతామద్య యయాహం శోక సంకటాత్ ।
ముక్తోభవేయం సకలా ద్భవత్పాదావలోకనాత్ ॥ 7 ॥

ఇతి సంప్రార్థితస్సైన యమధ్వజ సుతేన సః ।
హర్షేణ మహతాయుక్తో నిజగాదమృకండుజః ॥ 8 ॥

శ్రద్ధయా పరయా భక్త్యా శృణుతన్నామమాలికాం ।
గోపనీయా విశేషణ యా సర్వాపద్విమోచనీ ॥ 9 ॥

**నామావళి ప్రారంభః**

శివోమహేశ్వర సర్వో రుద్రోవిష్ణుః పితామహః ।
సర్వభృద్దివ్యకైలాస శిఖరేంద్ర నివాసభూః ॥ 10 ॥

అఖండ బిల్వచ్ఛదన ప్రియోలూతార్తిమోచకః ।
సంసార వైద్యస్సర్వజ్ఞః పరమాత్మా పరాత్పరః ॥ 11 ॥

కాళేభాజ జ వధ్వంసీ సితాభ్ర సలిలాప్లుతః

తేజోనిధి ర్జగద్యోని ర్దివ్య మంగళ విగ్రహః ॥ 12 ॥

అనేక కోటి బ్రహ్మాండ పిండీకరణ పండితః ।
పంచ బ్రహ్మాతను స్పర్శ మంగళా లంకృతాకృతిః ॥ 13 ॥

అనాదినిధన శ్శంభు స్సచ్చిదానంద రూపధృత్ ।
హిరణ్య గర్భజనకో జ్ఞానసూనాంబికాపతిః ॥ 14 ॥

మయూరార్తి ప్రహర్తాచ రామమోహనిబర్హణః ।
వేదాంత వేద్యః కాలాత్మా విచిత్రబహుశక్తిమాన్ ॥ 15 ॥

స్థిరధన్వా పశుపతి స్సర్వ తత్త్వ ప్రబోధకః ।
శబరాభయదో గౌర శ్శబరేక్షణ భూషితః ॥ 16 ॥

సువర్ణ ముఖరీతీర వాసీ విజయ ముక్తిదః ।
అగస్త్యేయరమేశాది సురోపాస్యత్వదాయకః ॥ 17 ॥

వైదికాగమ పీఠస్థో మణిజాలార్చన ప్రియః ।
మణికర్ణో హరిబ్రహ్మా దృష్ట పాదశిరాస్స్వభూః ॥ 18 ॥

మృడః పంచాక్షరాకారో దుర్గా హేమ రుచిప్రదః ।
అనంతకల్యాణ గుణో నీలా కైవల్య కారణః ॥ 19 ॥

లింగోద్భవో విద్యారాశి ర్విద్యాపతిరనామయః ।
పంచాక్షరాభిధేయశ్చ సుభగాశోక భంజనః ॥ 20 ॥

చంద్రక్షయ ప్రహర్తార్క మహాపాపాబ్ధి శోషకః ।
ఆనంద తాండవకర స్సకలామర నాయకః ॥ 21 ॥

భర్గో దుర్గా సమారాధ్య శ్శుక్ర ప్రస్తుత వైభవః ।
వేతా హర హరోద్ధర్తా శక్ర కిల్బిష మార్జకః ॥ 22 ॥

స్కంద సర్వజ్ఞతా హేతుః పంచధాభిన్న మస్తకః ।
లక్ష్మీ వినుత వామాంఘ్రి ర్జపాలాభక్తి గోచరః ॥ 23 ॥

మూకమృత్యుం జయార్తిఘ్నో వృద్ధ బ్రాహ్మణ వేషధృత్ ।
మాయా శివద్విజాకారో నారదామోదదాయకః ॥ 24 ॥

మార్కండేయ హృదంతస్థ మహాసంశయ భేదనః ।
సనత్కుమారక శుక పరాశర సుపూజితః ॥ 25 ॥

విజ్ఞాత దేవలోకోరు శక్తిర్యక్షవపుర్ధరః ।
సహస్ర దేవ సంవంద్యో నీలకంఠ మలాపమత్ ॥ 26 ॥

పద్మసేవక రాజేంద్ర కన్యాయుగళ సేవితః ।
తుంగోరక్షిత సారంగో భృతచక్రధరో విభుః ॥ 27 ॥

ధర్మాసనోవరగుణో భీప్సితార్థ ప్రదాయకః ।

నిత్యో బ్రహ్మ పురావాసీ దేవర్షి నగరాసికః ॥ 28 ॥

శ్రీ విష్ణు నగరా వాసీ శ్రీమత్పాండ్య పురస్థితః ।
భీమార్చితః పితా భర్తా భరద్వాజ ప్రపూజితః ॥ 29 ॥

ప్రసన్న కాళహస్తీశః ప్రభాద్యోతితదిఙ్ముఖః ।
కుమార కాళహస్తీశో గోవింద నయనార్చితః ॥ 30 ॥

**ఫలశ్రుతి**

ఇమాం శ్రీ కాళహస్తీశ శతనామాబ్జమాలికాం ।
పఠత్వం సతతం భూప సర్వాపద్వినివృత్తయే ॥ 31 ॥

యోవాకోవాస్తు పురుష స్త్రీర్ధయా శ్రద్ధయాపివా ।
ప్రాతః కాలేజపేన్నిత్యం నిశాదుష్కృత శాంతయే ॥ 32 ॥

సాయం కాలేజపే దేతే మహః పాపాపనుత్తయే ।
యస్యకంఠే మాలికేయం సదాభాతి మహాత్మనః ॥ 33 ॥

చరమంతద్వపుస్తస్య నాత్ర కార్యా విచారణా ।
స్నాన కాలే హోమకాలే జపకాలే విశేషతః ॥ 34 ॥

శ్రాద్ధ కాలే దేవపూజా సమయే శాంతి కర్మణి ।
తత్తత్కర్మా సంఖ్య ఫలా వాప్తయే చ సకృత్సు కృత్ ॥ 35 ॥

శ్రద్ధయే మాం పఠేద్భక్త్యా శాంకరీం నామ మాలికాం ।
దుస్స్వప్నే దుర్నిమిత్తే చ దురాలాపే చ దుర్గతౌ ॥ 36 ॥

దౌర్మనస్యే గజ వ్యాఘ్ర చోర యుద్ధాది సంకటే ।
దుర్భిక్షవ్యసనే ఘోరే ప్రజపే న్నామ మాలికాం ॥ 37 ॥

శ్రద్ధయా పరయా భక్త్యా ప్రదోషే శివ సన్నిధౌ ।
ప్రజపేచ్చం కరప్రీత్యై తామ శేషాఘనాశినీం ॥ 38 ॥

తయానదా శివం లింగే చార్చయేద్బిల్వ పల్లవైః ।
త్వమపి శ్రద్ధయా భూప భుక్త్యైముక్త్యై చ సాదరం ॥ 39 ॥

శ్రుతాం మద్వదనాత్సమ్యగ్జపే మాం నామమాలికాం ।
ఏవం మృకండు జస్తస్మైదత్వాతాం నామమాలిం ॥ 40 ॥

భుక్తి ముక్తి కరీం కాళహస్తీశ ప్రీతికారిణీం ।
ఇతస్యోత్తర దిగ్భాగే ద్విషడ్యోజన దూరగం ॥ 41 ॥

శ్రీమద్దక్షిణ కైలాసా భిధేయం ముఖ్యస్థలోత్తమం

# అనుబంధము 2

## శ్రీకాళహస్తి క్షేత్రము★

### శ్రీకొట్రా వేంకట నృసింహ శాస్త్రి

శ్లో॥ కైలాసవాసీ భగవాన్ కాళహస్తీశ్వరశ్శివః ।
కరోతు నిత్యకల్యాణం కరుణా వరుణాలయః ॥

ఈ క్షేత్రమును దక్షిణ కైలాసంబని ఆర్యులు వ్యవహరించుచున్నారు. శ్రీకాళహస్తి క్షేత్రమున నుండు శివలింగము పృథివ్యప్తేజోవాయురాకాశములను పంచ లింగములలో వాయులింగంబని పురాణములు నుడువుచున్నవి. కృతయుగంబున వాయు భట్టారకుడు, శ్రీకాళహస్తీశ్వరుని గూర్చి ఘోరతపం బొనర్చి సర్వ వ్యాపిత్వము మొదలగు వరములను పొందుటయే గాక, ఈ శివలింగమునకు వాయులింగంబని లోకమున ప్రసిద్ధి గల్గునట్లు వరమును పొందెను.

అందుచే ఈ క్షేత్రము వాయు క్షేత్రం బనియు ప్రసిద్ధి గాంచెను. ఇందుకు తార్కాణముగా శివుని గర్భాలయమునందలి దీపకళికలలో రెండు జ్యోతులు మాత్రమే సదా చలించుచున్నవై వాయుక్షేత్రం బనుటకు నిదర్శనములుగా నున్నవి.

సహస్ర శిఖరములతో నొప్పుచున్న ప్రసిద్ధ కైలాసము నుండి శివానందైక నిలయంబను నొక్క శృంగంబును, అంబుజాసనుండు తెచ్చి లోకానుగ్రహార్థమై మహేశ్వరుండిచట నివసింప నునిచె నని ఆర్యులందురు...

ప్రసిద్ధంబులగు శివక్షేత్రముల కన్నింటికి శ్రీ కాళహస్తి క్షేత్రము తల మానికంబై వెలసియున్నది.

"భువావౌ దక్షిణ కైలాసే ప్రవేశాన్ముక్త ఏవ సః"

అను ప్రమాణము, ఈ స్థల నివాసముచే ప్రాణులకు ముక్తి కరతలామలకమనియు,

"కాశ్యాంతు మరణాన్ముక్తిః"

అను వచనము, కాశ్యాది పుణ్యక్షేత్రములయందు మరణము నొందిననే గాని ముక్తి లభింపదనియు తెలియజేయు చున్నది.

**"శ్లో॥ కైలాసః పంచధా ప్రోక్తః**
**స్థానైశ్వర్యాది భేదతః"** అని ఆరంభించి,
**ఉక్తం తేభ్యోఽపి సర్వార్థ సాధనం పంచమం జగుః ।**
**శ్రీమద్దక్షిణ కైలాస స్థానం సర్వజనాశ్రయం ।**
**తపః కర్తుం యతోఽత్రైవ సుకరం నాన్యతో ధ్రువం ॥**

అని సదాశివుడు, జగత్సృష్టి సామర్థ్యసంపాదనార్థమై తపం బొనర్పదలచి తన్ను గూర్చి ప్రార్థించుచున్న విధాతం గాంచి, పంచవిధంబులనొప్పుచున్న కైలాసములలో ప్రాకృత ప్రళయమందు నశింపనదియు, మచ్ఛాలాగ్రమందు ధరింప బడిన శివానందైకనిలయంబను శృంగముతో నొప్పుచున్నదియు, అధి భూతంబునం గల శివక్షేత్రముల కన్నింటికి

---

శ్రీకాళహస్తీశ్వర కుంభాభిషేక సంచిక (1974) నుండి సంగృహీతము

మిన్నయై, విష్ణ్వింద్రాది పూజితంబై, స్వయం వ్యక్త మగు శివలింగముతో భాసిల్లు శ్రీ కాళహస్తి క్షేత్రంబున తపం బొనర్పు మని విధాతకు స్థలవైభవమును వివరించెను.

మఱియు శ్రీకాళహస్తి స్థలపురాణములో నాల్గవ అధ్యాయమున ఈ దివ్య స్థలప్రశంస క్రింది రీతిని గావింపబడి యున్నది.

"శ్లో॥ శ్రీమద్దక్షిణ కైలాసాభిఖ్యం స్థలవరోత్తమం ।
పునః ప్రోక్తాశేష ముక్తి విధానం కథితం పరం ॥
జ్ఞాన వైరాగ్యదం సాక్షాచ్ఛివ సాయుజ్య కారణం ।
తస్మాత్ సర్వోత్తమం స్థానం ఇదమేవ మునీశ్వరాః ॥
స్థలస్యైతస్య సదృశం న భూతం న భవిష్యతి ।
ధ్యానాచ్ఛ కీర్తనాదస్య శ్రవణా దీక్షణా త్సకృత్ ॥
స్పర్శనాత్పాపి హోప్యుక్త ఫలభాజో భవంతి హి ।
అస్య స్థలస్య సదృశం యే వదంతి స్థలాంతరం ॥
తే యాంతి నరకం ఘోర మహా రౌరవనామకం।
శ్రీమద్దక్షిణ కైలాస కీర్తనాదేవ మానవాః
ముచ్యన్తే ఘోర సంసారాద్దేశాంతర గతాః అపి
ఛండాలః పుల్కసోవాపి శ్రుత్వా దేశాంతరే సకృత్ ॥
స్థలస్యైతస్య మాహాత్మ్యం సద్యో బంధాద్విముచ్యతే ।
శ్రీమద్దక్షిణ కైలాస శిఖరాణి సమాశ్రితాః ॥
యత్ర దేశే ప్రవర్తంతే సాధవో ద్విజసత్తమాః ।
తత్రత్య ప్రాణినాం ముక్తిః కిము తత్ర నివాసినాం ॥
స్థలం తచ్ఛహుధోపాత్త కర్మనిర్మూలనక్షమం ।
తాపత్రయార్క సంతప్త వర్షశాలి ఘనోపమం ॥
యత్రాస్తే భగవాన్ శంభుః జగతాం కారణం విభుః ।
ఏశోర్విశసనస్థానం పాపాఖ్యస్య మునీశ్వరాః ।
స్థలం యచ్ఛ్రుతయో ముఖ్యాః ప్రమాణేషు వదంతి హి ॥
తస్మాత్తత్రైవ గంతవ్యం మోక్షమక్షయమిచ్ఛతా ॥

రోమశ మహర్షి భరద్వాజ మహర్షినిం గాంచి తెల్పిన శ్రీ కాళహస్తిక్షేత్ర ప్రశంసను సూతపౌరాణికుడు శౌనకాది మహర్షులకు యిట్లు వినిపించెను. శివక్షేత్రములలో శ్రీమద్దక్షిణ కైలాసమను పేరుగల శ్రీకాళహస్తి క్షేత్రము అత్యుత్తమంబై జ్ఞానవైరాగ్యములకు మూలకందంబై సాక్షాచ్ఛివసాయుజ్యమునకు నిధానమై భాసిల్లుచున్నది. ఈ స్థలమునకు సమాన మగు స్థలము లేదు. ఇకపై కలుగబోదు. పాపాత్ములు కూడ ధ్యాన, శ్రవణ, కీర్తన, దర్శనములచేత సంపూర్ణఫలమును పొందుచున్నారు. ఎవరీస్థలమునకు స్థలాంతరము సమానమని పలికెదరో వారు మహా రౌరవమను నరకమును పొందుచున్నారు. దేశాంతరస్థులగు మానవులు శ్రీమద్దక్షిణ కైలాసమును ఒక్కమారు స్మరించినచో వారు ఘోర సంసార బంధమునుండి విముక్తులగు చున్నారు. దేశాంతర గతుడగు చండాలుడుగాని, పుల్కసుడుగాని ఒకమారు ఈ క్షేత్రమహిమను వినినచో వాడు సంసారబంధవిముక్తుడై సద్గతి నొందును. శ్రీమద్దక్షిణ కైలాస శిఖరముల నాశ్రయించి యుండు సాధుసత్తములగు బ్రాహ్మణోత్తములు

యేదేశవమునందు నివసించుచున్నారో అచ్చటి వారందరు ముక్తి నొందుచున్నారు. ఇక నా క్షేత్రమందు నివసించు మహాత్ములకు ముక్తి కరతలామలక మగునవి వేరుగా చెప్పవలెనా? బహుజన్మాంతర కర్మ నిర్మూలన పటీయసి యగు ఈ క్షేత్రము ఆధ్యాత్మిక, ఆది దైవిక, ఆది భౌతిక, తాపత్రయార్క సంతప్తులగు మానవులకు వృష్టిప్రదమగు మేఘతుల్యమై భాసిల్లుచున్నది. పాప పశు సంహారక స్థానము శ్రీకాళహస్తి క్షేత్రమే యని శ్రుతులుద్ఘోషించుచున్నవి. కావున అక్షయమగు ముక్తిని గోరువారు శ్రీకాళహస్తి క్షేత్రమునకు పోవలయును నీ వచ్చటికి వెళ్ళుమని రోమశమహర్షి భరద్వాజ మహర్షికి తెల్పెనని సూతపౌరాణికుడు శౌనకాది మహర్షులకు విశదీకరించెను. ఈ క్షేత్రముయొక్క మహిమను కొనియాడుటకు పరమశివుని కొక్కనికే తప్ప మరెవ్వరికిని సాధ్యముగాదు.

శ్లో॥ కృతే బ్రహ్మపురం నామ్నా స్థలం త్రేతాయుగే పునః ।
ముణే విష్ణుపురాభిఖ్యం ద్వాపరే నారదాహ్వయం ॥
కలౌవర గుణాభిఖ్యం పర్వేషుచ యుగేషుచ ।
శ్రీకాళహస్తి నగరం విఖ్యాతం... ॥

కృతయుగమున బ్రహ్మపురమనియు, త్రేతాయుగంబున విష్ణుపురమనియు, ద్వాపరయుగమున నారదపురమనియు, కలియుగమున వరగుణపురమనియు శ్రీకాళహస్తి క్షేత్రమునకు నామధేయము మారుచున్నది.

"శ్లో॥ స్వర్ణవర్ణం కృతే త్రేతాయుగే రౌప్య సమప్రభం ।
ద్వాపరే లోహ సదృశం కలౌ ప్రస్తర సన్నిభం ॥"

అని కృతాదిచతుర్యుగములయందు ఈ క్షేత్ర నామధేయము మారినట్లు శివలిగము యొక్క వర్ణములు కూడ భేదము చెందుచున్నవి. ఈ సదాశివలింగము కృతయుగమున హేమమయముగాను, త్రేతాయుగమున రజతమయముగాను, ద్వాపరయుగమున లోహమయముగాను, కలియుగమున ప్రస్తర (శిలా) రూపమున భక్తులకు దర్శనం బిచ్చి కృతార్థులను జేయుచున్నదని స్థలపురాణము చాటుచున్నది. ఇందు బ్రహ్మ విష్ణ్వింద్రాది బృందారకులు, వశిష్ఠాగస్త్యాది మునీంద్రులు, లూతనాతాశన హస్త్యాటవిక తిర్యగ్జంతువులు ఉమేశు నారాధించి కృతార్థులైరి. వీరలే గాక లెక్కకు మిక్కుటంబగు మహాత్ములెందరో కృతాది యుగముల యందు పరమేశ్వరుని సేవించి దుస్తరంబగు నపవర్గమును బడసిరని స్థలపురాణము వాకొనుచున్నది.

కృతయుగే:-

శ్లో॥ బ్రహ్మాగస్త్యః పార్వతీచ, నీలాహరహరోముణే ।
మయూర భీమ చంద్రార్క శక్రాశ్చైతే దశక్రమాత్ ॥
స్థలే తత్ర తపః కృత్వా ప్రసాదాత్ పరమేశితుః ।
కృతయుగే భవత్పుణ్య సంప్రాప్తాత్మ మనోరథాః ॥

త్రేతాయుగే:-

శ్లో॥ హరిబ్రహ్మాచ లక్ష్మీశ్చ స్కందోరామో మృకండుజః
కిరాతయాతకాలేభా శ్చక్రం చైకాదశక్రమాత్ ॥
ఏతే త్రేతాయుగే తత్ర తపశ్శుద్ధావస్థలోత్తమే ।
ముణే శివప్రసాదేన సంప్రాప్తాత్మ మనోరథాః ॥

ద్వాపరయుగే :-

శ్లో॥ సుభగా విజయశ్చైవ జపాలాచ మునీశ్వర ।
మృత్యుంజయో నారదశ్చ పరాశర సుతాత్మజః ॥
సనత్కుమార శ్శక్తి పుత్ర త్రిదశానాం సహస్రకం ।
స వైతే ద్వాపరే తత్ర శివాత్సంప్రాప్త వాంఛితా ॥

కలియుగే :-

శ్లో॥ సారంగో వరగుణో రాజేంద్రో నీలకంఠకః ।
తత్ర చక్రధరః కన్యాయుగళం పద్మసేవకః ॥
ఏతే సప్తపురాః శంభు కృపయా ప్రాప్త వాంఛితా ।
అన్యే చ బహువస్సంతి భక్తాః పావనమూర్తయః ॥
కృపయా తత్ర దేవస్య పరయా ప్రాప్త వాంఛితాః ।
కలౌయుగే మునిశ్రేష్ఠ తేషాం సంఖ్యా న విద్యతే ॥

కృతయుగమున బ్రహ్మ, అగస్త్యుడు, పార్వతీదేవి, నీలా, హరహరుడు, మయూరుడు, భీముడు, చంద్రుడు, సూర్యుడు, ఇంద్రుడు, ఈ పదుగురు క్రమముగా శ్రీ కాళహస్తీశ్వరానుగ్రహముచే ఇష్టార్థసిద్ధిని బడసిరి.

త్రేతాయుగమున హరి బ్రహ్మ, లక్ష్మి, కుమారస్వామి, శ్రీరామచంద్రుడు, మార్కండేయుడు, కన్నప్ప, సాలీడు, కృష్ణసర్పము, ఏనుగు సుదర్శన చక్రము ఈ పదునొకండు గురు భక్తులు ఈశ్వరుని సేవించి ఇష్టార్థములను పొందిరి.

ద్వాపరయుగమున సుభగ, విజయుడు, జపాల, మృత్యుంజయుడు, నారదుడు, శుకుడు, సనత్కుమారుడు, పరాశరుడు, సహస్రదేవతలు, ఈ తొమ్మండుగురు శ్రీకాళహస్తీశ్వరానుగ్రహముచేత తమ మనోరథములను పరి పూర్తిగావించుకొనిరి.

కలియుగమునందు సారంగుడు, వరగుణుడు, రాజేంద్ర చోళుడు, నీలకంఠుడు, చక్రధరుడు, అమృత లతాకాంతిమతులు, పద్మసేనుడు అను ఈ ఏడ్గురు శ్రీకాళహస్తీశ్వర కృపకు పాత్రులైరి.

ఈ క్షేత్రముకు శివక్షేత్రములలో నత్యుత్తమంబనుటకు తార్కాణముగా ఈ కైలాస పర్వతమునందు సదాశివగుహ యనియు, యక్షగుహ యనియు నామాంతరములతో నొప్పు "చిద్గుహ" నొకటి విరాజిల్లుచున్నది. అందు చిచ్ఛక్తి సహితుడగు సదాశివుడు దురభిమానపూరితులగు సహస్ర దేవతలయొక్క శక్తి పరీక్షార్థమై నిలచి, ఒక తృణముచే వారి గర్వమును నిర్మూలించి, తదనుగ్రహార్థమై ప్రతి వత్సరము బ్రహ్మవిష్ణ్వింద్రాది దేవతాసంఘమునకు దర్శనం బొసంగుచున్నట్లు స్థలపురాణమందలి ఎనభై ఒకటవ అధ్యాత్మమందు, నిరూపింపబడి యున్నది. వేదమాత ఈ యర్థమును దశోపనిషత్తులలో రెండవది యగు "కేనోపని షత్" తృతీయఖండమున విస్తరింపజేసిన ఈ స్థలవైభవమును తెలియజేయుచున్నది.

మఱియు డెబ్బదినాలుగవ అధ్యాయమునందు స్కంధుడు శివాజ్ఞాను సారముగా వృషేంద్ర వాహనత్యాది శివధర్మములను నద్యద్రి విపిన క్షేత్ర శివలింగముల మహాత్మ్యమును యథావిధిగా నారదునకు వినిపించి, ఓ నారదా! ఇందొక రహస్యముకలదు. దానిని

వినిపించెదను. సావధాన మనస్కుడవై యాకర్ణింపుము. భూమండలమునందుగల సర్వ క్షేత్రములలో శ్రీకాళహస్తి భాస్కర క్షేత్రమని యెలుంగుము అని ఆరంభించి,

శ్లో॥ చత్వారో హేతవో యత్ర స్థలేత్యంత శుభావహే ।
శివసంపూర్ణ సాన్నిధ్య క్షేత్రం తదితి విద్ధి తత్ ॥
పాదమాత్రం తు సాన్నిధ్యం తత్రయత్ర మహేశితుః ।
లింగం తుంగం మిశ్రుతం చ దృశ్యతే అకృత్రిమం మునే ॥
బ్రహ్మావిష్ణుశ్చ చక్రశ్చ యది తల్లింగపూజకాః ।
విద్ధి తత్రార్థ సాన్నిధ్యం స్థలే దేవస్య శూలినః ॥
మహాగిరి సముద్భూతా పుణ్యైనేకాపగాయుతా ।
శివవిష్ణు స్థలోదార తీరయుగ్మ విరాజితా ॥
ఉత్పత్తిస్థల మారభ్య చాసముద్రం మునీశ్వర ।
ఏకసంజ్ఞా సదా దృష్ట ప్రవాహార్ణవగామినీః
పదేపదే పుణ్యతీర్థా నదీ తత్రాస్తి చేచ్ఛుభం ।
విద్ధి త్రిపాద సాన్నిధ్యం శివస్య పరమాత్మనః ॥
గిరిర్యత్ర మహేశస్య వర్తతే లోక విశ్రుతః ।
సమిష్టి దేహస్సకల దేవ ఋష్యాది వందితః ॥
అనేక పుణ్యతీర్థాఢ్యో నానాధాతు శిలాంచితః ।
నిత్యః కీర్తనవీక్షాద్యై పాపహా హ్యద్గుహోజ్వలః ॥
తత్ర సంపూర్ణ సాన్నిధ్యం విద్ధ్యమేశస్య భో! మునే ।

ఓ నారదా! నాల్గు హేతువులతో నొప్పి అత్యంత శుభదాయకంబగు క్షేత్రమున శివుడు సంపూర్ణ సాన్నిధ్యమును చేయును. దానిని భాస్కర క్షేత్రమని పెద్దలు చెప్పుచున్నారు. ఆ హేతువులను నీకు వివరించెదను.

1) అత్యున్నతమై, ప్రసిద్ధమై, అకృత్రిమమైన శివలింగముతో నొప్పియున్న క్షేత్రమున శివుడు పాదమాత్ర సాన్నిధ్యము చేయును.

2) ముందు చెప్పిన లక్షణములు గల్గి హరిబ్రహ్మేంద్రాదులచే పూజింపబడిన శివలింగము గల క్షేత్రమున సదాశివుడు అర్థ సాన్నిధ్యము చేయును.

3) పుణ్యశైలోత్పన్నమై, పుణ్యనదులతో నొప్పి ఉభయ కూలములయందు శివకేశవ క్షేత్రములతో విరాజిల్లుచు, ఉత్పత్తి స్థలము మొదలుకొని సముద్ర పర్యంతము ఒక్క పేరుతోనొప్పి అవిచ్ఛిన్నమగు ప్రవాహముతో నొప్పారి, సముద్రగామినియై అచ్చటచ్చట పుణ్యతీర్థములతో పెంపెసలారు నదీమతల్లికయున్న క్షేత్రమున శివుడు త్రిపాద సాన్నిధ్యము చేయును.

4) లోకప్రసిద్ధమైన సమస్త దేవఋష్యాది వందితమై అనేక పుణ్యతీర్థములతో నొప్పి, నానావిధ గైరికాదిధాతు విచిత్రితమగు విద్గుహచే ప్రకాశించుచు దర్శన స్మరణాదులచే పాపసంహారకమగు పర్వతము శివునకు సమిష్టి దేహము అచ్చట పరమేశ్వరుడు సంపూర్ణ సాన్నిధ్యము చేయును. అట్టి పర్వతములో గూడ ముందు చెప్పబడిన లక్షణములతోనొప్పి సర్వలోక ప్రసిద్ధమగు నాక్షేత్రము "భాస్కరక్షేత్రము"ని యెలుంగుమని పార్వతీనందనుడు నారదునకు క్షేత్రమాహాత్మ్యమును విశదీకరించెను.

పూర్వ మొకానొకప్పుడు శుక సనత్కుమార పరాశర మునీంద్రులు మువ్వురు దుర్విజ్ఞేయమగు జీవాత్మ, పరమాత్మ భేదమును నిర్ణయింపలేనివారై, శైవ మాయా మోహితులై భేదవాదులై సంచరించుచుండిరి. ఆ సమయమున పరమేష్ఠి బ్రహ్మఋషి గణసమైతుడై శుకాది మునిత్రయమునకు గల్గిన జీవాత్మ పరమాత్మ భేదనివర్తనా పూర్వకమగు ఏకత్వజ్ఞాన సంపాదకమగు ఉపాయమును ఉపదేశింపదలచి కాశీక్షేత్రమున కరుదెంచెను. ఇట్లేగు దెంచిన పితామహుంగాంచి కాశీపుర మునీంద్రులందరూ ససంభ్రమముగా నెదుర్కొని, తత్పాదపద్మములకు నమస్కరించి, లోకహితార్థమై యమ్మునీంద్రులు యిట్లు ప్రశ్నించిరి. ఓ సర్వరక్షకా! తమకు నమస్కారము. మీ ఆగమనము మాకు శుభోదర్కముగా నున్నది. మీ పాద పద్మ సందర్శనముచే మేము ధన్యులమైతిమి. సంసార వారధి నుత్తరించితిమి. అందుచే మాకు ప్రాప్యమగు మరొండు పదార్థము కోరదగినది లేదు. లోకహితార్థమై భవన్ముఖాంబుజమునుండి భేదము వాస్తవమా? కల్పితమా? ఈ విషయమును నిర్ణయించి ధన్యులం మమ్ము జేయుము.

"బ్రహ్మ వేత్తలగు యోగీంద్రులలో శుక సనత్కుమార పరాశరులు మువ్వురు సుప్రసిద్ధులు. వీరు నిరంకుశముగా సభలయందు జీవాత్మ పరమాత్మలకు భేదము వాస్తమనియు, తద్విషయమై నానావిధములగు యుక్తులను జూపుచూ, అభేద బోధకములగునైక్య శృతులకు స్వార్థమున తాత్పర్యములేదని చాటుచున్నారు. వారి వాక్యములను విని మేము సందేహ డోలికలలో నుఊ్తాత లూగుచున్నాము. మీరు లోకహితార్థమై వేదాంత సిద్ధాంత రహస్యమును మాకెరింగించి ధన్యులం జేయవే" అని ప్రార్థించిరి. విధాత అమ్మునీంద్రులకు శుద్ధాద్వైత తత్త్వము నుపదేశింపగా వారు పరమేష్ఠి యాజ్ఞ నొదలదాల్చి సంప్రాప్తాద్వైతసిద్ధిగలవారై వారివారి యాశ్రమములకు వెళ్ళిరి. అంత విధాత తన పుత్రులగు వ్యాసాదులను రావించి ద్వైత బుద్ధి నిర్మూలనదక్షమగు నుపాయము నుపదేశించెను. వారు తదుపదేశానుసారముగా దక్షిణ కైలాసమగు శ్రీకాళహస్తి క్షేత్రమున శివుని గూర్చి ఘోరతపం బొనర్చిరి. తత్తపంబునకు సంతసించి శంకరుడు దక్షిణామూర్తి రూపములో వారికి ప్రత్యక్షమై, మోహనాశకమగు చిన్ముద్రాముద్రితుడై వైదిక పీఠమం దుపవిష్టుడాయెను. అజ్ఞానతిమిర భాస్కరంబగు చిన్ముద్రాదర్శనముచే శుకాదులు సంశయమును బాసి, విగతకల్మషులై, పునరావృత్తి రహితమగు బ్రహ్మానందమును పొందిరి.

గాన జ్ఞానప్రదంబై, సాయుజ్యదాయకంబగు యిమ్మహా క్షేత్రమును భక్తమహాజనులు సేవించి పునరావృత్తిరహితమగు ఆనందమునకు పాత్రులగుదురుగాక! ఇతి శివమ్.

ఓం తత్సత్